---

కాకినాడ: జాజ్జి ప్రెస్ యందు ముద్రింపఁబడినది.

# తొలిపలుకు



శ్రీ మెహెర్ బాబా 25 వ ఫిబ్రవరి 1894 లో పూనాలో నొక పార్శీకుటుంబములో జన్మించిరి. పూనాలో నొక వృక్షము నీడను యావజ్జీవితము కడపిన, సూఫీ అవధూత హజరత్ బాబా జాన్ (ఆఫ్ఘన్ స్త్రీ) 1914 లో శ్రీ బాబాగారి నుదుటిని ముద్దు పెట్టుకొని దివ్యదృష్టి నిచ్చినది. తదుపరి కొన్ని మాసములుగా నీ ప్రపంచ పరిసరస్మృతి తప్పిపోయి వేరొక భూమికలో శ్రీ బాబా నిలిచియుండెను. తరువాత హిందూ అవధూతయగు శ్రీ ఉపాసనీ మహారాజుయొక్క ప్రభావములోనికి వచ్చి 1921 నుండి సద్గురు శ్రేణిలోచేరెను. శ్రీ బాబాగారు 1925 లో వహించిన మౌనము నేటివరకును వీడలేదు. శ్రీ సాయిబాబా తాజుద్దీన్ బాబా ఉపాసనీ మహారాజ్ నారాయణ మహారాజుల ప్రభావము శ్రీబాబాగారిపై ప్రసరించి వారి సాధనాక్రమము వృద్ధియై భగవత్ సాక్షాత్కారములో పరిణామము పొందినది. శ్రీ వారికన్ని మతములును భగవంతునిచేరు భిన్నమార్గములు. అందుచే యేమతము నవలంబించినను భగవంతుని చేరుటయే ప్రాతిపదికగా కల మనోప్రవృత్తి కల ప్రతి అన్వేషకుడును ఆయనకు ఆప్తుడే; 'నీవేరూపమును నామముతో భగవంతు నారాధించినను నాకు సంతోషమిచ్చునని' తెలిపినారు.

అందులకే ఆయనకు అన్ని మతములవారు అన్ని జాతుల వారును ప్రపంచము నందంతటను అనుచరులున్నారు. మానవుడు భగవదంశకలవాడు. దానిని గుర్తించి పొందుటకు చేయు యత్నములో శ్రీ బాబా సాయపడును. "నేనొక నూతన సంఘమును కాని, సంస్థనుకాని, విధానమునుకాని స్థాపించుటకు రాలేదు; కొత్తమతమును నిర్మించుట కసలే కాదు.

అనేకత్వము వెనుకనున్న సత్యమును ప్రబోధించుట జీవితరహస్యమును ఆవిష్కరించు హృదయగ్రంథమిది. హృదయమునకును బుద్ధికిని ఆనందదాయకమగు సమన్వయమును సృష్టింతును. అన్నిమతములను సాంప్రదాయములను పునరోత్తేజములుగా చేసి వాటినొక సూత్రమున మణిహారముగా కూర్తును' అని శ్రీ మెహర్ బాబాగారు సెలవిచ్చి యున్నారు. వారొక ప్రత్యేక నియమానుష్టాన విధానములును పూజా సాంప్రదాయములు కలిగిన యేమతమునుగాని స్థాపించి వ్యాపింప జేయుటకు అవతరించలేదు. మానవుడు భగవత్ స్వరూపుడు భగవంతుడు మానవాంశలో నున్నవాడు. అందీసృష్టి పరిణామపద్ధతిలో తరులత గుల్మాదుల నుండి మానవజన్మ నొందువరకు నొక ఘట్టముగను అందుండి వాసనా నిర్మూలన ప్రధానమగు భగవత్ సాక్షాత్కారము పొందుట రెండవఘట్టముగను శ్రీ బాబాగారు

స్వీయానుభవము నీగ్రంథమున పటముల మూలమున విశదము చేసియున్నారు. ఈగ్రంథముపేరు భగవద్వచనము 'God Speaks' లేక దైవవాక్కు. అట్టి వాక్కును పలుకుటకు అర్హతగల బాబాగారు అపూర్వమగు స్థానము నలంకరించుచున్నారు. బాబాగారి దర్శనభాగ్యము కలిగిన పండితపామరు లెల్లరు యీ భావమును పొందుదురనుటలో అతిశయోక్తి లేదు. మహామహులు సద్గురువులు శ్రీరామ,కృష్ణ,బుద్ధ,మహమ్మద్, క్రీస్తు, చైతన్య రామకృష్ణ పరమహంస, రమణమహర్షి వంటి వారి శ్రేణికిచెందినవారు శ్రీ మెహర్ బాబా. శ్రీరాములు అవతారపురుషుడని సమకాలికులలో కొందరు మహాత్ములకుతప్ప మిగిలినవారికి గుర్తు లేదు. అట్లే అవతారముల మహత్తు తరు వాత కాలమువారికి కాని సరిగా అవగతము కానేరదు.

16 వ అక్టోబరు 1950 లో మహాబలేశ్వరములో శ్రీబాబా గారిట్లు చెప్పియున్నారు. "ఇంతవరకు నేకడపిన జీవితము నన్ను దివ్యపరిపూర్ణత్వముకల దైవత్వపీఠమున నుంచినది. ఇకనుండి నానూతన జీవితము భగవంతుని యొక్కయు ఆయన ప్రజల యొక్కయు ఒక వినమ్రుడగు సేవకుడుగా నడచును. నానూతన జీవితములో నేను అన్వేషకుడను, ప్రేమకుడను, స్నేహితుడను పరిపూర్ణ దివ్యత్వము, పరిపూర్ణనమ్రత- యీరెండు అంశ లును భగవత్ప్రేరితములు. ఇవి రెండును భగవంతుని అనంత జీవితముతో శాశ్వతముగా అనుసంధింపబడినవి."

ఇందు తెలిపినట్లు శ్రీ బాబా కరుణాసముద్రుడు ప్రేమ స్వరూపుడు దీనాతిదీనుల పాదధూళిలోని భగవత్ ప్రసాదమును శిరమును దాల్చిన మహానమ్రుడు; యీయనకు జీవితములోని నిమ్నోన్నతములలోని భేదములు లేవు. కలిమి లేములొక్కటే పతితులను తన ప్రేమాలింగనముతో పాపదూరులనుచేసి పునీతులనుచేయు కరుణాసాంద్రుడు. యీయన విభూతి, దివ్యము. ఆవరణము అనంతమగు ప్రేమాజగత్తు, దృష్టి మట్టిని బంగారముచేయు అయస్కాంతము. చిరునవ్వు నిరాశాంధకారమును మెరిపించు ఆశాజ్యోతి. ఆమహామహుని దృష్టి నేను డిసెంబరు 1953 వత్సరములో బడితిని. 3 వ మార్చి 1954 తేదీని కాకినాడలో నాగృహపావన మొనరించి నన్ను ఆలింగనముచే సత్కరించినారు. అదేవత్సరములో నవంబరు మాసములో మెహరాబాదులో జరిగి సహవాసమునకుబోయి అయిదు దినములు వారి నిరంతర సాన్నిధ్యభాగ్యమును పొందితిని. వారి ప్రవచనములను తెలుగులోకి అనువదించుట సంభవించెను. నేను సెలవుతీసుకొనుటకు ఆయన దగ్గరకు వెళ్ళగా నీవు 'God Speaks' తెలుగులోనికి అనువదించవలెననిరి. అది ఆంగ్లములో అమెరికాలో ప్రచురింపబడినది. చాల కష్టమగు కార్యముగాతోచి అట్లు శ్రీవారితో మనవి చేసితిని. నేనున్నాను నీకు భయమెందులకని సెలవిచ్చిరి. 1955 డిసెంబరు మాసాంతమున భారతప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ హోంమంత్రి

(శ్రీ)పండిత గోవిందవల్లభపంతు నన్ను పిలిపించి వింధ్యప్రదేశ్ లెప్టినెంటు గవర్నరుగా వెళ్ళవలసినదని ఆదేశించిరి. 1956 జనవరి 16వ తేదీని పదవీస్వీకారముచేసి,ఫిబ్రవరిలో నీభాషాంతరీకరణమును ప్రారంభించి అక్టోబరు మాసమధ్యమున ముగించితిని.

యీ వింధ్యప్రదేశవాసము అచ్చట రాజ్యకలాపనమును నడుపు కార్యముతో కూడ యీ (శ్రీ) బాబా పనినిమిత్తమై యేర్పడినట్లు నాకుతోచినది. అనుదినము ఒక నిర్ణీతకాల మీపనికై వినియోగించుటకు వలసిన దీక్ష శిక్షణ శ్రీబాబాయే ప్రసాదించి యీపని ముగింపచేసినాడు.

నేను వేదాంతశాస్త్ర పాండిత్యముతో సంప్రాప్తించు భాషాధికారము కలిగినవాడను కాకపోవుటచే మరింత నమ్రతతో నీపనికి గడంగితిని. (శ్రీ) పిఠాపురం రాజావారి గవర్నమెంటు కాలేజీ (కాకినాడ) లో ఆంధ్ర సంస్కృత పండితులుగను, పండితకోటిలో గణనీయులుగను ప్రసిద్ధి కలిగిన (శ్రీ) విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారీ గ్రంథమును ఆమూలాగ్రముగ పరిశీలించి వలసిన భాషాసంస్కరణముచేసి రూపము నిచ్చినందులకు నాహృదయ పూర్వకమగు కృతజ్ఞతను తెలుపుచున్నాను. (శ్రీ) బాబాయొక్క ఆశీర్వచనము ఆయనకు కలదు. దీని ప్రూఫులు దిద్ది సరిచేసి మొదటినుండి

అంతమువరకు శ్రీ కామేశ్వరరావుగారితో కలిసి పనిచేసిన వేంకటపార్వతీశకవులలోని శ్రీ వోలేటి పార్వతీశముగారి పుత్రుడును పిఠాపురంరాజా కాలేజీలో ఆంధ్రాధ్యాపకులునగు శ్రీ వోలేటి శ్రీరామచంద్రమూర్తిగారికి నావందనశతములు. ఆయన కూడ దీనినొక దేవకార్యముగా యెంచి పనిచేసినారు. శ్రీమకోర్చి దీనినొక ఆదర్శకార్యముగా యెంచి పనిచేసిన జాన్సిప్రెస్ యజమానులు శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారు, చిత్రపటములకు వలసిన బ్లాకులను తమ సుప్రసిద్ధ కార్యాలయములో త్వరితముగా తయారుచేసి అందించిన మద్రాసు ప్రసాద్ ప్రోసెస్ స్టుడియో వారికిని నా అభివందనములు.

యీగ్రంథమునకు కావలసిన ద్రవ్యపరికరమును ఆంధ్ర మెహర్ (కేంద్ర) మండలి కాకినాడ వారు సమకూర్చి ప్రకటనాభారమును వహించియున్నారు. ఇందుకు తోడ్పడిన వారెల్లరు శ్రీ బాబా ఆశీర్వచనముల కర్హులు.

కాకినాడ,
16-6-59.

**మొసలికంటి తిరుమలరావు.**

# ప్రథమ భాగము

## *అంతఃకరణ ప్రవృత్తులు

జీవాత్మలు పరమాత్మయం దంతర్భూతములై కాలత్రయమున గోచరించును.

జీవాత్మలన్నియు నొక్కటే.

జీవాత్మలెల్ల ననంతములు శాశ్వతములు, రూపరహితములు.

జీవాత్మలన్నియు నొక్కటే; వానియందుఁగాని వాని యస్తిత్వ జాయమానస్థితులయందుఁగాని భేదము లేదు.

జీవాత్మల యంతఃకరణముల భేదము కలదు.

జీవాత్మాంతఃకరణభూమికల భేదము కలదు.

జీవాత్మల యనుభవములందును బ్రవృత్తులందును భేదముకలదు.

---

* అంతఃకరణము= i సర్వజ్ఞానాది ప్రత్యక్షకరణము. ii శరీరాంతస్థమై యుండి యింద్రియసహాయకమగునది. iii పంచీకృతములు గానట్టి పంచమహాభూతములతోఁ గూడిన సాత్త్వికాంశ కార్యభావమును గల్గియుండియు జ్ఞానశక్తి ప్రధానమైనది.

ప్రవృత్తి= స్వస్వవిషయముల నింద్రియాదుల సంచారము.

కొన్ని జీవాత్మలు స్థూలశరీరజ్ఞానమును, కొన్ని సూక్ష్మశరీరజ్ఞానమును, కొన్ని కారణశరీర (మనోమయశరీర) జ్ఞానమును, కొన్ని స్వస్వరూపజ్ఞానమును గలవిగా నుండును. ఇట్లున్న జీవాత్మలు తమతమస్థితి కనుకూలముగా స్థూల సూక్ష్మ కారణప్రపంచముల యనుభవమును బరమాత్మానుభవమును గల్గియుండును. ఈయనుభవములనే జీవాత్మ యాయాకోశముల విజ్ఞానమున నాయాకోశము లనఁదగు భూమికల ననుభవించుచుండునందురు. ఈకారణశరీరాదులే కోశము లనఁబడును. ఇవి యన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు.

కొన్ని జీవాత్మలు సంప్రబుద్ధములు, కొన్ని ప్రబుద్ధములు, కొన్ని బద్ధములు, కొన్ని బంధరహితములు. అంతఃకరణమున, ననుభవమున, భూమికల నానాత్వముగల యీజీవాత్మలన్నియుఁ బరమాత్మ యందలివే.

ఇట్లు జీవాత్మలు పరమాత్మయందలివైనప్పుడు జీవాత్మల యంతఃకరణానుభవభూమికల భేదమేల ?

భిన్నభిన్నసంస్కారములే జీవాత్మల భేదభానమునకుఁ గారణము.

స్థూలసూక్ష్మమానసికసంస్కారచిహ్న భేదములఁ బట్టి సంస్కారరహితత్వమునుబట్టియు జీవాత్మలకు నానాత్వము కల్గెను. ఇట్లు సంస్కారవశమున నానాత్వమునొందిన జీవాత్మలును, సంస్కారరహితజీవాత్మలును బరమాత్మయందలివై, భేదరహితమై యేకత్వము నెనసెనవియే.

అన్నమయకోశరూపమగు స్థూలశరీరమువాసనామాత్రముగల జీవులు స్థూలప్రపంచానుభవమును మాత్రము గల్గియుందురు. [పంచీకృతపంచభూతాత్మకప్రపంచము స్థూలప్రపంచము].

ఇట్లే ప్రాణమయమనోమయకోశ * వాసనలు గల జీవు లాయా కోశానుభవముల మాత్రము గల్గియుందురు. విజ్ఞానమయకోశజ్ఞానముగల జీవులు వాసనారహితులై స్వస్వరూపమగు పరమాత్మానుసంధానమునఁ దదనుభవమును గలవారగుదురు.

| * ఆవరణము | శరీరము | | |
|---|---|---|---|
| | | వేదాంతము | సూఫీ |
| స్థూలము | స్థూలశరీరము | స్థూలశరీరము | జిస్మెకసీఫ్ |
| సూక్ష్మము | సూక్ష్మశరీరము | సూక్ష్మశరీరము | జిస్మెలతీఫ్ |
| మానసికము | మానసికశరీరము | కారణశరీరము | జిస్మెఆల్టఫ్ |
| (కారణము) | (కారణశరీరము) | | |

అన్నమయకోశ మనఁదగు స్థూలశరీరము వాసనలను గలజీవులు స్థూలప్రపంచమును స్థూలశరీరముచే ననుభవింతురు. (ఈస్థూలప్రపంచమును విషయప్రపంచమనియు నందురు. విషయములు శబ్దస్పర్శరూపరసగంధములు. వీనియనుభవముక్రమముగా శ్రవణ, చర్మ, నేత్ర, జిహ్వా, నాసికలను నింద్రియముల ద్వారమునఁ గలుగును. వాక్పాణిపాదపాయూపస్థలను నింద్రియముల యనుభవములగు నాహారవిహార నిద్రా (మైథున), మలమూత్రవిసర్జనాదిక్రియలును విషయానుభవములే).

ప్రాణమయకోశ మనఁదగు సూక్ష్మశరీరమువాసనల వైశిష్ట్యమును గల జీవులు ప్రాణశక్తి ననుసరించి మూఁడు భూమికల యనుభవములు గలవారగుదురు. ఈ భూమికాత్రయమున దర్శనశ్రవణాఘ్రాణపాటవ ముండును.

మనోమయకోశ మనఁదగు కారణశరీరమువాసనల వైశిష్ట్యముగల జీవులు మనశ్శక్తిచే మనఃప్రపంచమున దర్శనశక్తి మాత్రము కలవారై యుందురు. ఇచటిదర్శనము భగవద్దర్శనము.

సప్తమైన వాసనలఁగల జీవులు పరమాత్మానుసంధానమున ననంతశక్తియు, ననంతజ్ఞానము ననంతానందము నగు పరమాత్మానుభవసంపన్నులగుదురు.

స్థూలశరీరజ్ఞానము మాత్రము గల జీవులు ప్రాణమయ మనోమయకోశముల యనుభవములనుగాని, పరమాత్మానుభవమునుగాని పొందనేరరు.

ఇట్లే సూక్ష్మశరీరజ్ఞానముగల జీవులు స్థూలకారణ (మనోమయ) విజ్ఞానమయకోశముల యనుభవమును, గారణశరీర (మనోమయ) జ్ఞానము గల జీవులు స్థూల, సూక్ష్మ, విజ్ఞానమయకోశముల యనుభవమును, విజ్ఞానమయకోశజ్ఞానముగల జీవులు స్థూలసూక్ష్మకారణశరీరుల యనుభవమును బొందరు.

ఆత్మానుసంధానమునఁ బరమాత్మానుభవము పొందవలె నన్నచో జీవునకు స్థూలసూక్ష్మకారణశరీరముల జ్ఞానము నశింపవలయును. అట్లయ్యును స్థూలసూక్ష్మమనోమయకోశ సంస్కారములు జీవాత్మ నావరించి యున్నంతవఱకు వానికి సంబంధించిన వికారానుభవములు జీవునిపైఁబడుచునే యుండును.

జీవాత్మను స్థూలశరీరసంస్కారము లావరించియున్నంతవఱకు స్థూలశరీరద్వారమున విషయముల ననుభవింపక తప్పకుండుటయే దీనికిఁగారణము.

అట్లే సూక్ష్మశరీరసంస్కారము లాత్మనావరించియున్నంతవఱకు నాజీవాత్మ ప్రాణమయకోశానుభవముల నొందక తప్పదు. అదేవిధమున మనశ్శరీర సంస్కారములున్నంత దనుక కారణశరీరము ద్వారమున జీవాత్మ తదనుభవములు నొందక తప్పదు. ఈమూఁడు శరీరముల సంబంధములగు సంస్కారములు పూర్తిగా నమసిపోయినప్పుడే జీవాత్మ స్వానుభవమునఁ బరమాత్మానుభవమును సంపూర్ణముగా నొందఁగల్గును.

స్థూలసూక్ష్మకారణశరీరములు జీవాత్మచ్ఛాయలు; స్థూలసూక్ష్మకారణప్రపంచములు పరమాత్మచ్ఛాయలు.

స్థూలసూక్ష్మకారణశరీరములు పరిమితములు,రూపవంతములు,
నష్టములు నగునవి. స్థూలసూక్ష్మకారణప్రపంచము లట్లు
గాక యాభాసములు, శూన్యములు, భావనిర్మితములు, నిరా
ధారస్వప్నములు. జీవాత్మపరమాత్మలు మాత్రము సత్య
ములు. కావున జీవాత్మ స్వకీయములగు స్థూలసూక్ష్మకారణ
దేహములతో స్థూలసూక్ష్మకారణప్రపంచముల ననుభవము
నొందుచున్న దనఁగా జీవాత్మ స్వకీయచ్ఛాయల సాహాయ్యమునఁ
బరమాత్మచ్ఛాయల ననుభవించుచున్న దనుట సత్యము. పరిమిత
మును నశ్వరము నగు రూపముతో మిథ్యయు, శూన్యమును,
భావనిర్మితము,నిరాధారస్వప్నము నగుదాని జీవాత్మ యనుభ
వించుచున్న దనుట సిద్ధాంతము.

జీవాత్మ స్వస్వరూపజ్ఞానము సాహాయ్యమున సత్యాను
భవమును గలదై సత్యమగు పరమాత్మానుభవము నొందును.
కేవలస్థూలశరీరజ్ఞానమున నున్న జీవాత్మ స్థూలశరీరాను
భవమును మాత్రము కలదగుచున్నది. అనంతమును నాశన
రహితమును రూపరహితము నగు జీవాత్మ పరిమితము నశ్వ
రము రూపవంతము నగు స్థితికి వచ్చినదని దీని యభిప్రాయము.
సంస్కారములే యీ యజ్ఞానమునకుఁ గారణములు. పరమా
త్మాభిన్నమయ్యు సత్యానృతమిథునీకరణమున ("సత్యానృతే
మిథునీకృత్యాహమిదం మమేదమితి లోకవ్యవహారః" అని శం
కరభగవత్పాదాచార్యులు) ననాదిగా సంస్కారవశమున జ్ఞాన
మునకు దూరమయ్యెను.

ఆ యా సంస్కారముల వశమున నా యా శరీరానుభవముల నొందునప్పుడు జీవాత్మ యా యా శరీరము లే తానను భేదరహితజ్ఞానమున నుండును. శిలాశరీరమున నున్న జీవాత్మ శిలయనుభవమునే స్వానుభవముగా గ్రహించును. అనఁగాఁ దానే శిలయనుకొనును. ఇట్లే లోహములయు, నుద్భిజ్జములయుఁ గీటకాదులయు మత్స్యాదులయు, నండజాదులయు, మృగాదులయు, స్త్రీపుంసాదులయు శరీరములుగల జీవులెల్లఁ దామే యాశరీరమ నెడి యనుభవమున నుండును. స్థూలశరీర మేజాతిదైనను, దానిరూప మెట్టిదైనను జీవాత్మ తనంతఁ దానే యాజాతివ్యక్తులతో నేకత్వము పొందును. తనకు నాస్థూలశరీరమునకు భేదము లేనట్టి యనుభవమును బొందును. సూక్ష్మశరీరము జ్ఞానము కలిగినప్పుడు ఆత్మ తానే యాశరీర మను ననుభవమును బొందును. ఇట్లే కారణశరీరమునఁగూడ జీవాత్మ యా యనుభవమును బొందును.

ఇట్లు రూపరహితము ననంతము నగు జీవాత్మ స్థూలసూక్ష్మకారణశరీరముల తన్మయీభావనమున నాశరీరము లే తాననెడి యనుభవములఁ బొందుటకు హేతువులు సంస్కారములే. స్థూలప్రపంచమునందలి యనుభవములను స్థూలరూపముల ద్వారమునఁ బొందుచున్న జీవాత్మ యనేకస్థూలరూపముల సంయోగవియోగముల ననుభవించును. ఈ సంయోగవియోగములే జననమరణము లని చెప్పఁబడుచున్నవి. ఈ సంస్కారముల వశమున శాశ్వతమును, అజరామరము నగు జీవాత్మ యసంఖ్యాకములగు జననమరణముల నందవలసి

వచ్చుచున్నది. ఇట్లు జననమరణానుభవముల నొందు జీవాత్మ పరమాత్మచ్ఛాయారూపమగు స్థూలప్రపంచము ననుభవించుట యేకాక యాయనుభవముతోఁబాటు తత్ప్రపంచసంబంధములగు పాపపుణ్యములు, కష్టసుఖములు నను వానినిగూడ ననుభవింపవలసి యుండును. ఈ ద్వంద్వముల కతీతమైన జీవాత్మ సంస్కారకారణముననే యీ ద్వంద్వముల ననుభవింపవలసి వచ్చినదని గ్రహింపవలయును. స్థూలశరీరాభిమానియగు జీవాత్మ స్థూలప్రపంచవిషయసంపర్కమువలనఁ బొందు ననుభవములే జననమరణములు, సుఖదుఃఖములు, పుణ్యాపాపములని తెలియఁదగు విషయము. స్థూలశరీరాభిమానమున నాత్మ ప్రతిబింబము జీవాత్మ యగుచున్నది. ఇట్లే స్థూలప్రపంచము పరమాత్మచ్ఛాయ.

ఇంతదనుక వివరింపఁబడిన యనుభవములన్నియు నాత్మ ప్రతిబింబానుభవములు మాత్రమే యగుటవలన నవి మిథ్యానుభవములు (అసత్యానుభవములు).

## యథార్థమునకుఁ బరమాత్మయే జీవాత్మ.

జీవాత్మపరమాత్మసంబంధముల వివరించునప్పుడు పరమాత్మ యనంతమగు మహాసముద్రమని చెప్పుదుము జీవాత్మ యనంతమగు సముద్రరూపముగాఁ దెలుపఁబడినఁ బరమాత్మ నతిక్రమించియుండుట కవకాశము లేదు. (పరమాత్మ యనంతమగుటచే జీవాత్మ దానిని మించియుండఁ జాలదనుట). అది హేతువుగా ననంతమగు పరమాత్మ యావరణమును దాఁటుటకు జీవాత్మకు సాధ్యముకాదు. అందుచేతనే జీవాత్మ

పరమాత్మలో నిబిడీకృతమైయున్నది. (అనఁగాఁ బరమాత్మ కలామాత్రము జీవాత్మయని తాత్పర్యము). ఈ ప్రధానవిషయము స్థిరపడిన పిదప ముందున కొకయడుగు సాగి యాత్మయే పరమాత్మయని నిరూపింపవచ్చును. అదియెట్లు ?

అనంతమగు మహాసముద్రమునుండి యొక జలకణమును దీసి చూచినపు డాబిందువు సముద్రమునుండి వేర్పడకపూర్వము మహాసముద్రమేయగును. అంతియేకాదు. అది యనంత మహాసముద్రములో నొకబిందువుమాత్రముగానుండ లేదు. ఎందుకనఁగాఁ బ్రతిబిందువును ఆ బిందువునకుఁ గల పరిమితమగు నావరణములో లేనప్పు డాసముద్రమువలెనే యనంతమైయున్నది. (దీనినే వివర్తవాదమని శాస్త్రజ్ఞులు చెప్పుదురు.) అట్లయ్యు, ననంతమగు మహాసముద్రముతోఁ బోల్చి చూచినప్పు డాజలకణము బహుపరిమితమగుదానివలెఁ గాన్పించును. అట్లే సాముద్రజలకణముతోఁ బోల్పఁబడిన జీవాత్మయు ననంతమహాసముద్రముతోఁ బోల్పఁబడిన పరమాత్మ యావరణమును దాఁటి యుండఁజాలదు. సముద్రభాగమైన నీటిబిందువు బిందుస్వరూపమునఁ బరిమితికలిగిన యావరణముతో సముద్రము మీఁద బుద్బుదమువలె నెట్లు తేలియుండునో, యాసముద్రమునకీ బుద్బుదరూపబిందువు ప్రత్యేకస్థితి నెట్లుకల్పించునో, యట్లే పరమాత్మలోనుండి పరమాత్మయే యైన జీవాత్మయుఁ దనచుట్టు నిర్మించుకొన్న యవిద్యావరణమగు బుద్బుదమునంటి యాటంకమునలనఁ దనకుఁ బ్రత్యేకస్థితి యున్నదనెడి యనుభవము పొందుచున్నట్లు గోచరించుచున్నది. దీనివలననే పరమాత్మ

కంటె భిన్నమైనస్థితి (అస్తిత్వాదికము) తనకుఁ గలదనెడి భావా భాసమును జీవాత్మ పరమాత్మనుండి పొందుచున్నది. తాననంతమైన ద్వైనను స్వకల్పితమాయావరణమునఁ బరమాత్మకంటె భిన్నమైన దను ప్రత్యేకత నొంది తన్మూలమున సంకుచితము నును బరిమితము నగు స్థితిని బొందుచున్నది.

---

# రెండవ భాగము

## ప్రథమప్రేరణము
## పరిణమదంతఃకరణమునకు దేహాంతరప్రాప్తి

ఆత్మ కనాదిదశయందు సంస్కారములు లేవు. కావున దాని కంతఃకరణమును లేదు. స్థూలసూక్ష్మకారణశరీరములలో నేదియు నాత్మకులేని స్థితి యిది. ఈశరీరత్రయము నా యా శరీరముల పుట్టుకకు హేతువులగు సంస్కారములవలనఁ గలుగును. సంస్కారవశముననే యాత్మ యంతఃకరణప్రవృత్తులఁ గలదగును. ఈప్రవృత్తులే స్థూలసూక్ష్మకారణదేహముల యునికికిఁ గారణములు. ఈదేహత్రయాశ్రయముననే స్థూలసూక్ష్మకారణప్రపంచములు భాసించును.

దీని ఫలితార్థ మేమనఁగా— శరీరత్రయవిజ్ఞానమును, స్వస్వరూపజ్ఞానమును, స్థూలసూక్ష్మకారణప్రపంచానుభవమును, బరమాత్మానుభవమును, ఆత్మకుఁ బ్రారంభమున లేవనుట.

అనంతమును, సంస్కారహీనమును, ప్రవృత్తిరహితమును, శాంతము నగు స్థితియందున్న యీ యాత్మ స్వస్వరూప విజ్ఞానమునకై ప్రారంభమునఁ బరితపించుటయే ప్రథమప్రేరణము. ఇది పరమాత్మయందు లీనమైయుండును. అనంతమగు సముద్రమునకు మొట్టమొదట స్పందనము గల్గుటవంటిదే పరమాత్మకుఁ బ్రథమప్రేరణము గల్గుట.

అప్రమేయమగుదానిసంబంధియగు నప్రమేయత్వముతోఁబాటు ప్రమేయత్వము గోచరించును.

ఈ ప్రథమప్రేరణ మపరిమితమా పరిమితమా యను విషయమును, ప్రారంభమునఁ బరిమితమై యనంతర మపరిమితమైనదా యట్లుగాక యారంభమున నపరిమితమై పిదపఁ బరిమితమైనదా యనువిషయమును, బరికింతము.

ప్రథమప్రేరణము పరిమితము; ఐన నిది యపరిమితమగుదాని సంబంధము గలదియే.

ఈ పరిమితమగు ప్రథమప్రేరణ మనంతమగు పరమాత్మార్ణవమునుండి బయలుదేఱినది. ఈ ప్రేరణము సంఘటన మనంతమగు మహాసముద్రమునఁ బరిమితమగు నొక యల్పప్రదేశమందుఁ గేంద్రీకృతమైనది.

అనంతసముద్రమం దంతర్భూతమైన ప్రథమప్రేరణము నవతరణము పరిమితమైనను అదికూడ నపర్యాప్తమే. అనంతత్వబింబమే యీపరిణతమైన సూక్ష్మస్థానమునుండి పైకిఁ బ్రసరించినది. ఆబిందువు క్రమముగా* విస్తృతము కాఁజొచ్చె.

* 'పరిమితిబిందువునుండి యపరిమితమగు దాని ఛాయ ప్రసరించు' నని బాబాగారి వాక్యము.

నది. ఈప్రథమ ప్రేరణమునే 'ఓమ్' (నాదము) అని యందురు. ఇదియే సృష్టికి మూలమగు సూక్ష్మము. ఇది యనంతమైనది.

ప్రథమప్రేరణాస్పందవీచికాధ్వనితోఁబాటు బహు స్థూలములగు ప్రథమసంస్కారములుగూడ నుత్పన్న మాయెను. దీనిచే నాత్మకు శుద్ధవ్యతిరేకధర్మములున్నవను తలంపుగల్గును. అంతట ఆత్మ స్థూలముగాఁ బరిమితముగాఁ గానఁబడును. ప్రథమప్రేరణస్థూలసంస్కారముల యనుభవ మాదియందాత్మ కిట్లు కలిగెను. అనంతము సంస్కారహీనము నంతఃకరణవృత్తిరహితమునగు నాత్మకుఁ దనకు భిన్నమగు ననుభవము కలుగుట కిదియే మొదలు.

ఇట్లు శాశ్వతమై యనంతమైన యాత్మ యవిభాజ్యము స్థిరమునయ్యుఁ దద్భిన్నానుభవముగాఁ బృథగ్భావమునఁ బరిణమించినది. అప్పుడొక తాఁకుడువంటి యుత్పాదనము కలిగినది. ఆయనంతాత్మ పరమశాంతస్థితికి దెబ్బ తగిలినది. ఈ తీవ్రమగు తాఁకిడివలన నంతఃకరణవృత్తిరహితమైన యాత్మకుఁ బ్రథమ వృత్తిరూపస్పందనము కలిగి యవిభక్తమైన పరమాత్మస్థితికంటె భిన్నమను భానము మొదటిసారి కలుగుచున్నది. కాని యాత్మ యనంతమగుటచే భిన్నత్వమును సూచించు ప్రథమస్పంద నానుభవముచే స్థూలమగు ప్రథమసంస్కారము లేక యను భవము ప్రథమమునఁ బరిమితమునగు సంస్కారమని చెప్ప వలెను. తన యనంతమైన యాదిస్థితితోఁబోల్చి చూచిన యెడల నాత్మకుఁ గలిగిన యీ ప్రథమ చైతన్యము చాల సూక్ష్మమగు పరిమితి కలది.

సంస్కారరహితమై యనంతమైన యాత్మ మొదట సంస్కారానుభవము పొందినప్పు డది బహుస్థూలానుభవమయ్యు బహుపరిమితమైయున్నది. ఆసమయమునందే యనంతమైన యాత్మయొక్క చైతన్యహీనస్థితి ప్రథమస్థూలసంస్కారస్థూలానుభవము పొందినది.

శాశ్వతమైన యనంతమైన యాత్మకుఁ జైతన్యము కలిగెను. ఈ సంస్కారమూలమగు చైతన్య మాత్మయొక్క యపర్యాప్తమైన శాశ్వతస్థితికి సంబంధించినదికాదు. బహుపరిమితమైన స్థూలసంస్కారమునకు సంబంధించినది. ఆత్మకు సంస్కారచైతన్యము కలిగియున్నచో నాత్మ యీసంస్కారానుభవములను బొందవలెను. అట్లనుభవించుటకుఁ దగు మధ్యవర్తి యాత్మ కుండవలెను.

సంస్కారములవలన ననుభవములు కలుగుచున్నవి. ఈ సంస్కారముల యనుభవముల నొందుటకుఁ దగిన యనుసంధానము కావలెను. నిర్గుణమై యనంతమై శాశ్వతమైన యాత్మ బహుస్థూలము సంస్కారసంబంధమునగు బహుస్థూలపరిమితిగల యనుభవము నొందుటకు స్థూలమగు ప్రథమవాహనము లేక సంధానవస్తువు కావలెను. పరిమితమగు నీయాత్మ ప్రథమసంస్కారము బహుస్థూలమగు మధ్యవర్తియావరణములోఁ గేంద్రీకృతమై యున్నది. ఈ స్థూలమగు ప్రథమమధ్యవర్తితో రూపరహితమైన యాత్మ సంపర్కము కలిగి యేకత్వమును బొందుచున్నది.

అభిన్నాత్మ ప్రథమచైతన్యము మొదటి మధ్యవర్తి ద్వారా మొదటి సంస్కారము ననుభవమునుబొంది, ద్వంద్వస్వభావము గల లేక నిహితవిరుద్ధస్వభావముకల బీజముతో సంపర్కమును బొందుచున్నది. ఆదిప్రేరణము తాఁకిడివలనఁ గలిగిన స్పందనములో నుత్పన్నమైన యీ స్వభావము ద్వంద్వములో రూపొందుచున్నది. పరిమితము స్థూలము నగు మధ్యవర్తి స్వరూపముతోఁ గలిగిన యీనూతన చైతన్య మాత్మానుభవమును బరిమితమగు స్థూలస్వరూపముగాఁ దోఁచునట్లు చేయుచున్నది. చైతన్యరహితమైన యాత్మకుఁ గలిగిన చైతన్యమునఁ బరమాత్మతో నైక్యానుసంధానమువలనఁ గలుగు సత్యాను (Reality)భవము పొందుటకు బదులుగా స్థూలస్వరూపముతోఁ గలిగిన సంయోగము వలనను ద్వంద్వస్వభావమునఁ గలుగు మాయ ననుభవించుచున్నది. స్థూలస్వరూపసంపర్క మెక్కువైనకొలఁది సంస్కారముల సంఖ్య యెక్కువగుచుండును. దీనితోఁబాటు చైతన్యముకూడ పెరుఁగుచుండును.

ఆత్మకుఁ గలిగిన చైతన్యము క్రమానుగతముగా నెట్లభివృద్ధి చెందునో గమనింతము. చైత్యమగు నాత్మ, బహుపరిమితికలిగి యత్యంతస్థూలమగు రాతివంటి మధ్యవర్తితో సంపర్కము పొందినదని యూహించినచో నప్పుడాత్మ యారాతితో నైక్యమును స్థాపించుకొనినదని చెప్పవలెను. (బహుపరిమితములు స్థూలములు వివిధములు వాయురూపములునగు యేడు ప్రధాన వస్తువుల వివిధస్వరూపానుభవములను యుగయుగములుగా నొందిన తరువాత నాత్మ రాతిరూపమునొందఁ

ప్రారంభించును. దీని నూహించుటకుఁగాని గ్రహించుటకుఁగాని సాధారణమానవులకు సాధ్యముకాదు).

అందుచే మనసౌకర్యముకొఱకే యాత్మకు రాతిస్వరూపసంపర్కము వలనఁ గలిగిన చైతన్యస్థితితో నారంభింతము. ఈరాతిస్వరూపమునఁ గూడ ననేక విధములైనవి యుండుటచే నొకటి తరువాత నొకటిగా నీరూపానుభవముల నాత్మ పొందుచుండును. ఈ యనుభవములు కేవలము స్థూలమైనవని యే చెప్పవలెను. మొదట నుత్పన్నమైన రాతిస్వరూపములో నైక్యానుభవము నొందిన యాత్మ రాతిని స్థూలమగు మధ్యవర్తిగా నుపయోగించుచున్నది. తనంతట తానే తెలియకయే యాత్మ రాతిలో నైక్యమగుచున్నది.

ఇట్లే యనేకయుగములు తరువాత నాత్మకు రాతిరూపమునఁ గలిగిన సంస్కారచైతన్యవృత్తి క్రమముగా వృద్ధియగుచు వచ్చినది. ఈ యనుభవములను గ్రహించుట కవకాశము పూర్తియగుటచే నాత్మకే సంపర్కము క్రమముగాఁదగ్గిపోవుట ప్రారంభమగును. అప్పుడే రాతిస్వరూపము దానంతట నదియే రాలిపోవును. కొంతకాల మేమధ్యవర్తియు లేక యాత్మ యట్లే నిలచియుండును. కాని రాతిసంపర్కమునఁ గలిగిన సంస్కారానుభవము మాత్రము వదలిపోదు. ఈచైతన్యము రాతిస్వరూపము తరువాతి శ్రేణితో సంపర్కమును బొందును. ఈ నూతనమధ్యవర్తిద్వారా ఆదిని రాతిరూపముతోఁ గలిగిన సంస్కారము నొందుచుండును. అనఁగా రాతిరూపము మాఱినది; కాని తత్సంస్కారము వదలలేదనుట. ఒకరూపమును వదలి

యాత్మ మఱియొక రూపమును బొందునప్పుడు రూపస్వరూప మును మాత్రమే వదలుచున్నది. కాని దానివలనఁ గలుగు సంస్కారమును నూతనరూపమునకుఁ గొనిపోవుచున్నది. అట్లే రూపములు త్యజింపఁబడినను వాని ద్వారా కలిగిన సంస్కారములను విసర్జింపక నూతనరూపములకు వాని నాత్మ తీసికొనిపోవుచుండును. ఏరూపము లేక యున్నస్థితిలోఁ గూడ నాత్మ తాను పూర్వరూపముల ద్వారా పొందిన సంస్కారమును మాత్రము వదలదు. చెప్పనలవి కాని యసంఖ్యాకములును వివిధములు నగు రాతిరూపముల ద్వారా ఆత్మకుఁ గలుగు సంస్కారసముదాయప్రభావ మెక్కువగు చునేయుండును. దీనివలన నాత్మచైతన్యము క్రమానుగత మైన యభివృద్ధినొందును. కాలచక్రపరిభ్రమణమువలన నీరాతి స్వరూపమునుండి యాత్మ తనచైతన్యమును వేఱుచేయును. వృద్ధి నొందుచు వచ్చిన సంస్కారములు మాత్రమాత్మకంటి యుండును. దీని యనంతర మాత్మ యింకొక విధమైన మధ్య వర్తితో సంపర్కము పొందును. అది లోహస్వరూపము. ఇది వఱలో రాతిస్వరూపమునఁ గలిగిన సంస్కారముల ప్రభావ ఫలస్వరూపమే యీలోహరూపము.

పరమాత్మలో నిబిడీకృతమై నిర్గుణ మనంతము విస్తారము నైన యాత్మ స్థూలమగు రాతిస్వరూపముల వలనఁ గలిగిన సంస్కారపరంపరలచే లోహస్వరూపముతో నైక్యముఁబొందు చున్నది. రాతిస్వరూపములలో వలెనే లోహస్వరూపము లందుఁగూడ ననంతములైన తరగతులుకలవు. ఈ స్వరూపము

ద్వారా ఆత్మ యనేకవిధములైన సంస్కారములను పొందును. లెక్కలేని మధ్యవర్తులయో వివిధస్వరూపములయో ద్వారా ఆత్మ రకరకముల సంస్కారముల అనుభవములను గ్రహించుచుఁ గ్రమానుగతమైన చైతన్యవృద్ధిని నొందుచుండును.

తక్కువ శ్రేణికిఁ జెందిన వెనుకటి స్వరూపముల సంస్కారమునువదలివేయుచు, సృష్టిలోఁ గ్రమవృద్ధి కగు నున్నత శ్రేణి యందలి స్వరూపముల సంస్కారములను పొందుచు నాత్మ యాత్ర చేయుచునే యుండును. అట్లే లోహస్వరూపముల సంస్కారములనుగూడ ఆత్మ విసర్జించును.

కాని మొట్టమొదటి లోహస్వరూపసమూహమునఁ గలిగిన సంస్కారానుభవములుమాత్ర మాత్మచైతన్యమును వదలవు. తరువాత శ్రేణియందలి లోహసముదాయముతో నాత్మకు నూతనసంస్కారము కలిగినప్పుడు పూర్వపు లోహ స్వరూపములే యంతరించును; కాని సంస్కారములు నశింపవు. ఇట్లే పలుతరగతులుగల లోహసముదాయములతో సంస్కారము మును మాత్రము గ్రహించిరూపమును విసర్జించుచు ననేకానుభవముల నాత్మపొందుచుండును. స్వరూపములతరగతి యున్నత స్థితికిఁ బోవుచున్న కొలఁది నా ఆత్మసంస్కారానుభవములు కూడ వెనువెంటనే యూర్ధ్వగతిని గలిగియుండును. పరమాత్మలో నిమిడియున్న యాత్మ నిర్గుణము ననంతమునైనను దుదకు లోహరూపమునుబొందును. రాతి స్వరూపమునకు లోహ స్వరూపమునకును సంబంధించినంతవఱ కాత్మ యీస్థూల ప్రపంచానుభవమును బొందుచున్నది.

అంతవఱకును బొందిన వృక్షరూపసంస్కారపరంపర లతో నావరింపఁబడి యాత్మ నిలచియున్నది. ఇప్పటికి వృక్షరూపముకూడఁ ద్యజింపఁబడినది. రూపములేక సంస్కారములు మాత్ర మాత్మయందు నిలచియున్నవి. ఈ సంస్కారపరంపరలు ననుభవములు, వివిధరూపములు, నంతములేనివియుఁ గాఁ దోఁచును. ఆత్మచైతన్యము తన పరిపూర్ణపరిణామమును పొందుటకే యీ యంతములేని విషమచక్రమునఁబడి పరిభ్రమణము పొందుచుండును. ఇట్లు తనకుఁ బరిభ్రమణమువలనఁ గలిగిన చైతన్యమువలననే తుట్టతుద కవశ్య మాత్మ తా ననంతమై, శాశ్వతమైన పరమాత్మయందలిదాన ననెడి యనుభవమును బొందును. ఈచైతక్యమువలన నాత్మ కఖండమగు శక్తియు, జ్ఞానమును, నానందము కలుగును.

ఇందు గమనింపవలసిన ముఖ్యవిషయ మేమనఁగా:— ఆత్మ కనంతములైన సంస్కారములవలనఁ గలుగు చైతన్యానుభవము పెంపొందుచునేయుండును. క్రిందిశ్రేణియందలిరూపములను విసర్జించుచు ఉన్నతము అత్యున్నతము నగు శ్రేణికిఁ జెందినరూపములను సృష్టించుచు నాత్మచైతన్యము క్రమాభివృద్ధి గాంచుచుండును. శిలాలోహవృక్ష స్వరూపములను వదలినప్పుడు వానివానియందున్న భిన్నభిన్నములగు రూపానుభవములను బొందుచు, విసర్జించుచుఁ, గ్రమానుగతమైన యున్నతపదారోహణము చేయుచు, నాత్మ పురోగమించుచున్నది. ఈ భిన్నస్వరూపములన్నియుఁ గ్రమవికాసము పొందుచున్న యాత్మ ప్రయోజనము కొఱకే నేర్పడినవి.

ఆత్మ వృక్షస్వరూపమునుగూడ వదలునప్పు డందుఁ వివిధరూప ములను దాను గ్రహించిన సంస్కారములను మాత్రముగ్రహించి వృక్షరూపమును వదలివేయుచున్నది. తుదిదశకు వచ్చి నప్పటికి రూపరహితమును సంస్కారపరివృతమునైన యాత్మ యున్నది. ఈస్థితి యుగములకొలఁది యాత్మ కీయనుభవములు గలిగినతరువాత సంభవించుచున్నది. ఈస్థూలప్రపంచములో భూమిపైనను నీటిలోపలను బుట్టిన వివిధవృక్షస్వరూపముల యనుభవము పూర్తియయినతరువాతనే యాత్మ యీ రూప మును వర్జించుచున్నది. అప్పటికీ వృక్షరూపావలంబనము లేక పూర్వసంస్కారముల మధ్యమున యాత్మ నిలచియున్నది. ఈసంస్కారముకూడ వినియోగము కావలెను లేక యంత మొందవలెను.

ఈ సంస్కారములుగల యాత్మ వృక్షరూపమునకుఁదరు వాత రూపములగు క్రిమికీటకాదిరూపము నాశ్రయించుట కాత్మ చైతన్యము ప్రేరకమగును. ఇప్పుడే వదలిన వృక్షరూప ముల సంస్కారప్రభావమే యాత్మ నాశ్రయించిన క్రిమికీటక రూపమునఁ బరిణమించినది.

ఈ క్రిమిరూపముతో నేకత్వముపొందిన యాత్మచైత న్యప్రవృత్తి తాను గీటకమనెడి యనుభవమును బొందును.

ఇంతటి చైతన్యపరిణామముపొందినను నాత్మ కింకను బరమాత్మయందలి తనకుఁగల స్వతఃసిద్ధశాశ్వతానంతస్థితి సంబంధమగు సత్యజ్ఞానము నిత్యముగా నొందలేదు. ఈ స్థూల ప్రపంచములో నే నొకకీటకమ ననెడి యనుభవమే యాత్మకుఁ

గలుగుచున్నది. ఇది యవిద్య లేక అజ్ఞానము. ఆత్మ చైతన్యము పూర్ణవికాసము పొందనంతవఱకీయజ్ఞానము పాఁతుకొనియుండును. ఆత్మకుఁ బూర్తియగు చైతన్యము కలిగినను అజ్ఞానములోనే మునిఁగియున్నదని చెప్పుదుము. ఎందుచేననఁగా నంతమాత్రమున నాత్మకుఁ బూర్తియగు నాత్మజ్ఞానము లేక తనను దాను తెలిసికొను చైతన్యము కలుగకపోవుట వలన.

అదియునుగాక యాత్మ చైతన్యము పూర్ణవికాసమును పొందినప్పు డా యాత్మ మానవస్వరూపముతో నేకత్వమును బొందును.

ఆత్మ కీటకరూపమును బొందినప్పుడు వృక్షరూపము నందొందిన సంస్కారములను వదలివేయుచున్నది. అట్లే కీటకరూపమును వదలి రూపరహితస్థితిలో నా సంస్కారములు మాత్రము నిలచియుండును. అవియు ననుభవరూపమున సంతె మొందవలెను. దానితరువాత స్వరూపము నాశ్రయించుట కాత్మయుఁ గీటకరూపమును విసర్జించుచున్నది. వివిధకీటకరూపముల యనుభవములు రాలిపోవుచుండఁగా నాత్మ ముందు స్థితి కధిగమించుచుండును. ఆత్మకుఁ గీటకచైతన్యము కలుగుటతోడనే స్థూలప్రపంచములోని కీటకానుభవము పొందుచుఁ బ్రథమముగా నాత్మకుఁ దనంతటఁ దాను గదలిపోవు శక్తి కలుగును. అదియునుగాక తాను సచేతనమనని,సజీవమనని, యాత్మ కుఁదోఁచును. ఈయనుభవము భిన్నవిధములుగా నభివృద్ధియగు నాత్మ యొక సరీసృపముగా(వెన్నెముక లేనిదిగా)రూపొందును.

అటుపిమ్మట వెన్నెముక మాత్రముకలిగి యితరావయవము లులేక ప్రాకుచుఁబోయెడి యనేకవిధములగు కీటకస్వరూప ముల నాత్మపొందుచున్నది. ఈ యాత్మచైతన్యవృత్తి యనేక ములగు మార్పుల నొందుచుండును. ప్రాకుచుఁబోవుట కాళ్ళ జతతోడనో, యనేకములగు జంటలపాదములతోడనో, జంట కాళ్ళయు, అెక్కలయుతోడనో సిద్ధములగు నానారూపము లతో మార్పులు చెందుచుండును.

ఒకప్పు డీ కీటకస్వరూపమునకుఁబైన బొచ్చుండును. మఱియొకప్పుడు నున్నగా సమముగా దీనిపైభాగముండును. ఇంకొకప్పుడు పొలుసులు కలిగినభాగముతో నుండును.

ఆహారముకొఱకు, నీసృష్టిలో వినాశనమునుండి తప్పిం చుకొనుటకు, నీ కీటకచైతన్యము కలిగిన యాత్మ కష్టపడవలె ననెడి యనుభవము గలదగును. తనకు జీవము గలదనియు స్మృతికలదనియు నాత్మకుఁ దెలిసివచ్చును.

ఈ యనేకవిధములైన కీటకజీవితముల యనుభవము లను బొందిపొంది యాత్మ తాను భూజలచరధర్మములఁగల దాన నైతిననికూడ గుర్తించును; దానికి సహజమైన చలనము భూమిపైనఁ గలిగియుండుట యేగాక స్వేచ్ఛగా నీటిలోఁగూడ వర్తించుటకు శక్తి కలుగును.

మనము సూక్ష్మముగా నర్థము చేసికొనునిమిత్త మన్ని విధముల కీటకములను, సరీసృపములను, భూచరజలచరములను కీటకజాతిలోఁ జేర్చుదము. అనఁగాఁ గాళ్లు లేక ప్రాకునవియు,

కాళ్ళు అవయవములు అెక్కలు కలిగియుండియుఁ బ్రాఁకునః యుఁ గీటకశ్రేణికిఁ జెందినవిగా నెంచవలెను. అనఁగా నిః పక్షులకంటెఁ జతుష్పాదజంతువులకంటెను భిన్నమైనవి.

శిలాలోహాస్వరూపములు నిడివిగా నిలుచుటక శక్తిలేనివి. వానిస్థితి బల్లపఱుపుగా నడ్డముగా నున్నది. వృక్ష జాలము నిడివిగా పైకి నిలచియున్నది. కీటకజాతి నిలువున నిలుః లేక భూమి నానుకొనిపోవు శ్రేణి యందలిది.

ఆత్మ యీ వివిధములైన కీటకప్రపంచముతో ననేకవిః ములైన యనుభవములనొంది యొంది తుద కేస్వరూపము తోను సంబంధములేని స్థితిలోనికివచ్చును. అంతకుఁబూర్వము వదలిన కీటకరూపముల సంస్కారములు మాత్రి మాత్మన బూర్తిగా నావరించియుండును. ఈ సంస్కారముల కనుభవము పూర్తియగుటకు మఱియొకరూపము నాత్మ యాశ్రయింః వలసియుండును. దానికొఱకై మత్స్యరూపము నాత్మపొందును ఇదివఱలోఁగలిగిన కీటకరూపసంస్కారములే యీమత్స్య రూపమును బొందుచున్నవి. ఈరూపములతో ననుభవముల పూర్తియైనప్పుడు మరల ఆత్మ యేరూపాలంబనము లేకయుఁ డును. అప్పుడే వదలిన మత్స్యరూపసంస్కారములు మాత్ర మాత్మను నావరించియుండును.

తరువాత నాత్మ పొందఁబోవురూప మీ సంస్కారమ ఫలమే. మత్స్యాంతఃకరణవృత్తిగల యాత్మచైతన్యము స్థూః ప్రపంచమున జలచరముగా, జీవమును వెన్నెముకను గలిగిన,జః

తువుగా ననుభవమును బొందుచున్నది. స్వతంత్రచలనముకలిగి, స్మారకముకలిగి, యవయవములు లేక, ఱెక్కలుకలిగిన చేఁపగ నిప్పుడు నున్నది. దీనికిఁగూడ మనుటకును, నాహారసంపాదనమునకు యాతన తప్పదు. ఇది నిలువుగా నిలఁబడఁజాలదు. తల పైకెత్తుకొని నిలుచుశక్తి లేక పడుకొనియుండు స్థితిలోనే జీవయాత్ర గడపవలసియుండును.

ఈ మత్స్యరూపమును బొందకపూర్వము కూడిన సంస్కారముల ప్రభావము పూర్తిగా నంతమొందిన తరువాత ఆ మత్స్యరూపమునుగూడ నాత్మ విసర్జించును. ఆరూపము నాశయము లేక యత్తిటి నుండును. కాని చివఱకు వదలిన సంస్కారముల యొఱుకమాత్ర మాత్మ నంటియుండును. ఈ సంస్కారముల యనుభవము నిమిత్త మాత్మ మఱియొక రూపమునాశ్రయింపవలసియున్నది. అందుచే మత్స్యరూపమున నున్నప్పుడు పొందిన యనుభవముల రూపాంతరమైన పక్షిరూపము నాత్మ యాశ్రయించుచున్నది. తుట్టతుదకు మత్స్యరూపమునఁ బొందిన సంస్కారశక్తి ప్రప్రథమముగానొందు పక్షిరూపమున ననుభవమునకు వచ్చుటయుఁ బూర్తియగుటయు జరుగును. అనేకవిధములగు నీపక్షిరూపములతో నేకత్వముపొంది యాత్మ బహుసంస్కారముల నొందుచున్నది. ఇట్లే రూపములను గ్రహించుచు విసర్జించుచు నాత్మ సంస్కారమును పోగుచేయుచు విసర్జించుచున్నది.

ఇట్లు యుగముల తరబడి కల్గెడి యనుభవములతో నాశ్రేణికిఁజెందిన రూపసంబంధములు వివిధములు నగు పలుతర

తులఁగలుగు సంయోగవియోగములవలన నుద్భవించిన సంస్కారముల యనుభవమును చేత్మాత్మపొందుచున్నది. ఆత్మాంతఃకరణావృత్తిపరిణామచక్రము తిరుగుచుండవలె నన్నచో ప్రత్యక్షముగాఁగాని పరోక్షముగాఁగాని యీసంయోగవియోగానుభవము లవసరము. సర్వవ్యాప్తమైన చైతన్యపరిణామకర్మాగారమున స్థూలస్వరూపములు పుట్టుచుఁబెరుఁగుచుండుట ప్రాసంగికము.

పక్షిప్రవృత్తిగల యాత్మ ఒకతరగతి పక్షులయుఁ, దరువాత మఱియొక తరగతిపక్షులయు,నట్లే క్రమముగా రకరకముల పక్షులయు,చైతన్యానుభవమును పొందును. ఇది మూలముగ ననేకములగు సంస్కారము లాత్మకు సంక్రమించుచున్నవి. తానే పక్షిననెడి యనుభవ మీవిధమున నాత్మకుఁ గలుగుచున్నది. ఆదిని రూపములేక పరమాత్మకుఁజెందిన యాత్మ యీపక్షిరూపము నాశ్రయించుటచే గాలిలోను భూమిపైనను నీటిలోను పక్షికిఁగల సంస్కారముల ననుభవించుచున్నది. వెన్నెముకఁ గలిగి,యీకలు గలిగి,కాళ్ళమీఁద నిడివిగా నిలబడుశక్తి గలిగి, గాలిలో నెగురు శక్తి గలిగిన జంతువుగా నాత్మ యనుభవము నొందుచున్నది.

ఇట్లే యుగములతరబడి పక్షి జన్మానుభవములను పొందినతరువాత పక్షిరూపాలంబనముకూడ వదలిపోవును. చిట్టచివఱ కలిగిన పక్షిరూపసంస్కారములుమాత్రము మిగిలి యుండును. అవికూడ సాంత శ్రేణికి సంబంధించిన పక్షిరూపములతో నంతమొందును. అంతవఱకుఁబొందిన పరిణామాభి

వృద్ధి యగుట్లేయున్నను రూపాశ్రయముమాత్ర మాత్మకు లేని స్థితి వచ్చును. ఆత్మ కంతఃకరణసహాకృతచైతన్య మొకసారి యబ్బినతరువాత నది వృద్ధిపొందుచునేయుండునుగాని నశింపదు. రూపములేని యవస్థకుఁ బూర్వ మాత్మకుఁగలిగిన పక్షిరూప సంస్కారములు మిగిలియుండును. ఇవి యనుభవముచే నశింప వలసియున్నవి. అందుచేఁ జైతన్య మొక సున్నితమగు మధ్యవర్తితో సంపర్కముపెట్టుకొని, చైతన్యముగల యాత్మ జంతు రూపములలోఁ బ్రథమ శ్రేణితో నేకత్వము పొందును.

అంతకుఁబూర్వము కడపటి పర్యాయము వదలిన పక్షి రూపము సంస్కారరూపము లీ జంతురూపములోఁగూడ నాత్మనంటియుండును. అనఁగా నీజంతురూపమదివఱలోఁ దుట్ట తుద వదలిన పక్షిరూపసంస్కారముల రూపాంతరమనుట. ఈ జంతురూపముద్వారా పక్షిరూపములలోఁబొందిన సంస్కార రూపములను గ్రమముగా నాత్మ వదలించుకొనుచున్నది. ఇట్లు జరిగిన తరువాత జంతురూపమునుండియు నాత్మ ముక్తిని బొందుచున్నది. అనఁగా నారూపమును వదలివేయుచున్నదని కాని లేక యారూపము మృతమైనదనిగాని చెప్పఁబడును.

కడపట వదలిన జంతురూపము సంస్కారము లావరించి యున్నయాత్మ రూపాలంబనము లేకయుండెను. మొదట జంతు రూపమునఁగలిగిన సంస్కారములను జీవుఁడగు నాత్మ యనుభ వింపవలెను; లేక క్షీణింపఁజేయవలెను. దీనివలన నా జీవాత్మకు రూపసంస్కారముల స్మృతి నశించును. అట్లు నశించుటచే రూప

సంస్కారవాసనారహితము, శాశ్వతము, ననంతము నగు స్థితికి సంబంధించిన సత్యానుభవ మాత్మకుఁ గలుగవలెను. అట్టి జ్ఞానము మూలమునఁ బరమాత్మానుభవమును బొందవలెను. ఇట్లు తన నైజసత్త్వము ననుభవించుటకొనర్చు యత్నమునఁ జైతన్యప్రవృత్తిగల యాత్మ, యనేకరూపానుభవములవలనఁ గలుగు సంస్కారములు తన నావరించియుండుటచే, వానిని క్షీణింపఁజేసికొనుటకును యత్నముచేయును. ఈయత్నమున నాత్మ తన స్వస్వరూపమును సత్యము నగు పరమాత్మకు దూరమగుచు స్థూలమైన మాయాప్రపంచమందలి ద్వంద్వములలోఁ దగుల్కొనుచున్నది. పరమాత్మతత్త్వమును గ్రహింపఁ గోరు జీవాత్మ యెడ తెగని యవిద్య యనఁదగు నజ్ఞాన మను గాఢావగుంఠనముచేఁ గప్పఁబడుచున్నది.

జీవాత్మ చైతన్యప్రవృత్తి మొట్టమొదటపొందినజంతురూపసంస్కారములను క్షీణింపఁజేయవలెనన్నఁ దుట్టతుదనుగూడ నట్టిసంస్కారానుభవములకనువగు జంతురూపమును దత్పూర్వరూపమును వదలు నప్పుడుకూడఁ బొందవలెను. మొదటి జంతుజాలరూపముల యనుభవములు సంఘటించిన ఫలమువలననే చిట్టచివఱ జంతురూపముకూడ ఆత్మకు తటస్థపడుచున్నది.

ఈ జంతురూపముకూడ రాలిపోయిన తరువాత ఆత్మకీ స్థూలప్రపంచముననే స్థూలరూపసంపర్కము లేకుండును. అట్టిస్థితిలో అప్పుడే వదలిన జంతురూపసంస్కారములచేఁ బరితమై యాత్మ విలసిల్లుచున్నది. ఈ సంస్కారములుకూడ క్షీణింపవలెనన్నచో ననుభవింపఁబడవలెను. దీనికొఱకుఁ దరువాత

శ్రేణియందలి జంతురూపము నాత్మ యాశ్రయించుచున్నది
అనఁగా నారూపముతో నా ఆత్మ యైక్య మొందుచున్నదనుట.
ఇట్లు వివిధములు నసంఖ్యాకములు నైన జంతురూపములతో
సంపర్కమునొందుచు విడుచుచు. నీజంతురూప సంబంధియగు
చివరి శ్రేణితో నేకత్వము పొందును. జాంతవప్రవృత్తిగల
యాత్మభూమిపైనను భూగర్భమునను నీటిలోను జరించు వివిధ
జంతుజాలములతో నేకత్వమును బొందుచున్నది. జీవచలన
స్మృతులుకలిగిన చతుష్పాదజంతువులతో నొకటియై తిను
టకు మనుటకు నిత్యము యాతన పడుచుండును. అందొక
ప్పుడు శాకాహారియు మఱియొకప్పుడు మాంసాహారియునైన
జంతుజాలముతో సంపర్కము కలిగియుండును. ఈజంతు
రూపము నిట్టనిలువుగా నిలుచుటకు శక్తి కలిగినది కాదు. వాల్చిన
తలతో నధోదృష్టి కలిగియుండును. ఈ జంతుజాలములో నగ్రి
యములైనవి వానరములు. అవి మానవులవలె నిడివిగా నిలు
చుండుటకు యత్నించును.

ఇట్లు జంతుజాలముల సంపర్కములతో సంస్కారముల
యనుభవము పూర్తియైన తరువాతఁ దుదనుగల్గు జంతురూపము
నుగూడ నాత్మ విసర్జించును. ఈదృశ చైతన్యవిశిష్టమగు నాత్మ
మరల రూపరహితముగా నుండును. కాని యంతకుముందే
వదలిన జంతురూపసంస్కారము లాత్మను చుట్టుకొని యుం
డును. ఈసంస్కారరూపము లనుభవింపఁబడవలెను; లేదా
క్షీణింపవలెను. అందుకొఱ కాత్మ తన చైతన్యముద్వారా
మనుష్యరూపము నాశ్రయించును. చిట్టచివఱ వదలఁబడిన

జంతుసంస్కారము మూర్తీభవింపఁగా నేర్పడిన రూపమే యీ మానవరూపము. ఆజంతుసంస్కారము లన్నియు నీరూపములో క్షీణింపఁబడవలెను. అట్లు ఆ సంస్కారక్షైణ్యము పూర్తియగుటతోడనే యీప్రథమ మానవరూపము నశించును. దానినే మరణమని చెప్పుదుము. కాని ప్రథమనరరూపములోఁగల సంస్కారములు మాత్రము విగతరూపమైన యాత్మ నావరించుచుండును.

ఈ సంస్కారము లనుభవింపఁబడి క్షీణింపవలెనన్న నాత్మ చైతన్యము మఱియొక నరరూపము పొందవలెను. ఇదివఱకు మొదటి నరరూపములో ననుభవించిన సంస్కారము ఫలితమగు మానవరూపమునే తిరిగి యాత్మ పొందుచున్నది. తరువాత స్వరూపముతో నాత్మ పొందు నైక్యమునే 'జననము' అని చెప్పుదుము.

ఆత్మచైతన్యము మొట్టమొదట మానవస్వరూపముతో సంయోగము కలుగుటతోడనే చైతన్య వృత్తిపరిణామము పరిపూర్ణతను పొందినది.* మానవరూపమున నాత్మచైతన్యము

*శ్రీమెహర్ బాబా గారిట్టివిషయము ననిర్ధారితముగా వదలఁగూడదని తెలుపుచున్నారు. సృష్టిపరిణామము లేక పునర్జన్మలలో విశ్వాసావిశ్వాసములు మానవుని యాధ్యాత్మికోన్నతి కనురోధకారణముగాని యవరోధకారణముగాని కాలేదని యాయన యంగీకరించినారు. ఈవిషయమై యీ క్రింది మాటలలో వారు తమయభిప్రాయమును దెలుపుచున్నారు.

పూర్తి పరిణామము పొందినది. కావున రూపపరిణామము కూడఁ బరిపూర్ణత్వమును పొందినది. ఈ ప్రథమ మానవరూపముతో నాత్మ యేకత్వమును పొందినతరువాత నింతకంటె మానవరూపమున కున్నతస్థాయి యేర్పడదు. అనఁగా జీవాత్మాంతఃకరణప్రవృత్తులు సచేతనములై మానవరూపమునఁ బరిపూర్ణతనుబొందినవన్నమాట. ఇప్పుడు చైతన్యపరిణామ మొక నిశ్చలస్థితికివచ్చినది. చైతన్యపరిణామములో మానవరూపము బహుతేజమునుగల్గి సమున్నతమై యున్నది. కావున మనుష్యరూపములో చైతన్యపరిణామము పరిపూర్ణమైనది. తరతరముల యుగయుగముల యనుభవపరిణామముగా నేర్పడిన దీమానవరూపము. ఈ పూర్ణతగల మధ్యవర్తియగు మానవరూపమును బూర్వపుసంస్కారము లన్నిటిని బూర్తిగాక్షీణింపఁజేసికొనుటకు ననంతమైన శాశ్వతమైన పరమాత్మలో నిమిడియున్న తన సత్యస్థితిని బొందుటకును నాత్మ వినియోగించుచున్నది.

---

మానవరూపములోవలె నాత్మ తన పరిపూర్ణచైతన్యవిజ్ఞానమునుబొందుటకుఁ బరిణామాత్మకమైన సంఘర్షణ ముపయోగించును. ఈచైతన్యవిజ్ఞానశక్తిని భద్రపఱుచుచు నాపరిణామమార్గమునఁగలుగు నితరఫలములను విసర్జింపవలెను. కష్టసుఖాదిరూపభవాగ్నివలన సంస్కారములను నశింపుచేయుటకు సహకారి కాఁగలందులకుఁ బునర్జన్మానుభవ మవసరము. సప్లిమెంటునోటు 3. చూచునది. సంఖ్యలవారిగ సూచన లీ సప్లిమెంటులో నీయఁబడినవి.

# మూఁడవ భాగము

## జీవరాశి
## సప్తవిధవర్గీకరణము

మనోబుద్ధిచిత్తాహంకారరూపముగు నంతఃకరణము మానవస్వరూపమునఁ బరిణతిపొందుటకుఁ బూర్వము ప్రధానములగు నేడు పూర్వపూర్వరూపముల ననుభవించుచు క్రమగతిముందునకుఁ బ్రసరించినది. రాతినుండిలోహము, లోహమునుండి యుద్భిజ్జము,నుద్భిజ్జమునుండి కీటకము (సరీసృపము), కీటకమునుండి మత్స్యము,మత్స్యమునుండి విహంగము,విహంగమునుండి మృగము, మృగమునుండి మానవరూపము కలిగినవి. వీనిలక్షణములు భిన్నములు.

## శిలా లోహ వర్గముల లక్షణములు

శిలారూపమునను లోహరూపమునను జీవాత్మకు స్థూలప్రపంచప్రథమానుభవము కలిగినది. శిలావర్గమువలెనే లోహవర్గముకూడఁ గర్కశము, నంగవిహీనము. వానిలో నొక్కొకదానియం దంతర్గతజాతు లనేకము కలవు. శిలాలోహముల ఘనీభూతస్థితియందు జీవము శక్తియు నిద్రాణములై యుండును. అందుకనియే యవి ప్రాణరహితములని యెన్నఁబడుచున్నవి. స్వతస్సిద్ధమైన చలనశక్తి వానికిలేదు. అందుచేతనే యవి నిట్టనిలువుగా నుండుటకంటె చాఁపచుట్టుగాఁబడి యుండుటకే స్థూలప్రపంచమున వాని యంతఃకరణవృత్తి యున్ముఖమగును.

## ఉద్భిజ్జవర్గలక్షణములు

ఈ జాతిలో జీవుఁడు సగము చలనశక్తిని సగము స్థావర శక్తి ననుభవించును. ఈ వృత్తిద్వయము వృక్షజాతిలోఁ బెంపొందుటనుబట్టి యివి నిట్టనిలువుగా నిలువఁదొ్రక్కుకొని నిలిచెడు శక్తిని ప్రదర్శించును. ఈ యూర్ధ్వగమన స్థితిని రక్షించుకొనుట కీజాతి భూశిలాపర్వతముల సాహాయ్యము పొందును. ఒకచోట వేరు తన్నికొనియుండుటచే నీజాతి తమంతటతామై నిలువలే వని తెలుపఁబడినది. ఇంతియేకాక యొకచోటినుండి మఱియొకచోటికిఁ బో లేవు.

## కీటక (సరీసృప) వర్గలక్షణములు

జీవాత్మకుఁ దనంతట తాను సంచారము చేయఁగలుగుట యందలి యనుభవము సరీసృపరూపమునఁ గలుగుచున్నది. అనఁగా జంగమత్వానుభవము కలుగుచున్నదనుట. ఈసరీసృపవర్గమునందలి వ్యక్తులు తమతమ యనుభవములకంటె నుత్తరోత్తరబలీయములగు నంతఃకరణవృత్తుల ననుభవింపవలె నను కోరిక కలవియై తమజాతియందలి పరిణామము నందభివృద్ధిని బొందిన యితరసరీసృపముల సంయోగమును బొందుచున్నవి. ఇవి క్రమముగా వెన్నెముక కలవియై వివిధరూపములతోఁ బ్రాఁకుచుండును. వీనియందు రెండు పాదములను గలవి, బహుపాదములను గలవి, రెండురెక్కలను గలవియునై జంగమస్థితియం దభివృద్ధి పొందుచుండును. ఇంకను వీనియందుఁగొన్నిటికిఁ బైభాగము పెంకులతో నిండియుండును; కొన్నిటికిఁ

బైభాగము నున్నగానుండును; మఱికొన్నిటికిఁ బైభాగము పొలుసులతో నిండియుండును. బ్రదికి మనుగడ సాగించుకొనుట కివి పైఁజెప్పఁబడిన రూపములతోఁ గ్రిందుమీఁదగుచు నిరంతర కృషి చేయుచుండును. ఇవి కొంతకొంత వైషయికజ్ఞానముగల ప్రాణులు. వీనియందుఁ గొన్నియెడల జలచరత్వస్థలచరత్వ ములు రెండు నుండును. ఈ సరీసృపరూపము క్రిమికీటకసర్ప ములయు నుభయచరములయు సంబంధమును గలది. వీనికిఁ గాళ్లును ఱెక్కలు నున్నప్పటికిఁ బ్రాఁకు స్వభావముమాత్రమే కలవియగుటవలనఁ బక్షిజాతికిని చతుష్పాదజంతువులకును భిన్నమైనవి. ఈ సరీసృపస్వరూపముకూడ నిట్టనిలువుగా నిలుచుండ నేరదు. వంగిభూమిపైఁ జాఁపచుట్టుగానుండు స్వభావము కలది.

## మత్స్యవర్గలక్షణములు

మత్స్యాంతఃకరణప్రవృత్తిగల జీవాత్మ స్వజాతిసంబంధములగు వివిధమత్స్యములతోఁ దాదాత్మ్యమునొంది స్థూలప్రపంచమును జలచరమై యనుభవించును. ఇది వెన్నెముక కలిగి వైషయికజ్ఞానమును స్వతస్సిద్ధమైన చలనశక్తియుఁ గలప్రాణి. దీనికి ఱెక్కలుండును. ఇదియును బ్రదికి మనుగడ సాగించుకొనుటకై నిరంతర కృషిచేయుచుండును. నిలువుగా నిలుచు శక్తి యీ రూపమునఁగూడ జీవాత్మకు లేదు. ఇవియుఁ దలఁ బైకి నిలుపలేక చాఁపచుట్టుగానుండు స్థితిని గలదే.

## పక్షివర్గలక్షణములు

వెన్నెముకఁ గలిగి యీఁకలు ఱెక్కలు గలరూపమును బొందిన జీవాత్మ యిది. దీనికిఁగలుగు నూతనానుభవముల వలన నంతఃకరణవృత్తు లభివృద్ధి నొందును. ఈరూపమునకు గాలిలో నెగురు శక్తియుఁ గాళ్ళమీఁద నిలువుగా నిలిచెడి శక్తియుఁగలదు.

## జంతువర్గలక్షణములు

జంతుజాతిలోనుండు నానావిధములగు జీవరాసులవలనఁ గలుగు నూతనానుభవములచే జీవాత్మకు నంతఃకరణవృత్తుల యనుభవము సంపాదించుశక్తి యభివృద్ధినొందును. ప్రాణి జ్ఞానము, స్మృతి, స్వతంత్రచలనశక్తి, కలిగిన చతుష్పాదజంతు లోక మాత్మరక్షణముకొఱకు, నాహారముకొఱకు వివిధము లగు కష్టముల కగ్గమగుచుండును. అందుఁ గొన్ని శాకాహారు లును, గొన్ని మాంసాహారులును. ఇవియు నిట్టనిలుచుశక్తి లేని వగుటచేఁ దలలను వంచియుండును. వీనిలో వానరము మాత్రము హెచ్చు పరిణతి పొందిన జంతు వగుచున్నది. ఇది మనుష్యులవలె నిలుచుండుటకు యత్నించును.

## మానవవర్గలక్షణములు

ఇట్లు క్రమముగాఁ బరిణామాభివృద్ధిని బొందుచున్న జీవుఁడు పరిపూర్ణపరిణామస్థితికి వచ్చి ప్రపంచానుభవము లంతఃకరణవృత్తితోఁ బూర్ణముగాఁ బొందఁగలిగినపుడు మాన

వృఁడగుచున్నాఁడు. పరిణామయాత్రకుఁ బరమావధి మానవ రూపము. ఇందే మనోబుద్ధిచిత్తాహంకారముల కధిష్ఠానమగు నంతఃకరణము పరిపూర్ణస్థితిని బొందును.

మానవుఁడు జన్మించినపుడు మొదటఁ గ్రిందఁబడియుండు శక్తిమాత్రము కలిగియుండును. ఈ స్థితిలోఁ గొంతకాల మాతఁడుండును. తరువాత నిలువునఁ గూర్చుండుటకు యత్నించును. ఆపైన నిలుచుండుటకుఁ గృషిచేయును. ఇట్లు మానవ రూపమునఁ బరిపూర్ణవికాసము చెందిన జీవాత్మప్రవృత్తి నిలువుగా నిలుచుయత్నము చేయును.*

---

—ఆరోహించు నాత్మ

ఖనిజదేహంబు వీడి వృక్షఁబనైతిఁ,
దచ్ఛరీరంబు వీడి జాంతవశరీరి
నైతి; నా తనువును వీడి యైతి నరుఁడ;
భయము నాకేల ? నే నధఃపతన మెప్పు
డేని యనుభవించితినో చెప్పు; మృత్యువునకుఁ
జిక్కి యీ నరతనువుఁ ద్యజించి యింకఁ
బ్రియతనిర్జరమూర్తినై భాసిలెదను:
త్రిదశదేహవిభూతి నతిక్రమించి
ముందునకుఁ బోదుఁగాని నేనందు నిలువ.
బ్రహ్మకంటె నన్యము నశ్వరమ్ము సుమ్ము.
దేవతాత్వముఁగూడ నతిక్రమించి
నప్పుడగుదు మనోవృత్తికైన నంద
రానివాఁడ; జన్మాదిదూరగుఁడ నగుదుఁ
గాతఁ, దెల్పుచున్నదిగదా ఖంగు ఖంగు
రనుచు ఘంటారవమయి మిథ్యాజగంబు
మనకు బ్రహ్మ లయస్థానమనుచు సతతము

—రూమి

# నాల్గవ భాగము

## పునర్జన్మము
## సంస్కారహీనచేత్యసామ్యావస్థ

ప్రథమ ప్రేరణము(స్పందనము) కల్గినది మొదలు జీవాత్మ తనకంటె భిన్నముగా నట్టియు, దనతోఁ గూడియున్నట్టియు, స్వరూపస్మృతి కాటంకమును గల్గించునట్టియు, మాయాశబలమగుటచేఁ దనకుఁ దెలియకుండగనే తానే కల్పించుకొన్నట్టియుఁ బరిమిత కారణసూక్ష్మ దేహములు తానే యనుకొనుచుఁ, బరిమితములగు స్థూలసూక్ష్మకారణ దేహములఁబడి యా యా రూపములన్నియుఁ దానేయను నంతఃకరణవృత్తిని గల్గియుండెను.

సమధికసమున్నతతరచేత్యతాపరిణతి నొందుచుఁ జీవాత్మకు వాసనానుభవము సమకూర్ప ద్వారకల్పములై వర్తించిన పరిమిత స్థూలరూపములనుండి యొకటితోడనే మాటిమాటికిఁ దన పరిపూర్ణ పరిణామయాత్రయందు దాత్మ విడివడుచున్నదైన నది తెలిసియేని తెలియకేని స్వకీయములగు పరిమితసూక్ష్మరూపమునుండియుఁ బరిమిత మనోమయరూపమునుండియు నెప్పటికిని విడివడనేరదు.

ఈ విధముగాఁ దన పరిమితస్థూలరూపమునకు ద్వారకల్పమైన శరీరముతోడఁ దనకుఁగల సంబంధమునుండి విడివడినప్పటికిఁ దనకుఁ దెలియకుండఁగనే మిగిలియున్న తనపరిమిత సూక్ష్మరూపసంబంధమే శరీరరహితస్థితియందున్న యాత్మకుఁ

బరిమితశక్తిరూపమగు ప్రాకార మగుచున్నది. దీనివలన దన కనంతరమేర్పడనున్న పరిమితస్థూలరూపమునకు ద్వారకల్పమైన దానిని దెలిసికొను విజ్ఞానమాత్మకుఁగలుగు జాడయేర్పడును. ఈవిజ్ఞానమున నింతకుమున్ను తాను వీడిన పరిమితస్థూలరూపసంబంధములై తన్మనోమయరూపమునందునిల్చి ప్రతిబింబించు వాసనల నాత్మ యనుభవింప వీలగును.

పూర్వము విడనాడిన పరిమితస్థూలరూపవాసనలనుండి సముత్పన్నములగు సమున్నతతరజాతుల(types)సంబంధములైన పరిమితస్థూలరూపములఁ దెలిసికొనుటకుఁ దగిన సమధికతరమగు పరిమితశక్తి యాత్మకు సుస్థిరమగుటకుఁ దగినప్రాకారమగురీతి నాయాత్మ తన పరిమితసూక్ష్మరూపమునఁగూడ సమధికసమున్నతతరచేత్యతాపరిణామము నొందును. ఇట్లు పరిమితస్థూలరూపముతోఁబాటు పరిమితసూక్ష్మరూపముగూడఁ బరిణమించుట సహజము.

ఇదే విధమున సమధికతరము సమున్నతతరము నగు క్రమపరిణామక్రమమునఁ దనకు లభించి సమకూడి యభివృద్ధి నొందుచు నసంఖ్యాకములై వెలయు భిన్నవాసనల నాత్మ తన యందిమిడ్చికొని స్థిరమొనరించుకొని పర్యాలోచించుట కనుకూలముగఁ బరిమితమనోమయరూప పరిణామముగూడ స్థూలసూక్ష్మరూపములతోఁ బాటేకకాలముననే జరుగును.

ఇది యిట్లగుటచేతనే నానావిధములగు నుద్భిజ్జరూపములతో నేకీభావమునొందుజాడల నాత్మ యున్నప్పు డట్టులున్న యా యాత్మకును, బరిణతపరిమితసూక్ష్మమనోమయరూప

ముల నుద్భూతమగు నాయాత్మయే తదుద్భిజ్జములవిధములై యచిరకాలముననే గల్గుమార్పుల రూపమునఁ బరిమితసూక్ష్మ మనోమయరూపములనున్న తనకును గల సన్నిహితసంబంధ మును వ్యక్తీకరించుచిహ్నములఁ బ్రకటించును. ఈయుద్భిజ్జ రూపములందు బ్రతుకఁదగినవి దక్కఁ దక్కినవి నశింపవలసి వచ్చుసంఘర్షణమున బ్రతుకుటకుఁ గావలసినట్టియు నితరజీవ రాశికిసంబంధింపనట్టియు, స్థవంతములగునట్టియు లక్షణములు వ్యక్తమగును.

సరీసృపము, పక్షి, మత్స్యము, అనువాని రూపము లలో జీవాత్మ పరిమితసూక్ష్మరూపము క్రమముగా సహజ గుణముగా మాఱును. ఈ సహజస్వభావము జంతురూపమున మఱింత స్ఫుటముగా ప్రకటితమగును. పిదప జీవాత్మ మనుష్య జన్మమెత్తినపుడు స్థూలశరీరానుభవమున, మనోవృత్తుల మార్గ మున స్థూలప్రపంచానుభవమును బరిపూర్ణముగాఁబొందును.

ఇట్లు మనుష్యశరీరమున సూక్ష్మకారణశరీరముల యభి వృద్ధి పరిపూర్ణమగును. అట్లగుటచే స్థూలప్రపంచజ్ఞానముతోఁ గూడి జీవాత్మ మనుష్యశరీరము నందన్నమయ ప్రాణమయ మనోమయశరీరముల ననుభవించును.

ఇట్లు శరీరత్రయవిజ్ఞానము జీవాత్మకు మనుష్యజన్మ మునఁ గల్గినప్పటికి స్థూలప్రపంచప్రవృత్తులఁ గలదగుటచే సూక్ష్మప్రపంచము దానిప్రవృత్తులను, గారణప్రపంచము దాని ప్రవృత్తుల నెఱుఁగఁజాలకుండును.

జీవాత్మకు స్థూలప్రపంచప్రవృత్తిమాత్రము కలిగినను సూక్ష్మకారణ(మనోమయ)శరీరముల స్మృతిలేనప్పటికిని సూక్ష్మకారణశరీరముల ద్వారముననే స్థూలప్రపంచప్రవృత్తుల ననుభవించును. ఈ యనుభవమునకుఁ బరోక్ష హేతువులు సూక్ష్మకారణశరీరములే. సూక్ష్మకారణశరీరములయు, వాని ప్రపంచములయు, స్మృతి లేకపోయినను ప్రాణ (సూక్ష్మ) మనో (కారణ) లోకముల శక్తిని గుర్తెఱుఁగక పోయినప్పటికిని మనుష్యరూప మొందిన జీవాత్మ స్థూలస్వరూపద్వారముననే తనశక్తి నుపయోగింపఁగలదు. దీని కుదాహరణముగా నేఁడు మానవుఁడు ప్రయోగించు పరమాణుశక్తిని జెప్పవచ్చును. కామక్రోధాదులు, సంకల్పవికల్పములు మనస్సునకు స్థూల లక్షణములు. వీని ననుసరించి జీవాత్మ మనస్సు నుపయోగించును. కామము (కోరిక) మనఃప్రభావమును ముఖ్యముగా సూచించును. (కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః మోహాత్ గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః అను భగవద్గీతయందలి పదునాఱవ యధ్యాయములోని పదియవశ్లోకమునుజూచునది.)

సూక్ష్మకారణ (మనో) లోకముల స్మృతికలుగక పూర్వమే జీవాత్మకుఁ బ్రారంభమున నరజన్మమందు ప్రాప్తమైన సంస్కారముల స్మృతియుండును. ఈ సంస్కారముల స్మృతి యీజన్మమున కత్యంత సన్నిహితమైన పూర్వజన్మమునకు సంబంధించినది.

ఇట్లత్యంతసన్నిహితపూర్వజన్మమగు జంతురూపము నుండి వచ్చిన సంస్కారస్మృతి పరిపూర్ణముగా క్షీణించి పోయి నప్పుడు జీవాత్మనుండి స్థూలమగు మానవరూపము విడివడును. ఈయెడబాటునే మానవుని మరణమని చెప్పుదురు.

పైనదెల్పినరీతిని స్థూలమగు మొదటి మనుష్యశరీరము నుండి జీవాత్మ విడివడిపోయినప్పటికిని సూక్ష్మశరీర కారణశరీరములనుండి మాత్రి మెడబాటునందదు.

అట్లే మొదటి మనుష్యశరీరమును త్యజించినపుడా శరీరముతో నున్నప్పుడు కల్గిన సంస్కారములను జీవాత్మ సూక్ష్మ కారణశరీరముల ద్వారమున గ్రహించి యనుభవించును. ఇదేవిధమున నుత్తరోత్తరముకల్గిన మానవశరీరమును వదలి నప్పుడుకూడ నా యీ సంస్కారములను గ్రహించియే ముందు ముందురానున్న జన్మమునకు సూక్ష్మ కారణ శరీరములమార్గమున జీవాత్మ తనవెంటఁ గొనిపోవుచుండును. అనఁగాఁ బూర్వ పూర్వసంస్కారముల రూపనే యుత్తరోత్తర మానవశరీరము జీవాత్మకుఁ గల్గుటకు హేతువగుచున్నది. ఇట్లు మాటిమాటికి జీవాత్మ మానవశరీరముతో సంయోగము పొందినప్పు డీసంయోగమునే మానవుని యుత్పత్తియని చెప్పుదురు.

స్థూలశరీరమున విషయలంపటమైన జీవాత్మ పరిణత ములైన సూక్ష్మకారణశరీరములతోఁ గూడియుండి పిదప నా శరీరమును విడిచి తాను విడిచిన మానవశరీరసంపర్కమున గల్గి నట్టియు, బరస్పరవిరుద్ధములగునట్టియు, సంస్కారములతోఁ

గూడి కొంతకాలముండును. ఈకాలవ్యవధినే మరణమునకుఁ బునర్జన్మమునకు మధ్యకాలమని చెప్పనగును. ఇట్లు చావు పుట్టుకలకు మధ్యకాలమునలె గోచరించుసమయమున జీవాత్మ యనుభవించుస్థితినే నరకమనికాని స్వర్గమనికాని యందురు. మానవస్వరూపమునఁ జిత్కళలతోఁ బ్రకాశించు జీవాత్మమాటి మాటికి నా యీ మనుష్యదేహముల సంయోగవియోగానుభవము లొందుటయే పునర్జన్మపద్ధతి యందురు.

సూక్ష్మకారణశరీరములతోనున్న జీవాత్మ పుణ్యపాపాదులగు ద్వంద్వములయందుఁ బుణ్యాదులగు శ్రేయములను మాత్ర మనుభవించునప్పుడు జీవుఁడు స్వర్గసుఖముల ననుభవించుచుండెనందుము. అట్లుగాక పాపాదులగు దుష్టసంస్కారముల ననుభవించునప్పుడు నరకమనుభవించుచుండెనందుము.

తీవ్రతరములగు ననుభవముల స్మృతివలన జీవాత్మకుఁ గలుగుస్థితులే స్వర్గనరకములు. ఇవి స్థూలశరీరసంబంధమునుండి దూరమైనప్పుడు జీవాత్మ యనుభవించు సంస్కారములనుండి జనించును.

సామాన్యముగా లోకము తలంచువిధమున జీవాత్మ స్వర్గమునకుఁగాని నరకమునకుఁ గాని పోదు. జీవాత్మ నిత్యము ననంతమునై, నిత్యము ననంతము, నగు పరమాత్మయందే శాశ్వతముగా నుండుటయే దీనికి హేతువు. కావున జీవునిబుద్ధి ప్రవృత్తియే యీసంస్కారముల ననుభవించుచున్నది.

ముఖ్యసంస్కారములకు విరుద్ధములగుసంస్కారముల యనుభవము పూర్తియై యీ సంస్కారములు క్షీణించినప్పుడు ఇతఃపూర్వమునదలిన మానవదేహమువలవ సంక్రమించిన ద్వంద్వసంస్కారముల సమస్థితి పొడుకొనినప్పుడు, జీవాత్మ యుత్తరజన్మమునకు సంబంధించిన మానవదేహముతోఁ దనంతట తాను సంయోగముపొందును. ఈవిధమున జీవాత్మ స్థూల శరీరముతోఁ బ్రపంచ ప్రవృత్తుల కున్ముఖమై స్వర్గమునో, నరకమునో యనుభవించి తరువాత జన్మమునఁ బూర్వజన్మ సంచితములైన ద్వంద్వసంస్కారముల క్షీణింపఁ జేసికొనును. ఇదియే జన్మజన్మాంతరముల పునఃపునరావృత్తి.

ఈమాదిరిగ ననంతములైన మానవరూపముల జనన మరణములు జీవాత్మకుఁ గల్గుచుండును. స్థూలదేహముతో స్థూలప్రపంచానుభవములను బొందిన యనంతరమే జీవుఁడు మానవశరీరములతో మరల మరల జన్మించుచుండును. గాఢ సుషుప్తి యందువలె స్మృతిహీనమైన స్థితినుండి యీవలకువచ్చి స్థూలప్రపంచానుభవమున జీవుఁడు లీనమై యవిభక్తము, రూపరహితము, ననంతమునైన స్థితి ననుభవించునపుడు పర మాత్మయందుఁ దనశాశ్వతనిత్యస్థితిని గలవాఁడయ్యె నని చెప్ప వలయును. ఇదియే జీవాత్మ పరమాత్మలకు భేదరాహిత్య మును, నేకత్వమును దెలుపుస్థితి.

ఇట్టి క్రమపరిణామపద్ధతియందుఁ దన యనంతమైన, శాశ్వతమైనస్థితిని జీవాత్మ తెలిసికొనుటకే యీపునర్జన్మవిధాన

మునఁ బ్రథమప్రేరణము (స్పందనము) నుండి తనంతట తాను బయలు వెడలినది.

వివిధరూపములఁ బరిణామము క్రమక్రమముగాఁ నభివృద్ధి యగుకొలఁదిని దదభివృద్ధితోఁ బాటు జీవునకు బుద్ధివికాసమువలన ననుభవము లెక్కువగుచుండును. పూర్వాపూర్వములగు హీనజన్మములవలనఁ గల్గిన సంస్కారములనుండి ముక్తిఁ బొందుచు జీవాత్మ యుత్తరోత్తరజన్మముల నున్నతగతికిని బోవుచుండును.

అంతఃకరణప్రవృత్తుల పరిణామము వృద్ధియగుకొలఁదిని బాహ్యప్రపంచముసందలి స్థూలరూపముల వివిధసంస్కారములను గ్రహించుచు జీవాత్మ మున్ముందునకు సాగుచుండును. ఆదిని బ్రారంభమైన వాయుతోయరూపములదాటి స్థూలమైన ఘనపదార్థరూపములతో జీవాత్మకుఁ గల్గిన సంయోగానుభవములనుఁ బరికించినచో నాజీవుని యంతఃకరణప్రవృత్తులు వైవిధ్యమును బొంది యేకోత్తరగతులుగా విభక్తమైనట్లు తెలియుచున్నది. ఈపరిణామదశ లేవనఁగా రాతినుండి లోహమునకు, లోహమునుండి వృక్షజాతికి, దానినుండి సరీసృపజాతికి, ఆజాతినుండి మత్స్యజాతికి, దానినుండి ఖగజాతికి, దానినుండి మృగజాతికిఁ, గ్రమముగాఁ బరిణమించి తుదకు మృగమునుండి మానవజాతికిఁ బరిణమించుట యే.

నిర్వికారమైన పరమాత్మకుఁ బ్రథమప్రేరణమునఁ (స్పందనమున)గలిగినట్టియుఁ, బరిమితమైనట్టియుఁ, బ్రథమ

సంస్కారమువలన మొదటిసారిగా బహుపరిమితమైన యంతః కరణవృత్తి కలిగెను. క్రమముగా వివిధములగు సంస్కారములఁ గలదియై యిట్లు జీవాత్మ స్థితినొంది తనకుఁ బూర్వాపూర్వరూపములఁబరిమితములైన ప్రవృత్తులతో వర్ధిల్లెను. క్రమముగా జీవాత్మ యిట్లభివృద్ధినొంది మొదట మానవదేహముతోఁగూడి యున్నప్పు డీయంతఃకరణప్రవృత్తులు (కర్మేంద్రియ జ్ఞానేంద్రియ వృత్తులు) పరిపూర్ణముగాఁ బరిణతములయ్యెను. అనఁగా మానవదేహముననున్న జీవునకు సర్వేంద్రియవిషయజ్ఞానము కలిగిన దనుటయే. ఇంక నీ ప్రవృత్తుల యభివృద్ధికి మానవదేహముకంటె నున్నతస్థితియందుండెడు దేహమును జీవుఁడపేక్షింపఁడు; అట్టిదేహము జీవునకవసరమును లేదు. ఈదేహముననే యంతఃకరణ ప్రవృత్తులు పరిపూర్ణస్థితికి వచ్చినవగును. ఇదియే వైషయికజ్ఞానము.

ఇప్పటి కంతఃకరణ ప్రవృత్తులవలనఁగల్గు జ్ఞానముపలబ్ధమైనను, అభిన్నమును, అనంతమును, అనశ్వరమును, నగు పరమాత్మసాక్షాత్కారానుభవము జీవునకింకను లభింపలేదు. ఇది హేతువుగా జీవాత్మ యఖండజ్ఞానానందశక్తుల యనుభవ మింకనొందలేదు. మానవదేహముల మాటిమాటికి నొందుచు వివిధదశలలో మునిఁగి తద్దశానుభవముల నొందుచు స్థూలప్రపంచ విషయములందే కొట్టుకొనుచుండును.

శరీరత్యాగము చేసినప్పుడును, దనకు సంక్రమించిన స్థూలసంస్కారముల ప్రభావమువలన వాసనారూపమగు సంతఃకరణప్రవృత్తులతో నున్నప్పుడును జీవాత్మకు ననంతమగు

స్వీయపరిభ్రమణస్థితి యనుభవమునకు వచ్చుటలేదు. అందుచేఁ దృక్తశరీరమగు జీవాత్మ ననుసరించి యుండెడు పూర్వాపూర్వజన్మసంస్కారములే వాసనారూపములై యంతఃకరణ పరివృత్తుల నావరించియుండును.

ఈ వాసనారూపసంస్కారముల యనుభూతిని క్షీణింపఁ జేయుటకు సంస్కారముల నశింపఁజేయుటకు జన్మపరంపర యందుఁ గలుగు బరస్పరవిరుద్ధములగు ద్వంద్వానుభవములను జీవాత్మ పొందుచున్నది. ఈసంస్కారభారమునుండి విముక్తుఁ డగుటకుఁజేయు యత్నములలో మాటిమాటికి జన్మించుట యను సంసారపంకమున జీవాత్మ తగుల్కొనుచున్నది. అన్యోన్యవిరుద్ధములగు సంస్కారముల ప్రభావములను భవపరిణామమును సమానముగాఁ బొందునప్పుడు తరువాతరానున్న మనుష్యజన్మసంబంధమగు బుద్ధిశక్తి కొంతసంక్షోభమును జీవునకుఁ గలుగఁజేయును. ఇట్టి సంపర్కములేనప్పుడు సంస్కారముల ప్రభావము తద్విరుద్ధసంస్కారశక్తివలన ననుభవము నకురాక తాటస్థ్యమును వహించును. దీనివలన పరస్పరవిరుద్ధములగు సంస్కారములనుండి జీవాత్మ విముక్తినొందుస్థితికి వచ్చును. వీనినే పూర్ణమగు నిశ్చలస్థితియని చెప్పుట సమంజసము. పరిణామక్రమపద్ధతి యాత్మకు లబ్ధమైన యంతఃకరణ విజ్ఞానము త్రాసునకు గౌరవలాఘవములఁ జూపు ముల్లు వంటిది. దీనికిఁగల రెండుసిబ్బులందు పుణ్యాపాపముల న్యాసముగల సంస్కారములు తూచఁబడుచున్నవని మనము దృష్టాంతముగాఁ జెప్పవచ్చును.

ప్రవృత్తినివృత్తులలో నేవైపునకును మొగ్గకుండగా జీవుఁడు మాధ్యస్థమైనస్థితిని త్రాసుముల్లువలె నుండుటకు యత్నించును. కాని యనుభవింపవలసిన పరస్పరవిరుద్ధసంస్కారము లున్నంతవఱకు జీవున కిదిసాధ్యముకాదు. అది కారణముగా విషయప్రవృత్తులకు సంబంధించిన ద్వంద్వరూపములగు సంస్కారములందుఁ బ్రధానములును, బ్రబలములునగు వ్యతిరేకసంస్కారములద్వారమున జీవుఁడు తాటస్థ్యమునపేంప యత్నించును.

ఇట్లు వ్యతిరేకసంస్కారముల ననుభవించుచు జీవుఁడు అంతఃకరణబాహ్యప్రవృత్తులయందుఁదటస్థత్వస్థితికి వచ్చునప్పటికీసంస్కారముల యనుభవములందుఁ జిక్కువడును. దీనివలన వీనికివ్యతిరేకమగు సంస్కారముల నాశనముచేయు నుద్దేశముతో బయలుదేరిన జీవుఁడు ప్రథమసంస్కారములఁ బ్రభావమున మాటువడును. ఇదిహేతువుగా జీవుని నిశ్చలత్వమునకు భంగముకలిగి తీవ్రసంక్షోభము ప్రారంభమగును. దీనినే సంచలనమనియు నందుము. అందుచే త్రాసునకు ముల్లుగానున్న యంతఃకరణము ప్రథమానుభవమున కత్యంతభిన్నమగు విరుద్ధమార్గమునఁబడును.

ఇట్టి సందిగ్ధస్థితియందు జీవుఁడు తుదియవస్థయందుఁ దనకుఁ గలిగినట్టియుఁ, బ్రధానములైనట్టియు, వ్యతిరేకములైనట్టియు సంస్కారముల ననుభవించుటకు మఱియొక మానవజన్మమెత్తును. జీవున కత్యావసరమైన యనుభవములను దృష్టిపఱుచుటకై మానవుఁడు మరలజన్మించును.

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః"

—భగవద్గీత 8వ అధ్యాయము 6వ శ్లోకము

ఇట్టి జన్మాంతరము జీవుఁడు విశుద్ధసంస్కారముల ననుభవించుటకుఁగాని, క్షీణింపఁజేయుటకుఁగాని తప్పనిదగుచున్నది.

ఇట్లు పునఃపునరావృత్తమగుచున్న జన్మపరంపరయందుఁ బరిణామమును సంపూర్ణముగానొందిన సూక్ష్మకారణ శరీరముల యవలంబనము కలిగినవాఁడై యంతఃకరణవిజ్ఞానము జీవుఁడు గలిగియుండును. ఈవిజ్ఞానమునకుఁ దగినట్లు వానికి జన్మముగల్గును. ఈ జన్మపరంపరలందుఁ బరస్పరవిరుద్ధములును, ద్వంద్వములును, బహుసంఖ్యాకములును, నానాత్వమునుగలవియునగు సంస్కారముల యనుభవములను జీవాత్మ పొందుచున్నది. ఈ యనుభవపరంపరల కంతమనునది లేదు.

ఇంతకుఁ బూర్వము తనయందు సంక్రమించినట్టియు, నన్యోన్యవిరుద్ధములు నగు సంస్కారములవలనఁ గలుగు ననుభవములను స్థూలదేహముద్వారమున క్షీణింపఁజేసికొనుటకు జీవుఁడు యత్నించుచుండును. కాని యీయత్నమున జయము జీవుఁడు పొందఁజాలఁడు సరికదా దానికిబదులు పరస్పర భిన్నములైన వినూతనసంస్కారములఁ బొందుచుండును.

నూతనజన్మమునకుఁ గారణమైన సంస్కారముక్షీణించుటతోడనే స్థూలశరీరము నాశనమొందును (ఈ సంస్కారమునే ప్రారబ్ధకర్మమని యందురు). విగతశరీరులైన జీవులు మిగిలిన సంస్కారములవశమున స్వర్గమునకుఁగాని నరకమునకుగాని

పోవుదురు. ఈమార్గద్వయము పుణ్యపాపరూపములైన యా యాసంస్కారముల ఫలానుభవము ననుసరించియుండును.

స్వరూపస్థితియందుఁగూడ నుత్తేజములైన తత్తత్సంస్కారముల నంతఃకరణప్రవృత్తి సాయమున జీవుఁడనుభవించును. ఈయనుభవము వలనఁగూడ నన్యోన్యవిరుద్ధములగు సంస్కారములు క్షీణించుటకు జీవుఁడు యత్నము చేయును. ఈ స్వర్గనరకస్థితియందును సంస్కారశూన్యతవలనఁ గల్గునిశ్చలస్థితి సామ్యావస్థ సామీప్యము కొంతవఱకుఁ బ్రాప్తమగునే కాని పరిపూర్ణముగాఁ బ్రాప్తింపక తప్పిపోవుచుండును. ఇట్లుసంస్కారములు కొన్ని క్షీణింపఁగా విరుద్ధములై ప్రబలములై మిగిలియున్న సంస్కారములు జీవాత్మకు మఱియొక స్థూలదేహము నం దాశ్రయము పొందుటకుఁ బ్రేరేపించును. జననమరణ పరంపరలలోఁబూర్ణమగు నైశ్చల్యము లభింపనేరదు. అదిస్థూల ప్రపంచమున స్థూలదేహమునందున్నప్పుడే సాధింపవీలగును. సంస్కారరహితమైన యంతఃకరణము సామ్యావస్థను, నిశ్చల స్థితినిపొందువఱకుఁ బ్రారబ్ధములగు సంస్కారములవలన స్థూల ప్రపంచమునందు నంతములేని జన్మములు జీవునకు సంభవించుచునేయుండును.

మానవదేహమున నున్నపుడు తన్నలముకొను బలవత్తరమగు సంస్కారజాలమునందు జీవునియంతఃకరణప్రవృత్తి చిక్కువడియుండును. జన్మచక్రము తిరుగుచున్నకొలఁది యీ పరిణామము జరుగుచునేయుండును. సాంద్రములైన యీసంస్కారములనుండి తప్పించుకొనుట యసాధ్యముగాఁదోఁచును.

గోచరించిన దానికంటె గంభీరమగు భావమందిమిడి యున్నదని జ్ఞానులై యాయుగాయుగములం బ్రపంచమున నవతరించిన *మహాయోగులీ సత్యమును గుర్తించియుం బ్రకటించి యున్నారు. మానవుడీగోచరమగు ద్వైతమయిన ప్రపంచముతోం దనజీవితమునందలి కొంతభాగము ననుసంధించినను భగవత్సాక్షాత్కారమే యాతనిపరమలక్ష్యము.

ఈ సంస్కారము లనుభవముచేతనే క్షీణించును. (ప్రారబ్ధం కర్మ అనుభవేనైవ క్షీయతే). కాని యీ యనుభవము లెక్కువైనకొలంది యీసంస్కారములు మరింత గాఢమగును.

---

*మౌలానా రూమీ "మస్నవి" యను తనగ్రంథములో నీవిషయమును వివరించుటకొక కథనిట్లుచెప్పినారు. పులికూనయొకటి గొఱ్ఱెలమందతోంబాటు పెంచంబడుచుండెను. ఆపులికూన పెద్దదియగుకొలంది గొఱ్ఱెలవలె గడ్డిమేయుచు వానివలెనే యఱచుచుండెను. దానికిగొఱ్ఱెలకంటెం దానువేఱైనదాన నను జ్ఞానమే లేకుండెను. ఇట్లుండగా నొకనాండడవి పులి గొఱ్ఱెలమందలోం బెరుగు పులికడకువచ్చి యిట్లుచెప్పందొడంగెను. "నీవుకూడ నావలెనే యొకపులివి. ఈగొఱ్ఱెలలో నొక దానవు కావు. ఈవిషయము నీకుం దెలియునా?" యని చెప్పిదానిని సమీపముననున్న కొలనికడకు వెంటంగొనిపోయి యందలినీటిలోం దననీడనుజూపి గొఱ్ఱెలకంటె భిన్నమైన స్వీయరూపమునది గ్రహించునట్లు చేసెను.

దీనివలన గ్రహింపవలసిన విషయమేమనంగా మనుష్యుండుగూడ నింద్రియప్రపంచములో మునింగిపోయి యందైక్యమగును. దానినుండితప్పించుకొనుమార్గమును గాననేరండు; కాని యేమహాపురుషుండో సిద్ధపురుషుండో లభించి వానికి జ్ఞానోపదేశముచేసినపుడు స్వస్వరూపజ్ఞానము నొందంగలండు. ఇట్టివాండే సంసారపంకమునుండి పవిత్రుండై క్రమముగాం గాలవశమున తన గమ్యస్థానముచేరి భగవత్సాక్షాత్కారము నొందును.

ఇట్లు పేరుకొనుసంస్కారముల బలహీనములగు నట్లొనర్చి పలుచఁబడునట్లుచేయుట కొకటియే మార్గముకలదు. మానవత్వజ్ఞానముగల దేహమునయున్న జీవాత్మ యీసంస్కారములను త్వరితగతి ననుభవింపవలెను. ఈ యనుభవమువలనఁ గలిగెడు నూతనసంస్కారముల ప్రభావమును తగ్గించుటకుఁగాను తద్వ్యతిరేకసంస్కారముల యనుభవములవలన యత్నింపవలయును.

ఈ జన్మపరంపరలో విరుద్ధసంస్కారముల సంఘర్షణము జరుగుచునేయుండును. ఈ కృత్యముమీఁద జన్మపరంపరల కార్య మాధారపడియుండును. తుట్టతుద కవిద్యనుండి బయటపడి యాత్మానుభవమును తుదిమెట్టుగాఁ బొందుటకుఁగాను కర్మానుభవమవసరము.

అనుకూలముగాఁ గన్పించినను వాస్తవికముగాఁ బరస్పరప్రతికూలములగు వివిధసంస్కారపరంపరల యనుభవములను బొందుచు జననమరణరూపయాత్రను జీవుఁడు సాగించుచుండవలెను. ఈజన్మములలో స్త్రీయనియుఁ, బురుషుఁడనియు, జాతి మత వర్ణ భేదములు కలవాఁడనియు, ధనికుఁడనియు, దరిద్రుఁడనియు, రోగియనియు, నిరోగియనియు, బరస్పరవిరుద్ధములగు ద్వంద్వస్థితులను బొందుచు విరుద్ధానుభవములను సృజించుకొనుచుఁ దదనుభవమున వానిని క్షీణింపఁజేసికొనుచు జీవాత్మ మున్ముందునకు సాగిపోవుచుండును.

ఈసంస్కారముల విరుద్ధప్రభావమువలనఁ బుట్టిన యనుభవములనొందుచు జీవాత్మ లక్షలకొలఁదిగా జనన మరణము

లతోఁగూడిన జన్మముల ననుభవించి తుదకుఁ బరస్పరవిరుద్ధములగు సంస్కారములనుగూడఁ బూర్తిగా క్షీణింపఁజేయును.

ఇట్టి జన్మముల ఫలముగా మానసరూపమున బరిణామమును బరిపూర్ణముగాఁబొంది జ్ఞానవంతమైన జీవాత్మ యప్రమేయము, నిత్యము, సత్యము నగుఁ బరమాత్మానుభవమును బొందఁగల స్థితికిఁబోవును.

ద్వంద్వముల స్థూలసంస్కారములు క్రమముగా క్షీణించుకొలఁది యంతఃకరణప్రవృత్తులకు నంతఃపరిణామము క్రమముగా నభివృద్ధినొందుచుండును.

ఇట్టి సమయమున స్థూలప్రపంచప్రవృత్తిప్రధానమైన జీవాత్మప్రవృత్తి క్రమముగా స్థూలప్రపంచమునకు దూరమగుచుండును. ఇదియే నివృత్తిప్రవృత్తు లంతర్ముఖములై మరలినప్పుడు విషయప్రపంచసంస్కారానుభవములు సన్నగిలుచుఁ గ్రమక్రమముగా దూరమగుచుండును.

అనేకజన్మముల ఫలముగా ద్వంద్వములును స్థూలములును నగు సంస్కారముల ప్రభావము క్రమముగా క్షీణించినప్పుడే యంతఃకరణప్రవృత్తులు బాహ్యవిషయవిముఖములై యంతర్ముఖములై నివృత్తిదశయందుఁ గ్రమాభివృద్ధిని గాంచుటకు సాధ్యమగును.

---

గీ. విషయ వాంఛలభరమున వేగు నేను
బానిసగనైతి నీదేహబంధమునకు;
వాంఛలను వీడఁగల్గినవాఁడ నేని
నైక్యమందెద నేఁ బరమాత్మతోడ.

# ఐదవ భాగము | భూమికలు

## విమోచనముఁబొందు జీవాత్మయంతఃకరణమునకగు నంతర్ముఖపరిణామము

విషయప్రపంచబంధములనుండి యంతఃకరణప్రవృత్తులు వెనుమరలినపుడు ఆత్మ యధ్యాత్మపరణి సంతర్ముఖమగును; విషయసంస్కారములపటుత్వము తగ్గును. బలహీనత నవి యంతఃకరణమున లీనమగును. ఇది యాత్మ యంతర్ముఖమగుటకుఁ బ్రథమసోపానము. అంతఃకరణవృత్తులు పండి, వెనుమరలి, యంతర్ముఖములై క్రమక్రమముగా క్షీణించుటకుఁ బూర్వమీ యాత్మ మానవజనన మరణచక్రమునఁ గడఁగానక యనేకపర్యాయములు పరిభ్రమించుచుండును; ఇట్లు తిరిగి తిరిగి యంతర్ముఖమైన పిదపఁ బ్రాపంచికవృత్తులు క్షీణక్షీణములై రూపుమాసినవగును. ఇయ్యెడమనోవృత్తులు తమంత తామే విరమించును. ఈస్థితి యందంతఃకరణమునఁ బ్రతిబింబించు సత్పదార్థము గోచరించును.

సాధారణముగా నీయంతర్ముఖత క్రమవిశిష్టము. పశుస్వరూపస్వభావములు మానవుని స్వరూపస్వభావములుగాఁ బరిణమించినవి. కావున విషయప్రవృత్తి మానవునియందు బలవత్తరమైనది. బాహ్యమగు నీ వైషయికప్రవృత్తియే యసాధారణవ్యక్తులగు కారణజన్ములందో మాత్రమత్యల్పకాలమున నాకస్మికముగా నష్టమగుటయు, నట్లు నష్టవిషయమగు నంతఃకరణమునఁ బ్రతిబింబితమగు నాత్మ పరమాత్మానుసంధానము

చేసికొనుటయుఁ దటస్థించును. విషయము లంతర్ముఖములై క్రమక్రమముగా క్షీణించి మనోలయమున నష్టములగుట లోక సాధారణము. దారి తెన్నులేని యరణ్యమునఁ దిరిగి తిరిగి గృహోన్ముఖుఁడైనవాఁడు మరల నెట్లరణ్యమునఁ జొరఁడో యట్లే విషయవృత్తుల సంతర్ముఖమొనర్ప యత్నించువాఁడు తిరిగి విషయప్రపంచమునఁ బడఁడు.

"నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥
(గీత 2 అ॥ 40 శ్లో)

ఆత్మ క్రమముగా స్థూలసూక్ష్మమనోలోకములతోఁ దనకుఁగల సంబంధములఁ ద్రెంచి వేసికొనును; అప్పుడు వీని నన్నింటి కందరాని నైజస్థితినొందును. ఈమార్గమునఁ బోవు నాత్మ కాఱుభూమికలు గలవు. అందు మొదటిమూఁడును సూక్ష్మప్రపంచసంబంధమునుగలవి; నాల్గవది సూక్ష్మమనో లోకముల సరిహద్దులలోనిది. ఐదాఱు భూమికలు మనో లోకము. ఈభూమికల నాఱింటిదాఁటిన యాత్మ పరమాత్మ యందు శాశ్వతముగా లీనమైయుండును.

## ఒకటి రెండు భూమికలు

ఇంద్రియముల వశమున విషయోన్ముఖమైన మాంస వాంతఃకరణము క్రమముగా(నింద్రియజయమున)సంతర్ముఖమైన నప్పుడాత్మ(జీవుఁడు)ప్రథమభూమికయందు సూక్ష్మేంద్రియముల రూపమునఁ గొలఁది కొలఁదిగా సూక్ష్మప్రపంచానుభవమును

గలదగును. ఈస్థితియందీ యనుభవము లాత్మకు(జీవునకు)స్థూల సూక్ష్మశరీరముల రెంటియూలమునఁ గల్గును. పర్యాయ భేదము లేకుండ నింద్రియముల స్థూలసూక్ష్మరూపములు రెండునిట నుసయుక్తము లగుచున్నవి.

ఈస్థితియందు జీవాత్మ స్థూలసూక్ష్మప్రపంచముల నడుమ సరిహద్దుపై నున్నదందురు. ఇట జీవాత్మ యంతఃకరణ ద్వారమున వింతలగు ననుభవముల నొందును. చర్మచక్షులచే క్షణము సూక్ష్మభూమికను దర్శించును. ఇట్లే బాహ్యశ్రోత్రేంద్రియముచే నమరగానము (నాదబ్రహ్మమును)వినును: ఘ్రాణేంద్రియముచే విషయేతర సౌగంధ్యము నాఘ్రాణించును. అనఁగా నంతఃకరణమున భాసించి విషయప్రపంచము ననుభవించు జీవాత్మ సూక్ష్మప్రపంచప్రథమభూమికయందుండి స్థూలేంద్రియములతో సూక్ష్మసంస్కారానుభవములను బొందుచుండును.

బాహ్యవిషయోన్ముఖములగు నంతఃకరణప్రవృత్తులంతర్ముఖములగుకొలఁది యాత్మసూక్ష్మప్రపంచప్రథమభూమిక యందలి యనుభవములనొందుచు బాహ్యవృత్తులణఁగిసూక్ష్మ వృత్తి విశిష్టమగును. ఈసూక్ష్మప్రపంచము ననుభవించెడి యాత్మక్రమముగాఁ దత్ప్రపంచమునందలి ద్వితీయ భూమికను బ్రవేశించును. ఈభూమిక యనంతమగు దైవశక్తిపరిపూర్ణము. ఇది పరిమితమైన సూక్ష్మప్రపంచమం దపరిమితశక్తిగాఁ బరిణమించును.

స్థూలశరీరమున నున్న యాత్మ యంతర్ముఖమైన విషయ ప్రపంచమునకు నంతఃకరణమునఁ బ్రతిబింబితమైనపుడు స్థూల శరీరమును, మనోమయ శరీరమును మఱచును. అంతియేగాని సూక్ష్మాంశమునందిన స్థూలకారణశరీరముల ద్వారమున స్థూల మనోమయశరీరములతో నాత్మ వ్యవహరించుచునే యుండును.

అంతర్ముఖాంతఃకరణమునఁ బ్రతిబింబించిన యాత్మ (జీవుఁడు) స్థూలమనోమయ దేహములను, వానివిషయములను విస్మరించును. అన్నపాననిద్రాదర్శనస్పర్శనశ్రవణాదులగు వివిధవ్యాపారములందును, వాంఛామననిదిధ్యాసాదివ్యాపారములందును తద్దేహద్వయమును వినియోగించుచునే యుండును.

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥"
(భగవద్గీత ౩వ అధ్యాయము ౫ శ్లోకము)

"నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్
(భగవద్గీత ౫వ అధ్యాయము ౮ శ్లోకము)

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్
(భగవద్గీత ౫వ అధ్యాయము ౯ శ్లోకము)

బాహ్యవృత్తుల నంతర్ముఖమొనర్చి యంతఃకరణమునఁ బ్రతిబింబితమై ద్వితీయభూమికనున్న మానసాత్మ (జీవుఁడు)

శమమును (ఇంద్రియజయమును) గలదై యనంతశక్తిమంతమై మహిమలను బ్రకటింపఁగలదు. ఈదశయందు యోగి మ్రోడు చిగుర్చునట్లు, ఫలపుష్పభరితమైన వృక్షము మ్రోడగునట్లు నుజేయఁగలఁడు. రైళ్ళను, మోటార్ల నాపఁగలఁడు. ఊటలేని నూతులనూటపుట్టింపఁగలఁడు. సూక్ష్మశరీరముతో సూక్ష్మేంద్రియజ్ఞానమున నింద్రియముల జయించినవాఁడీ ద్వితీయభూమికయందు సూక్ష్మప్రపంచము ననుభవించును. ఈతఁడుసామాన్యునివలె నన్నపానాది కర్మముల నిర్వహించుచున్నట్లు పైకిఁగాన్పించినను బాహ్యప్రపంచస్మృతి లేకుండును. అంతర్ముఖవిషయమగు నంతఃకరణమునఁ బ్రతిబింబించు నాత్మ(జీవుఁడు) దర్శనాదులగు నూతనసంస్కారముల సృజించుకొనుచు సూక్ష్మప్రపంచానుభవము పొందుచుండును.

## మూఁడవ భూమిక

శాంతమైన యింద్రియవృత్తుల నంతర్ముఖమైన యంతఃకరణమునఁ బ్రతిబింబించిన జీవాత్మ ధారణాయోగమునఁ ధ్యేయాధారప్రదేశమునందు (చిత్తమునిలుపుట) మూఁడవ భూమిక ననుభవించును. ఇచ్చట సూక్ష్మలోకసంబంధమగు ననంతశక్త్యనుభవమును జిత్తముపొందును. ఈ యనుభవము రెండవభూమికయందుఁగంటె నధికముగానుండును. ఇట్టిస్థితియం దాత్మకుఁ (జీవునకు) గొప్పమహిమలు ప్రకటించుశక్తి కల్గును. (పరమాణువుమొదలు పరమమహత్త్వాంతము దీని వశమందుండును. "పరమాణుపరమమహత్త్వాంతోఽస్య వశీకారః" అనియోగసూత్రము.) గుడ్డివారికి దృష్టినిచ్చుట,

యంగహీనుల కంగములనిచ్చుట, గొంకస్వాను మృతులగువారిఁ బ్రాణదానము చేయుట మొదలగుశక్తుల నిష్ఠించియున్న యోగి ప్రదర్శించును. ధారణాస్థిరమైన చిత్తముగల యీ జీవాత్మ సూక్ష్మలోకముల వివిధభూమికల పర్యటించుశక్తి గలదై యుండును. స్థూలశరీరాభిమానియగు మానవుఁడు తన స్వాధీనములోనున్న వాహనసముచ్చయముల నుపయోగించి భూమిపై ఖండాంతరముల సంచరించుటవంటిదే యీశక్తి.

సూక్ష్మలోకమున నిమిడియున్న ప్రధానభూమికలు ద్వితీయతృతీయభూమికలు. ప్రథమభూమిక స్థూలప్రపంచమునఁ గొంతభాగము, సూక్ష్మప్రపంచమునఁ గొంతభాగముగానున్నది. అట్లే నాల్గవభూమిక కొంతసూక్ష్మలోకసంబంధమును గొంతమనోలోక సంబంధమును గల్గియున్నది. ఇది మనోలోక ద్వారముకడనున్నది.

## నాల్గవ భూమిక

సూక్ష్మవిజ్ఞానముగల జీవుఁడు తనవృత్తుల యంతర్ముఖత్వ మభివృద్ధియైనకొలఁది సూక్ష్మప్రపంచసంబంధమగు నాల్గవభూమికకూర్చు ననుభవములనొంద యత్నించును. ఈ భూమిక నారోహించిన జీవుఁ డనంతశక్తి విజ్ఞానముఁ గలవాఁ డగును. పరిమితముఖమున గోచరించు భగవంతుని యపరిమితశక్తియే యిది. ఈభూమికయందున్న జీవునకు సిద్ధులు కలుగును. ఇట్టి యోగసిద్ధులఁ బొందినజీవుఁడు సజీవమగు

నూతనసృష్టి చేయఁగలఁడు;* చచ్చినవారినేనియు బ్రదికింపఁ గలఁడు.

(ఇందుఁగల్గు మహిమలు సమాధిభంగకరములు; వ్యుత్థిత చిత్తునకు నివి సిద్ధులు. కనుక వీనినుపేక్షించి పరమాత్మదర్శనాభ్యాసమే చేయఁదగినదని "తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః" యోగసూత్రము చెప్పుచున్నది. ఈసూత్రవ్యాఖ్య "అతస్తా ఉపేక్ష్యపురుషదర్శనాభ్యాస ఏవ కార్య ఇతిభావః" అనియుఁగలదు.)

ఈ భాగాంతమునఁ జూపినపటమునందువలె ననంతశక్తి సముపార్జనముఁగలిగి సూక్ష్మవిజ్ఞానముతో సంతన్ముఖత నొందుచున్న జీవాత్మ నాల్గవభూమికయందుండి మనోమయలోక సింహద్వారమున నిలిచియున్నది. ఇట్టితఱి జీవాత్మ మనోలోకసంభవములును, మానసికవికారలక్షణములు నగు తీవ్రవాంఛలచే విఘాతమగుచుండును. ముందు నూయి వెనుక గోయి యనునట్టి సంకటమయమగు నంధకారస్థితిలో జీవుఁడు చిక్కుపడును. తన కధీనమైన సిద్ధిరూపమగు నఖండశక్తి నీవాంఛాపరితృప్తికై వినియోగింపవలెననెడి ప్రబలకామ ప్రేరణమున జీవుఁడు మునిఁగియుండును. సర్వకామములును స్వాధీనమునందుంచుకొని, వానిని నాశనముచేసికొనుచు

---

*కుతుబ్ స్థితియందున్న సిద్ధపురుషుల జీవులు విజ్ఞానమయకోశమందుండి యిట్టి సంఘట్టనలను ప్రకటింపక నియమింతురు. దీనివలన ప్రమాదకరములగు పర్యవసానము తమకు రాకుండ యిట్టిజీవులు తమ్ము రక్షించుకొనఁగలవు.

నున్నతస్థితికి జీవాత్మ ముందున కధిగమించునసమయమున నీ పరిమాణస్థితి యేర్పడును.

నాల్గవభూమికయందున్నజీవుని తీవ్రవాంఛలు పరాజితునిచేయును. వానికిఁ బ్రాప్తించినసిద్ధులను దుర్వినియోగము చేసినయెడల తీరనియపకారము జీవునకుఁ గల్గును. జీవాత్మ యింతవఱకు సముపార్జించిన విజ్ఞానశక్తి చెదరి ఛిన్నమును భిన్నమునగును. ప్రారంభదశయందు మిక్కిలి పరిమితములగు నంతఃకరణప్రవృత్తులుగల స్థితిలోనికి జీవుఁడు పతనము చెందును. మొదటిశిలారూపముతో నైక్యమునుబొందుగతి జీవునకు వచ్చును. పూర్ణవిజ్ఞానమును మరలఁబొందుటకై జీవుఁడు పరిణామదశయందు మొదటఁదెలుపఁబడిన యనుభవపరంపరలను దిరిగి యనుభవింపవలసివచ్చును.

నాల్గవభూమికయందున్న జీవుఁడు సగముసూక్ష్మ సంస్కారములను, సగముమానసికప్రవృత్తులను గలిగియుండును. దుష్టాదుష్టమగు వాంఛాపీడనముననఁబడి తృప్తిఁగానక మోహజాలమున జీవుఁడు తగుల్కొనును. తనకులభించిన సిద్ధిరూపములగు శక్తులను సద్వినియోగము చేయుటకుఁగాని, దుర్వినియోగము చేయుటకుఁగాని ప్రేరితుఁడగుచుండును. తుచ్ఛమగు పశువాంఛను దీర్చుకొనుటకుఁగాని పేరునో ప్రతిష్ఠనో సంపాదించు కొనుటకుఁగాని, తాదృశనీచాశయముల లబ్ధికొఱకుఁగాని యీశక్తిని వినియోగించినచో తనయున్నతస్థితినుండి జీవాత్మ యాకస్మికముగా నధఃపతనమందును. తిరిగి శిలారూపమగు సృష్టిరాశిలోనికిఁ బోవును. ఈకామమును

జయించి యీశక్తిని సద్వినియోగముచేసినను వినియోగింపక పోయినను జీవుఁడై దనభూమికను బ్రవేశింపఁగలఁడు. అచ్చట వానికిఁబతనము లేని సురక్షితస్థానము లభించును. ఈశక్తిని సద్వినియోగముచేసిన వానికి 'కుతుబ్'లని పిలువఁబడెదు యోగ సిద్ధులసాహాయ్యముచే నాల్గవభూమికలోనికిఁ బోవుటకు నవకాశముకల్గును. ఐహికాముష్మికలక్ష్యసిద్ధికొఱకు బాహ్యప్రపంచమున నుండియు జీవాత్మ తనకుఁబ్రాప్తమైన యీశక్తిని సద్వినియోగము చేయవచ్చును. ఎట్లనఁగా నితరుల క్షేమముకొఱకును; వైద్యసాహాయ్యముచేయు 'ఆస్పత్రుల' కొఱకును, అన్నాతురులై కష్టములనుభవించు వారికొఱకును, ధనమును వ్యయముచేయవచ్చును లేదా యాధ్యాత్మికమైన జ్ఞానమును వ్యాప్తిలోనికిఁ దెచ్చుటకుఁ దన్మార్గమునఁ బోఁదలఁచిన వారికి సౌకర్యము లొనఁగూర్చుటకు ధనమును వ్యయముచేయవచ్చును. కాని యీనాల్గవ భూమికయందుఁ దన యనుభవమునకు వచ్చినశక్తులను సద్వినియోగము చేయుటయనఁగా నితరుల యాధ్యాత్మికోన్నతికి మాత్రమే వాని నుపయోగించుట యని తాత్పర్యము. ఏవ్యక్తికి నిహసౌఖ్యోన్నతిఁగూర్చుట కీశక్తులనుపయోగింపరాదు. అట్లుపయోగించుట దుర్వినియోగమేయగును నాల్గవభూమికలో జీవునకు సంప్రాప్తమైన శక్తులు సద్వినియోగముచేయుటనుగూర్చి చూపు నుదాహరణములు గ్రహింపనగును. ఆధ్యాత్మికమార్గమునున్న యాత్రికునకు మార్గవశమునఁదీరని దప్పికగల్గి యాసన్న మరణుఁడగునపుడీచతుర్థభూమిక నందున్న జీవుఁడు తనశక్తిని వినియోగించి స్థూలశరీరముతో

నాతనికి దర్శనమిచ్చి వానివాఁ చల్లార్చియంతర్ధానము కావచ్చును. ఇట్టిది సద్వినియోగము ఒకవ్యక్తికిఁగాని ఒకజాతికిఁగాని శ్రేయఃకారణములగు కార్యములకు సిద్ధపురుషుఁడు తనశక్తినుపయోగింపవచ్చును. సద్వినియోగముకూడ నాత్మకు బంధకారణమై మోక్షనిరోధకముగాఁ బరిణమించును. ఇది హేతువుగా నాల్గవభూమికను దాఁటుట యతికష్టము; ప్రమాదభూయిష్టమును. నాల్గవభూమిక యందున్న వ్యక్తి తనుబీడించు తీవ్రవాంఛలను తృప్తిపఱచుటకై తనశక్తుల నుపయోగింపకుండ నిగ్రహము కల్గియుండుట చాలకష్టము.

నాల్గవభూమిక మనఃప్రపంచమునకు సింహద్వారము. అన్ని భూమికలకంటె నీభూమికయందు జీవుఁ డధఃపతనము నందుటకు బహుమార్గములుకలవు. ఈమార్గములు జీవునకు మనస్సు వశముకాకపూర్వము ప్రబలమగు నాధ్యాత్మికశక్తులు సంక్రమించుటచే నేర్పడినవి. అందుచే నాల్గవభూమికయందు జీవుఁడు విషమస్థితి కభిముఖుఁడగును. మానసికప్రపంచమగు నైదవభూమికను బ్రవేశించినప్పుడే మనస్సును దా నుపయోగించుకొనుటకు లేక మనోవృత్తుల ననుభవించుటకు సాధ్యమగును. నాల్గవభూమికయందు మనసు తనయధీనమం దుండదు. స్థూలవిషయప్రవృత్తుల కధీనమైన జీవాత్మవలెనే నాల్గవభూమిక ప్రవేశించిన సూక్ష్మవిషయవిజ్ఞానముగల జీవాత్మయు మనస్సును బరోక్షముగానే యుపయోగించుకొనును. ఈ నాల్గవభూమికయందు మనస్సునకుఁ బూర్తివికాసము కల్గును. అది తీవ్రగతియందలి సంకల్పవికల్పములతోడను,

రాగ ద్వేషాదులతోడను నిండియుండును. ఒకవంక నిర్బల వత్తరములైన మనోవికారముల వశముఁజేసికొనుటకు జీవాత్మ కృషిచేయుచుండును. మఱియొకవంక నిగూఢములగు నీభూమి కల యనంతశక్తి కార్యరూపమునఁ బరిణమింపవలెనను నూహతోఁ బ్రేర్యమాణమగుచుండును. ఇది యే బుద్ధిసిద్ధు లన్ని భూమికలయందుకంటె నధికముగా జీవునకు సంప్రాప్తించు భూమిక. (బుద్ధిసిద్ధులనఁగా యోగనిష్పన్నశక్తులు.)

ఈశక్తుల నపమార్గమున నుపయోగింపవలెనను మోహ మునఁబడినచో జీవునకుఁ జిత్తవిక్షేపము తప్పదు. దీనివలన నుత్పన్నమగుశక్తి మహాప్రళయమువంటిదై సూక్ష్మశరీరజ్ఞాన మును బూర్తిగా నాశనముచేసి నాల్గవభూమికనుండి జీవపరిణా మమున కాదియైన శిలాస్థితిలోనికి మరల జీవుని ద్రోసివేయును. విద్యుద్దీపమునెల్లు కాచపాత్రమునఁగల తీగెకాలిపోయి దీప మాఱిపోయిన స్థితివంటిదే యిప్పుడు జీవునకు సంభవించి యాతఁ డంధకారావృతుఁడగును. అట్లధఃపతనమైన జీవుఁడు మరల మరలఁ బరిణామదశానుకూలముగా బహురూపవ్యక్తుల ప్రవృత్తుల ననుభవించుచు జన్మాంతరముల ననేకముపొందుచుఁ గ్రమముగా నొక్కొక భూమికనేదాఁటుచు మున్ముందునకు నిర్గమింపవలసియుండును.

ఇట్టి చిత్తవిక్షేపము నాల్గవభూమికయందు మాత్రమే జీవునకు సంభవించుచుండును. అదికూడ నాల్గవభూమిక యందలిశక్తుల జీవుఁడు దుర్వినియోగపఱచినప్పుడే యనుదుగా

జరుగును. సాధారణముగా జీవునకుఁ గల్గువిజ్ఞానము నాల్గవ భూమికయందుఁ దప్ప తదితరభూమికలయందు నశింపదు.

జీవాత్మ తనకుఁ గల్గినశక్తులను, వాంఛలకు వశముగానీక సద్వినియోగముచేసినచో సంతర్ముఖమైన ప్రవృత్తులవలనఁ గల్గు విజ్ఞానపరిభావమున నొక్కొక్కతటి యైదవభూమికయందలి యనుభవము లవసరము లేకుండగనే దాని నతిక్రమించి యాఱవభూమికలోఁ బ్రవేశించును.*

చతుర్థభూమికయందలి జీవుఁడు సిద్ధులని తెలుపఁబడు తనకుఁగలశక్తుల మంచిచెడ్డలలో దేనికిని వినియోగింపనిచోఁ గ్రమముగా సంతర్ముఖమైన పరిణామమువలన నీభూమికనుండి యైదవభూమికయగు మానసికప్రపంచమునఁ బ్రవేశించును.

## ఐదాఱు భూమికలు

నాల్గవభూమికలోనున్న సూక్ష్మవిజ్ఞానముగల జీవుఁడు పరిణతినొందుచున్న జ్ఞానవశమున మనోమయకోశరూపము నందున్న మనస్సుతో నేకీభవించి మనఃప్రపంచానుభవమును బొందుచుండును. ఈభూమికయందు జిత్తవిక్షేపనిగ్రహమున నంతర్ముఖమై జీవాత్మ ప్రత్యాహారమను పేరుగలస్థితిని మనస్సుతోఁ దాదాత్మ్యమునొంది మానసికభూమికల ననుభవించును. (జితేంద్రియుఁ డగువానిచిత్తము ధ్యానసమయమున దాను ధ్యానించువస్తువు నాకారమునుబొందును. అప్పుడు

---

* నాల్గవభూమికకుఁగల గడపను దాటి మఱియొక గడిలోనికిఁ బ్రవేశించి నట్లే యైదాఱుభూమికలలోనికిఁ బ్రవేశించుట.

వానియింద్రియములను జిత్తము ననుకరించును. చిత్తము నిరోధోన్ముఖము కాఁగా వేఱుప్రయత్నము లేకుండగనే యింద్రియములు నిరుద్ధములగును. ఈయర్థము 'స్వవిషయాసంప్రయోగే చిత్తస్యస్వరూపానుకార ఇవ ఇంద్రియాణాం ప్రత్యాహారః' అను యోగసూత్ర వ్యాఖ్యయందుఁ దెలుపఁబడినది.) మనోభూమికయందు మనస్సు సంకల్పవికల్పరూపమును నాలోచనమును గ్రహణస్థితిని గల్గియుండును. ఇవి రెండును రెండుభాగములు. సంకల్పవికల్పముల ధర్మాధర్మములు, నైహికపారలౌకికవిచారణమును మిక్కుటముగా నుండును. గ్రహణశక్తివలన మనస్సునకు ననుకంపము జనించును. ఈస్థితియందు వృత్తులతోడనే మనస్సు ప్రకాశించుచుండును. ఈవృత్తులు బాధలుగను, వాంఛలుగను, వైమనస్యసౌమనస్యములుగను, ప్రేమానుబంధములుగనుఁ బరిణమించుచుండును.

ఇట్లు మనఃప్రపంచమున మనస్సునకు ప్రత్యేకముగ రెండు తెఱఁగుల ప్రవృత్తులున్నప్పుడు తత్తదనుభవములుకూడ రెండు తెఱఁగులుగానుండును. ఈరెండిటిలో భావప్రధానమైనది (సంకల్పవికల్పాత్మకమైనది) యైదవభూమికయనియు, బోధసముతోఁ గూడిన యనుభూతిఁ గల్గించునది యారవ భూమికయనియు, గ్రహింపవలయును. (సంకల్పవికల్పాత్మకము మనస్సు. నిశ్చయాత్మకము బుద్ధి, యను నవి రెండును ప్రత్యేకత లేని యేకేంద్రియభావమునవే యని చెప్పుదురు.)

మనోమయకోశములో నుండి పైదైన భూమికయందున్న జీవాత్మ మొదటిభాగములోనున్న మనస్సుతో నేకత్వమును బొందుచు విషయవివేకమునకై విచారణముచేయు భావతాదాత్మ్యమును బొందుచుండును. ఇట్టి భావసృజన శక్తి జీవాత్మకుఁ గలుగుచుండును. కనుక భావముల యాజమాన్య మీకోశమందలి జీవాత్మకుండును.

స్థూలసూక్ష్మవిషయోన్ముఖములైన జీవులఁ దనవశమున నుంచుకొనుశక్తి యిచటి జీవాత్మకుండును. అంతియేకాని స్థూలసూక్ష్మవిషయోన్ముఖులైన జీవుల నీకోశమందలి జీవుఁడు స్వాధీనముచేసికొను నను నభిప్రాయము పొరపాటు. భావప్రపంచముననున్న మనస్సత్తపై యీకోశమందలి జీవునకుఁ బ్రభావముండును.

ఇట్లు సంకల్పవికల్పరూపమగు భావపరంపరయందు నిమగ్నమగు మనస్సుతో నైక్యమై పైదైన భూమికయందలి జీవాత్మ భావప్రసారణమునే చేయుచు మనస్సునకు రెండవ రూపమగు బుద్ధితో నైక్యమును బొందఁజాలదు. కావున మనోవికారములగు వాంఛలనుగాని, రాగద్వేషాదులనుగాని తన యధీనమునందుంచుకొననేరకున్నది.

అట్లయ్యు క్రమముగా నాంతరపరిణామమువలన నీ భూమికయందు మనోవికాసముగల జీవాత్మ యాఱవ భూమికయందలి స్థితిని క్రమముగా సంపాదించుకొనుచు నిశ్చయాత్మకమగు బుద్ధితో నేకత్వమును బొందును. ఇదియే

నానుకంపావిశిష్టమగు మానసికస్థితి యందైక్యమునుబొందుట. ఇట్టి మార్గము జీవాత్మ కేర్పడిన పిదపఁ దన్మార్గమున* నాఱవ భూమికయందు లభించు విజ్ఞానప్రవృత్తుల యనుభవమును బొందును.

ఆఱవ భూమికయందలి ప్రవృత్తుల వివేకము కల్గిన జీవాత్మరసానుభవము వలననే మనఃప్రపంచమును అనుభవించుచుండును. వీనికి భావముల సంపర్కమే లేకుండును. ఎల్లయెడలను, ప్రతివస్తువునందును, భగవద్దర్శనము ప్రత్యక్షముగాఁ బొందు రసానుభూతిని గలిగియుండును†. నిరంతరము భగవంతుని దర్శనముచేయుచునే యుండును. ఈసాక్షాత్కారమున భగవంతుఁడు తనప్రతిబింబమే యనునంశమును జీవుఁడు గ్రహింపఁజాలఁడు. తాను ప్రత్యక్షముగాఁ జూచుభగవంతుని తోడి యేకత్వము తనకుఁగలదని గ్రహింపనేరఁడు. అనఁగా

---

* ఐదాఱు భూమికల యనుభవములో భేదము స్వల్పము. ఒకగదిలోఁ బ్రవేశించినవాఁడు దిక్కులుచూడక ముందువఱకుఁ జూచినప్పుడు తనయెదుట నున్న వస్తువును గమనించునటుల, యాఱవభూమికయందలి పరమాత్మను ప్రత్యక్షముగాఁ జూడఁగలఁడు. దిక్కులుచూచినవానికి ఎదుటనున్న వస్తుప్రత్యక్షజ్ఞానముకలుగక తానున్నగదిరూపము గోచరించునట్లైదవభూమికయందున్న వానికిఁ దద్భూమికానుభవమాత్రమే కల్గును.

† భగవత్సాక్షాత్కారమనఁగాఁ జర్మచక్షువులతో నొకవస్తువును జూచుటవంటిదని భ్రమపడరాదు. జ్ఞాననేత్రవికాసమునఁ బరమేశ్వరసాక్షాత్కారానుభూతి నపరోక్షము చేసికొనుటయే భగవత్సాక్షాత్కారమని బాబాగారి వచనము.

జీవాత్మపరమాత్మలు తాదాత్మ్యసమన్వయ మీస్థితియందు జీవునకుఁ గలుగలేదనట. ఐనను దనయెదుట గోచరించు భగవంతునితో నైక్యానుసంధానము చేసికొనుటకొరకు జీవాత్మ పరితపించుచు నావేదన మనుభవించుచుండును.

ఈమానసిక వృత్తి ప్రధానమైన మనఃప్రపంచము యొక్క రెండవ యవస్థతో నేకత్వమును బొందుటయనునది యాధ్యాత్మిక ప్రేమమునకు ముఖ్యస్వభావము. ఈప్రేమయే భగవంతునిలో లీనమగుటకు మార్గదర్శిని.

మనోమయ ప్రపంచమగు నైదవభూమిక పూర్ణభావ విజ్ఞానముతోఁగూడినస్థితి. అదిహేతువుగా నాభూమికయందు భావముల సృజించుట వానిని తనయధీనమున నుంచుకొనుట యను భావస్వామిత్వము జీవునకుఁ గల్గును. అట్లయ్యు వాంఛలను నిగ్రహించు నధికారము మాత్రము జీవునకు స్థిరము కాలేదు.

ఆఱవ భూమికయందలి మనఃప్రవృత్తులు జీవుని యధీనమందుండును. అప్పుడీ మానసికవృత్తి సమీపమున కేభావమునుఁ జేరఁబడలేదు. ఆఱవ భూమికయందలి ప్రవృత్తి భావరహితమైనది. ఇవి స్థూలసూక్ష్మశరీరములకు సంబంధించిన మనఃప్రవృత్తులుగల జీవాత్మల చిత్తవృత్తులపై నధికారము కలదియగును. ఈయధికారమును గొందఱు స్థూలసూక్ష్మ శరీరప్రవృత్తులు గల జీవుల హృదయములను దాను స్వాధీనపఱుచుకొనుట యని పొరఁబడుచున్నారు. ఆఱవభూమిక యందున్న జీవాత్మ వాంఛలకుఁ దత్ప్రేరితములగు వికారము

లకుఁ గారణమగు మానసికస్థితిని తనస్వాధీనమునం దుంచు కొనును.

భగవంతుని ప్రేమించుటయనఁగా వానితో నైక్యమును బొందుటకుఁ బరితపించుటయని యీఆఱవభూమికలో మనకుఁ దెలుపఁబడినవిషయము. ఈయాఱవభూమిక నధిగమించినయెడల మాయ యంతరించి భగవంతుఁడు సాక్షాత్కరించును. మానవ రూపముననున్న ప్రేమాత్మ మానసికప్రవృత్తులం దున్నప్పుడు స్థూలసూక్ష్మ శరీరముల స్పృహ లేకుండును. అట్లయ్యు మనఃకోశ మునుండియే స్థూలసూక్ష్మశరీరములద్వారమునఁ బరోక్షముగాఁ దనపనినిజేయుచునే యుండును. స్థూలసూక్ష్మ ప్రపంచముల యనుభవమును బొందనప్పటికిని స్థూలశరీరసంబంధకార్యముల దనకుఁదెలియకుండఁగనే కొనసాగించుచుండును. తినుట త్రాగుట, చూచుట వినుట, నిద్రించుట మున్నగు కార్యములను జేయుచున్న యీజీవాత్మప్రవృత్తి మనోమయ ప్రపంచసంబంధ ముననే యుండును; అచటనున్న దృష్టృత్వము వలననేచూచు చుండును. అట్లే తెలియకయే స్థూలరూపములోనుండు స్థూల ములగు నణ్వాదిశక్తులనుగూడ సూక్ష్మమార్గమున నీజీవాత్మ యుపయోగింపఁగలదు. తనమనశ్శక్తిచే సర్వమునుఁజూడఁగల యనుభవము మాత్రమే యీస్థితియందాతనికిఁగలదు. మనః ప్రపంచమున మనోమయ ప్రవృత్తులుగల జీవాత్మదృగిందిర యశక్తినిమాత్రము కల్గియుండును.

ఐదవభూమికనుండి మనోమయప్రవృత్తులు గలమానవాత్మ మనోమయరూపమున మనఃప్రపంచప్రథమస్థితి యనుభవ

మును బొందుచుండును. ఇట్లు మానసికమగు ప్రథమస్థితి సంబంధించిన యనుభవము నీరీతిగఁగలదియై పిదప నీస్థితిని దనయధీనమున నాఱవభూమికయందుంచఁ గలుగుచున్నది. ఈసమయమున విభూతులను బ్రకటించుశక్తి జీవునకుండదు. ఇట్లుండకపోవుటకు హేతువులు రెండు. మనోమయప్రపంచపరిభాసమును, సూక్ష్మలోకమందలి యఖండశక్తులును జీవునకు ననుభవములో నుండకపోవుట. అనఁగా నీసమయమున జీవునకు వాని స్పృహయే యుండదు. మనోవిజ్ఞానమునకున్న జీవాత్మసూక్ష్మలోకమందలి జీవాత్మల ప్రాథమిక మానసస్థితిమీఁదఁ బెత్తనముచేయుచుండుటచే నత్తఱి విభూతులనుఁ బ్రకటింపవలెనను సంకల్పము నిగృహీతమై యుండును. మానసికవిజ్ఞానముగల జీవాత్మయందు స్ఫురియించు నిచ్ఛాశక్తి యాధారముగా దీని స్వరూపముండును. కావున విభూతులఁ బ్రకటించుకోరికను బెంపొందించుటకు, నిగ్రహించుటకుఁగూడ మానసిక విజ్ఞానముగల జీవునకు శక్తి కలదు. ఇంతియేకాదు ఇతరులమనస్సులయందును వివిధసంకల్పముల రేకెత్తించుటకు నణంచుటకుఁగూడ నీజీవాత్మకు శక్తి గలదు. దిగువభూమికలయందలి ప్రవృత్తులఁ జవిచూచుస్థితికి నిచటి జీవాత్మ పతనము నొందక స్థైర్యముకలదియై యుండును.

ఇట్టి మానసిక ప్రవృత్తుల విజ్ఞానవంతమైన జీవాత్మ యాంతరపరిణామమును గ్రమముగాఁబొందుచున్న కొలఁది మానసేంద్రియమునకు రెండవభాగమగు బుద్ధిస్థితిపై పరిపూర్ణాధికారమును వహించును. ఇత్తెఱఁగున జీవాత్మ పరిపూర్ణముగా

మానసికజ్ఞానమునకు సంబంధించిన ప్రవృత్తులననుభవించును. ఈయనుభవమే యాఱవభూమిక యందు మనోలోకపూర్ణ స్థితి జీవాత్మకు సిద్ధించుట.* ఈయనుభవమున భగవంతుని సాక్షాత్కారము ప్రత్యక్షముగా జీవుఁడనుభవించును. సర్వ వస్తువులయందు సర్వప్రదేశముల సర్వాంతర్యామిగా భగ వంతుఁ డీభూమికయందు సాక్షాత్కరించును.

మొదటి భూమికనుండి యాఱవ భూమిక చేరువఱ కును ద్వంద్వములును, బరస్పరవిరుద్ధములు నగు ననుభవపరం పరల ద్వారమున జీవాత్మ కంతర్ముఖ పరిణామము సాగినది. ఈద్వంద్వాదులు క్రమక్రమముగా నీమార్గమున క్షీణింపఁ జొచ్చెను. ఇట్టివి నశించుకొలఁది జీవుని మనోమయకోశము నందలి యనుభవముల పరిణతి యాఱవ భూమికయందుఁ బరి పూర్ణతనుఁ జెందినది. తుదకు ద్వంద్వసంస్కారముల వాసనా వేశము మాత్రము మిగిలియున్నది. ఇచ్చట మనస్సునకు జీవునకు నభేదమగు ననుభవము జీవాత్మకుఁ గల్గును. ఈ యనుభవముతో జీవుఁడు మనోరూపియై ప్రతివస్తువునందు భగ వంతుని మాత్రమే చూచుచుంటిననుజ్ఞానముకలవాఁడగును. ఐనను భగవంతుని యందుఁ దన ప్రతిబింబమును జీవుఁడుగనలేని స్థితియందున్నాఁడు.

* పుప్పిపన్ను కదలి వదులుగానుండియుఁ జిరకాలము రాలక యుంటి యున్నటుల నహంకారము క్రమముగా బలహీనమైనప్పటికిని తుదికఱపు జీవువంటియే యుండును. సప్తమభూమికయందు నదిపూర్తిగానశించి యనంత మైన స్వస్వరూపమగు నహమాత్మగామారును.

సంస్కారరహితమై మనోవిజ్ఞానము మాత్రమే మిగిలి యా ఆరవభూమికయందున్న జీవాత్మ (ఈభాగము చివరభాగమున పటముచూచునది) భగవత్సాక్షాత్కారము నొందుచు సర్వమున భగవంతుని జూచుచుఁ బ్రతిబింబితమగుఁ దనరూపమును భగవంతునియందుఁ గాననేరకున్నాఁడు. మనోవిజ్ఞానమునఁ దానే మనస్సనుకొనుటయే దీనికిఁ గారణము. ఇది హేతువుగా భగవంతుని కంటెఁ దాను భిన్నుఁడనను నభిప్రాయము జీవునకు మిగిలియుండును. ఆ ఆరవభూమిక యందున్న మానసిక విజ్ఞానము గల యాత్మ స్థూలవిషయప్రవృత్తులతో స్థూలప్రపంచమును, సూక్ష్మవిషయప్రవృత్తులతో సూక్ష్మప్రపంచమును దర్శించిన దానికంటె స్పష్టతరముగ వాస్తవికముగ భగవద్దర్శనముచేయుచుండును.

ఇంతకుఁ బూర్వము నానాత్వమును నసంఖ్యాకమును, వైవిధ్యమునుగల సంస్కారముల ననుభవించిన జీవాత్మ చిత్తవృత్తియం దవసానదశయందున్న ద్వంద్వముల (రేఖాచిహ్నముల) మాత్రమనుభవించును. మనోవిజ్ఞానమున నారవ భూమికయందు విలసించు జీవాత్మ మనస్తాదాత్మ్యభావమున భగవంతుని కంటె భిన్నుఁడనను జ్ఞానముకలదియై తద్రూప ద్వైతస్థితిని వీడకుండును.

## ఏడవ భూమిక

మనస్సునుండి సంగవిమోచనము పొందు స్థితికి పైనఁ దెలుపఁబడిన యనుభవము త్రోవదీయును. ఇత్తఱి జీవుఁడు

తనతోఁదానే సాంగత్యమును బొందును. ఇదియే పరమాత్మతో నైక్యమును బొందుట.

మనోవిజ్ఞానమునకు సంబంధించిన ప్రవృత్తులు గల జీవుఁడు స్వయంకృషివలన నాఱవభూమికను దాఁటి యేడవ భూమిక ననుభవించుట సాధ్యమైన పనికాదు. అనంతానందము ననుభవించుటకుఁ దా నానందమున నిమగ్నుఁడై యున్నట్లు తెలిసికొనుటకు ననంతత్వముతోడి యేకత్వము ననుభవించుటకు మనోవృత్తులనుండి జీవుఁడు పరిపూర్ణవిముక్తి నొందవలెను. ఇది జరుగుట కొక సిద్ధపురుషుని కటాక్షమవసరము. ఇట్టిసిద్ధుఁడే గురువు. (న గురోరధికం న గురోరధికమ్మని సంప్రదాయసిద్ధముగాఁ జెప్పుదురు. ఈ యేడవ భూమిక యందు స్వీయజ్ఞానముగల జీవాత్మ తా ననంతమును, శాశ్వతము నను జ్ఞానమునుగలిగి పరాశక్తి యనుభవమును మనః ప్రవృత్తి యనుభవమునుగూడఁ గలదియైయుండుటచే నీయనుభవములు తన యనంతశక్తికిని, యనంతవిజ్ఞానమునకుఁ బరిమితత్వమునే సమకూర్చుచున్నవి.

ఇట్లు స్వయంప్రకాశమగు జీవాత్మ భగవత్సాక్షాత్కారము నొంది యఖండములగు నానందజ్ఞానశక్తులను దాననుభవించుటయే గాక బహిఃప్రసరణమునుగూడఁ జేయుచుండును. స్థూలసూక్ష్మమనఃప్రపంచములనున్న వివిధజీవాత్మలయందుఁ గొన్నిటి సంస్కారములనుండియు, సాంగత్యములనుండియు విముక్తిగల్పించి యీజీవులకు మోక్షము ప్రసాదించుటకుఁగా

నాత్మ సాక్షాత్కారము పొందిన జీవాత్మలు తమకుఁ గలిగిన యనంతశక్తి జ్ఞానానందములను బ్రత్యక్షముగా నుపయోగించును.

శాశ్వతమైనసద్దైనను వ్యక్తిగతాత్మ తనచేయు మోక్షసాధనమునఁ బరమాత్మయందలి తనయనంతస్థితిఁ దెలియనేరక యసంఖ్యాకములగు భిన్నభిన్న సంస్కారములను సమకూర్చుకొన్నది; పరిమితములు, బుద్ధ్యప్రాయములు నగుజన్మముల సంబంధము నొందినది. ఇట్లుస్థూలప్రపంచమున స్థూలేంద్రియ ప్రవృత్తుల ననుభవించుచు దానిలోఁగూడ సూక్ష్మమనః ప్రపంచములకు సంబంధించిన ప్రవృత్తులను గూడ నంతర్ముఖమై యనుభవించుచుఁ బరిణామమును బొందుచునే యుండెను.

అంతర్ముఖమైన పరిణామదశయందుఁ దుదకు గురుకటాక్షముచేఁ బరిపూర్ణత్వమునుబొంది పరమాత్మ యెట్లనంతమో యట్లే తాను ననంతమనియుఁ దనకంటెఁ బరమాత్మ భిన్నముగాదనియుఁ దెలిసికొని యీయపరోక్షస్థితిని పరమాత్మతో నొక్కటియై జీవాత్మ యనుభవించుచున్నది.*

ఇట్లాత్మ పరోక్షానుభూతి కలిగి తత్ఫలములగు జ్ఞానానందశక్తుల యనుభవము పొందిన తరువాత తనశాశ్వతత్వ

*"నీను చేలాంచలమ్ము నేనెన్ని సార్లొ
చేతఁబట్టితిననుకొంటి చిత్తమలర
విస్మయంబయ్యెఁ గనుగోయ విప్పినంత
చేతఁబట్టినయదియె నా చేలమగుట"

(Asghar)

మును జీవుఁడు గ్రహించును. ఇంకేమఁ బూర్వమీ మోక్ష సాధనదశయందుఁ దాను స్థూల సూక్ష్మ కారణ శరీరములతోఁ దత్తత్ప్రపంచముల సంస్కారనాంగత్వానుభవములన్నియు వాస్తవముగాని కలగాఁదోఁచును. పరిపక్వముకాని పరిణామ దశలో జీవాత్మ యున్నంతకాలము స్థూలశరీరముతో, బంధు జాలములతో, మానవరూపములతో స్థూలసూక్ష్మకారణ ప్రపంచముల విహారణ స్థానములగు నాఱు భూమికల తోడను దదితర నానావిధకార్యములతోడ నీజగన్నాటకము జరుగుచున్నది. అంతర్ముఖనై జీవుఁడు పరిపూర్ణముగాఁ బరిణతి నొందినపుడే యేడవభూమిక యందలి స్వానుభవమును బొందఁగలుగుచున్నాఁడు. దీనివలననే స్వస్వరూప విజ్ఞానము జీవునకుఁ గలుగుచున్నది. ఇదియే భగవత్సాక్షాత్కారము. దీనినే తనయనంతత్వమును బరమాత్మ యనంతత్వమును నొక్కటియని జీవుఁడు తెలిసికొనుట.*

---

* ఈవిషయమునే బాబాగారిట్లు వ్యాఖ్యానించుచున్నారు. భగవంతుని సాక్షాత్కారమునొందినవాఁడు జ్ఞానస్వరూపుఁడు చిత్స్వరూపుఁడు, భగవంతుఁడును. అతఁడు పూర్తియగు జాగ్రదవస్థలోనున్నాఁడు. అతఁడే జ్ఞానజ్ఞాతృజ్ఞేయస్వరూపుఁడు. ప్రేమస్వరూపుఁడును ప్రేమితుఁడును ప్రేమింపఁబడినదియుఁగూడ నాతఁడే. ప్రతిజీవాత్మయు నాతఁడుట్లన్న తనికిఁ దెలియును. ప్రతిజీవాత్మయు తనలో నిమిడియున్నది. సృష్టిస్థితిలయములకు నిమిత్తకారణము తానేయనియు జీవునకుఁ దెలియును. కాలత్రయమునందబాధ్యుఁడై యుండువాఁడను నేనేయనుజ్ఞాన మాతనికుండును. అపార సత్వోదధి తానేయనియు నీతఁడీస్థితియందు గ్రహించును కాని సాధారణ మానవునకుఁ దానెక్కడనుండి యీజన్మమునకువచ్చెనో యీశరీరపాతానంతరము తానెక్కడకుఁబోవునో తెలియదు.

మనస్సు పూర్తిగా లయమునొందినపిదప దానినావరిం
చిన సంస్కారములన్నియు నశించిపోయినతరువాత సంస్కార
బంధవిముక్తమైన యీజీవప్రవృత్తి స్వేచ్ఛాపరిపూర్ణము.
ఇదియే యాఱు ఏడు భూమికలకు నడుమనున్న యంధకారమగు
లోయను దాటుట. ఈ యేడవభూమిక రూపరహితమైన
భగవంతునిస్థానము. ఊహాప్రపంచమును బూర్ణముగా నతిక
మించినతరువాత పరమసత్యస్వరూపుడు ననంతమూర్తియు
నగు భగవంతుడు ప్రత్యక్షమగును. ఆత్మజ్ఞానము సంపాదిం
చుటకై ప్రథమప్రేరణము(స్పందనము)గలిగిన జీవాత్మ యేడవ
భూమికయందు మార్పులేని శాశ్వతమైన, యవిభక్తమైన,
యరూపమైన పరమాత్మతో నేకత్వమును బొందును. ఈపర
మాత్మయనంతవిజ్ఞానశక్తియు, నానందమయాఖండసత్యమును.

---

## ఆఱవ భాగము | భగవత్సాక్షాత్కారమునందలి సోపానసంగ్రహము

పరమాత్మసాక్షాత్కారమునకై తీవ్రవాంఛగల జీవా
త్మకు మానవదేహమున పరిపూర్ణమగు జ్ఞానమును సంపా
దించుకొనినప్పటికిని బరమాత్మానుభవము పరిపూర్ణముగా
లభ్యముకాదు. దీనికి హేతువీ విజ్ఞానము స్థూలశరీరసంస్కార
ములచేఁ బరివృతమైయుండుటయే. స్థూలశరీరసంబంధమున
జీవాత్మ స్థూలప్రపంచానుభవ ప్రధానములగు లక్షణము
లతో నిండియుండును.

మానవస్వరూపము లేనిదే జీవునకు సూక్ష్మకారణ శరీరములయుఁ బరమాత్మయు, విజ్ఞానానుభవములు, పొందసాధ్యముకాదు. స్వరూపపరిణామము పొందుటకు స్థూలప్రపంచానుభవము నొందుటకు విజ్ఞానాభివృద్ధికి స్థూలశరీర సంస్కారానుభవము లత్యావసరము. ఐనను స్థూలమైన బాహ్యప్రపంచసంస్కారానుభవములగు వైషయిక విజ్ఞానమున్నంత కాలము జీవునకు సూక్ష్మకారణ శరీరముల విజ్ఞానముండదు.

శారీరక పరిణామము మానవశరీరముతోఁ బరిపూర్ణతను బొందును. మానసిక ప్రవృత్తులు విజ్ఞానముతోఁగూడి యీదశయందే విషయముల పైకిఁబ్రసరించుటయు బరిపూర్ణతను బొందును. కావున స్థూలప్రపంచసంబంధములగు సంస్కారముల యవసరము జీవునకింతటితోఁ దీరినది. ఇటనుండి మనఃప్రవృత్తులు వెనుమఱలి యంతర్ముఖములగును. ఈయంతర్ముఖతయే స్థూలసంస్కారములు సూక్ష్మసంస్కారములుగను, సూక్ష్మసంస్కారములు మనస్సంస్కారములుగను బరిణామముబొంది తుదకీమానసిక సంస్కారములుగూడ లయమునొందును. మానసస్వరూపమునందే జీవుఁడు సూక్ష్మకారణ శరీరములయు, స్వకీయములయు ననుభవములను, సూక్ష్మమానసిక ప్రపంచములయు, పరమాత్మయు ననుభవములను బొందునని తాత్పర్యము. ఐనను మానవదేహమున జీవుఁడు విజ్ఞానముపొందినవెంటనే పైనదెల్పినవాని నన్నిటిని యనుభవింపనేరఁడు. దీనికిఁగారణమేమనఁగా స్థూలసంస్కారములు, సూక్ష్మసంస్కారములుగా మార్పునొందవు. ఇక్లే

సూక్ష్మదశనుండి మానసికదశలోనికిఁ గూడ వెంటనే మార్పు నొందవు. జాంతవాదిశరీరముల వీడి ప్రప్రథమమున మానవ శరీరమును గ్రహించిన జీవునకు పూర్వజన్మసంస్కారము లెట్లు భాసించుచుండునో యిట్లేపరంపరగా ననేకమనుష్య జన్మముల నెత్తిన జీవునకుఁగూడఁ బూర్వపూర్వ స్థూలసంస్కారములు భాసించుచు నేయుండును. వీనిప్రభావముకూడ నీజీవునియందు గోచరించుచుండును. ఇట్లు స్థూలసంస్కారములు వాసనా రూపమున జీవునంటియున్నంతకాల మా జీవుఁడు పౌనఃపున్య ముగ మానవదేహమున జన్మింపవలయుట తప్పదు.

ఇచట జీవునకు రెండుమార్గములు ముక్తుఁడగుటకుఁ గాన్పించును. వానిలోనొకటి యాకస్మికముగ జీవుని స్థూల సంస్కారములన్నియు నొక్కమాఱు నశించుపోవుట. అప్పుడు జీవాత్మకు స్థూలశరీర విజ్ఞానమునశించి యాత్మజ్ఞానముదయిం చును. అనఁగా స్థూలసంస్కారములు నశించి పరమాత్మ సాక్షాత్కారము లభించును. లోకసాధారణమైనది రెండవ పద్ధతి. ఈరెండవమార్గమునఁ గ్రమముగా స్థూలసంస్కార ములు క్షీణించి సూక్ష్మసంస్కారాభి ముఖుఁడు జీవుఁడగును. తరువాత సూక్ష్మసంస్కారములను గ్రమముగానంతరించి మానసికసంస్కారములుగా మాఱును. తరువాత నివికూడ లయమొందును. ఈమార్గమున మొదటజీవుఁడు స్థూలశరీర ప్రపంచములయుఁ, బిదప సూక్ష్మశరీరప్రపంచములయు, ననంత రము మనశ్శరీరప్రపంచములయు, ననుభవములను గ్రమ ముగా నొకదానిని విడిచి మఱియొకదానిని పొందుచుండును.

తుదకుఁ గారణశరీరమునుండియు విముక్తికలదియై జీవాత్మ తననుదాను దెలిసికొనును. ఇదియే జీవుఁడు పరమాత్మానుభవమును బొందుట.

ఇట్టి యనుభవము కలిగిన పిదప జీవునకు నధిరోహింప వలసినవి మూఁడుసోపానములుమాత్రమేకలవు. ఈమూటిలో జీవాత్మ యుత్తటి నొకసోపానము నధిరోహించును.

మొదటి సోపానము :- (1) సర్వోత్కృష్ట గల పరమాత్మానుభవమును బొందినతోడనే జీవుని తనవెంట నీడవలె నంటియున్న స్థూలసూక్ష్మకారణ శరీరములఁ దృజించును. శాశ్వతము, ననన్యమునగు నొకానొక యనుభవము జీవుఁనకుఁగల్గును. అది భగవంతుని యనంతత్వమున నిమిడియున్న శక్తి జ్ఞానానందముల యనుభవము. ఈయనుభవమును జీవుఁడనుభవించును గాని వానికి భగవంతునకుఁ గల గుణము లన్నియు సంక్రమింపవు.

(2) శరీరత్రయ విజ్ఞానము లేనివాఁడై యప్పటికి నీసోపానము నందున్న జీవుఁడు కొంతకాలమువఱకు నీశరీరములను దృజించకపోవచ్చును.

రెండవసోపానము :- స్వీయజ్ఞానానుభవముతోఁబాటు శరీరత్రయము నీసోపానమున విడనాడకుండును. ఛాయారూపములైన యీశరీరత్రయప్రవృత్తులు గూడ జీవాత్మ కలదియైయుండును. ఐనను వీనితోఁబాటు భగవంతుని నిరతిశయత్వమునకు సంబంధించినశక్తి జ్ఞానానందముల జీవాత్మ

యనుభవించుచునేయుండును. అంతమాత్రమేగాక యీశరీర త్రయచ్ఛాయలను బరమాత్మచ్ఛాయలుగా జీవుఁడనుభవించుచుండును. ఇత్తటి తనకుఁ బ్రాప్తించినశక్తి జ్ఞానానందముల జీవాత్మ శరీరత్రయమునందున్న స్వేతరజీవాత్మలకొఱకు వినియోగింపఁడు. అనఁగా జీవుఁడిప్పుడు స్వాయత్తస్థితి కలవాఁడైయుండును.

మూఁడవ సోపానము :- దీనియందలి యనుభవము రెండవదానియందలి యనుభవమువలెనేయుండును. ఐననొక్క భేదము మాత్రముకలదు. ఈసోపానమున కధిరోహించిన జీవుఁడు తనకు లభ్యమైనశక్తి జ్ఞానానందముల నితరజీవుల నుద్ధరించుటకై వినియోగింపఁగలఁడు. స్థూలశరీరమునందున్న జీవులను సూక్ష్మశరీరానుభవములఁ గలవారినిగను, సూక్ష్మశరీరమునందున్న జీవులను గారణ శరీరానుభవములఁ గలవారినిగను, కారణ శరీరానుభవముగలవారిని స్వానుభవముగలవారినిగను నీసోపానమునందున్న జీవుఁడొనర్పఁగలఁడు. అంతియేగాక స్థూలశరీరప్రవృత్తులను గల జీవుల నొక్కపర్యాయమే స్వానుభవముగలవారినిగాఁ గూడ నీసోపానమునందున్న జీవుఁడొనర్పుటకు శక్తిమంతుఁడగును.

మానవశరీరమునందున్న జీవునకు సూక్ష్మకారణ శరీరముల పరిపూర్ణ పరిణామము—ప్రవృత్తుల యంతర్ముఖత :

ప్రాణమనశ్శరీరములు మనుష్యరూపముననే పరిణతి నొందుచుండును. (ప్రాణమయమనోమయకోశముల విజ్ఞాన

మును కలిగియున్నప్పుడు స్థూలదేహావరణము నుండియే జీవుఁడు పరోక్షముగాఁ బ్రాణమనశ్శరీరముల ద్వారమున బనిచేయుచుండును. ఈదశయందు జీవుఁడు మనశ్శరీరచిహ్నములగు శక్తులను దెలిసికొన నేరకపోయినను, ఆయాశక్తులదా నుపయోగించుకొనును. దీని కుదాహరణములు: ఆణవికవిద్యుచ్ఛక్తులు మనోవికారములే కోరికలు. ఈకోరికలఁ దీర్చుకొనుటకే జీవుఁడు మనశ్శరీరము నుపయోగించును.

మానవశరీరమున నున్న జీవునకు సూక్ష్మశరీరజ్ఞానము కలిగినచో స్థూలశరీరమునకు మనఃప్రవృత్తులకు సంబంధించిన జ్ఞానసంపదయుండదు. ఎనను సూక్ష్మశరీరావరణమున జీవుఁడు స్థూలశరీరమనఃప్రవృత్తుల ద్వారమునఁ బరోక్షముగాఁ గార్యకరణసమర్థుఁడే యైయుండును. ఈదశయందు సూక్ష్మశరీరజ్ఞానముతోఁ దత్ప్రవృత్తులను గలిగియున్న జీవుఁడు స్థూల మనఃప్రవృత్తుల యనుభవములఁ బొందనప్పటికిఁ దినుట, త్రాగుట, చూచుట, వినుట, గమనాగమనాదులు మున్నగు కర్మజ్ఞానేంద్రియ ప్రవృత్తుల ననుభవించుచుండును. అట్లేమనఃప్రవృత్తులఁ గూడ మనస్సు ద్వారమున ననుభవించుచుండును.

మానవశరీరమున నున్న యాత్మ మనోమయ కోశవిజ్ఞానమును గలిగియున్నప్పుడు స్థూలసూక్ష్మశరీరముల ప్రవృత్తుల ననుభవింపదు. మనోమయకోశావరణమునుండి జీవాత్మ స్థూలప్రాణశరీరముల ద్వారమున పనిచేయుచుండును. అట్లే మనఃకోశజ్ఞానముగల జీవాత్మ స్థూలప్రాణశరీరముల ప్రవృత్తిశూన్యమగుటచే తత్సంబంధప్రపంచముల యనుభవము

లేకుండును. ఐనను యింద్రియముల మార్గమున విషయముల ననుభవించుచుండును. ఇదేవిధమున వివిధరూపములనున్న శక్తి నిగూఢ నుపయోగించుకొనును.

స్థూలశరీర ప్రవృత్తులుగల జీవాత్మ నరసినచో నీవిషయము తేటపడఁగలదు. భూమిపైనున్న వానికి సూర్యమండలమెంత దూరమో యట్లే స్థూలశరీరవ్యాపారమున నున్న జీవునకు సూక్ష్మలోకమునకు మనోలోకమునకు నంతదూరమని భావింపనగును. సూర్యుఁడు నిరంతరము భూమిపైఁ దనకిరణములను బ్రసరింపఁ జేయుచుండును. అట్లే సూక్ష్మశరీరమునకు మనోమయకోశమునకు సంబంధించిన శక్తులు స్థూలశరీరము నావరించియుండును. భూమిపైఁబ్రసరించు సూర్యకిరణముల యందలి యణుస్వరూపములు విద్యుత్స్వరూపములును నగు శక్తులను దనకుఁ దెలియకయే ప్రపంచ మెట్లు వినియోగించుకొనుచున్నదో యట్లే జీవాత్మ స్థూలశరీరప్రవృత్తులను గలిగియుండియుఁ దనకుఁ దెలియకుండఁగనే మానసిక సూక్ష్మశరీరముల శక్తులను వినియోగించుకొను చుండును. సూర్యకిరణముల వంటివే మన శక్తులు. వానిని వాంఛాకామముల ద్వారమున మనఃప్రవృత్తులతోడ్పాటున జీవాత్మ స్థూలశరీరము నుండియే వినియోగించుకొనును.

ఈ పైనుదాహరణమునే మఱికొంత యాలోచించినచో సూక్ష్మస్థూలశరీరముల భేదము మఱింతస్పష్టముగాఁ దెలియఁగలదు. గాలి భూమికి పైభాగమున సూర్యునకు సమీపమున నుండి సూర్యకిరణశక్తిని, సామీప్యముచే, మిక్కుటము

గాగ్రహించును. అట్లే స్థూలశరీరమున నతిక్రమించి సూక్ష్మశరీరమునకు సంబంధించిన యంతఃకరణ ప్రవృత్తులను గలజీవాత్మ యఖండశక్తి కలదియై నిర్జీవులను సజీవులను జేయుటకు, అంధులకు దృష్టినిచ్చుటకు, అంగవిహీనుల నంగసహితులఁ జేయుటకు సమర్థమైయుండును. ఇది మొదటి మూఁడు భూమికల యందలి ప్రభావము రెండు మూఁడు భూమికలయందుండి శక్తిమంతమైన కొలఁది జీవాత్మ తనశక్తులను మిక్కుటముగాఁ బ్రసారము చేయఁగలదు.

సూక్ష్మవిజ్ఞానముగల జీవుఁడు శక్తిమంతుఁడై తననిష్కళంకశక్తిని మిక్కుటముగా వినియోగించుచు దానిని బహిఃప్రసరణముచేయునపుడు మానసికప్రవృత్తులు లేనివాఁడై యుండును. అందుచే స్వస్వరూపజ్ఞానము లేకయే జీవాత్మమనోలక్షణములగు కామవిచికిత్సాదులగు వాని వశుఁడైయుండును. ఇట్టిటి తనకు లభ్యమైన పరాశక్తిని వినియోగించు నవకాశముండియు, నావిజ్ఞానము లేనివలన మనోలక్షణములగు సంకల్ప వికల్పాదులవశమై తద్వికారములగు కామాదుల తగులమున జిక్కుపడును.

అఖండశక్తిమంతమై సూక్ష్మవిజ్ఞానముగల జీవాత్మ తనకుఁ గలిగిన యోగశక్తులఁ బ్రదర్శింపవలయునను కోరికతో బ్రకటించినపుడు వానివిజ్ఞానసంపద యట్టడుగునకు దిగజారిపోవును. జీవులకుఁ గలిగినవిజ్ఞానమునందలి తరతమభావమును బట్టి యాయాజీవులు రెండుమూఁడు భూమికలప్రవేశమును

గాంతురు. అనఁగా రెండుమూఁడు భూమికల పరిమితత్వమున సూక్ష్మవిజ్ఞానమునకు విస్మృతికలదు.

సూక్ష్మప్రపంచమునకు మనోలోకమునకు సరిహద్దు నిర్ణయించు రేఖను నాల్గవభూమికయందురు. సూక్ష్మవిజ్ఞానము గలజీవాత్మ సూక్ష్మమనఃప్రపంచములను వేఱుచేయు నాల్గవ భూమిక సింహద్వారముకడ నిప్పుడున్నదని దీని తాత్పర్యము. ఈభూమికా విజ్ఞానముగల జీవాత్మ పూర్వావరణములఁ బ్రవృత్తులను గలిగిసూక్ష్మ ప్రపంచప్రవేశమున లబ్ధమైన యఖండ శక్త్యనుభవమును బొందుచుండును. మనఃప్రపంచ ద్వారము కడ సూక్ష్మశక్తినిపొందిన జీవుఁడు మనః ప్రపంచమునకు సమీపముగా నుండును. దీనివలన మనఃప్రవృత్తుల వికారములు తమప్రభావమును జీవునిపైఁబ్రసరింపఁజేయు చుండును.

ఇట్లు సూక్ష్మవిజ్ఞానముగల జీవుఁడు నాల్గవభూమికయందుండి తద్విజ్ఞానలబ్ధములగు శక్తులవినియోగించి నప్పటికి నీ విని యోగము మనఃప్రవృత్తుల చైతన్యములేకయే యీశక్తులు ధృతములైనవి యాకర్షణము చేయునవి. తదనుకూలముగా నీశక్తుల వినియోగించునప్పుడు కామాదివికారములు జీవునకుఁ గలుగును. ఈవికృతులచే నాతఁడు సంచలితుఁడగు చుండును.

నాల్గవ భూమికయందు జీవునిపరిస్థితి ప్రమాదకరమై నది. ఇచ్చట జీవుఁడఖండశక్తి సంపన్నుఁడయ్యు నాశక్తిని మంచిచెడ్డల రెంటికి నుపయోగించుట కవకాశముండుటచే మానసికముగా నుచ్చస్థితిలోనున్న రెండుశక్తుల యొరపిడికి లోఁగ

పండవలసి వచ్చును. మంచిచెడ్డలకుఁ దోవఁదీయు నీశక్తుల సమన్వయింపఁదగిన స్థితి జీవునకేర్పడును. సూక్ష్మ ప్రపంచసంబంధములగు బలవచ్ఛక్తులివి. ఇవియేమనోమయప్రపంచమున జీవుని లోఁగదీయఁగల మనోలక్షణశక్తులు. ఈరెంటిసమన్వయమును జేయుటయత్యావసరము. ఈనాల్గవ భూమికయందున్న జీవుఁడు తెలియకుండగనే మనోలక్షణముల ప్రేరణమున మనోవికారములకు లోఁగిపోయినచో యున్నతదశయందున్న యీశక్తులతృప్తికై వాంఛలధికమై మహిమలను బ్రకటించుఁ గోరిక కలవాఁడగును. ఈకోరిక నాపుకొనలేక చచ్చినవారిని బ్రతికించుట, అంధత్వమును మాన్పుట, రోగులకారోగ్యమును గలుగఁజేయుట మొదలగు మహిమలను జీవుఁడు ప్రదర్శించును. ఈప్రదర్శనమునకు హేతువులు జయింపరాని తనవాంఛలే. ఈస్థితియందున్న జీవుఁడు సృష్టికిఁబ్రతిసృష్టి చేయఁగలఁడు.

ఇట్లు తనకుఁబ్రాప్తించిన శక్తి నిమానసిక ప్రవృత్తుల ననుసరించి యుపయోగింప యత్నించినప్పుడు సాధారణప్రకృతి కతీతమైన యీరెండు శక్తులకును ప్రబలమగు సంఘర్షణము జరుగును. ఈసంఘర్షణముచే నాల్గవభూమికయందున్న జీవునకు భయంకరమైన విఘ్నము తటస్థించును. ఉన్నతమార్గమున మున్ముందునకు సాగుచున్న జీవుని మోక్షయాత్ర విచ్ఛిన్నమగును. అందుచే జీవుఁడు మరల పతనమునొందును. ఇట్లు పతితుఁడైన యాతఁడు మరల ఆతియాకారమునుబొంది తిరిగి క్రమక్రమముగాఁ బరిణామమును బొందవలసియుండును.

## —: దీనికి స్థూలవిజ్ఞానముగల శాస్త్రజ్ఞునితారాకాణము :—

నాల్గవ భూమికయందున్న జీవుని వాంఛాపర్వతమును శాస్త్రవిజ్ఞానమునఁ దానుసంపాదించిన శక్తులవినియోగింప వలయునను కోరికఁగలవైజ్ఞానిక శాస్త్రజ్ఞుని వాంఛాపరత్వముతోఁ బోల్చిచూతము.

వైజ్ఞానికుఁడు క్రమముగా దానుశాస్త్రసంపదచే సమాపార్జించిన మహాశక్తిని వినియోగింపవలెనను కోరికగలవాఁడగును. శాస్త్రవేత్తయీశక్తి జ్ఞానముకలవాఁడైనను ప్రారంభదశయందాశక్తి యనుభవము వానికిలేదు. సూక్ష్మవిజ్ఞానము సంపాదించిన జీవుఁడాశక్తి యనుభవమును గలవాఁడై యుండి దానిని వశపఱుచుకొనఁగల్గును. శాస్త్రజ్ఞుఁడగువాని కీశక్తి యనుభవములోనికిరాదు. వైజ్ఞానికి నాణవికశక్తి యనుభవము కలిగెనన్నచో సూక్ష్మ ప్రపంచమునందలి శక్తిసంబంధమగు స్థూలలక్షణములలో నొకటియగు ననుభవమును బొందినాఁడని చెప్పవలయును.

అణుశక్తిని తనకుస్వాధీనము చేసికొనినవైజ్ఞానికుఁడు మనోలోక లక్షణమగు శక్తినుపయోగింపవలయునను కోరికకు లొంగినచో నది వాని భావదశాపరిసమాప్తి యనవలెను.

పరస్పరవిరుద్ధమగు భావముల సంధిలోఁదగుల్కొని తనశక్తులను గార్యరూపమున బ్రకటింపవలెను. కోర్కెయొకవైపునకు లాగుచుండగా నిగ్రహాప్రధానమగు వివేక మాకోరికను శాంతింపఁజేయుచుండును. అప్పుడీశక్తి ద్వయమును దన యధీ

నముసందుంచుకొని సమత్వమును బాటింపవలసిన బాధ్య
వైజ్ఞానికుని యందుండును. తనకుఁగలిగిన శక్తులను లోకకల్యా
ణమునకుగాని, నాశనమునకుగాని యీతఁడు వినియోగింప
చ్చును. లేదేని వినియోగింపక యూరకుండవచ్చును. య
స్సంపాదనమునకో, యధికారసంపాదనమునకో స్వార్థపరుఁడై
యహమికచే నావహింపఁబడి తాను వినియోగించు శక్తి వల
లోకమున నెట్టెట్టి భీభత్సకార్యములు పుట్టునోయని తలంప
దుర్వినియోగము చేసినప్పుడు ప్రస్తుతము లోకమునకు భయ
మునుగొల్పు హైడ్రోజనుబాంబు కంటెను బలవత్తరమున
బ్రమాద కరమునగు మారణయంత్రమును వైజ్ఞానికుఁడ
సృజించును.

ఇదియొక ప్రధానఘట్టము. వైజ్ఞానికుఁడు ధ్వంసకా
కమగు నస్త్రమును బ్రయోగించి నాఁడన్నచో కీర్తిసముపా
నాయత్తమగు స్వార్థపరత్వమనెడు వాంఛకును విజ్ఞానసమ
పార్జితమగు దనశక్తి నుపయోగించుటకును మధ్యమునఁ గ
సమత్వము ధ్వంసమగును.

ప్రమాదస్థితియందు తాను కనిపెట్టిన యస్త్రమునంద
శక్తి వలన దనకుఁగలిగిన బలము నుపయోగింపవలయును, నన
కోరికకు, ఆకోరికను నిగ్రహింపవలయునన్న యత్నమునకు
నంతరము చాల సునిశితమైనది. వైజ్ఞానికుని స్థితియిట్లుండగ
నాధ్యాత్మికభూమిక ప్రవేశించు వీనివిషయముపోల్చి చూతము
ఆణవికశక్తిని స్వార్థపరుఁడై వైజ్ఞానికుఁ డుపయోగించినపు
తా నెంతజాగ్రత్తగా నున్ననుగాని ఫలము మొదటతననాశనవే

ఆబాంబు బ్రద్దలైనప్పు డాతఁడే మూర్ఛపోయి స్పృహదప్పి నేల పైఁగూలును. కొంతసేపటికి వానికిజ్ఞానమురాఁగా నాతఁడు తానింతకుఁబూర్వము వైజ్ఞానికులలో నున్నతస్థితియందుంటి ననువిషయమును మఱచి తన సంసారము బాల్యమునుండి తనజీవితవిధానము స్మృతియు లేనివాఁడై తుదకు తనకింతనష్టము కలిగినదను జ్ఞప్తికిని దూరగుఁడగు చున్నాఁడు. దీనినే వైద్యు లపస్మార (Amneria) మందురు. ఇట్టిస్థితియందు వీనికిమనుష్యుఁ డనను సాధారణస్మృతి మాత్రమేయుండును. శాస్త్రవేత్తృత్వ ముసరిపూర్ణముగా నశించును. ఇతనిజీవితము క్రొత్తగా మరల ప్రారంభమగును. ఇట్లే నాల్గవ భూమికయందు సమున్నత మైన సూక్ష్మజ్ఞానముకల జీవునకుఁగూడఁ దనశక్తుల దుర్వినియోగము చేసినప్పుడు విషాదసంఘటనము ప్రాప్తించును. దీనివలనఁ బరిమితమగు విజ్ఞానమును మాత్రముగలస్థితిలోని కీతఁడు పతితుఁడైసమున్నతజ్ఞాన స్మృతిని గోల్పోవును. ఈపరిమితవిజ్ఞానస్థితిని పొందుటయనఁగా మరల నీతఁడు జాతిరూపముగా మాఱుట.

అణిమాది సిద్ధుల (Occult) దుర్వినియోగ మొనర్చి తనకు యోగశక్తివలన ప్రాప్తించు పురోభివృద్ధిని నాశనము చేసికొనకుండుటకై యీనాల్గవభూమిక యందున్న జీవునిసంరక్షించువాఁడు సద్గురుఁడు* దీనినే వేదాంతులు గురూపసదన

---

* ఈగ్రంథ ప్రచురణకర్తలు జీసస్‌నకు కలిగినమోహాశక్తులగూర్చి ప్రశ్నింపగా బాబా యిట్లు సమాధానముచెప్పెను. సైతాను జీసస్‌ను మోహపెట్టె శేను. జీసస్సే స్వశక్తిముగా మోహితుఁడై యీమోహములజయించెను. దీని

విధియనియు గురుపుకంటె నధికుఁడు లేఁడనియు జెప్పుచు "పండితో మేధావీ గాంధారానేవోపసంపద్యేతైవమేవే హాచార్యవాన్ పురుషో వేద" యనుఛాందోగ్యమునందలి వాక్యము నుదాహరింతురు. సాధారణముగా నాల్గవ భూమికయందున్న జీవుఁడు తనమానసిక ప్రవృత్తుల్ని నిగ్రహించుకొనలేని సమయమున స్థూలసూక్ష్మశరీరముల దన యధీనమునందుంచుకొనగలసమర్థులగు సద్గురువులు ఆయశక్తులను దాముగ్రహింతురు. అందుచే పూర్ణపతనము నొందుజీవు లెక్కువగానుండరు. గురువులు ప్రమత్తులుగా నుండుటవలనగాని భగవదిచ్ఛయట్లుండుటవలనగాని యిట్టిపతనములప్పుడప్పుడు సకృత్తుగా జరుగును. చిన్నది పెద్దదియను భేదములేక యేసంఘటనమైనను, యేలోకమున జరిగినను అదియంతయు భగవదిచ్ఛప్రకారమే జరుగుచుండును.

మానవశరీరమున నుండగా జీవున కొక్కపర్యాయము పరిపూర్ణాత్మజ్ఞానము కలిగినయెడల మఱింక సాధారణముగా నాజ్ఞానము నశింపదు. అయినను చతుర్థభూమికయందున్న

---

యందు గ్రహింపఁదగిన మహావిషయ మొకటిగలదు. జీసస్ తానే మోహితుఁడై ప్రపంచమున విజృంభించు మోహపాశముల భారమువంతను వహించి పిదప వానిని జయించెను. ఈసరణిని మోహపాశములకుఁగల శక్తులన్నిటి నరికట్టు మహాశక్తి నొకదానిని జీసస్ సృజించెను. ఇట్టిస్థితియే బుద్ధునియందును నాయా యవతారపురుషులయందును గోచరించును. భగవంతుఁడు భూమిపై నవతరించినప్పుడు ప్రపంచమునంతను సన్మార్గమున పురోగమించుటకు వలయుశక్తి నిచ్చును. మానవజాతిమాత్రమే కాక సృష్టప్రపంచమంతయు నీశక్తివలన ప్రయోజనము ననుభవించును.

విజ్ఞానాత్మ తనకబ్బినజ్ఞానమును గోల్పోవుస్థితికి రానవకాశము
కలదు. ఈయవకాశముల కల్పించునది శక్తులదుర్వినియోగము.
వీనిని దుర్వినియోగము చేయకుండుటకు జీవుఁడు మనోవికార
ములకు లొంగకుండవలయును. లొంగిన పతనమను ప్రమాద
ముతటస్థించును. భావములు, వాంఛలు, వాంఛాప్రకోపము
లు, అను మూఁడులక్షణములలోను వాంఛయే ముఖ్యమగు
మనోలక్షణముగా నెన్నవలెను.

ఈయఖండ శక్తిని బరిపూర్ణముగా సద్వినియోగము
చేసినచో జీవుఁడు నాల్గవభూమికా ద్వారమును దాఁటి యైదవ
యాఱవభూమికలలోఁ ప్రవేశించుట యేగాక తిన్నగా నొక్కొ-
క్క-ప్పుడాఱవ భూమికయందలి విజ్ఞానమును కోరికలు మనో
వికారములు నుగ్రస్థితిలోనుండి జీవునకు సంప్రాప్తించినశక్తి
బహుళమును వమ్ముచేయ యత్నించినప్పుడు తమ గ్రహస్థితిని
నిలుపరించి తనశక్తిని సద్వినియోగమును జేయుచు సంరక్షించు
కొనుటచే నీభూమికాసంబంధమగు నావరణలోనికిఁ బ్రవేశింప
జీవునకు సాధ్యమగును. ఈశక్తులన్నింటిని జీవుఁడు తన వశ
మునం దుంచుకొనుట యేగాక యవసరమైనప్పుడు సృజింపఁ
గలఁడు.

ఇట్లు సూక్ష్మప్రపంచమున బ్రజ్వలితమైన యీయఖండ
శక్తిని మంచిచెడ్డలవేనికిని గొందఱుజీవులువ్యయము చేయరు.
నాల్గవభూమికనుండి కడచి యీసూక్ష్మవిజ్ఞానముగల జీవులు
మానసిక లోకములోని యైదవభూమికాసంబంధమగు విజ్ఞాన
మును బొందుదురు. ఇందు ప్రవేశించిన జీవుఁడు మనోవృత్తు

లకు లొంగడు. ఇట్లు లొంగకుండుటకు హేతువు? యీతఁడు మనోవిజ్ఞానము పూర్తిగ కలవాఁడై తనస్థూలమున మనశ్శాసకుఁడగుటయే.

ఐదారుభూమికలనున్నట్టియు, మనోవిజ్ఞానముగలట్టియు, జీవుఁడు ఆభూమికలయందు తాను పురోగమించుకొలఁది మనోలోకవిజ్ఞానమును అధికాధికముగాఁ గలవాఁడగును. ఈస్థితికి వచ్చిన జీవుఁడు దిగువనాల్గు భూమికలకు సంబంధించిన విజ్ఞానస్మృతియే లేకుండును. ఇట్లు మనఃకోశముననున్న జీవునకు సూక్ష్మలోకాఖండశక్త్యనుభవముగూడ నుండదు. ఈస్థితిలోనున్న యాత్మ స్వానుభవముచే మనస్సుపై సర్వాధికారమును గలదైనప్పటికి సూక్ష్మప్రపంచశక్తి జ్ఞానము లేమింజేసి యెట్టి మాయలను మహిమలను బ్రదర్శింపలేకుండును. అందుచేతనే సూక్ష్మజ్ఞానముగల జీవునికంటె స్థితియందున్న జీవునకు నధికమగుశక్తి తనంతసంక్రమించినప్పటికిని మరణించిన వానిని బ్రతికించుట నంటియు, నంధులకు దృష్టిని ప్రసాదించుటవంటియు, మహిమలను బ్రదర్శింపఁజాలఁడు. అట్లయినను బ్రజ్ఞాపూర్ణమైన మనస్సును స్వాధీనమున నుంచుకొనుశక్తి నిగల్గి మనోమయకోశముననున్న యీజీవుఁడు స్థూలసూక్ష్మశరీరవిజ్ఞానము మాత్రముగల జీవులకు మనోవిజ్ఞానము కలుగునట్లు చేయు సృజనశక్తిగల వాఁడును, ఇట్టి జీవుల తనయధీనమునందుంచుకొనఁగలశక్తి గలవాఁడును నగును. ఈసృజనశక్తి శాసకత యథావసరముగ నీతఁడు చేయుట వీనిని నొకయాట వంటిది.

ఉదాహరణమునకై సూర్యసమీపమున నున్న మనో విజ్ఞానముగల జీవునిశక్తి ని యాలోచింతము. మనోలోకమునకు నాధారశక్తి సూర్యుఁడను నీమానసిక ప్రవృత్తి సూర్యుని నుండియే కలవాఁడై జీవుఁడుండుననియు నీజీవుఁడు మానవ శరీరమునందుండి తన మనశ్శక్తులను గ్రహించుటయు, శాసిం చుటయు, వాని నుపయోగించుటయు, ననుభవపూర్వక ముగ నొనర్చుననియు, నీయుదాహరణమున మనమూహిం తము. అట్టియెడ నీయైదాఱుభూమికలయందున్న జీవుఁడు సమస్తశక్తులను గలిగి యుండుటయే గాక యితర జీవుల మనోభావములను వాంఛలను వికారములనుగూడ దనయధీ నమునందుంచఁగలడు. ఇప్పటికి జీవునికి స్థైర్యము కలుగుటచే నిటనుండి యిట్టిజీవుఁడింకఁ గ్రిందికిదిగజారఁడు. నాల్గవభూమిక యందు జీవుఁడు మనస్సునకు లొంగిపోవలసిన ప్రమాదముం డెడిది. కాని మనోవిజ్ఞానమునుబొందిన జీవుఁడు తనమనఃప్రవృ త్తులను శాసించు నధికారముగలవాఁడై యుండును.

తుద కాత్మవిజ్ఞానముపొందిన జీవుఁడు సూర్యునిలోనున్న పరమేశ్వరరూపమగు నారాయణునివంటివాఁడు, (ఉపమాన ముగానే యిచట సూర్యుని ప్రస్తావము తేఁబడినది. మనకు కంటికి గాన్పించు వేడిమినిచ్చు సూర్యునిప్రసక్తి యిచట లేదు. కాగా నీసృష్టికంతకు మూలకారణమగు నాదిశక్తికి నీసూర్యు నకును ఏకత్వ ముపాదింపరాదు. ఎందుకనగా సూర్యుఁడుకూడ నా పరమాత్మసృష్టిలోనివాఁడే)

మనశ్శక్తుల రెంటికిని యాధారభూతముగా పైనుదహరింపఁబడిన సూర్యబింబస్వరూప స్వభావవిజ్ఞానమును యేడవ భూమికను ప్రవేశించినట్టియు, నాత్మవిజ్ఞానముకలట్టియు జీవుఁడు కలిగియుండును. అనంతమును శాశ్వతమునగు శక్తి జ్ఞానానందములను ననుభవించుచు, వికసింపఁజేయుచు నుండెడు నీ జీవుఁడు స్థూలసూక్ష్మకారణశరీరముల విజ్ఞానమును మాత్రము గల జీవుల సంస్కారములనుండి సముద్ధరించుటకై తమతమ శక్తులను దృఢసంకల్పబలముతో వినియోగించుచుండును. (ధర్మసముద్ధరణమునకై 'యపాంతరతముఁడు' అను మహర్షి యాత్మవిజ్ఞానముకలవాఁడై ముక్తావస్థయందున్న వాఁడు భగవన్నిదేశమున వ్యాసుఁడై జన్మించెనను విషయము శారీరకమీమాంసయందు యావదధికారాధికరణమున దెలుపఁబడినది. ఇది యిట అనుసంధేయము.)

---

## ఏడవ భాగము

### ఏ డు మ ఱుఁ గు ల తె ర.

సద్గురువు కవియు నైనవాఁడు కబీరు. ఈతఁడు రచించిన కబీరువాణియను కావ్యము భగవద్భక్తిని దేవమార్గమును మాయారూపమగు సృష్టిని చక్కగా నిర్వహించుటచే దానికొక వైశిష్ట్యము కలిగెను. ఆతఁడు సద్గురునగుటచే జిజ్ఞాసుపునకు సామాన్యమానవునకుగూడ నుపయోగించు విషయముల దెలిపెను. రూఢార్థముగల మాటలచే లక్షణార్థముగలమాటల

వలనను కబీరు బోధించిన యాధ్యాత్మికరహస్యములు సామాన్యుని ధీశక్తికి అందుబాటులో నున్నప్పటికిని యాధ్యాత్మికపథమున నున్నతస్థితులఁ బ్రకాశించు శక్తిని సంపాదించినవారికి మాత్రమే యీపలుకులలోని గంభీరమగు నాధ్యాత్మికత్వము బోధపడును.

క్రమశిక్షణమున యాధ్యాత్మికరహస్యజ్ఞానముపార్జనము చేయు యోగులుకొందఱు తాము సమాధ్యవస్థలోనున్నపుడు దమ భౌతికశరీరములనే యాధారము లేక గాలిలోనిలుచునట్లు తాత్కాలికముగా చేయగలరు. ఏవిధమగు స్థూలవస్తుసహాయములేకయే నీటిపై నడచువారును గాలిలో నెగురువారును యోగులలోఁ గొందరుందురు. ఇట్టి శక్తులుకల్గినవారు భగవత్కృపాపాత్రులని చెప్పుటకు వలనుపడదు. ఆధ్యాత్మికవిద్య యను తులయందు తూచినచో నీమహత్వములు తేలిపోవును. కావున వీనికేమియు విలువలేదు. ఇట్టిమహిమల ప్రకటించుట వలన యోగులగువారు సాధారణముగా నాధ్యాత్మికవిద్యయగు జ్ఞానసంపాదనమున ముందుగమింపనేరకపోవుటయేగాక తిరోగమనస్థితిని పొందుదురు. సత్యస్వరూపులగు సద్గురువు లిట్టిమహిమలను జూపువారి చర్యల ననుమతింపరు. ఈ రహస్యమును దెల్పు కథ యొకటి కలదు. 'హిందువుల గురువొకండు ఒకనది రేవుకడ నదిని అవలి కేవులకు దాటించు పడవకొఱకు వేచి యుండెను. ఒకయోగి యచటికివచ్చి తనయోగమహిమచే నీటిమీద నడిచి యీవలయొడ్డునకుఁ బోయి తిరిగి యచ్టే యీ గురువున్నచోటికివచ్చి 'ఇది యెంతసులభమైనపనియో చూచి

తిరా' యనెను. చిఱునగవుతో వానికా గురు విట్లు సమాధా
నముచెప్పెను, 'ఔను, యిది సులభమైనపనియే. నీవు చూపిన
యీ మహిమ పడవకేవు అణా కంటె తక్కువ విలువకలది.
దీనినిబట్టి నీచవాంఛలను నిరంతరమును స్వాధీనములో నుంచు
కొనుట స్వల్పకార్యముకాదని తెలియును. కోరికలన్నిటి నూర్ధ్వ
ముఖమునకుద్రిప్పి పవిత్రమైన యున్నతస్థితిలోనికి చెదరకుండ
తీసికొనిపోవుట ఘనమైనకార్యము. కాని యీకోరికలన్నిటిని
పరిపూర్ణముగా దగ్ధముచేసి నాశనముచేయుట ఘనమైనకార్య
ము. ఈకార్యమును నిర్వహించుటకు ముఖ్యముగాఁ గావల
సినవిభగవత్కృపానుగ్రహములు. ఇవి ప్రచ్ఛన్నమైనశక్తిస్వ
రూపములు. ఈశక్తిసంపాదనమున కాధారముభక్తియు, ప్రేమ
యు. వీని రెంటిలోఁ దనను దానాహుతిచేయునప్పుడు ధూమ
మను నార్భాటముండదు. కొన్నియెడల భగవద్భక్తియో, భగ
వత్ప్రేమయో బహిరంగముగా గోచరించినపుడు సాహసోపేత
ముగ చూపఱకు తోఁచుచుండును. తన మహిమలను బ్రక
టించు ప్రాగల్భ్యముకొఱకు యత్నముచేయుటమాత్రము భగ
వంతు నవమానించుటయేయని చెప్పవలెను. ఆసనశుద్ధిగఁ
గూర్చుండి భగవంతుని ధ్యానముచేయునపుడు తన తృప్తికైన
ను శరీరమును కదలింపఁగూడదని కబీరు చేయు నుపదేశము.
"స్థిరసుఖమాసనమ్" అని పాతంజలి యోగసూత్రము చెప్పుచు
న్నది. ఇచ్చట స్థిరశబ్దమునకునిశ్చలము అని యర్థము. ఈ అర్థ
మునే "ఆసీనః సంభవాత్" అని శారీరకమీమాంసాసూత్రము
ధ్యానరూపమగునుపాసనము అనఁగా సమానప్రత్యయాప్రవా

హాకరణముగావున నది శరీరచలనమున సంభవింపనేరదు. దీనికి హేతువు చలనము చిత్తవిక్షేపమునుజేయును, అని శంకరభగవత్పాదుల యభిప్రాయము. స్వప్నముతోఁ బోల్చినయెడల జాగ్రదవస్థయందలి భౌతికజీవితము వాస్తవమని చెప్పవలెను. అట్లే భగవన్మార్గవాస్తవికతతోఁబోల్చి చూచినప్పుడు ప్రపంచము దానికి సంబంధించిన జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందలి జీవితకలాపము సారములేని మాయారూపమగు స్వప్నముగా నెంచవలెను. ప్రపంచమును అందలి యనుభవములను యెట్లు మాయామాత్రములో సత్యానుభవమునకుఁ గొంపోవు నాధ్యాత్మికమార్గముగూడ మాయాసంకలితమే. ఇందు మొదటిది సత్యదూరమైన మాయ యనియు. రెండవది సత్యమైన మాయయనియు జెప్పవలెను. రెండింటికి నంతరము పెద్దదైనను భగవంతుఁ డొక్కఁడే పరమసత్యము.

జ్ఞానోదమగునప్పుడవిద్య నశించును. ఈ యవిద్యనే యజ్ఞానమందురు. జ్ఞానము కల్గినఁగాని యజ్ఞానమంతముగాదు. అజ్ఞానము నశించి జ్ఞానముకల్గుట యెప్పు డను ప్రశ్నమునకు సమాధానముగా 'నిలుచుండి పాడుచున్నాఁడు'అను వాక్యము నుదాహరించి నిలబడుటకుఁ పాడుటకు కాలభేధమెట్లులేదో యట్లే యవిద్యానాశనము విద్యోత్పత్తియని శ్రీశంకర భగవత్పాదులు శారీరకా మీమాంసాభాష్యమునఁజెప్పిరి. భగవంతుఁడొక వైపున తద్దర్శనమున తదైక్యముపొందుటకు శక్తిగల మానవుఁడు మరియొకవైపునసృష్టిలోనున్నారు. భగవత్సాక్షాత్కారము పొందువఱకును మానవునుండి సత్యము మఱుగు

పడియేయుండును. పైకిట్లు కాన్పించెడి యీయసంగతస్థితికి రెం డు కారణములు కలవు. సత్యమునుగూర్చిన మానవునియజ్ఞాన మొకటి. రెండవది సత్యము హేతువునకును (తర్క-బుద్ధికిని) కేవలము బుద్ధికి నతీతమైన స్థితిలో నుండుటచే మానవుఁడు భగవంతుఁడగుటయును,అట్లగుటకు శక్తిమంతుఁడగుటయును వాస్తవము. కారణమేమనఁగా దెలిసికొన్నను తెలిసికొనకపోయినను మనుష్యుఁడు భగవంతుఁడు. అజ్ఞానము యెంతకాలము వీని నావరించియుండునో యంతకాలము భేదబుద్ధికలవాఁడై మాయావశుఁడై యనంతమైన వస్తుజాలమునందేకత్వమును గనలేకుండును. విషయముల యానంత్యమునకును మేర లేదు. భగవజ్జ్ఞానోదయముతో నవిభాజ్యమైన భగవంతుని యేకత్వమనంతమైనదని తెలియును. మనకు స్థూలముగాగోచరించు జగత్తునందలి ద్వంద్వములయందుభాసించు మాయలో భగవంతునకు మానవునకుఁగల భేదభావమును సద్గురువు నడిమిభాగమున గల తెరయని చెప్పుచున్నారు. సద్గురువును మహాకవియునగు శ్రీహాఫీజు యిట్లుచెప్పెను.

"ఆత్మపరమాత్మ మధ్యమందంతరంబు
వేరొకఁడగ లేదు నమ్మమఫీజ; నీవు
నిత్యసత్యనిగప్పిన నివురటంచు
దెలియ కనువిచ్చి కొంతనైనొలఁగిసంత"

'ఈయవనికాసస్తకమును దొలగింపుము; భగవంతుఁడు నీకు గోచరించున'ని కబీరు చెప్పెను. స్త్రీలు వేసికొను మేలిముసుగు

జేయుట. మొదటిద్వారమగు నోటినుండి యిందుప్రవేశము కలుగును. సూక్ష్మప్రపంచమున ప్రథమభూమికయందు ప్రవేశించుటయే దీనిపరమావధి "ఆలామ్ యే మాలకుట్"

స్వప్నావస్థయందు మానవుఁడు సూక్ష్మశరీరమును సూక్ష్మచైతన్యమును గొంతవర కుపయోగించుకొనఁ గల్గుచున్నాఁడు. ఇట్లే యాతఁడు మొదటి భూమికలోఁ బ్రవేశించినప్పుడు సూక్ష్మశరీరము ననుసరించి సూక్ష్మవిజ్ఞానము కలవాఁడై సూక్ష్మప్రపంచానుభవమును బొందును.

అట్టియనుభవమును బొందిన యాతఁడు క్రమాభివృద్ధిజనకమగు మార్గమున ముందునకు సాగుచున్న యెడల సూక్ష్మలోకములో నాల్గవ భూమికకుఁబోఁగలఁడు. రెండు మూడు భూమికలను యవనికాసప్తకము నొక్కటే పర్యాయముజయించిన పద్ధతి నిదిదాటినట్లగును. మొదటిభూమికకూడనిట్లెజయింపఁబడినది. రెండు మూడుద్వారములగు నాసాపుటములరెంటి ననుసరించి మున్ముందునకు గడచి చనినపిదప సత్యమగు మాయానుభవము తీవ్రమగుచుండును. ఇదియే పైమార్గములోని యున్న తానుభవము. రెండవద్వారము దాటినపిదప సూక్ష్మప్రపంచాద్భుత విషయముల యనుభవములను జిజ్ఞాసువు కలవాఁడగును. ఆశ్చర్యజనకములగు నాయనుభవములలో స్థైర్యమును గోల్పోయి పతనమొందుట కవకాశము కలదు. మూఁడవద్వారము దాటినతరువాత కలుగు ననుభవములు నిగూఢములు విస్మయజనకములు. వానివలన మానవుఁడు నిశ్చేష్టితు-

డగును. బాహ్యప్రపంచమునందలి యనుభవములను వాస్తవములని నమ్మినట్లె తామున్న పరిసరములలో నాశ్చర్యానిమగ్నులైసూక్ష్మలోకమున నున్న వారు తామిస్త్రరి పరమాత్మనుదర్శించితిమను పొరపాటునకు లోనగుదురు. ఆభూమికకు సంబంధించిన మాయలోఁదగుల్కొని యదే తనలక్ష్యమని తలఁచెడు సాధకునకు సద్గురువు సాయపడవలయును. మనోవిజ్ఞానము గల జీవుఁ డీతనితో సదృశుఁడు కావున వానికిని సద్గురువు సాయపడవలయును. గురుకటాక్షమిట్టి చిక్కులోనున్న వానినిమున్ముందునకు నుత్తరోత్తరభూమికలోనికిఁ దీసికొనిపోఁగలదు.

సప్తయవనికాభేదనమే నాల్గవ విజయము. ఈవిజయమున నేకకాలముననే జీవుఁడు రెండేసి సిద్ధులనేడు తెఱఁగులఁ బొందఁగలడు (1) నాలుగైదిటుల ముడులువిడఁగొట్టబడును. (2) నాలుగైదిటుల తెరలుమాయమగును. (3) నాలుగైదిటుల మూలవాంఛలు నాశనమగును. (4) నాలుగైదిటులసాంద్రనైల్యమదృశ్యమగును. (5) తత్సంబంధమగు ప్రధానసంస్కారములారెండింటివి తుడిచివేయఁబడును. (6) నాలు గైదిటులమార్గమున కర్ణరంధ్రద్వయము లధిగమింపఁబడును. (7) తుదకారెంటివలన సూక్ష్మలోకమున నున్నతమైన నాల్గవ భూమికలోనికీసాధకుఁడు చేరును.

ఆధ్యాత్మిక వికాసమునను, శక్తి సంపాదనమునను ఇదివరకు చెప్పినట్లు నాల్గవభూమిక ప్రాధాన్యము వహించినది. ("అన్వార్-ఓ-తాజలియాత్" లేకసిద్ధులు) ఇంతదనుక చేరిన సాధకశ్రేష్ఠులు మృతులనుగూడ సజీవుల నొనర్పఁగలరు.

ఈశక్తుల దుర్వినియోగము చేయుటకై మనస్సుప్రేరణము చేయుచుండును. దానివలన ముప్పుతప్పదు. కన్నులకు మిరుమిట్లుగొలిపి గర్వితులనొనర్చునట్టి యిట్టియున్నతస్థితికి బోయినవారు సద్గురువుల తోడ్పాటులేనివారగుచో ఆస్థితిని నిగ్రహించుకొనలేరు. కొలదిమందికే ఈశక్తి కలుగును. వారినిగురించియే హాఫీజు యిట్లుచెప్పుచున్నాడు.

'స్వర్గదేహాలియందున్న సమయమందు
సరకుగొనబోకు మందలిసౌఖ్యదముల
సరకుచేసిన మెలకువ సడలిపడెదు
నాకముననుండి పాతాళలోకమునకు"

ఇట్టిసందర్భమున తానంతదనుక సముపార్జించిన యాధ్యాత్మికౌన్నత్యమును పూర్తిగాకోల్పోవుటయేగాక జీవుడు తాజేరిన స్థానమునుండి భ్రష్టుడై శిలారూపమగు స్థితికలవాడగును.

దారిచూపు గురుకరావలంబనము లేకుండ నాల్గవ భూమికయందు గమనించెడు ముముక్షువునకు గాఢాంధకారమున తెరువుతెలియక నడచెడు తెరువరిగతిపట్టును. ఉజ్జ్వలమై శక్తిమంతమైన నాల్గవభూమిక యందలి స్థితిని క్రైస్తవమతస్థులు వారియాధ్యాత్మికపరిభాషలో 'జీవతమోనైశస్థితి' యని యందురు.*

* మోక్షమార్గమున నాల్గవభూమికయందున్నవానికి సంక్రమించు శక్తులు దుష్పథములకు మరల్చినప్పుడాతని రాక్షసుడందురు. ఈభూమికయందేయున్న ప్రసిద్ధయోగియగు 'చాంగ్' దేవునకు సద్గురువగు శ్రీధ్యానేశ్వరుడు సకాలములో సాయపడకున్నయెడల పతనమునొందెడివాడు. ఈ

తమోవృతుఁడగు జీవుఁడు భ్రమ ప్రమాదముల నిగ్రహించినయెడల మనోలోకమగు నైదవభూమిక ప్రవేశింపఁగలఁడు. నాల్గవభూమికయందువలె యవనికాసప్తకము నొక్కసారే పర్యాయము భేదించెడు తుదిఘట్టమునకా జీవుఁడు చేరెనని చెప్పవలెను. ఇప్పటికి బంధములైన యేడును విడివడి వాంఛలు వర్ణములు, సంస్కారములు నశించి సప్తయవనికాత్మకావగుంఠనము పూర్తిగా తొలఁగిపోవును. నేత్రద్వయమను ఆఱు ఏడు ద్వారములదాఁటి తేటః ప్రేమపూర్ణమగు నైదవభూమికయం దాతఁడు ప్రవేశింపఁగలఁడు.

ఈ యైదవభూమికలోఁ బ్రవేశింపఁగల్గినవారు 'వాలి-అల్లా' అనఁబడు భగవంతుని మిత్రులు. వారి మనోనేత్రము పూర్తిగా వికసించియుండును. అవగుంఠనము లను యవనిక లేదును సమసిపోయినను దగ్ధపటన్యాయమున యవగుంఠన మింకనున్నటులేయుండును. అందుచే జిజ్ఞాసువు భగవదైక్యము నింకను పొందలేదు.

---

నాల్గవభూమికను బ్రవేశించిన 'బాబాఫరీత్ గంజిశేకర్' యెగురుచున్న పిట్టలనుబడఁగొట్టి వానిప్రాణముల హరించి తిరిగివానికి ప్రాణముపోసి తన శక్తులనుబరీక్షించుకొన ప్రారంభించెను. అత్తఱియైదవ భూమికయందున్న వృద్ధ నారియొకతె యట్టిశక్తి దుర్వినియోగమువలన కలుగుఫలములనుండి యాతని రక్షించెను ఈయనుభవముకలిగినపిదప 'ఫరీద్ బాబా' తనగురువుతో సన్నిహితసంబంధమును గలవాఁడై తద్గురుకటాక్షమున సద్గురుత్వమును తానుపొందగల్గెను. (Qutubiyat-or Perfect masterhood.)

అహంకార కలుషితములుకాని నిష్కళంకమైన ప్రేమ కారణముగా నైదవభూమికయందున్న ముముక్షుపుస్థితి సురక్షితము. దీనికి తిరోగమనస్థితి రాదు. తమ కేవిధమగు నపాయము లేకుండ యీ భూమికయందున్నవారు స్థూలసూక్ష్మ లోకములందున్నవారికి సంకల్పరూపమునగాని నిస్సంకల్పముగాగాని మిక్కిలి సాయముచేయఁగలరు. ఇట్టి సిద్ధసంకల్పులు సాయమునుచేయుదురు.

ఎక్కడో యొకానొక జీవునివిషయమునఁదప్ప తక్కిన జీవులవిషయమున నిటనుండి వారు తమంతతాము ముందునకు సాగుట యసంభవము. మిగిలిన యవగుంఠనమును గురువునను గ్రహమున సాహాయ్యమునఁ దొలఁగించుకొని యాఱవభూమిక యందు జీవుఁడు ప్రవేశింపఁగలఁడు. మనోలోకమున సత్యోన్నతమగు భూమిక యిది. దివ్యదృష్టి నిట జీవుఁడు పడయును. ఫాలభాగమార్గమున నీతఁడు దివ్యత్వమును బొందును. ఇచ్చట భగవంతుని సాక్షాత్కారము పరిపూర్ణముగా కలుగును. ఎల్లెడలను యెల్లవస్తువులును భగవన్మయములై వీనికిఁ గాన్పించును. దీనినే సాక్షాత్కారదృష్టియందురు. అనఁగా ప్రత్యక్షదర్శనము వలన నిట జీవునకు విశ్వాసము కలుగును.

స్థూలప్రపంచమునందున్నవారికి భగవంతునియందు విశ్వాసమే యాధారము. ఈ విశ్వాసము స్థిరమైనది కాకపోవచ్చును. ఇది యీక్రింద తెలుపఁబడిన విశ్వాసములవంటిది కాదు. మేధావి శేషమో, సహజజ్ఞానమోకలవాని విశ్వాసము, దర్శనమువలన కలిగిన విశ్వాసము, స్వానుభవమువలన కలిగిన

విశ్వాసము, అను ముక్తులగులకు భిన్నమైనది స్థూలపరిపూర్ణ సంస్థితుని విశ్వాసము.

ఉన్నతస్థితినంది యాఱవభూమికయందున్న జిజ్ఞాసువు కూడ ద్వంద్వములకుఁ గొంత లొంగినస్థితిలోనుండును. భగవంతున కెదురుగా దానున్నపుడును చూచువాఁడు, చూడఁబడువాఁడు, అనునగాధమగులోయ యిరువురను వేఱుచేయుచున్నది. సద్గురు కటాక్షమునగాని యీలోయను జీవుఁ డతిక్రమింపనేరఁడు. తనశక్తినలన మొదటిభూమికలనైదిఁటిని మానవుఁడు స్వతంత్రముగా దాటుటకు సాధ్యములైనవే. అయినను ఐదవ భూమికయందుండు ద్వైతజ్ఞానరూపమగు యవనికమాత్రము సద్గురుకటాక్షమున లభ్యమగు సాయమునఁదొలఁగింపఁబడును. ఆఱవభూమికయందుండు మాయనుండి యేడవభూమికలోఁ బ్రకాశించు సత్పదార్థానుభవమును దనంతట తాను మానవుఁడు పొందనేరఁడు. ఇచట నభయప్రదాతయగు సద్గురు కటాక్షమే యద్వైతసిద్ధి కాధారము.

అనంతమై, జ్ఞానానందశక్తులకు స్థానమైన యేడవభూమికలో జీవుఁడు వ్యక్తిత్వమును గోల్పోయి భగవంతునిలో లీనమగును. శాశ్వతమై త్రైకాలికాబాధ్యమైన పరిపూర్ణత్వము నాతఁడొందును. అప్పుడీభౌతికశరీరము నిలిచినను నిలువకున్న నొకటియే. స్థూలరూపమగు నీశరీరమను కవచము బ్రహ్మైక్యసిద్ధి స్థిరమైన కొలఁదికాలమునకు రాలిపోవును. కాని కొందరివిషయమునందీ శరీరము చాలకాలమువఱకు నిలిచి యుండును. భగవంతుని సాక్షాత్కారము పొందినవారు

'మజూబ్సు' (Majzoobs) అనియు బ్రహ్మీభూతులనియుఁ జెప్పఁబడుదురు.

సద్గురువు స్వయముగాఁజేయు సాయమువలననే సాక్షాత్కారమందినవారిలోఁ గొందఱు సాధారణమానవునిస్థితికి రాఁగలరు. అట్టివారు ఆత్మజ్ఞానముకలవారై స్థూలసూక్ష్మ మనోలోకముల విజ్ఞానమును తిరిగిపొందుచుందురు. అప్పుడిట్టిపురుషుల నవతారపురుషులని సద్గురువులని లేక 'కుతుబు' లని చెప్పుదురు.

తేజస్సుగలచోట నంధకారముండదు. ఇవిరెండును విరుద్ధస్వభావములుగలవి. జ్ఞానమున్నతఱి యజ్ఞానము నశించును. బ్రహ్మనుండి జీవుని వేరుపరచునట్టియు నగాధమైనట్టియు మాయాయవనికావగుంఠన మిదియే. జ్ఞానసూర్యుఁడగు సద్గురువు కనురెప్పపాటులో దానిన్నిగించినవానికి భగవత్సాక్షాత్కారస్థితిని బ్రసాదింపఁగలఁడు.

భగవంతుఁడొక్కఁడే సత్యము. ప్రేమస్వరూపుఁడగు నాదివ్యపురుషునియందు శాశ్వతముగా నున్నవారమే మనమందఱము.

---

# ఎనిమిదవ భాగము | పరాత్పరతరపరబ్రహ్మ.

(లోకాతీతము, అలోకమునగు దాని కవ్వల వెలిగెడు దైవము.)

ప్రథమస్పందనము — జీవపరిణామచక్రము.

---

## పరాత్పరతర పరబ్రహ్మ.

(లోకాతీతము, అలోకమునగు దానికవ్వల వెలిగెడు దైవము.)

ప్రథమ స్పందమునకు పరతరమైన స్థితియొకటి కలదు. ఇదియే పరాత్పరతరమగు పరబ్రహ్మ. భగవంతుని యస్తిత్వమును దెలుపునదియు నిదియే. ఇదిసర్వమునకు మూలము, సూఫీ యీస్థితిని 'వారా-ఉల్-వారా' అనిచెప్పెను.

భగవంతుని యస్తిత్వమును దెలుపు నీయనాదిస్థితియందంతము లేనట్టియు నిరన్వయమునగు శూన్యస్థితికలదు. "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది.

ఈ శూన్యమున భగవంతునకు చిదచిత్ స్థితులలో నన్యతరముగాని, భగవంతుని చిదచిత్ కళల యన్యతరముగాని భాసింపవు. అహమేవాహమనఁబడు ప్రత్యయగోచర మగునదియు, నహంతతోఁగూడినదియు, నగునదేదియు నందు లేదు. అం దనంతమనోవ్యాపకత కాని, సంకుచిత మనోవ్యాపకత

కాని లేదు. కారణ శరీరము నతిక్రమించిన మహాకారణ శరీర మనఁబడు సర్వవ్యాపకమైన శరీరముగాని, భౌతికశరీరముగాని యీయవ్యక్తశూన్యము నందులేదు. లోకాలోకములు నందు లేవు. చిత్స్పందనముగాని, యచిత్ప్రకాశముగాని యందు గోచరింపదు.

ఇది మూలమనియు, ననంతమనియు, నవ్యక్తమనియు భగవంతుని శూన్యస్థితియనియు వాకొనఁబడును. ఇట్లని నిర్గుణము నిరాకారమగు భగవంతుని స్వరూపమిది యనరాదు. సగుణ సాకారస్థితియు నిదికాదు. ఇదియే భగవంతుఁడుకలఁడు అని తెలుపు నస్తిత్వమును బోధచేయునదియై, చిత్ శూన్యమై స్థాణుస్థితిని దెల్పును.

భగవదస్తిత్వమును దెలుపునప్పటిస్థితిని సృష్టికిపరమైన దానికంటె పరతరమైన దానినిగాఁ జెప్పుదుము.

ఈ పరాత్పరతర భావమునే భగవంతుని యోగనిద్ర యని చెప్పుదురు.

ఈయస్తిత్వమనంతమగుటచే దిక్కాలముల కందనిదై సర్వత్ర వ్యాపించియున్నది.

ఈ సర్వము శూన్యగర్భితము. శూన్యమనఁబడు అభావము కొదవపడినచో సర్వశబ్దమునకు సర్వత్వము సిద్ధింప నేరదు.

ఈయభావరూపమగు శూన్యమున చేత్యమగు జిత్పదార్థము వ్యక్తముగా నుండును. శూన్యాంతర్గతమైన సమస్తము

నకు శూన్యస్వభావమే యుండును గావున చిత్పదార్థమును శూన్యమువలెనే యందుండును. దీనికి పరతరమైన భగవత్స్వరూపము స్వతస్సిద్ధముగా సర్వశబ్దవాచ్యము కావున భగవంతున కానంత్యముండును. సర్వము తానై తనయందు సర్వము నైనస్థితియే భగవంతునకు సహజము.

ఇట్టిస్థితిలో శూన్యము అణఁగియున్నప్పుడు దానిస్వభావముచే చిత్స్వరూపముగూడ శూన్యతనే భజించును. దీనికన్నలనున్న భగవంతుని స్థితియందు సర్వవ్యాపకత్వము మూలమున భగవానుఁ డనంతముగా నుండును. పరమాత్మయనఁబడు నీస్థితియందు సర్వమున తాను ప్రకాశించుటమాత్రమేగాక సర్వమును దనయందు నిముడ్చుకొనువాఁడై యనంత శక్తి జ్ఞానానంద సౌందర్యములు అవ్యక్తములై యుండును.

భగవంతుఁ డన్నిటియందు ననంతుఁడై ప్రకాశించుచున్నాఁడన్నచో నాయన్నిటికి వ్యతిరేకమైన శూన్యమునందు పరిమితముగా గోచరించును.

ఈ పరిమితమైన శూన్యరూపమగు నభావమావిర్భవించినప్పుడది యనంతముగా గోచరించును. ఇట్లు విస్తరించుట చూచినప్పుడు మన కది విరుద్ధముగాఁ దోచును.

ఈ పరిమితమైన యభావమునకు ననంతత్వమును గలిగించునది భగవంతునియం దిమిడియున్నట్టియు ననంతములునగు శక్తి జ్ఞానానందము లనఁబడు స్వభావము లివి పరాత్పర తరమగు పరబ్రహ్మ సహజస్వభావములుగా వ్యాప్తమైయుండును.

అనంతమును,సర్వవ్యాపకమును నగుదానియందు పరిమితముగా నిమిడియున్న శూన్యరూప మగు నభావముకూడ పరబ్రహ్మ యందు గోచరించు స్వభావత్రితయము నావరించియుండును.

"ఓంకారబిందువునావిర్భూతి"

ఇట్లు పరిమితమైన శూన్యము, భగవత్స్వభావములును, సర్వవ్యాపకములునైన వాని మూడిఁటి ప్రభావముచే క్రమ ముగా పరివ్యాప్తమై యనంతశూన్యమునుగా గ్రహింపఁదగు సృష్టిగా నావిర్భవించును. ఈ సృష్టియందలి మనకు మిథ్యా రూపమున గోచరించు, శూన్యమని తెలుపఁబడెడి యవ్యక్త రూపము భగవంతుని ఛాయ యని యందుము.

భగవంతుఁ డనంతుఁడగుటచే తచ్ఛాయయు ననంతము. సర్వవ్యాపకమైన భగవంతుని విభూతిలో నల్పాల్పబిందువునం దిమిడియున్న యీ మిథ్యాత్వమగు శూన్యత యావిర్భవించుట కారంభించును. అవ్యక్తమగు నీశూన్యస్థితినుండి యావిర్భవించు శూన్యము సూక్ష్మబిందుస్థానమునుండి వెలుపలకు వచ్చి వ్యాపించుచున్నది. ఆబిందుస్థానమునే సృష్టిస్థానమనియు, ఓం కారస్థానమనియుఁ జెప్పుదురు. దీనినిబట్టి సృష్టిస్పందనము బిందుస్థానమై పరబ్రహ్మయందే యున్నదని తెలియఁబడును.

అనంతమై సర్వవ్యాపకదశయందున్న పరిమితశూన్యాం తర్గత బిందుస్థానమునుండి సృష్టి ప్రారంభమై క్రమముగా పర బ్రహ్మపదార్థమునుగూడ నావరించుచున్నది. ఈసృష్టి సర్వము నందును వ్యాపించి యనంతమై పైనుదాహృతములైన భగవం

తుని స్వభావక్రియమునకు సన్నిహితముగాఁ గూర్పఁబడి యనంతముగా వ్యాప్తినొందును. అంత ననంతశూన్యముగా బ్రత్యక్షమగును. ఇదియే యనంతసృష్టియుననఁబడును. బ్రహ్మ కంఠమును భేదించుకొని మొట్టమొదట ఓంకారము, అథయను నదియు నుద్భవించెనని మన సంప్రదాయము.

"ఓంకారశ్చాథశబ్దశ్చద్వావేతౌ బ్రహ్మణఃపురా
కంఠంభిత్వావినిర్యాతౌ తస్మాన్మాంగలికావుభౌ."

లీల — (లహర్)

పరిమితమైనసృష్టియు నపరిమితమైనదానియం దిమిడియున్న సృష్టియు నవ్యక్తమును అనంతశూన్య రూపము కలదగుటకు హేతువునే మూలకారణమందుము.

ఈ మూలకారణము భగవంతుని లీల (లహర్) తప్ప మరేమియు కాదు. ఈ ప్రథమస్పందనరూపమగు లీలయే భగవంతుని ముఖమునుండి వెల్వడిన "నే నెవఁడను—కోఽహమ్" అను శబ్దము.

బ్రహ్మప్రేత్వముతో నొక్కటియగు ననంతత్వమువలన స్వతంత్రుఁడై బ్రహ్మ అనంతానందమున లీనమందుటకు తానీ యనంతమగు లీలనుబ్రకటించును. దీనినేస్వాత్మానందలయము నొందుట యని చెప్పుదురు. ఇదియే శతానందరూపమగు బ్రహ్మ పదార్థమని తైత్తరీయోపనిషత్తు చెప్పుచున్నది. లీలను ప్రకటించుటయే స్వాతంత్ర్యమునకు నిదర్శనము. స్వతంత్రుఁడే

లీలను బ్రకటింపఁగలుగుట హేతువుగా నీవిషయమును మనసుఁ గ్రహింపవలయును.

అనాదియందు ననంతమగు నీలీలయే శూన్యమునం దవ్యక్తమైయున్న దెల్లయు వ్యక్తమగుటకు హేతువగుచున్నది.

శూన్యగర్భితమైన దానిని వ్యక్తీకరింపఁ జేయుటకు ముందు భగవంతుఁడు తనలీలనుబ్రకటించును. ఈ లీలా ప్రక టనమునకుఁబూర్వము పరబ్రహ్మస్థితియందుండి యనంతమై స్వతంత్రమైన సర్వత్వమునందుగల శూన్యమున యీలీల యిమిడియున్నది.

అనంతమై యంతర్భూతమైన యీలీల భగవంతుని యందుండి పైకి ప్రకటితమై శూన్యమున శూన్యముగా నెట్లు ప్రత్యక్షమగుచున్నది ?

లీల లీలయే. స్వతస్సిద్ధముగా నేల ? యెట్లు? యేదిఁ యను ప్రశ్నములు దీనికి కలుగవు. అది యేక్షణమందైన నా విర్భవింపవచ్చును. అది యిప్పుడే జరుగవచ్చును; కొలఁది నెలలో జరుగవచ్చును; ఎన్నటికిని జరుగకపోవచ్చును.

అనంతమగు నాదిలీల లీలయే. ఆనంత్యమున ననుభావ్యుఁ డగు భగవంతుని విలాసము. అది భగవంతునియందు ప్రస్ఫు టము కాకపోవచ్చును; వేలకొలఁది సంవత్సరముల తరువాత నో, లక్షలకొలఁది కాలచక్రములు తిరిగినతరువాతనో, యా విర్భవింపవచ్చును. దీని కాశ్చర్యపడవలసిన దేదియులేదు.

స్వతంత్రుఁడు, నిత్యుఁడుఁ నైన భగవంతునియందలీలా విలాసము తనంతటతానే సహజాత్సంభవముగాఁ బ్రస్ఫుటించును. ఇట్లు ప్రస్ఫుటితమై బాహ్యముగాఁ గోచరించు విలాసమే యీ సమస్తసృష్టికిఁ బ్రారంభముగా నారంభమయ్యెను.

ఇట్లు భగవంతుఁడు తనవిలాస ప్రభావముతో నవతరించినప్పు డాయవతరణముతోఁగూడి యేకకాలముననే యానంత్యమున నిమిడియున్న శూన్యమును సభావముగా నవతరించును.

ఈక్రమమున భగవల్లీల మిథ్యయని తెలుపఁబడు శూన్యమును సృజించినదని గ్రహింపవలయును.

మేయమగు సర్వమునుండి యమేయమగు మిథ్యయెట్లు జనించినది యనువిషయమును మరల ఒక్కపర్యాయమిచట జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట యవసరము.

పరమాత్మ యనంతమగు సర్వము. దీనిని పారములేని పారావారముతోఁ బోల్చవచ్చును. పారావారమున ప్రతిజల బిందువు పరిమితమగు సర్వము. అపారమగు సముద్రమనంతమగు సర్వము. అనంతసముద్ర మనంతసర్వమైనపు డందులోని ప్రతిజలబిందువు పరిమిత సర్వమగును.

ఈ లీలావిలాస మనంతమగు సముద్రమును మథించి సృష్టిరూపమగు దాని నావిర్భవింపఁజేయక పూర్వము సర్వసృష్టికై బిందుస్థానమై ఓంకార మనంతమగు సర్వమందున్నది.

సృష్టిలీలా స్పందనము పరిస్ఫుటముకాక మునుపు యీయపార పారావారముపై శాంతము నిశ్చలమైయుండెను. అట్టియెడ నాయనంతజలమున బిందువులనుమాట లేదు. అంతయు నొక్కటియే. కావున భిన్నత్వమును లేదు. అప్పుడున్నది సమస్తము ననంతమునైన యపారమగు సముద్రమొక్కటియే.

లీలయనునది సమస్తమగు నానంత్యమును స్పందించు నట్లుచేయఁగా మొదట నోంకారము సృష్టి బిందువై బహు పరిమితమై సర్వముగా జనించినది.

అనంతమగు సర్వమున ననంతమగు శూన్యమిమిడి యుండెను. ఐనను యీశూన్యము లీలచే కదలింపఁబడినప్పుడు మితమైన సర్వమునుండి యమితమైన శూన్యమావిర్భవించి నది. అదియే యోంకారమను బిందువు.

అతిమితమైన సర్వమునుండి యనంతమైన శూన్యము క్రమముగా వెలికివచ్చినది. అదియంతములేనిదిగాఁ బెంపొందఁ జొచ్చెను.

లీనమైయున్న శూన్యముపైకుబికి శూన్యత్వముగా జనించు సమయముననే స్రష్టయగు బ్రహ్మ పరబ్రహ్మస్వరూపమున శూన్యముగా నిమిడియుండి సచేతనుఁడై యావిర్భవించును. ఇట్లావిర్భవించిన సచేతనమగు బ్రహ్మ క్రమముగా మూర్తిమంతమయ్యెను. సర్వమగు తననుండి శూన్యస్థితిని బయటికివచ్చిన సమస్తవస్తుచయముల యనుభవములను భగవంతుఁడు తాను సృష్టికర్తగా ననుభవించుచున్నాఁడు.

అప్పుడు క్రమముగా స్వస్వరూపజ్ఞానము కలవాఁడై భగవంతుఁడు సృష్టికర్తగా తననుభావించి పరిమేయమగు శూన్యమున ననంతస్థితియందు తగుభాగాని తన తత్త్వత్రయ మును విస్తరించి పోషించుచున్నాఁడు.

భగవంతుని యనంతస్థితి పైకి గోచరించెడు శూన్య సంబంధమగు ననంతత్వమునుండి తప్పించుకొన లేకుండును. శక్తిజ్ఞానానందముల యనంతత్వముల సంపర్కప్రభావముల చే నీశూన్యమును ననంతముగా విస్తరించుచుండును. ఇది స్వావిరుద్ధ పరిణామముగాఁ గాన్పించును.

భగవంతుఁడు తన పరబ్రహ్మస్థితియందు తనసత్యస్వ రూప విషయికమగు చిత్ జ్ఞానమును బూర్తిగాఁ బొందుటకే పైన తెలుపఁబడిన సంఘటన మవసరమైనది. ఈమార్గమున తన శక్తిజ్ఞానానందముల యానంత్యానుభవమును పరబ్రహ్మ కలవాఁడగుచున్నాఁడు.

పరిపూర్ణమగు చిత్స్వరూపానుభవ మొక్క పర్యా యము కల్గినను అది నశింపదు; శాశ్వతమైయుండును. ఈ చిత్స్వరూపజ్ఞానము మిథ్యాస్వరూపమగు శూన్యమునుండి వచ్చి నదా? సత్యమునుండి కల్గినదా? యను ప్రశ్న మిచ్చట పుట్ట నేరదు.

ఈచిత్స్వరూపజ్ఞానము భగవంతునకు నైజమగు సత్యా నుభవమును గలుగఁజేయును. ఈస్థితియందే చేతన్యుఁడగు జీవు

నకుఁ బరిపూర్ణత్వము సిద్ధించినది. ఇట్లైనను అసత్యమగు మిథ్యానుభవము కలిగినపిదపనే చిత్స్వరూపజ్ఞానసత్యము సాక్షాత్కరించును. ఈ చిత్ జ్ఞానము పరిణామమును బొందునప్పుడు అసత్యమే సత్యమని తోచుస్థితి తీవ్రమగును.

అట్టితటి భగవంతునకు నసత్యస్మృతితప్ప వేఱొండుండదు. దానినే సత్యముగా భగవంతుఁడును అనుభవించును. అనఁగా సృష్టికర్తయగు (హిరణ్యగర్భుఁడు) భగవంతుఁడు మాయారూపమగు శూన్యావిర్భావమును సత్యమని, సర్వమని తదేకీభావమున పొరపడినట్లు గోచరించును.

ఈస్థితిలో భగవంతుఁడు తన నిత్యసత్య స్వరూపానందమును బొందవలెనన్న సర్వమునం దిమిడియున్న చిత్కళను తనలోని కాకర్షించుకొనవలెను. (ఈ చిత్కళయే బహిర్గతమైనప్పుడు మాయారూపమున భగవంతుని యనంతస్థితి నావరించును.) దీనినే యంతర్ముఖముగా నాకర్షించినప్పుడు అది తన కేంద్రమగు సర్వమునందును అనంతస్థితియందు నిలుచును. (దీనినే 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞ' యనునది యుపనిషద్ధర్మమునుగాఁ బెద్దలు చెప్పుదురు.)

పైన చెప్పినట్లు బహిర్గతమైన చిత్కళ యంతర్ముఖమై పరిపూర్ణముగా నంతఃపరిణతినిబొందినప్పుడు మిథ్యారూపమునే సత్యమను ననుభవమునుగూర్చిన శూన్యత దనంతతానే సమసిపోవును. ఇట్లది సమసిపోగా దాని స్థానమున భగవంతుని నిత్య, సత్యానంతములు స్థిరపడును.

అనఁగా నిత్యసత్యరూపమును గ్రహింపవలసిన నూతన విజ్ఞానమనునది లేదు. సర్వమునందు నిమిడియున్న విజ్ఞానమే యిది. శూన్యమునుండి పైకివచ్చి శూన్యతతోఁ దనకుఁగల సంబంధమువలన శూన్యమునే సత్యముగా నింతవఱకు ననుభవించిన విజ్ఞానమే యిది. ఈ విజ్ఞానము పరిణమించి పరిపూర్ణమైనప్పుడు అసత్యమైన యభావానుభవము అనంతము సత్యముగ గోచరించును. అంతఃపరిణామమువలన నీ విజ్ఞానరూపమగు చిత్కళయే పూర్ణత్వమును బొందినప్పుడు అనంతము, సత్యము నగునది యొక్కటేయను ననుభవము కలుగును. ఇది భగవంతునకు స్వకీయమగు ననంత సత్యస్థిత్యనుభవమును గూర్చును.

ఆద్యమును, ఆనంత్యమునగు స్థితియందు భగవంతుఁడు సత్యజ్ఞానానందములను వాని ప్రభావముచే నిత్యమగు ననంతత్వమును బొందుచున్నాఁడు. కాని భగవంతుఁడు శాశ్వతమైన పరమాత్మ పరబ్రహ్మ. ఆదిస్థితికిని తరువాత భగవంతునికి సంక్రమించిన స్థితికి నీ భేదముకలదు. శూన్యతను ఆవిష్కరణము చేసినప్పుడు క్రమముగా సంప్రాప్తించు సంస్కారములవలన నీ భేదము కలుగుచున్నది.

పరబ్రహ్మస్థితి యందుండు భగవంతునకు తానునంతుఁడు నిత్యుఁడైనప్పటికి తన నిత్యానంతత్వముల జ్ఞానము లేకుండెను. అనంతమును, స్వీయమునగు చిద్విలాస ప్రభావము వలన భగవంతుఁడు తన యాథార్థ్యస్వరూపమగు చిదనంతుఁ

డగును. ఈ చిత్స్వరూపము తనసత్యజ్ఞానానందముల రూప. మును అనుభవించుటకుఁ దోడ్పడును.

నూతనముగా సంప్రాప్తించిన నిత్యచిత్స్వరూప స్థితి వలన తన పరబ్రహ్మస్థితి జ్ఞానము నిత్యముగా సృష్టికర్తయగు. హిరణ్యగర్భుఁడు పొందఁగలుగుచున్నాఁడు. ఈజ్ఞానము స్మరణ రూపమైనది. ఇదియే పరబ్రహ్మపదమును బొందుటకు లక్ష్య మైనది.

పైన తెల్పినట్లు భగవంతుని యాద్యస్థితి యనంతము. నిరాకారమునగు శూన్యము. ఇందు భగవంతుఁడున్నాఁడు.. కాని యిది చిద్రహితమైనస్థితి. దీనినే సృష్టిసంకల్పము నధిగ మించిన భగవంతుని గాఢసుషుప్తి.

ప్రప్రథమమున స్పందనరూపమైన చిల్లీలా విలాసము. కారణముగా భగవంతుని సుషుప్తిస్థితి భంగమయ్యెను. దాని వలన కలిగినఫలము సృష్టి. ఈసృష్టినే కార్యరూప పరిణామ మందురు.

ఈ సుషుప్త్యవస్థను గ్రహించుటకై మానవుని సుషుప్త్య వస్థతోఁబోల్చి మనము చూచుకొందము. మానవుని సుషు ప్తియు భగవంతుని సుషుప్తియు యథార్థమునకు భేదరహిత ములే. పరమాత్మయనియు, పరబ్రహ్మయనియు చెప్పఁబడు స్థితియందున్న భగవంతుఁడిట్టి గాఢసుషుప్తి నిమగ్నుఁడైయుం డును. కాని మానవస్థితిలోనున్న భగవంతుఁడు ప్రతిదినము సుషుప్త్యవస్థనుమాత్రమేకాక జాగరణావస్థ ననుభవించును.

రూపరహితుఁడు, సంస్కారరహితుఁడు, అనంతుఁడు. నిత్యుఁడునైన భగవంతుఁడు పరిమేయమగు సజీవ, నిర్జీవరూపానుభవములను బొందుచుండును. దీనికి హేతువు అభావమగు శూన్యముయొక్క పరిమితమగు సంస్కారము శూన్యముగా నావిర్భవించుటయే. దీనినే మాయాశబలితబ్రహ్మ మందుము.

చిత్స్వరూపము తత్తత్పరిణామదశ లందుచున్నప్పుడు కొన్నికొన్ని వేళల శూన్యసంస్కారములను మానవానుభవములను భగవంతునియందు సంక్రమింపఁజేయును.

పరిమితమైన చిత్స్వరూపమునుండి వెలువడు మయూఖరేఖలచే సంగృహీతమైన ప్రథమసంస్కారమును భగవంతుఁడు కలవాఁడగును. అనంతమగు లీలావిలాసము ప్రస్ఫుటమై తదంతర్గతమైన మిథ్యాత్వమునుండి శూన్యతను ఆవిష్కరించినపుడే పైన తెలుపఁబడిన పరిణామ ముత్పన్నమయ్యెను. ఈ లీలావిలాసమునకు కర్తృత్వము భగవదిచ్ఛయే.

ప్రథమమున పరిమితముగా బిందురూపమున స్పందించిన చిత్కళాపరిణామముతోఁ బాటుగా ననాదియు సాంతమునగు సంస్కారమును క్రమాభివృద్ధిని పొందఁజొచ్చినది. ఈ చిత్కళావిక్షేపశక్తిని సరోవరమధ్యపతితసూక్ష్మవస్తుస్పందనమున జనించు తరంగము క్రమాభివృద్ధిని తీరాంతము వ్యాపించుటతోఁ బోల్తురు.

ఈ పరిణామము వ్యాప్తినొందుకొలఁది నానాస్థూలరూపముల ద్వారమున నానావిధ సంస్కారానుభవములు కలుగు

చుండును. ఎందుచేతననఁగాఁ బుట్టుచున్న సంస్కారముల యనుభవములను చేత్యమైనచిత్కల తప్పకపొందుచుండును. కాని చిత్కలయే యీసంస్కారముల ననుభవించుటకు చిత్సంస్కారముల రెంటికి పరస్పరానుభవమునుగూర్చు మధ్యస్థప్రేరణ శక్తి యొకటియుండవలెను. పరిణామమున క్రమక్రమాభివృద్ధి నొందుజీవునకు స్థూలరూపముల యందభివృద్ధికలుగుకొలఁది యీచిత్సంపదయుఁ బరిణతిని బొందుచుండును.

భగవంతునియందు ప్రథమమున నుత్పన్నమైన యమేయమైన విలాసతరంగసంబంధమున బరిమితమగు మొదటి సంస్కారము అనంతమును, చిత్కలాప్రైన్యమును గోచరింపఁ జేయుశక్తియు, భగవంతుని పరిమితచేతను నొనర్చినది. క్రమముగా వివిధములగు సంస్కారములు బహిష్కృతములై భగవంతుని పరిమితమగు చేత్యస్వరూపమును బెంపొందింపఁజేయఁ జొచ్చెను. ఈసంస్కారములు చేత్యమగు విజ్ఞానమునావరించి వృద్ధియగుచు తుదకుభగవంతుని।మానవరూపముతో నేకీకరణ మొనర్చును. ఇదియే చిదనంతమగు భగవంతునియందుగల పరిణతి పరిపూర్ణదశకు వచ్చినదనుట.

ఇట్లు మానవశరీరమున భగవంతుఁడు జీవాత్మయై చిత్ జ్ఞానమున పరిపూర్ణదశకువచ్చుటచే నింతకంటె ఉన్నతోన్నతములైన శరీరముల యవసరము లేదయ్యెను.

చేత్యమగుజ్ఞానము పరిణతిగాంచుమార్గమున సజీవములు నిర్జీవములునగు నానాస్థూలరూపములతో భగవంతునికి

సంపర్కముకలుగుచుండును. ఐనను తనకుఁ దెలియకయే పరిమితమైన సూక్ష్మాకారమున మనోరూపమున భగవంతుఁడు యేకత్వమును బొందుచున్నాఁడు. సర్వమునం దిమిడియున్న శూన్యమగు మిథ్య ప్రారంభమున బహిర్వ్యాప్తమైనప్పటినుండియు చిద్దశాపరిణామమార్గమునందు పైనపేర్కొనబడినరూపములు భగవంతుని స్థూలరూపసంబంధము కలిగియేయుండెను.

చిత్స్వరూపజ్ఞానము వృద్ధిఁగాంచుకొలఁదిని సూక్ష్మమనోరూపముల పరిణామముకూడ కొనసాగుచుండును. ఇట్లు పరిమితములగు సూక్ష్మమనోరూపములు స్థూలమగుమానవరూపమున వృద్ధిపొందుచుండును.

మానవరూపమున భగవంతుఁడు పరిపూర్ణముగా చిత్స్వరూపజ్ఞానముకలవాఁడైనప్పటికి పరిమితమగు సూక్ష్మమనోరూపములుకూడ మానవరూపమున పరిపూర్ణముగా వృద్ధిపొందినప్పటికిని అందుప్రకాశించు చిత్స్వరూపము జీవసంబంధమున స్థూలమైనదగుటచే నదిస్థూలప్రపంచానుభవమునుమాత్రము కలుగఁజేయును. అందుచే నిట్టిజీవునకు సూక్ష్మమనోరూపములస్మృతియు తల్లోకముల ప్రత్యక్షానుభవము అనునవి రెండు నుండవు.

మానవశరీరమున భగవంతుఁడు పరిపూర్ణముగా చిత్జ్ఞానము కలవాఁడైనప్పటికి సూక్ష్మశరీరసంబంధమగు తన పరిమితశక్తినిగూర్చికాని, మనోమయశరీరమునకు సంబంధించిన తన పరిమితమనస్సునుగూర్చికాని జీవదశయందున్న భగవంతుని

కింకను స్మృతి కలుగలేదు. నే ననంతశక్తిజ్ఞానసంపన్నుఁడను. నేనే భగవంతుఁడను అను యెఱుకకూడ నీదశయందున్న జీవునకు లేదు. స్థూలశరీరసంబంధములగు పాంచభౌతికవిజ్ఞానమునకు తనకభేదము నీస్థితియందు పాటించును. స్త్రీపుంసాత్మక సాధారణవ్యక్తివలె స్థూలప్రపంచానుభవములును భగవంతున కీదశయందుండును.

దేహమగు స్థూలరూపమును, మనోరూపమును, ప్రాణమయవిజ్ఞానమయరూపములును, అనువాని యనుభవములను పరబ్రహ్మయం దిమిడియున్న యమేయశూన్యమునుండి యావిర్భవించిన ప్రమేయశూన్యమునుండి బయలుదేరి జీవునకుఁ గలిగించుచున్నది.

అనఁగాఁ బరిమితశరీర మనః ప్రాణశక్తులు శూన్యమునుండి బయలుదేరినవనియు, వీనికి సంబంధించిన విజ్ఞానము కూడ శూన్యసంబంధమైనదేయనియుఁ దెలియవలయును.

మనస్సు భావములకు, వాంఛలకు స్థానము. ప్రాణశక్తి బలము, వీర్యస్థానము. శరీరము సుఖదుఃఖముల కాశ్రయము. భావములు, వాంఛలు, బలము, వీర్యము, సుఖము, దుఃఖము అనునవి మానవునియందు పరిమితములైయున్న మనోమయ, ప్రాణమయ, అన్నమయకోశముల లక్షణములు. మనఃప్రాణశరీరసంబంధమగు త్రిగుణములును పరిమితమగుస్థితిలోనున్నను పరిమితశూన్యమునుండి యవి పుట్టినవి కావున వానిశక్తులను మిక్కిలిగాఁ బ్రసరింపఁజేయును.

మానవప్రకృతికి ప్రారంభలక్షణములు ప్రాణమనో బౌతికరూపములే. ఇవి యానందమును సూచించునవి. ఈ మూఁడిటికిని భగవంతునియందుగల మూఁడు విధములగు ననంతశక్తి జ్ఞానానందములతో సంబంధముకలదు. దీనినే సచ్చిదానంద మందుము.

పరిమితమగు శూన్యమునుండి క్రమముగా పరిమితమగు భగవంతుని త్రిగుణాత్మకమైనస్థితి యిట్లావిర్భవించినప్పుడును, పరిమితమగు శూన్యమనంతశూన్యముగాఁ గన్పడినప్పుడును, మాయగా గోచరించు శూన్యత్వమున నీపరిణామము లగ్నమైయుండి పరిమితమైన మూఁడు లక్షణములుగా మానవుని యందు ప్రత్యక్షమగుచుండెను. వీనిశక్తి యనంతముగా వృద్ధిపొందు లక్షణము కలదు.

మనఃప్రాణశరీరములు మూఁడును తమతమ శక్తిబాహుళ్యమును భ్రమకొల్పుచు నెట్లుప్రకటించునో చూతము. వాని యనుభవము లీక్రిందివిధమున కలుగుచున్నవి. (1) నూతన విషయ సృష్టిచేయఁగల విజ్ఞానశాస్త్రజ్ఞుని మనస్సు బహు విషయములను కనుగొనుచున్నది, (2) భ్రమయను చక్రగతమైన యణుశక్తి యావిర్భవించి యది యేశూన్యము నుండి బయలుదేరినదో దానినే నాశనముచేయఁగల భీషణ శక్తిని బ్రదర్శించుచున్నది. (3) ఐహికసుఖమున కాలవాలమైన శరీరము శూన్యతాభివృద్ధితోపాటు సుఖాభివృద్ధిని యనుభవించవలెనను వాంఛ కలదియగును. ఈ మాయాజీవితమునకు సుఖమును బడయుటయే ప్రాతిపదికమగును.

భ్రమస్వరూపమగు నీశూన్యత యిట్లువిస్తరించుటకు కారణమేమనఁగా సర్వస్వరూపమైన దానియందలి యనంత శక్తిజ్ఞానానందములనెడు భగవల్లక్షణములను పరిమితమగు ప్రాణ మనోభౌతికశరీరములను నాహావించుటయేకాని మఱొండు కాదు.

అనంతశక్తికి పరిమితిలేదు. దానికి తఱుగువిఱుగులు లేవు. కాని పరిమితమగుశక్తి యనంతశక్తితో సంబంధమున్నను అది నశించుటకు కారణమేమనఁగా శూన్యములోని పరిమితమనస్సునుండి శూన్యముగా నావిర్భవించుటయే.

అనంతజ్ఞానము శాశ్వతము, సమగ్రము, సర్వవ్యాపకము. దానికి తెంపుగాని తుదిగాని లేదు. పరిమితమైనమనస్సు అనంత జ్ఞానముతో సంబంధము కలిగినదైనను క్రమముగా నాశనము పొందుచున్నది. శూన్యమై పరిమితమైనమనస్సునుండి బయల్వెడలిన శూన్యమునుండి యీపరిమితమనస్సు పుట్టుటయే దీనికి కారణము.

అసీమానందము, నిత్యము, నిరాటంకము. అది నిత్యమగుటచే దానికి విరుద్ధస్థితి లేదు. లౌకికసుఖము అఖండానందముతో సంబంధముకలిగినప్పటికిని నిత్యముకాదు. అందుచే దానిలో వ్యతిరేకస్థితియగు దుఃఖస్థితికూడకలదు. ఈపరిమిత సుఖము మానవునకు ప్రాతిపదికమేయైనను నాశనముకలది. దీనికి హేతువు జీవితముయొక్క యశాశ్వతత్వము. శూన్యజీవితమునుండిజనించిన శూన్యమునబుట్టినది యీజీవితమగుటవలన దీనికి నాశనముతప్పదు.

భగవత్సాక్షాత్కారమునకై చేయుయత్నమున త్రిగుణాత్మకమైన మనఃప్రాణస్థూలశరీరలక్షణములను గోల్పోవుస్థితి వచ్చును. పిదప ప్రధానమగు సచ్చిదానందముల జీవుఁడనుభవించును. అప్పుడు తననిజస్థితి స్థూలశరీరముకాదనియు, శాశ్వతానందమనియు, పరిమితప్రాణశక్తికాదనియు, మూలశక్తియనియు, పరిమితమనోవిజ్ఞానముకాదనియు, అనంతజ్ఞానమనియు జీవుఁడు తెలిసికొనును. ఇట్టి ఎఱుక కలిగినపిదప పరిమితమగు ఉపాధిత్రయమును విడనాడి ప్రధానమగు భగవంతునిరూపమై శాశ్వతమగు సచ్చిదానందస్థితిని పొందును. ఇంతకుఁ బూర్వముగలసంబంధము యీస్థితికి చేరునప్పటికి పరిమితోపాధులతోడి సంబంధము జీవునకు విచ్ఛిన్నమగును.

ఈస్థితియందు మానవుఁడు చేత్యసంపదను కలవాఁడయ్యు నసత్యమును, పరిమితమునైన శూన్యతనే సత్యముగను అనంతముగను భావించి తదనుభవములఁ బొందఁడు. ఐహికసుఖప్రధానమైన శరీరము, ప్రాణశక్తి, మనస్సు శూన్యతానుభవములకు కారణభూతములైనను పరిమితసంస్కారములతో మానవుని చిద్విజ్ఞానమును బంధింపవు. వీనిసంబంధము భేదింపఁబడుటచే చేత్యదృష్టినుండి యివిదూరములైనవి. స్వభావముచేనివి పరిమితమగు శూన్యసంబంధముకలవి కావున వెంటనే యదృశ్యములైనవి.

శరీరము, ప్రాణశక్తి, మనస్సు మనుష్యుని చిత్ జ్ఞానముపై తమప్రభావమును గోల్పోవుటకుఁ బూర్వము దైనందిన

జీవితములో నొకయనుభవము మానవునకుఁ గలుగుచుండును. అది ప్రతిదినము నిద్రపోవుట, మెలఁకువఁగాంచుట యనునవి.

ఈ ప్రధానమగు అనుభవము దైనికజీవితములో మానవునకు మూఁడుస్థితుల కారణమగుచున్నది.

మొదటిస్థితి :—గాఢసుషుప్త్యవస్థ. ఇదియే మానవుని లోని యాత్మకుఁ బూర్తియగు నిశ్చైతన్యస్థితి.

రెండవస్థితి :—స్వప్నావస్థ. ఇది జాగ్రదవస్థతోఁ గూడి యుండును.

మూఁడవస్థితి:—పరిపూర్ణజాగ్రదవస్థ. మానవునియందు జీవస్వరూపముగా నాత్మకుఁగల విజ్ఞానస్థితి యిది.

మానవునకు తనయందు సంచరించు ప్రాణవాయువుల ప్రజ్ఞానము కలదు. అది మానవునకు నాతఁడు చేయు పనుల వలన ద్యోతకమగుచున్నది. సంస్కారములవలన కర్మములు పుట్టును. కర్మములవలన సంస్కారము లుత్పన్నమగుచున్నవి. సంస్కారములు కర్మములచే మనస్సునందు సంకలనము పొందు చున్నవి. ఈ రెండును అన్యోన్యాశ్రయములు, అన్యోన్యాధార ములు. కర్మములవలన సంస్కారములు వృద్ధిపొందును. సంస్కా రములనుండి కర్మములు ప్రేరణము చేయఁబడును.

పైన తెలిపినట్లు సంస్కారముల జన్మము సర్వమునం దిమిడియున్న శూన్యమునం దంతర్గతమైయున్నది. దీనినే పరబ్రహ్మస్వరూపమునందలి భగవంతుని స్థితియని చెప్పు దుము. శూన్యము సృష్టిస్వభావము ననుసరించి శూన్యముగా

నావిర్భవించి నప్పుడు శూన్యాదిస్వరూపము భగవంతుని యందలి చిత్కళాస్పందనమునను ప్రథమాంశముగా జనించినది. అదియే శూన్యత్వప్రథమ సంస్కారము. ఈ చిత్కళాస్పందనము ప్రవృద్ధమగుకొలఁది ప్రథమసంస్కారము వివిధ సంస్కారములుగా నుత్పన్నమగుటకుఁ గారణమైనది.

అందుచే సంస్కారము లన్నియు మిథ్యారూపములు. శూన్యమనఁబడు మిథ్యకంటె వేఱుకాదు. కాని శూన్యములగు నీసంస్కారముల ద్వారమున మనుష్యుని యందలి చిత్స్వరూపమగు ప్రజ్ఞానము పూర్ణత్వమొందుటచే నీసంస్కారములతో సంబంధముగల యీప్రజ్ఞానము, యీశూన్యమే వాస్తవము సర్వము అను ననుభవము మానవునకుఁ గలుగునట్లు చేయును.

ఇట్టి సంస్కారములు పూర్తిగా నశించువఱకును మనుష్యుని జీవితమునందలి ప్రధానములై గోచరించును. వీని నాశనముతో నసత్యమై శూన్యసంబంధములగు ననుభవమునుండి చిద్విజ్ఞానము ముక్తిని పొందును. ఇట్లు సంస్కారములనుండి ముక్తి పొందినప్పుడు అసత్యమగు శూన్యమును సత్యముగా భావించు ననుభవముఁ గూడ నశించును. అప్పుడు సత్యము అనంతమగు నాత్మయనియు, భగవంతుఁడనియు ననుభవము కలుగును.

సంస్కారములు మనుష్యుని ప్రజ్ఞానముపై తమ ప్రభావమును జూపు నంతకాలము ప్రాణశక్తి ప్రోత్సాహమున

మనస్సును లోఁగదీసికొని యాంతరస్మృతియం దీసంస్కారములు స్థావరమేర్పఱచు కొనుచున్నవి.

ఈ సంస్కారములు మానవుని యంతస్స్మృతియందు వానివాని విజ్ఞానవికాసమునుబట్టి కొన్నిగంటలో, దినములో, సంవత్సరములో,యావజ్జన్మములో స్థిరముగా నిలిచియుండును. ఇవియే స్వప్నజాగ్రదవస్థలయందు నంతస్స్మృతిమార్గమున బ్రస్ఫుటించుచుండును.

ఈసంస్కారములు పూర్తిగా నిద్రాణమైయున్నప్పుడు దానిని సుషుప్త్యవస్థ యందుము. ఇవి పైకిపుట్టినప్పుడు ప్రథమావస్థలలో ననిశ్చలములుగానుండును. దీనికి కారణము శూన్యతలోనుండి సూక్ష్మాతిసూక్ష్మరూపములలో నివి బయలుదేరుటయే. ఆసమయమున మానవుఁడు అర్ధస్మృతిలోనుండి యంతస్స్మృతిజన్యములగు స్వప్నములయనుభవములను బొందుచున్నాఁడు. ఈచంచలరూపములోని సంస్కారములు పరిపక్వమైనప్పుడు నిర్దుష్టమైన స్థూలరూపముగా ననుభవములోనికి వచ్చును. ఇవియే ప్రథమశూన్యదశలోని సూక్ష్మరూపములు. ఈయనుభవము కలిగినప్పుడు మానవుఁడు స్థూలప్రపంచానుభవమును జీవస్వరూపమున జాగ్రదవస్థయందుండి యనుభవించును.

తెలివిగలిగి లేచి జాగ్రదవస్థలోనున్నప్పు డాతఁ డనుభవించునవియు శూన్యగర్భస్థములగు సంస్కారములు. స్వప్నదశయం దాతఁడనుభవించుసంస్కారములే మరింతశక్తికలవియై

యాథార్థములుగాఁ బైకినావిర్భవించును. అనఁగా స్వప్నమే యుచ్ఛస్థితియందున్నప్పుడు మానవుఁడు జాగ్రదవస్థలోనున్నాఁడని చెప్పవచ్చును. కావున మానవుని జాగ్రిదవస్థ యస్పష్టమైన స్వప్నావస్థానుభవమే. కాని యిప్పుడు మరింత ప్రిస్ఫుటముగాను స్పష్టముగాను అనుభవములోనికి వచ్చును.

నిద్రాక్షీణమైన స్వీయసంస్కారముల ప్రిస్ఫుట నాటకమే స్వప్నము. ఈ సంస్కారములు అంతస్స్మృతిచే వెలుపలకు వచ్చినప్పుడు స్వప్నమునందలి వస్తుజాతము పాత్రిలుగా సూక్ష్మాతి సూక్ష్మరూపములలో సృష్టింపఁబడును.

స్వప్నావస్థయందున్నవాఁడు తనకుఁ గలుగు స్వప్నమున నాతఁడు ఏకమైపోవును. ఆస్వప్నమును సృష్టించువాఁడును అతఁడేయగును. ఈసృజనము ఒక నాటకమువంటిది. ఈ నాటకమున సృష్టికర్తయగు నాతఁడును పాత్రిధారిగనే యుండును. ఈ స్వప్ననాటకమున కథావస్తువుతోడను, అందలి వ్యక్తులతోడను తాను సూక్ష్మస్థితియందుండి సంపర్కముకలవాఁడై మెలఁగును. ఈ స్థితియందు కథావస్తువు, వ్యక్తులు, సమస్తము స్వప్నమనుభవించువాని సృజనమే. మరి యివియన్నియు సూక్ష్మస్థితిలోనున్న వేకాని వ్యవహార సిద్ధములుగావు. ఈయవస్థ మానవుని భూతాద్యతన జీవితములకు సంబంధించిన సంస్కారముల ఫలము. ఇట్లొకజీవుఁడు స్వప్నావస్థయందు నంతస్స్మృతిలో సూక్ష్మస్థితియందుండెడు రూపములతోడి సంయోగము కలవాఁడగుచున్నాఁడు.

జాగ్రదవస్థలో వీనికి స్వప్నగతవిషయములు జ్ఞప్తికి రాగా వానిని స్థూలరూపములందలి వస్తువులుగను, జీవములుగను, తనకు సంబంధముగల విషయములతోఁ గూర్చి కొనును. ఈవిషయములును అప్పుడు జ్ఞప్తికి వచ్చును. అధికజ్ఞాన సంపన్నునకు భూతకాలమునందును దైనందిన చర్యలో తనకు సంబంధముగల వస్తుచయము స్వప్నానుభవమున జ్ఞప్తికి వచ్చును.

ప్రజ్ఞావంతునకు తాను గాంచవలెనని యత్నించునదైనను, తనకు సన్నిహితత్వముగల వస్తువైనను, తాను స్వప్నమునం దనుభవించినదని జ్ఞానము కలుగవచ్చును.

ఒకప్పుడు పూర్వముగనిన స్వప్నమునందు గోచరించిన వస్తువును భావికాలమున స్థూలరూపమున తన జీవితాంశములో గోచరించునదియై వర్తమానమునఁ గాన్పింపవచ్చును.

కొంతకాలము గడచిన తరువాత నావస్తువే తన జీవితములోఁ జూచిన స్మృతియేమియు లేనప్పటికి ప్రస్తుత జాగ్రదవస్థలో నెన్నఁడో కలలోఁజూచిన రూపముగానే మరలఁ గాన్పించును.

కొన్ని సంవత్సరములకుఁ బూర్వమే స్వప్నమున యనుభవించిన విషయములు ఒక్కొక్కప్పుడు యథార్థములై యనుభవమునకు వచ్చుట యందందు కానవచ్చుచున్నది.

భూతకాలములోని యంశములు ప్రస్తుతకాలమున జరిగినసంస్కారములనుండి స్వప్నరూపమున నుత్పన్నమగు

నప్పుడు భవిష్యత్కాలమున జరుగనున్న విషయములను మానవుఁడు కలలోఁగనుట యెట్లు సంభవించు నని యిచ్చట సందేహము కలుగవచ్చును.

రాఁబోవు విషయములను ప్రస్తుతము కలలోఁగనుట నిజముగా సాధ్యమగునా! భావికాలమున జరుగఁబోవు సంఘటనలను ముందుగా నిర్ణయింపవచ్చునా! యనునది ప్రశ్నము. కలలోఁగాంచియు, భావికాలమున యెప్పుడో జాగ్రదవస్థలో తన యనుభవమునకు వచ్చు విషయమును గూర్చి మూఢుఁడై యీ మధ్యకాలమున నుండుట కవకాశము కలదాయనియు సందేహము.

ఇట్టి సందేహముతోఁ గూడిన ప్రశ్నముల కవకాశమున్నను అప్రయత్నముగా భవిష్యత్తునుగూర్చి కలలో కొంత గ్రహింపగలిగినను మానవున కాభవిష్యత్తు ఈ వర్తమాన స్థితిలో నెట్లు సిద్ధమగుచున్నది అని మఱియొక ప్రశ్నము కూడ పైనివాని ననుసరించి కలుగును.

ఇంకను కలలోనైనను గడచిన సంస్కారముల మార్గమున వర్తమానమున నివశించు మానవుఁడు భవిష్యత్తుతో నెట్లు సంపర్కమును బొందుచున్నాఁడనియు, భావిని జరుగనున్న విషయములకు మానవుని సంస్కారములతో ముస్ముందుగా నెట్లు సంయోగము కలుగుననియు, అనాగత విషయ జ్ఞానము మానవునకు దేనివలన లభ్యమగుచున్నదనియు సందేహపరంపర ఒకదానివెనుక నింకొకటి కలుగవచ్చును.

భావినిజరుగనున్న విషయములతోఁ, వస్తువులతోఁ దనకుఁగల సంబంధము వర్తమానదశలో మానవునకు తనకుఁ దెలియకయే యనుభవద్యోతకము లగుచుండుటకు కారణము తన స్వప్నస్థితిలో ప్రచలితమైన నాటకమునకుఁ దానే కర్త యగుట.

నిద్రాక్షీణమైన తన సంస్కారముల ద్వారమున కలలోని నాటకమునకు సృష్టికర్తయైనప్పుడు తన పూర్వసంస్కారములు పైకి విజృంభించినప్పు డవి వర్తమాన స్థితిని కలవివలె తోఁచును. ఈనాటకమున మునిఁగియున్న మానవుఁడు తన పూర్వస్థితిలో మునిఁగియుండును. దానినే వర్తమాన స్థితియని తలంచు చుండును.

భూత పూర్వములగు సంస్కారముల నిమగ్నుఁడై యుండియు ఎఱుకలేమిచే వర్తమానమనెడు భావమునందు మానవుఁ డుండును. తన పూర్వసంస్కారముల రక్షించు కొనుచు వచ్చినను తాను స్వప్నమందనుభవించిన వస్తుచయముల సంపర్కములను స్వప్నములద్వారముననే యనుభవించు చుండును. ఈసంబంధము లప్రయత్నసిద్ధములైనను అవస్థా రూపనాటకము పరిపూర్ణముగా సురక్షితమై నడచున ట్లవి చేయును. స్వప్నమును సృజించు కర్తయే దానికి రక్షకుఁడును.

వర్తమానదశయందు కడచిన దానిని యెట్లు పోషించుకొని మున్ముందునకు సాగుచున్నాఁడో మానవుఁడు తనకు తెలియకుండగనే వర్తమాన దశయందు భవిష్యత్తును సంర

క్షించుకొనుచున్నాఁడు. వర్తమానము భూతమునకు భవిష్య త్తైనట్లు, భవిష్యత్తున కది భూతమగును.

నేడు నిన్నటికి భావికాలము. అదే రేపటికి భూతకాలము. నేటితో సజీవుఁడైన మానవుఁడు నిన్న రేపు అనురెంటిని పోషించుచున్నాఁడు.

భూతభవిష్యత్కాలములకు ప్రత్యేకము మూలమున్నప్పటికి నవి ఒక్కపర్యాయమే వర్తమానమున పరిరక్షితము లగుచున్నవి. కావున వర్తమానమున భూతభవిష్యత్తులు శాశ్వతముగా లీనమైయున్నవి. సృష్టికిగల శాశ్వతత్వమున కాల మనునది లేదు.* గతము లేదు. అనాగతము లేదు. వర్తమానము మాత్రమే కలదు. అనంతకాలమున జరిగిన దేదియు లేదు; జరుగబోవునదియు లేదు. అంతము లేని అద్యతనముననే యెల్ల విషయములు జరుగుచున్నవి. జరుగుట యనున దంగీకరింపవలసి

---

* స్థూలసూక్ష్మకారణలోకములు ఊహాప్రపంచములు మాత్రమే. అందుచే కాలము, తలము (ఆకాశము) కూడ నూహాజనితములే. కాలమునకు స్వాతంత్ర్యముగాని ప్రత్యేక పరిమాణముగాని లేదు. ఈ మూఁడులోకములలో నన్యోన్యసంబంధము లేని యనుబంధరూపమైన విలువమాత్రము కలదు. స్థూల ప్రపంచమందలి కాలమునకు మిగిలిన లోకములలోని సంబంధము లేదు. ఇట్లే సూక్ష్మకారణప్రపంచముల కాలమునకు మిగిలిన లోకముల కాలమునకు సంబంధము లేదు. కలయనునది యవయవసూక్ష్మాంశముల ద్వారమున స్థూలవిషయముల యనుభవము, దీర్ఘమును, క్లేశజనకము నగుకలయెంత తక్కువ కాలములో జరుగునో మనకు తెలియదు. ఈ కాలవిలక్షణమున గడియారమను కాలమానముతోఁ దెలుపఁబడునది.

వచ్చినచో అదియే వర్తమానము. ఎందుచేతననఁగా మనదృష్టికిఁ జరిగినట్లు కానఁబడునదంతయు, నిప్పుడేజరుగుచున్నట్లు కనఁబడు నదియు, నింకముందు మాయావృతమైన జగత్తులో జరుగఁ బోవునదియు భగవంతుఁడాదిని నేనవఁడ నను ప్రశ్నతోఁదన చిద్విలాసమును స్ఫుటీకరించి ప్రథమ స్వప్నమును గాంచి నప్పుడే ప్రారంభమైనది. వాస్తవముగా నేమియు జరుగలేదు జరుగఁబోదు.

కావున మానవుఁడు స్వప్నస్థితియందు భూతవర్తమాన భవిష్యత్తురూపములతో సంబంధముకలవాఁడయ్యేనేని, యట్టి సంబంధమును దానే సృజించి, పోషించి నాశనముచేయుచుం డును. కాని ప్రస్తుతమగుదశయందును, స్వప్నదశయందును సాక్షీభూతుఁడైజీవుఁడు వానిని జూచుచుండును.

ఇట్లు ప్రారంభమైన సృష్టిమీద జీవసృష్టియై యది సుర క్షితమగుచున్నది. స్వప్న జాగ్రదవస్థల యందేని, వర్తమాన భవిష్యత్తు లందేమి యేవేవి సృష్టింపబడుచున్నవో అవస్తువు లన్నియు దమవినాశనమునకు సంబంధించిన లక్షణమును గలిగి యుండును.

ఉత్పన్నమైనది అంతవంతము. దాని నెంత రక్షించి నను అది నాశన మందకతప్పదు. తద్రక్షణవ్యగ్రుఁడైన మాన వుఁడు తనకుఁ గడచినకాలములో సృజింపఁబడిన ప్రతివస్తువును తాను వర్తమానమున రక్షించుచుండును. భావికాలమున తాను రక్షించుదానికి నాశముకలుగునని యెఱిఁగియు దానిని

రక్షించుచుండును. తనకీయెఱుక కలదను విషయమును మానవుని స్మృతియందుండదు. కావున తద్రిక్షణయత్నమే తన్నాశనమును గూర్చిన యాలోచనమూ యనునట్లు మానవునిదశ యీ స్థితియం దుండును. ఇది భావిజ్ఞానస్మృతిలేమి వలన కలుగుచున్నది.

సృష్టికర్తకును కర్తృత్వముతోపాటు రక్షకత్వము పై విధమునసే కలుగును. ఇట్లు రక్షకుఁడయ్యు రక్షితవస్తుచయ నాశనముకూడ వానికి దృగ్గోచరమగుచునేయుండును. కావున యన్నివస్తువులు ప్రియత్నపూర్వకముగను, అప్రియత్నముగను రక్షింపఁబడుచునేయున్నవి. అట్టితతఃఈ సృజింపఁబడిన వస్తువుల భవిష్యత్తును వర్తమానమున మానవుఁడు స్థిరపఱచుచున్నాడు. నాశనమెట్లును తప్పదని తెలిసియే మానవుఁడిట్లుచేయుచున్నాఁడని విశదమగుచున్నది.

అనంతమైన దివ్యస్వప్నలీలయందు భగవంతుఁడు సృష్టి స్థితి లయ కారకుఁడుగా త్రిమూర్త్యాత్మకమైన పాత్రిలను ధరించును.

భగవంతుఁడు తాను అనంతముగాఁజేయు సృజనపోషణ విధానములతోడనే భవిష్యత్కార్య మగు లయకృత్యమునందును నిమగ్నుఁడైయుండును. భూతకాలసంబంధియైన తన సృష్టిని పోషించినవాఁడై శాశ్వతమైన తనవర్తమానస్థితియందే భవిష్యత్తుకూడ పాడుకొనునట్లుచేయును. ఆ భావికాలము యితఃపూర్వము సృజింపఁబడినదానిని, ప్రస్తుతము పోషింపఁబడు

దానినికూడ నశింపఁజేయును. కావున భగవంతుఁడు సర్వజ్ఞుఁడై శాశ్వతమగు వర్తమానస్థితియందుండి వర్తమానమున తాను శాశ్వతముగారక్షించు భూతకాలస్థితి తెలిసినవాఁడగును. కాని వెంటనే భవిష్యత్తునందున్న సమస్తమును వర్తమానస్థితియందే మున్ముందుగనే నిరంతర మాతఁడు అనుభవించుచుండును.

అట్లే మనుష్యరూపమునందున్న భగవంతుఁడు మానవుఁడుగా ప్రయత్నములేకయే జాగ్రదవస్థయందును, భవిష్యత్తునందును తా ననుభవింపవలసిన విషయములను స్వప్నావస్థయందుఁగాంచును. కొంతకాలమునకు మున్ముందుజరుగఁబోవు విషయములఁగూర్చి ముందుగానే తెలిసికొనుటజరుగునని మానవుఁడు తెలియఁ గలుగుచున్నాఁడు.

దీని పర్యవసానమేమనఁగా సృజనకార్యమునందే స్థితిలయము లిమిడియున్నవనుట. మాయను సృజించి భగవంతుఁడు దానితోఁగూడ పోషణనాశనములను జేయుచున్నాఁడు.

వాస్తవముగాఁ బోషణనాశనములను గల్పించుక్రియలు సృష్టిక్రియయందే యిమిడియున్నవి. మాయాసృజనముననే తక్కినరెండునుకలవు. అనఁగాఁ బోషించి నాశనముచేయవలసినదేదియు సృష్టింపఁబడలేదు. సృష్టింపఁబడిన సమస్తము శూన్యమునుండియే వచ్చినది. శూన్యమనఁగా సర్వవిధముల లేనిదన్నమాటయే. దీనినే యత్యంతాభావమందురు.

ఇట్టిశూన్యము బ్రహ్మచే సృష్టమై విష్ణువుచే పుష్టమై శివునిచే నష్టమగుచున్నదని చెప్పినపుడు అనంతమై బ్రహ్మాండ

యనఁబడు మాయాలోకమునకు సంబంధించి భగవంతునకుఁగల్గు దివ్యము ననంతము నగు స్వప్నావస్థకు సంబంధించినదని చెప్పు దుము.

నిత్యసత్యమునకు సృష్టిస్థితిలయము లనునవి లేవు. దిగ్వి దిగ్విభాగములుగల యాకాశము లేదు. అది సాపేక్షమునుగాదు అన్యోన్యసంబంధముగల త్రైకాలిక బాధ్యమునుగాదు. అనఁగా దానికి భూతభవిష్యద్వర్తమానములు లేవు.

సత్యమగు దీని నిత్యత్వమున శాశ్వతము, అనంతము, సర్వవ్యాపకము నగు సత్పదార్థము కలదు.

మానవచైతన్యము స్మృతియందలి శూన్యసంస్కారము లను అంతఃకరణ ప్రవృత్తులచే ననుభవించు నప్పు డావ్యక్తి స్వప్నావస్థయం దున్నాఁడనియందురు. పరిపూర్ణమైన స్మృతితో శూన్యసంస్కారములను మానవచైతన్య మనుభవించు నప్పు డాతఁడు ఒకస్వప్నమున మరియొక స్వప్నమును గాంచు చున్నట్లు తోఁచును. ఇది శూన్యమును అనుభవమునకుఁ దెచ్చు చున్నది. అది హేతువుగా ప్రపంచము తత్సంబంధవ్యవహార ములు శూన్యమునందలి శూన్యములనియు, స్వప్నమునందలి స్వప్నములనియు నెన్నఁబడుట యందౌచిత్యము కలదు. అనఁగా మానవశరీరములోని భగవదంశము మానవజీవితమును సృష్టియనెడు దివ్యస్వప్నములో మిథ్యారూపమగు స్వప్న మునుగా ననుభవించుచున్నది. సృష్టియనెడు నీదివ్యస్వప్నమున మానవజీవితము భగవంతుఁ డనుభవించెడు మరియొక స్వప్నము.

భగవంతుఁడు మానవరూపమున పరిపూర్ణవిజ్ఞానము పొందినప్పటికిని మాయారూపముగల యనంత శూన్యవివిధ సంస్కారములను స్థూలప్రపంచ యాథార్థ్యమునుగా ననుభవించునప్పటికిని దనకుఁగల పరిపూర్ణవిజ్ఞానము యీ యసంఖ్యాకములైన సంస్కారములు నిద్రావస్థయందున్నప్పుడు లీనమైపోవును. దీనివలన గాఢమును దివ్యమునగు సుషుప్త్యవస్థా దివ్యస్థితి నిర్ధారిత మగును. అనుదినము గాఢసుషుప్తినుండి జాగ్రదవస్థలోనికి జీవుఁడు వచ్చినప్పుడు పూర్వావస్థయందు నిద్రాణమైయుండిన పరిపూర్ణవిజ్ఞానము లుప్తమైన సంస్కార సమూహము అనునవి పరిమిత శూన్యమాయాసంస్కారములుగా నావిర్భవించి వాస్తవమై యనంతమైన శూన్యముగా రూపము దాల్చును.

జీవాంతఃపరిణామములోని జన్మపరంపరా మార్గమువలన యన్యోన్యవిరుద్ధ సంస్కారములన్నియు నశించు వఱకును జాగ్రత్సుషుప్త్యవస్థలలో నొకదాని తరువాత నొకటిగా జీవసంస్కారము లావిర్భూతములై, యంతర్గతములై, జీర్ణములగుచుండుట జరుగుచునే యుండును. ఇట్లు జరుగఁగా జరుగఁగా సంస్కారహీనమైన జీవుఁడు తుదకు మిగులును. అత్తఁడె నైజమును, శాశ్వతమును, అనంతమును, సత్యమును నగు భగవత్స్థితి స్మృతిపూర్వకమైన యనుభవము తనకుఁ గలుగును.

భగవంతుఁడు మనుష్యరూపమున సంస్కారరహితమైన పరిపూర్ణమగు చైతన్యమును బొందునప్పుడు మానవుని వివిధావస్థలు భగవంతుని వివిధావస్థలతోఁ బోలిక కలిగియుండును.

మానవాకృతియందు భగవంతుని గాఢనిద్రాస్థితి యీదివ్యస్థితిని బోలియుండుటయే గాక పరబ్రహ్మరూపమగు భగవంతుని గాఢనిద్రాస్థితిని గూడ పోలియుండును.

ఆస్థితి నిరామయమైన యనంత శూన్యస్థితి*. గాఢ సుషుప్తియందు నిశ్చేతన శూన్యముండి, అహమ్మనువ్యక్తి యూపిరిపీల్చుచున్నను పరిమితమగు 'నేను' అను 'అహ' మందు చైతన్యముండదు. పరిమితమగు మనఃప్రాణశరీరములయు నీప్రపంచమునయు చైతన్యము కూడ నుండదు. మనుష్యునిలోని యాత్మ తన యునికిని గురించి కూడ స్మృతికలిగి యుండదు. అనఁగా గాఢనిద్రాస్థితిలో 'ఆత్మ' యున్నదిః చైతన్యము మాత్రము 'లేదు'.

---

* భగవత్సాక్షాత్కారమునకు గాఢసుషుప్తికి నొక గంభీరమగు సంబంధము కలదని శ్రీ మెహర్బాబా విశదీకరించియున్నారు. భగవంతునితో నైక్యమందవలెనని యాత్మ యనుక్షణమాశించుచునే యుండును. కాని దాని చైతన్యము స్థూలప్రపంచ సంబంధమగుటచే నాత్మకూడ నాస్థూలప్రపంచ వస్తుసముదాయములో నొకటైనట్లు కాన్పించును. గుల్మస్థితిలో జీవము రాతిలో సంఘటితమై యుండును. కాని యాత్మ పరమాత్మతోఁగలిసియే యుండును. నల్లమందునుగాని మద్యమునుగాని సేవించినవానికి శరీరమున ప్రత్యేకముగా మార్పులేకపోయినను సేవించినవాని కలవ మాంద్యము గోచరించును; వికారము ప్రకోపించును; ఇట్లే జీవుఁడు భగవంతుని లోనివాఁడేయైనను జీవత్వ ప్రభావమును గలవాఁడగును.

---

బడలికవలనఁ గలుగు నిద్రావస్థయందున్న ప్రతిజీవుఁడు స్వస్వభావమగు భగవంతునందు లీనమై విశ్రాంతిగనును. సృష్టియంతయూ నిట్లే సర్వాంతర్యామియైన భగవంతునందు గాఢనిద్రాద్వారమునఁ బ్రవేశించును. ఇది యెల్లజీవుల దైనందినానుభవము.

గాఢనిద్రలోనుండి మానవుఁడు మేల్కొనినప్పుడు యేమి కారణము లేకయే మెలఁకువ గాంచును. నిద్రాక్షీణమైయున్న సంస్కారముల చైతన్యమే తనయాంతరస్మృతిని కదలించి లేవఁగొట్టును. ఇవి గాఢనిద్రలోఁ గనఁబడవు. అందుచేతనే మనుష్యుఁడు నిద్రనుండి మేల్కాంచినవెంటనే తనపరిసరములస్మృతిని మొదట పొందును. తరువాతఁ గ్రమముగా మితమగు 'నేను' అహమునకు సంబంధించిన కలాపములన్నియు జ్ఞాపకమునకు వచ్చును. అనఁగా మనఃప్రాణశరీర ప్రపంచముల చైతన్య జ్ఞానము పొందును.

ఆది యందున్న యనంతమగుశూన్యతలోని గాఢనిద్రాస్థితినుండి భగవంతుఁడు మెలఁకువఁగాంచినప్పుడే 'ఆదికారణ' ముత్పన్నమైనది. స్వతంత్రుఁడును, అనంతుఁడు నగు భగవంతుని చిద్విలాసమయ్యదియే. అంతకంటె దానికి వేరుకారణము కాని సందర్భముకాని లేదు.

గాఢనిద్రలోనుండి మేల్కొనుమానవుఁడు సగము మెలఁకువగలిగిన స్వప్నావస్థలోఁ గొంతకాలముండి పూర్తిగా మెలఁకువఁగాంచినట్లే 'పరమాత్మ పరబ్రహ్మ' స్థితిలోనున్న భగవంతుని విషయముకూడ నట్లే యాదియగు తన దివ్యగాఢనిద్రాస్థితిలోనుండి పూర్తిగా మేల్కొనుటకు పూర్వము సగముస్మృతిస్థితిని అనుభవించును. అదియే దివ్యస్వప్నస్థితి లేక సృష్టికర్తృత్వావస్థ.

ఆదికారణమై ఆవిర్భవించిన మొదటి అనంతవిలాసము బహుపరిమితమైన చైతన్యమును భగవంతునిలో మొదట

కలుగఁజేసినది. ఈపరిమితమైన చైతన్యము, అర్ధస్మృతిలోనున్న భగవంతుని, అణఁగియున్న శూన్యపరిమితసంస్కారమును ఆంతర స్మృతిద్వారమున అనుభవించునట్లుచేసినది. ఈ శూన్యమే శూన్యతగా రూపొందినది. ఈశూన్యత్వమునకుఁ బరిమితమగు మొదటిసంస్కారానుభవమే 'దివ్యస్వప్నముగాఁ బ్రారంభ మాయెను. అదియే యీబ్రహ్మాండసృష్టి'.

పరమాత్మలో మొదటిచైతన్యబిందువు భగవంతునిలో నాంతరచైతన్యమును బ్రవేశపెట్టినది. దీనివలన భగవంతునకు సగము చైతన్యస్థితికలిగినది. ఇది అంతయు గాఢమగు దివ్యనిద్రలో భగవంతుఁడున్నప్పుడు జరిగినది. ఈ దివ్యమగు అర్ధచైతన్య స్థితిలో భగవంతుఁడు దివ్యస్వప్నంబుల గనుచు సృష్టియనుభవము పొందును. ఇది భగవంతుని జాగ్రదవస్థపొందకపూర్వము జరుగును. ఈ జాగ్రదవస్థయందు భగవంతుఁడు తనఅనంతమును అపరిమితమును అగు దివ్యస్వభావానుభవమును బూర్తిచైతన్యముతోఁ బొందును. ఈదివ్యస్థితి 'సర్వమయు'డగు పరమాత్మ పరబ్రహ్మస్థితిలో నిమిడియున్న శూన్యమునుండి వెడలి పైకివచ్చినది. 'సర్వము'అనఁబడు శూన్యమునందున్న 'ఓమ్‌బిందువు' లేక సృష్టి బిందువు ద్వారమున నీభగవంతుని అర్ధచైతన్యము పైకి వచ్చెను.

ఈ బిందువునుండి పైకివచ్చిన భగవంతుని దివ్యమగు నంతశ్చైతన్యము తదీయ దివ్యగాఢనిద్రను భంగపఱచినది. అప్పుడే భగవంతుని మొదటి నిట్టూర్పు బయలువెడలెను. అదియే ఆదిశబ్దము 'దివ్యనాదము'. దీనితో నాకాశము, కాలము

పరిదృశ్యమానబ్రహ్మాండము నుద్భవించెను. తోడనే పరిమిత మగు నహంకారము, మనస్సు, ప్రాణశక్తి, వ్యక్తి బహురూప ముల బయలుదేరెను.

దివ్యస్వప్నస్థితియం దనంతమగు భగవంతుని దివ్యము నాంతరమునగు చైతన్యము పైకిఆవిర్భవించి శీఘ్రగతిపొందిన కొలఁది దివ్యస్వప్నము లేక 'సృష్టియంత్రము'కదలుట ప్రారంభ మగును. ఆస్థితిలో భగవంతుఁడే దివ్యస్వప్నానుభవమును బొందు టయేగాక, యీ సృష్టిపరిణామములోని విషయజాలముతో నేకత్వమును బొందుచు సన్నిహితసంబంధము కలిగియుండును.

పైన తెలుపఁబడిన శూన్యతలో సృష్టిబిందువునుండి భగవంతునిదివ్యము నాంతరమగు చైతన్యము బయట కావిర్భ వించినప్పుడు సృష్టియంతయు పైకివచ్చి క్రమముగా రూపపరి మాణ వర్ణపరిణామము పొందుచుండును. ఇది భగవంతుని అంతశ్చైతన్య ప్రభావముబట్టి యుండును.

పరమాత్మ పరబ్రహ్మస్థితిలోని గాఢమగు దివ్యనిద్ర నుండి మేల్కొలుపఁబడుచున్నాఁడు. కాని సగము స్మృతియే కలుగుచున్నది.

పరిణామవృద్ధినిబొంది సగము చైతన్యస్థితిలోనున్న భగ వంతుఁడు దివ్య స్వప్నానుభవమును మఱింత తీవ్రముగాఁ బొందుచున్నాఁడు. అప్పుడు తనసృష్టికార్యములో మఱింత తీక్ష్ణముగా నిమగ్నుఁడగుచున్నాఁడు.

జగత్ సృష్టిలో సర్వము తానేయైనట్లు అనుభవమును బొందుచు, భగవంతుఁడు జగత్తులతో, వాయుమండలములతో

చేతనాచేతన సర్వవస్తుసంచయముతో గుల్మ, లోహ, వృక్ష, పక్షి, కీటక, మత్స్య, జంతు, మానవప్రాణికోటితో నేకత్వ మును బొందుచున్నాఁడు. 'నే నెవరు?' అను తన మొదటి మాటకు పైకి వాస్తవముగాఁ దోచు వికృతసమాధానముల నగుపడుచున్నాఁడు. ఎట్లనఁగా నేను రాతిని, నేను లోహ మును అని తుదకు 'నేను పురుషుఁడను, నేను స్త్రీని' అను సమాధానము వచ్చును.

భగవంతుఁడు మానవకోటితో నేకత్వము పొందినప్పు డాయన యపూర్ణచైతన్యస్థితి వదలిపోయినది. దివ్యస్వప్నస్థితిలో మానవరూపముతో భగవంతునికి సంబంధము కలిగినప్పు డాయనకుఁ బూర్ణచైతన్యము సంక్రమించును.

ఈ పూర్ణచైతన్యస్థితియందుఁ గలలన్నియు పటాపంచలై జాగ్రదవస్థానుభవమును భగవంతుఁడు కలవాఁ డగును. తానే భగవంతుఁడ నను సాక్షాత్కారజ్ఞానము కలిగి యుండును. ఈ పరిస్థితిలో భగవంతుఁడు మానవులతోఁ బూర్తిగా నైక్యమై, పూర్ణచైతన్యము కలిగి, యెక్కువ యెఱుక కలిగి యున్నప్పటికిని, తన స్వతస్సిద్ధమైన వాస్తవమైన దివ్యజాగ్ర దవస్థను భగవంతుఁ డింకను గాంచలేదు. ఇప్పటివఱకును గలి గిన చైతన్యము శూన్యమునుండి వచ్చిన శూన్యతకు సంబం ధము గలది. ఇదివఱలో నిబిడీకృతమైన శూన్యత భగవంతుని మానంతరస్మృతి పైకివచ్చుట వలన 'సర్వముగా' బ్రభవించి నది. దీనివలన భగవంతుఁడు తన సర్వముతో నేకత్వము కల భగవత్స్వరూపుఁడుగా చైతన్యము పొందుటకు బదులుగాఁ

పరిదృశ్యమానబ్రహ్మాండము నుద్భవించెను. తోడనే పరిమిత మగు నహంకారము, మనస్సు, ప్రాణశక్తి, వ్యక్తి బహురూప ముల బయలు దేరెను.

దివ్యస్వప్నస్థితియం దనంతమగు భగవంతుని దివ్యము నాంతరమునగు చైతన్యము పైకిఆవిర్భవించి శీఘ్రగతిపొందిన కాలఁది దివ్యస్వప్నము లేక 'సృష్టియంత్రము'కదలుట ప్రారంభ మగును. ఆస్థితిలో భగవంతుఁడే దివ్యస్వప్నానుభవమును బొందు టయేగాక, యీ సృష్టిపరిణామములోని విషయజాలముతో నేకత్వమును బొందుచు సన్నిహితసంబంధము కలిగియుండును.

పైన తెలుపఁబడిన శూన్యతలో సృష్టిబిందువునుండి భగవంతునిదివ్యము నాంతరమగు చైతన్యము బయట కావిర్భ వించినప్పుడు సృష్టియంతయు పైకివచ్చి క్రమముగా రూపపరి మాణ వర్ణ పరిణామము పొందుచుండును. ఇది భగవంతుని అంతశ్చైతన్య ప్రభావముబట్టి యుండును.

పరమాత్మ పరబ్రహ్మస్థితిలోని గాఢమగు దివ్యనిద్ర నుండి మేల్కొలుపఁబడుచున్నాఁడు. కాని సగము స్మృతియే కలుగుచున్నది.

పరిణామవృద్ధినిబొంది సగము చైతన్యస్థితిలోనున్న భగ వంతుఁడు దివ్య స్వప్నానుభవమును మఱింత తీవ్రముగాఁ బొందుచున్నాఁడు. అప్పుడు తనసృష్టికార్యములో మఱింత తీక్ష్ణముగా నిమగ్నుఁడగుచున్నాఁడు.

జగత్ సృష్టిలో సర్వము తానేయైనట్లు అనుభవమును బొందుచు, భగవంతుఁడు జగత్తులతో, వాయుమండలములతో

చేతనాచేతన సర్వవస్తుసంచయముతో గుల్మ, లోహ, వృక్ష, పక్షి, కీటక, మత్స్య, జంతు, మానవప్రాణికోటితో నేకత్వ మును బొందు చున్నాఁడు. 'నే నెవరు?' అను తన మొదటి మాటకు పైకి వాస్తవముగాఁ దోచు వికృతసమాధానముల కగుపడుచున్నాఁడు. ఎట్లనఁగా నేను రాతిని, నేను లోహ మును అని తుదకు 'నేను పురుషుఁడను, నేను స్త్రీని' అను సమాధానము వచ్చును.

భగవంతుఁడు మానవకోటితో నేకత్వము పొందినప్పు డాయన యర్ధచైతన్యస్థితి వదలిపోయినది. దివ్యస్వప్నస్థితిలో మానవరూపముతో భగవంతునికి సంబంధము కలిగినప్పు డాయనకుఁ బూర్ణచైతన్యము సంక్రమించును.

ఈ పూర్ణచైతన్యస్థితియందుఁ గలలన్నియు పటాపంచలై జాగ్రదవస్థానుభవమును భగవంతుఁడు కలవాఁ డగును. తానే భగవంతుఁడ నను సాక్షాత్కారజ్ఞానము కలిగి యుండును. ఈ పరిస్థితిలో భగవంతుఁడు మానవులతోఁ బూర్తిగా నైక్యమై, పూర్ణచైతన్యము కలిగి, యెక్కువ యెఱుక కలిగి యున్నప్పటికిని, తన స్వతస్సిద్ధమైన వాస్తవమైన దివ్యజాగ్ర దవస్థను భగవంతుఁ డింకను గాంచలేదు. ఇప్పటివఱకును గలి గిన చైతన్యము శూన్యమునుండి వచ్చిన శూన్యతకు సంబం ధము గలది. ఇదివఱలో నిబిడీకృతమైన శూన్యత భగవంతుని నామాంతరస్మృతి పైకివచ్చుట వలన 'సర్వముగా' బ్రభవించి నది. దీనివలన భగవంతుఁడు తన సర్వముతో నేకత్వము కల భగవత్స్వరూపుఁడుగా చైతన్యము పొందుటకు బదులుగాఁ

దానుపైకి యావిర్భవింపఁజేసిన సృష్టితో నైక్యమును బొందును. పూర్ణచైతన్యముతో మానవులతో నైక్యమును బొందుచుఁ దన పరమాత్మ పరబ్రహ్మస్థితిని గూర్చి గుర్తు లేకుండును.

ఈ పూర్ణచైతన్యమున భగవంతుఁడు తన స్వాంతస్సృష్టి యనుభవమును బొందుచునే యుండును. మానవులతోఁ బూర్ణయగు నెఱుకతో నేకత్వము పొందుచుండును. ఆ యా సంస్కారముల ప్రభావమును బట్టి ఒకప్పుడు పురుషుఁడుగాను మఱియొకప్పుడు స్త్రీగాను రూపొందుచుండును. అనగాఁ మనుష్యస్థితిలో భగవంతుఁడు పూర్ణచైతన్యము కలిగినవాఁ డయ్యుఁ పరబ్రహ్మస్థితిలోని భగవంతునివలె ననుభవమును బొందఁడు. పరిమితికల మానవస్థితి యనుభవమునే పొందును.

ఇచ్చట యన్యోన్యవిరుద్ధస్థితి యేమనఁగా సత్యమగు భగవంతుఁడు మాయాసృష్టిని సత్యముగా నెంచును. ఆయన వాస్తవికతను మాయలోఁ గోల్పోవుటచేత సత్యస్వరూపమే తన్ను తాను తెలియుటకుఁ బ్రతిబంధక మైనది.

మానవులోని భగవంతుఁడు తన నిజరూపమును భగవంతుఁడుగాఁ దెలిసికొనుట కిప్పుడు మానవునిలో ప్రతిపాదితమై పూర్ణభగవచ్చైతన్యము లోపల నాకర్షింపఁ బడవలెను. ఈ యంతర్ముఖమైన చైతన్యము బయటకుఁ ద్రోయఁబడినప్పుడు మానవుఁడే భగవత్స్వరూపుఁ డగుచున్నాఁడు. ఈ చైతన్యము వల్లనే భగవంతుఁడు తన్నుదాను దెలిసికొను చున్నాఁడు. ఇదియే భగవంతుని సాక్షాత్కారము పొందుటయనఁగా. ఈ దివ్యస్వప్నమున కిదియే పవిత్ర లక్ష్యము.

ఈ లక్ష్యము సిద్ధించుట యనఁగా చైతన్యము క్రమముగా నంతఃపరిణామముఁ బొందుచు, గాఢనిద్రావస్థలో పూర్తి శూన్యత యనుస్థితి క్రమముగా లయమైపోయి సముపార్జితమైన పూర్ణచైతన్యము మిగులుటయే. అనఁగా శాశ్వతమైన 'నేనే భగవంతుఁడ' ననెడి యనుభవమును బూర్తిఁ స్మృతిలో భగవంతుఁడు పొందగలుగు చున్నాఁడనుట. పూర్తి స్మృతితో తన ఆదిస్థితిని పొందఁగలిగి నప్పుడు భగవంతుఁడు తన శాశ్వతస్థితిని, పవిత్రప్రకృతి ననుభవించు చున్నాఁడు. ఇదియే సర్వము అనిచెప్పఁబడెడి యనంతము సత్యము నయినది. మొదట 'నే నెవరు' అను ప్రశ్నకు 'నేను భగవంతుడను' అను సమాధానము చివఱకు లభించినది. పూర్తిచైతన్యముతో భగవంతుని సాక్షాత్కారము పొందుటకు మానవచైతన్యము కలిగిన భగవంతుఁడు జన్మాంతరములలోనఁ బైకి ప్రస్ఫుటమైన చైతన్యము నంతర్ముఖము చేసికొనుచుండును. ఈ చైతన్యము మొదటగా దివ్యస్వప్నములో మానవరూపము నొందినప్పుడు ప్రాప్తమైనది.

ఈదివ్యస్వప్న మంతమగు కాలము ప్రారంభమైనపుడు మానవరూపమున మాయావృతమగు జాగ్రదవస్థయందు గలుగుననుభవములు పొందు భగవంతునిచైతన్యము తనలో నంతర్ముఖము చేసికొను చుండును. ఈచైతన్యము లోకసృష్టిలో బాహిరములగు వస్తువులచే నాకృష్టమగుచుండును. ఆదిని భగవంతు గాఢనిద్ర వానిచైతన్యస్థితిలోనుండి క్రమముగా చైతన్య పరిణామమార్గద్వారమున నెట్లుచైతన్యము బహిర్గతమైనదియు

గాని మరల నెట్లు లోపలి కాకర్షింపఁబడి యంతర్ముఖమైనది తెలిసికొనుట యవసరము. ఇది 'నేను భగవంతుఁడను' అను పవిత్రజాగ్రదవస్థ యనేకజన్మాంతరానుభవముల యనంతరము సాధ్యమైనది. ఈ చైతన్యవృద్ధి భగవంతుని చైతన్యముతోఁ బాటు సాధారణప్రజ్ఞ కలిగిన మానవుఁ డెట్లు మార్పుచెం దెనో చూతము. సాధారణమానవుఁడు మొదట గాఢనిద్రలో నుండి క్రమముగా జాగ్రదవస్థలోనికి వచ్చుటవలన వలసిన చైతన్యస్ఫూర్తిని పొందుచున్నాఁడు.

మొదటిస్థితి:— తనపరిసరముల స్మృతియే లేక కన్నులు మూతపడిన మనుజుని గాఢనిద్రను పరబ్రహ్మస్థితియందలి శూన్యతలోనున్న భగవంతుని గాఢమగు దివ్యనిద్రను గమనించినప్పు డీ రెండు సందర్భములను నిర్గుణుఁడగు భగవంతునకు సగుణుఁడగు మానవునకును చైతన్యము పూర్తిగా మృగ్యము. రెండింటిలోను శుద్ధశూన్యత యున్నది. ఈ రెండు సందర్భములలో నా చైతన్యము లేకపోవుట గాఢనిద్రలోనున్న మానవుని మూతపడిన నేత్రముల పోలికవలనఁ దెలియును.

రెండవస్థితి:— ఇంకను నిద్రలోనుండియే మెల్లగా మెలఁకువనుపొందుచున్న స్థితిలో కన్నులు తెఱచుటకు యత్నము చేయువాని స్థితి పరికింతము. లోపల అణగియున్న సంస్కారములు గాఢనిద్రాస్థితిలో అణఁగియున్నవి. అంతరస్మృతిద్వారమున నివి కదలి పైకివచ్చి శూన్యస్థితిని భేదించి మెలఁకువ గలుగఁజేయు చున్నవి. అంతస్స్మృతినుండి భిన్నములగు సంస్కారములు ప్రకోపము పొంది పైకి వచ్చినప్పుడు నిద్రలోకలలను

గాంచుచుండును. కాని గాఢనిద్రాస్థితి పోయినది. అర్ధచైతన్య స్థితిలోఁ గలలను గనుట అనఁగా నంతస్స్మృతిలో సూక్ష్మాతి సూక్ష్మరూపమున నణఁగియున్న శూన్యతాసంస్కారముల యనుభవము పొందుట. మనుష్యుఁ డర్ధచైతన్యస్థితికిఁ బ్రారంభములో నుండుట యేగాఁక, కలలయనుభవమును పొందుట యే గాక కలలోని సూక్ష్మరూపములలో తనచే సృజింపఁబడిన జీవ జాలముతో సంబంధలంపటుఁడై తగుల్కొనును. సంస్కారములు పైకివచ్చి మానవుఁడు తనకలలో జరుగు విషయములలో ముఖ్యపాత్రవహించి కలలనాటకమునకు కర్త లగుచున్నవి. గాఢనిద్రలోనుండి యప్పుడే స్వప్నస్థితిలోనికిఁ బోవుచున్నాఁడు. అర్ధచైతన్యస్థితి నొందుచున్నాఁడు. ఈకలలను గనుచున్న వ్యక్తిని అప్పుడే కన్నులు తెఱచుటకు యత్నించు నిద్రలోని వ్యక్తితోఁ బోల్చుకో వచ్చును. ఈ కన్నులు తెఱచుస్థితి చైతన్యలేశము మానవునియం దంతశ్చైతన్యముగా నావిర్భవించు స్థితియని చెప్పవలెను.

మానవుని స్థితిగుర్తించినట్లే తన గాఢదివ్యనిద్రాస్థితి నుండి కదలికకలిగిన భగవంతునిస్థితిని గూర్చి యాలోచింతము. భగవంతుఁడు తనదివ్యస్వప్నస్థితి లేక సృష్టికర్తృస్థితి యనుభవము పొందుచున్నాఁడు. భగవంతుని పవిత్రాంత శ్చైతన్యము ద్వారమున ప్రథమశూన్యతాపరిమితసంస్కార మావిర్భవించినప్పుడే కలప్రారంభ మగును. ఈ రెండు శూన్యతయును, భగవంతుని అంతశ్చైతన్యమును, సర్వమగుభగవంతుని ఆదిస్థితిలో శూన్యముగా నంతర్గతమై యున్నవి. భగవం

తుఁడు, తన అర్ధచైతన్యప్రారంభదశలో తనసృష్టిలోని జీవ రాసులతో దగ్గఱసంపర్కము కలిగియుండును. (ఇదియే తన దివ్య స్వప్నసంపర్కము.) సృష్టిని పైకి ఆవిర్భవింపఁజేయు పవిత్రాంతశ్చైతన్యము ద్వారమున నిది జరుగుచుండును. ఇవి శూన్యతాసంస్కారములు.

మూఁడవస్థితి:— అర్ధనిమీలితనేత్రములతో నిదురలో నున్నమానవుని అవస్థ మూఁడవది. మనుష్యుఁ డీస్థితిలో నర్ధచైతన్యస్థితి యొక్క యనుభవము పొందును. ఇంకను నిద్రలో నుండి పూర్తిగానర్ధచైతన్యస్థితిలోనున్న మానవునిగురించి తెలిసికోవలెనన్నచోఁ గొలఁదిగా తెఱచియున్న కన్నులుకలిగి, అర్ధచైతన్యప్రారంభదశ దెలుపుచుండును. శూన్యతాసంబంధ మాయాసంస్కారముల వల్ల కలలను గనుచున్నాఁడు. ఈ సంస్కారము లంతస్స్మృతితోఁ జేరి పైకివచ్చినప్పుడు స్వప్నస్థితి ప్రారంభదశగాఁ బరిణమించును. ఈ కలలు సాగినకొలఁది అంతస్స్మృతులలోఁ జేరి నిద్రాణమైయున్న వివిధసంస్కారములు పైకివచ్చి ప్రాబల్యము పొందుచుండుటచే మానవుఁ డంతస్స్మృతిలో మఱింత తీవ్రముగా వీనియందు దగుల్కొనును. దీని పర్యవసానమేమనఁగా కలలో దానుసృజించుకొన్న రూపములతో మఱింత గాఢమగు సంబంధము కలుగఁజేసికొనును. అప్పు డతఁడు పూర్తిగా అర్ధచైతన్యస్థితిలో నుండును. ఈస్థితి చైతన్యములేని పూర్తియగు గాఢనిద్రాస్థితికాదు; మఱి పూర్తిస్మృతిగల జాగ్రదవస్థయును గాదు. ఇది అర్ధజాగ్రదవస్థ. ఈ అర్ధచైతన్యస్థితిలో కలలను మఱింత గాఢముగాను, దృఢసంకల్ప

:ముతోను అనుభవించుచు సగము తెఱచిన కన్నులతోనుండును. ఇది మానవుని మూఁడవస్థితి.

ఇది దృష్టిలో నుంచుకొని యర్ధచైతన్యస్థితి ననుభవించుచు దివ్యస్వప్నావస్థలో నున్న భగవంతుని గూర్చి యోజింపుఁడు. సృష్టికర్తగా తన సృష్టియనుభవమును భగవంతుఁడు పొందుచుండును. దివ్యాంతశ్చైతన్యము సృష్టికార్యమును తీవ్రముగా నెఱవేర్చుచు, తన సృష్టిజాలములోని జీవకోటిలో భగవంతుఁడైక్యము పొందుచుండును. దివ్యస్వప్నములోనున్న భగవంతునకు బలవత్తరమగు సంస్కారములుత్పన్నమగుచు, సృష్టియగు జీవజాలమే తానను స్థితి వచ్చును.

నాలుగవస్థితి:— మానవుని నాల్గవస్థితిగురించి చూతము. నిద్రలోనుండి కలలోఁ దనకు గలుగుచున్న యాంతరస్మృతిలోని సంస్కారముల తాకిడి ప్రబలమై క్రమముగా సగము తెఱచిన కనులను బూర్తిగా తెఱచుటకు యత్నించు స్థితి నాలుగవది. ఇచ్చట మనుష్యుఁ డర్ధచైతన్యములోనుండి పూర్తియగు జాగ్రదవస్థ పొందుచున్నాఁడు.

దీనితో భగవంతుని స్వప్నావస్థయగు నాల్గవస్థితిని పోలిచి చూతము. ఈ ఘట్టము చాల ప్రధానమైనది. భగవంతుని చైతన్యము బ్రహ్మాండము పరిణామము నొందుతఱి భగవంతుని యనంతమగు యంతశ్చైతన్యద్వారమున బహుసంస్కారములు పైకావిర్భవించి, శూన్యతానంతస్థితిలో స్థిరపడుచుండును. అప్పుడు తన దివ్యస్వప్నమగు స్థితిలోని పూర్ణమై నిర్దిష్టమై తనస్వరూపముతో భగవంతుఁ డేకత్వము పొందును.

ఇదివఱ కనేకములగు చేతనాచేతనవస్తు సామగ్రితో నైక్యము పొందియు పైనవివరింపఁబడిన స్థితిలో మానవరూపముతో నేక మగును. అర్ధచైతన్యస్థితినుండి పూర్ణచైతన్యస్థితిపొందెడి యీ సమయములో మానవరూపముతో పూర్ణమగు నేకత్వము పొందును.

అయిదవస్థితి:— నిద్రలోనుండియుఁ గనులు కొంచెము హెచ్చుతక్కువగా తెఱచిన స్థితి అయిదవది. ఇందులో అంత స్స్మృతినుండి సంస్కారములు గాఢమగు బలముతో పైకి ప్రకోపించుచుఁ గలలంత్యదశలో స్పష్టముగా నడచుచుండును. ఈ స్థితిలో మానవుఁ డర్ధచైతన్యము కలిగియుండును. ఈ స్థితిలోని కలలు వాస్తవికతకు సన్నిహితముగా నుండును. సహేతుకమగు సందర్భశుద్ధి కూడ నిందుఁ గానఁబడును. శూన్యతలోని సూక్ష్మాతిసూక్ష్మరూపము లున్నతస్థితిలోనికి వచ్చి స్పష్టముగాఁ గలలలోఁగానఁబడు సందర్భమిది. ఇంక నీకలలు ముందునకు సాగుట కవకాశములేని సమయములో సంస్కారము పూర్తిచైతన్యస్థితిలోనికి వచ్చెడి యవస్థ వానికిఁ బ్రాప్తించును. ఇంకను నిద్రలో నున్నప్పటికిని కన్నులు తెఱచుకొని పూర్తిగా జాగ్రదవస్థలో నున్నట్లు చెప్ప వలెను. స్వప్నసమయమునుండి జాగ్రదవస్థలోఁ బ్రవేశించుట యందు యీబహుక్లుప్తకాల మొక త్రుటిసమయముండును. ఇదియే యంతస్స్మృతి పరిపూర్ణమగు నర్ధచైతన్యము.

ఈ మానవుని అయిదవస్థితిని గమనించి నప్పుడు భగవంతుఁడు తన పూర్తిచైతన్యము పొందుటకు ముందు

పూర్తిపరిణామము పొంది, యనంతమగు సర్వచైతన్యస్థి యనుభవమును పొందుచున్నాఁ డను విషయమును గ నింతము. తన యుచ్చస్థితి యందు భగవంతుఁ డనంతమ సంస్కారముల ప్రాబల్యముచే తన అంతశ్చైతన్యముతో బ్రహ్మాండసృష్టిలోని జీవజాలముతో సంపర్కమును విడి వేయు చున్నాఁడు. అనంతమగు తన పవిత్రాంతస్స్మృతితో తన అర్ధచైతన్యస్థితితో అది పూర్ణత్వముపొందుటలో జంతుజా రూపములతో భగవంతుఁ డేకత్వమును పొందెను. దివ్యస్వ ములోని యీ పంచమస్థితిలోఁ బూర్తిపరిణామముతో సర తార్ధచైతన్యస్థితి యందున్న భగవంతుడు జంతుజాలసంస్కా ములతో సంబంధము కలిగియుండలేదు. ఇప్పుడు భగవంతు దివ్యస్వప్నస్థితిలో నొకఘట్టమునకుఁ జేరితిమి. అనంతముల సంస్కారము లావిర్భవించునట్లుచేసి భగవంతుని యంతశ్చై న్యము తీవ్రస్థితిలో నున్నది. ఇప్పుడు భగవంతుఁడు మాన రూపముతో నేకత్వమును పొందినాఁడు. పూర్ణమగు చై న్యమునుగూడఁ బొందెను.

ఆఱవస్థితి:— కన్నులు బాగుగా దెఱచి నిద్రనుండిమేల్కొ జాగ్రదవస్థలోనున్న యీఆఱవస్థితిలోనున్న మనుష్యుని జూతమ ఈ స్థితిలో సర్వచైతన్యావస్థ లేదు. శూన్యములో నణఁగియు సంస్కారములు మానవుని అంతరస్మృతిలోనుండి పైకి లుగా వచ్చు సమయము గతించినది. పూర్తి మెలఁకువ గ స్మృతి కలిగియున్నను దన ఆత్మస్మృతి యింకనతనికిఁ గల లేదు. గాఢసుషుప్తిస్థితి తప్పినది. కల యంతమైనది. శూ

ములోనుండి సూక్ష్మరూపములుగా పైకివచ్చి కలిగినకలలోని అనుభవములు కూడ గతించినవి. ఇప్పుడు తనదృష్టికి స్థూలముగాను, వాస్తవముగాను దనజాగ్రదవస్థలోఁ గనఁబడు వస్తుచయమునుజూచి మానవుఁడు తబ్బిబ్బగుచున్నాఁడు. కలలో నస్పష్టముగా గానఁబడిన శూన్యమునుండి బయల్వెడలిన రూపములనే యిప్పుడు నిర్దిష్టమై, స్పష్టమైన రూపము కలవానినిగాఁ జూచుచున్నాఁడు. ఇప్పు డొకమాదిరి యగు కలను గనుచున్నాఁడు. ఒక త్రుటికాలములో మేల్కొన్న కలకంటె నిది యెక్కువ వాస్తవముగాఁ దోఁచును.

ఇది యాఱవస్థితి. వాస్తవముగా విషయములుగోచరించుచున్న నిదికూడ శూన్యమైన కలగానే తోఁచును. కలలోని కలవలె నీ దృశ్యమును జూచుచున్నాఁడు.

ఈ స్థితి మనుష్యుడు మేలుకాంచకపూర్వము కొన్ని క్షణముల యనుభవముతోఁ బోల్చనగును. అప్పుడు తన్నుదాను జూచుటకంటె నెదటనున్న వస్తుజాలమునే మొదట యాతఁడు చూచును. అదివఱకు మూసికొనియున్న కన్నులు తెఱచుటతోడనే దృష్టి కొక భ్రమణ మేర్పడును. అప్పుడు తన 'ఆత్మ'ను గురించిగాని, 'ఆత్మ'ను చుట్టుకొనియున్న వస్తువులతోడి 'ఆత్మ'సంబంధమును గురించిగాని,యెఱుఁగని స్థితిలోనున్నాఁడు. అత్తఱి వస్తువులను దెల్లబోయి తదేకదృష్టితోఁ జూచును.

భగవంతుని స్థితి మానవరూపముతో నైక్యమంది పూర్ణచైతన్యము పొందినప్పుడు మానవుని ఆఱవస్థితివలెనే

యుండును. ఆసమయమున ఆదిని కనుచున్న దివ్యకలను గనుచు ననంతమగు అర్ధచైతన్యస్థితి భగవంతునికి లేదు. అంతస్స్మృతిలోనుండి పూర్తి పరిణామముగల శూన్యతను సృష్టిగా పై కావిర్భవింపఁజేసినస్థితియు నిప్పుడు లేదు.

ఈ ఆఱవస్థితిలోఁ బూర్ణమగు చైతన్యము కలిగియుండుటచే భగవంతుఁ డాదియందువలె గాఢమగు నిద్రాస్థితిలోని యనంతమగు నర్ధచైతన్యస్థితియందు లేఁడు. తనకుఁ బరిమితమైన ఆత్మచైతన్యజ్ఞానము లేదు. అదియునుగాక త్రిగుణాత్మకమైన శక్తిజ్ఞానానందముల యనంతస్థితిస్స్మృతియు భగవంతునకేర్పడ లేదు. కాని పూర్తిచైతన్యముమాత్రము కలిగియున్నాఁడు. అనఁగా శూన్యతలో నిమగ్నమైయున్న చైతన్యము కలిగియున్నాఁడు. వాస్తవమైన స్థూలస్థితుల ద్వారమున నీపూర్ణచైతన్యము వ్యక్తమగును. కాని లౌకికదృష్టికీ స్థితులనంతముగాఁ దోఁచును.

ఏఁడవస్థితి:— స్థూలశరీరస్స్మృతియు స్థూలప్రపంచపరిసర ప్రభావానుభవమును బొందుచు తన పరిమితమగు అహమికను స్థాపించుటకు చేయు ప్రయత్నము జాగ్రదవస్థ కలిగిన యేఁడవ స్థితి. స్థూలచైతన్యజ్ఞానముతో స్థూలప్రపంచానుభవమును పొందుచున్నప్పటికిని మానవుఁడు తనకుస్స్మృతిలేకయే పరోక్షముగా నుపయోగించు పరిమితమగు ప్రాణశక్తి మనశ్శక్తుల చైతన్యమును పొందలేకున్నాఁడు. ఈ శక్తుల యనుభవము తనస్థూలశరీరలక్షణములచేఁ బరిమితమైనది. ఈ స్థితిలో మనుష్యుఁడు పూర్ణచైతన్యము కలిగియున్నాఁడు గాని యది స్థూల

చైతన్యము. తననావరించియున్న లోకపరిస్థితులలో దనయాత్మ తగుల్కొనియున్నది.

స్థూలప్రపంచస్మృతి కలిగియుండుట యేగాక, తనదృష్టికి ప్రపంచములో నెదురగు వస్తువులస్మృతిని కలిగియుండుట యే గాక, పరిమితమగు తనయాత్మ యీపరిసరములలో మునిగి యనుభవమును బొందుచున్నది. స్థూలప్రపంచములోని వస్తునయమును తనస్థూలప్రధానేంద్రియముచే గుర్తించి వానిలోని వ్యత్యాసమును దెలిసికొనుచున్నాడు. పరిమితమగు నాత్మ ప్రబోధించినరీతి నీ యింద్రియముల ప్రాధాన్యమును నిర్ణయించుకొనుచు, వైచక్షణ్యముకల్గియో కలుగకయో ప్రాణశక్తిని, మనశ్శక్తిని బరోక్షముగా వానికి సంధించుచు మానవుఁ డీ యింద్రియముల నుపయోగించుచున్నాఁడు. తిరిగి తానుగాఢ నిద్రను జొరకపూర్వమే మెలఁకువగల మానవుఁడే కార్యమును జేయుచున్నాఁడు.

ఇక్లే భగవంతుని యేఁడవస్థితి గమనింతము. ఇప్పుడు మానవరూపముతో నైక్యమొంది భగవంతుఁడు పూర్తి చైతన్యము కలిగియుండును. భగవంతు డాదినివలె నిప్పుడు దివ్యకలలను గనఁడు. పూర్ణచైతన్యముతో మాయావృతమగు నెఱుక యనుభవమును పొందుచున్నాఁడు. ఈ యెఱుక శూన్యమును, వాస్తవమైన దానిగా ననుభవింపఁ జేయును. అనఁగా భగవంతుఁ డనంతమైన పవిత్రార్ధచైతన్య స్థితిలో నున్నప్పుడు, తనదివ్యస్వప్నము నావిర్భవించిన శూన్యమే యంతర్గతమైన శూన్యము. ఈ శూన్యము ననుభవమును

బొందుచున్నాఁడు. పూర్ణచైతన్యస్థితిలోనున్నప్పు డాశూన్య మునే తన దివ్యస్వప్నముగా ననుభవింపక యాశూన్యమే సర్వమను చైతన్యానుభవము నొందుచున్నాఁడు.

ఈయెఱుక (awareness) కల్గినవెంటనే సృష్టికర్తగా తాను గనుచున్న దివ్యస్వప్నములను గనుట యాపివేసినను తాను బరి పూర్ణచైతన్యము పొందుటచేఁ బూర్వపుదివ్యస్వప్నము స్వప్న ముగా స్మృతికలిగియుండక వాస్తవమైన విషయముగా ననుభ వించును. శూన్యముగాఁ గాక సర్వముగా మాఱును. ఇదియే తను సృష్టించిన శూన్యము. ఈ శూన్యమునే (సృష్టియను తనకల) వాస్తవముగా భగవంతుఁ డనుభవించుచున్నాఁడు. ఈ స్థితిలో భగవంతుఁడు మానవవ్యక్తితో నైక్యమునుబొంద చున్నాఁడు.

సృష్టికర్తయైన భగవంతుఁడు మానవరూపములో నున్న పుడు నిండుచైతన్యముతో తన స్వప్నస్థితినివీడి స్థూలచైతన్యమ కల మానవుఁడుగాఁ దాను బరివర్తన మొందినట్లు తెలిసికొనన చున్నాఁడు. తన దివ్యస్వప్నస్థితిలోని సృష్టిని వాస్తవముగ గ్రహించుచున్నాఁడు; తనజాగ్రదవస్థలో మానవులోని భగ వంతుఁడు 'మాయావిషయ' జ్ఞానముతో దన ప్రప్రథమ దివ్య స్వప్నములోని అంతస్వప్నముగా ననుభవించుచున్నాఁడు

ఇది భగవంతుని వింతస్థితి. తాను పొందినపూర్ణచైతన ముతోఁ బెడత్రోవను పోవుచున్నాఁడు. తనకు గలిగి మాయాస్మృతివలన దన యనంతమగు 'ఆత్మ'తో సంపర్కమ పొందనేరక మానవరూపములోనున్న తనస్వరూపముతో

నేకత్వమొందుచున్నాఁడు. ఇది శూన్యముగా తన దివ్య స్వప్నము నడుచుచున్నప్పుడే జరుగుచున్నది.

కేవలము కల్పితమగు ఊహగాఁ గనఁబడినను, మానవుని జీవితము శాశ్వతమును వాస్తవమునునగు భగవంతుని యునికి నావరించిన ముసుగుగాఁదోఁచును.

తన్ను దాను తెలిసికొనుటకు మానవరూపములో భగవంతుడు లీనమగుచున్నాఁడను విషయము చూచుటకు విపరీతవిధి చోదితముగాఁ గనఁబడును. మానవుఁడే భగవంతునిలో లీనమైన నాడు భగవంతుడు తన అనంతమును, శాశ్వతము నగు స్థితిని దెలిసికొనుచున్నాఁడు. తనలో లీనమగుటకు యత్నించుచున్న తన ప్రతిబింబస్వరూపమగు మానవరూపములో లీనమై పోవుచున్నాఁడు. అందు తన పూర్తిచైతన్యము పొందినప్పటికిని దన యనంతశాశ్వత రూపానుభూతిని పొందలేకున్నాఁడు. కాని యీ పూర్తిచైతన్యము తన ప్రతిబింబములో నేకత్వముపొందుట పోవుటతో డనే భగవంతుని స్మృతినుండి యీ బింబము మాయమగును. అప్పు డప్రియత్నముగాఁ దనంతట తానే నేను భగవంతుఁడనను చైతన్యమునొందును. ఎప్పుడునుగల శాశ్వతుఁడుగాను, అనంతుఁడుగాను నుండు సత్యాత్మ తానే యని గుర్తెఱుఁగును.

మానవస్థితిలో భగవంతుఁడు మానవుఁడుగాఁ దన్ను తా నెఱుఁగి పరిమితమగు నహంకారలక్షణములను బ్రకటించెను. వీనితోఁ బరిమితమగు మనస్సు, కారణశక్తి స్థూలశరీ

రము కూడనేయుండెను. తరువాత క్రమముగాఁ దన్నుఁ దానే భగవంతుఁడనని తెలిసికొని తన యనంతశక్తులను దన పవిత్రానంతమైన "పరమాత్మ"గాఁ బ్రకటింపఁజొచ్చెను.

ఆదిని గాఢదివ్యనిద్రలోనుండి క్రమముగా నేఁడు ప్రాతిపదికస్థితులనుండి భగవంతుఁ డెట్లు పొందెనో వానిని మానవుఁడు గాఢనిద్రనుండి జాగ్రదవస్థలోనికి వచ్చులోపున నేఁడు స్థితుల నెట్లనుభవించెనో పోల్చిచూచినయెడల భగవంతుని చైతన్యపరిణామగతి తెలియుచున్నది. చివఱకుఁ బరిపూర్ణ చైతన్యపరిణామము కలిగిన భగవంతు డట్టిచైతన్యము కల మానవునితో నేకత్వము పొందుచున్నాఁడు. ఈలోపున భగవంతుని దివ్యకలయగు సృష్టినాటకములోని సమస్త చేతనాచేతన వస్తుజాలముతోను భగవంతుఁ డేకత్వమును బొందుచుండెను.

స్మృతిహీనమగు స్థితిమొదలు (దివ్యగాఢనిద్రతోఁబోలినది) పూర్ణచైతన్యస్థితి మానవాకృతిలోఁ గలుగువఱకు భగవంతుఁడు శాశ్వతమై సర్వవ్యాప్తమై రూపరహితమై యవిభాజ్యమై యనంతమగు 'ఏకమేవాద్వితీయం' గానే యున్నాఁడు. అనంతమును సర్వవ్యాప్తమునగు భగవంతుని స్వభావము తన శాశ్వతస్థితిని ప్రత్యక్షముగానో, పరోక్షముగానో వివిధరూపస్థితులలో, భగవంతుఁడు ప్రకటితమగుచున్నాఁడు.

స్మృతిహీనస్థితిలోని భగవంతుని యనంతమగు విలాసముద్వారమున నీపరిణామకార్యమంతయు నప్రయత్నముగా నుత్పన్నమైనది. భగవంతుడు తన యునికి సంబంధమగు చైతన్యస్మృతిని పొందుటతో నీపరిణామములు బయల్పడలినవి.

తన నిశ్చైతన్యస్థితి విపులమగు సందర్భములోఁ దనలో నిమిడి యున్న చైతన్యము విశదముగాఁ జొచ్చినది. భగవంతుని యీ చైతన్యము లెక్కలేని స్థూలరూపముల సంబంధము కలదగుటచే ననేకములగు సంస్కారముల ననుభవముల నొందుచు వృద్ధిగాఁజొచ్చెను.

వృద్ధిని పొందుచున్న భగవంతుని చైతన్య ముచ్ఛ్రేణి యందుండు రూపములతో నేకత్వమును బొందుచున్నది. దీని వలన లెక్కలేనన్ని సంయోగ-వియోగములకుఁ గారణ మగుచున్నది. రూపములు జననముపొందుట తరువాత శూన్యములో నశించిపోవుట జరుగుచున్నది. దీనినే జననమరణము లందురు. సంస్కారములు మాత్రము వెనుక విడువఁబడును. ఈసంస్కారములవల్ల సృజింపఁబడెడి నూతనరూపముతో వృద్ధియగుచున్న భగవంతుని చైతన్యము తిరిగి సంబంధము కలిగి యుండును.

మానవరూపముద్వారా చైతన్యములేని భగవంతుఁడు పూర్తిచైతన్యము నొందును. ఈ భగవచ్చైతన్యము మానవరూపముతో నేకత్వము పొందుచున్నది. కాని యీ చైతన్యము సంస్కారములభూయిష్టమగుటచే భగవంతుఁడు తన యనాదియగు ననంతస్థితియనుభవమును బొంద వీలులేకున్నది. తద్విరుద్ధముగా భగవంతుఁడు తాను మానవుఁడనని తెలిసికొనెను. "నే నెవరు" అను మొదటి విలాసస్ఫూర్తియనంతరము తానీ స్థితిలో మానవుఁడనని తెలిసికొని స్థూలప్రపంచానుభవము నొందుచున్నాఁడు. తనశాశ్వతస్థితిజ్ఞానము మరుగుపడియున్నది.

"నేనెవరు" అను ప్రశ్నకు "నేను భగవంతుడను" అను సమాధానము పొందువఱకు నీస్థితిలో నుండును.

మొదటివిలాసము శూన్యమును సృష్టించెను. సంస్కారము లా శూన్యమును 'శూన్యత'గాఁ బోషించినవి. అనఁగా సృష్టి, సృష్టవస్తువులను పరస్పరవైరుధ్యములుకల యీసంప్రదాయములు తమ్ముతామే నాశనము చేసికొని శూన్యతను హరించి సత్యానుభవమును బ్రసాదించును.

స్వతంత్రుఁడైన భగవంతునిలో నాయన మొదటివిలాసమంతము లేని త్రిగుణాత్మకమగు లక్షణములను గల్పించెను. సృష్టి, స్థితి, లయకారులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు బయలుదేఱిరి. ఈ కారకత్వములకుఁ గారణము భగవంతునాదివిలాసము.

భగవంతుని యీ మూఁడులక్షణములు సృష్టిలోని సమస్తవస్తువులకు జన్మస్థితిభంగములను గలుగఁజేయుచున్నవి. అనుదినజీవితములోఁగూడ మనుష్యులకు తదితర సృష్టివస్తువులకు జననము రక్షణము లేక పోషణము మరణము జరుగుచునే యున్నవి.

భగవంతుని ప్రథమవిలాసము ద్వారమున మొదటి సంస్కారము మొదటిమాట 'నేనెవరు' అనునది శూన్యము నుండి బయలుదేఱినది. ఈ మొదటిసంస్కారము మొదటిసృష్టియంతర్గతశూన్యత నుత్పాదించినది. ఈసృజింపఁబడిన శూన్యతయే సంస్కారముల జన్మమునకుఁ గారణమగును. క్రమ

ముగా నన్యోన్యవిరుద్ధమగు సంస్కారములు నశించి 'నే నెవ' రను ప్రశ్నకు 'నేనే భగవంతుఁడ'నను సమాధానమువచ్చును.

చేతనాచేతనరూపములు తమ వ్యక్తిగత వర్తనమువల్ల జనించిన సంస్కారము ననుసరించి యీ మాయ ననంతముగా సాగించుచున్నవి. ఈ యనంతములగు సంస్కారసమూహము-వలన నాదిసృష్టి (భగవంతుని విలాసమునుండి బయల్వెడలినది) పోషింపఁబడుచున్నది. దాని వెనువెంటనే పరిణామముకూడ పొందుచు వ్యక్తిత్వముగల రూపము జీవుఁడుకూడ 'నేనెవరు' అను ప్రశ్నకు సంపూర్ణస్మృతితో నీక్రిందివిధము సమాధానములు పొందవచ్చును. 'నేను అచేతనమగువస్తువును'; 'నేను చేతనము కలిగిన జీవమును'; 'నేను హేతుబద్ధమగు జీవిని'; 'నేను పురుషుఁడను, నేను స్త్రీని'.

ఉదాహరణగా భగవంతుఁడు మానవజన్మములో గాఢనిద్రయందున్నప్పు డహోరాత్రరూపమగు కాలము ప్రపంచరూపమగు నాకాశము ననునవి నశించినట్లే కనఁబడును. కాని మెలఁకువతో దినోదయము లోకము మఱల గాన్పించు-చున్నవి. ప్రతిదినము మేల్కొనుటతోడనే యతనికి లోకము దానిలోని వస్తువులు దాని సంబంధమగు వస్తువులు నెట్లు సృష్టియగుచున్నవి ? అతని చైతన్యము పరిణామము పొందు సందర్భములో సముపార్జింపఁబడి తనలో నిద్రాణమైయున్న సంస్కారములు, పునర్జన్మములలో పొందఁబడిన సంస్కార-ములు, అప్రయత్నముగా గాఢనిద్రనుండి మేల్కొనునట్టి లంతర్గతమైన సంస్కారములను బురికొల్పును. దీనివలన నిద్రాణ

మైన సంస్కారములు జాగ్రదవస్థలో నిండుస్మృతిలోని అను భవములచే నశించుటకు తగు నవకాశము లభించును. ఇట్టి మాదిరిగా నిద్రాణస్థితిలోని మనుష్యుని సంస్కారము లను దినము నతనికిఁ బ్రపంచమున నుదయమును సృష్టించును. ఇవి నిద్రాణమైయున్న సంస్కారముల వల్ల సృజింపఁబడినప్ప టికిని జాగ్రదవస్థలో ప్రాప్తమగు అనుదినసంస్కారముల వల్ల ఈ పైఅనుభవములు పోషింపఁ బడుచున్నవి. ఆదిని భగవంతుని విలాసమువల్ల కలిగిన సృష్టితో ఉత్పన్నమైన సంస్కారములు కూడ అనుదినానుభవముల వల్ల మఱింత వృద్ధిపొందుచుండును. దినము క్రమముగాఁగల కాలము లోకముకూడ నిద్రలోని యనుభవములగు అన్యోన్యవిరుద్ధసంస్కారముల వల్ల నాశన మగును. ఈ సంస్కారములు జాగ్రదవస్థయందుఁ గల్గు సంస్కా రములకు విరుద్ధములైనవి.

ఎడతెగని పరంపరలుగా, భగవంతుఁడు మానవరూప మునఁ దనసృష్టికి సృష్టికర్తగాఁ దనప్రభావము ప్రకటించు కొనుచుండును. మనుష్యుని యందంతర్గతమైన సంస్కారముల వలన నిదిజరుగును. జాగ్రదవస్థలోని జీవితకాండము ద్వార మున సృష్టియు, సంస్కారమును వృద్ధిచేసికొనుచుఁ దనను బోషించు కొనుచుండును. నిద్రకాంచినప్పుడు విరుద్ధసంస్కా రముల ద్వారమున తన సృష్టివిధ్వంసకుఁడుగా వర్తించును. చిట్టచివఱకు గాఢనిద్రాస్థితిలో గతించిపోవును. సృష్టిగాఁ గనఁబడు వ్యక్తిగతమైన చైతన్యమును అనుదినమున, నశింపు చేయుచు, మానవుఁడు తిరిగి సృష్టించుచు, పోషించుచు, నాశ

నము చేయుచు సృష్టిని సంస్కారముల నటనచే నడిపించును. ప్రతిజీవము వస్తువ్యక్తి ముఖమున భగవంతుఁడీ యనంతమై త్రివిధములైన సృష్టిస్థితిలయ కార్యములను సాగించుచుండును.

మానవస్థితిలోవలెనే భగవంతుఁడు తనమిగిలిన యన్ని స్థితులలోను ప్రత్యక్షముగాను,బరోక్షముగాను దన త్రికర్మలను సాధించుచుండును. హృదయస్పందనమునఁగాని, లేక ఊపిరి తిత్తులు పనిచేయునపుడుగాని, ఈ మూఁడుకార్యము లేకసమ యమున సాగుచుండును. హృదయస్పందనమున హృదయము పెద్దదియగును. సంకుచితమగును. నడుమ సామాన్యస్థితిలో నుండును. సృష్టిస్థితిలయకార్యములు మూఁడు నిందులో నిమిడి యున్నవి. సంకుచితమగు నప్పుడది యా జీవి మరణమునకుఁ దోవ.

సృష్టిస్థితిలయములగు త్రివిధభగవల్లక్షణము (బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు) ఏకకాలమందు అన్యోన్యసంబంధము లేకుండ స్వతంత్రముగా నన్నివస్తువులయందును జీవములయం దునుఁ బనిచేయుచుండును. చైతన్యపరిణామములో నన్నిభూమి కలలోను, బనిచేయుచుండును. అంతఃపరిణామస్థితినిగూడఁ బని చేయుచుండును. కాని ఈ లోక సృష్టి యనేకయుగములను, అంతరములను భరించి భౌతికసంస్కారమువలన పోషింపఁబడి చివఱకు భగవంతుని అన్యోన్యవిరుద్ధములగు భౌతికసంస్కార ముల వలన నశించుచున్నది. ఈ అంతిమవిచ్ఛేదమును "మహా ప్రళయమని" పిలుతురు. మహదంతర్లీనకార్యము శూన్యమగు నీలోకసృష్టి సర్వములో శాశ్వతముగ లీనమగును.

ఈ పరిణామపద్ధతిలో స్మృతిహీనుఁడైన భగవంతుఁడు పూర్ణచైతన్యము పొందగల్గెను. కాని తన సనాతనమగు స్థితి చెందక యదిపరిమితమై స్థూలమై యున్నది. పరిమాణదశలో నెంతశ్రమయో గలిగినపిదప భగవంతునకు పూర్ణచైతన్యము లభించినది. స్థూలరూపమున బెరిగిన సంస్కారముల భార మును భరింపవలసి వచ్చినది. మానవరూపము ధరించుటకుఁ బూర్వము స్థూలవస్తురూపముల సంయోగములోని సంస్కార ముల ననుభవింపక తప్పినదిగాదు. కనుక మానవరూపము లోని భగవంతుఁడు పూర్ణచైతన్యము పొందినప్పటికిఁ దన యాదిస్థితి స్మృతి లేకుండును. ఈ ఎఱుక లేమికిఁ గారణము అనవసరములైన స్థూలసంస్కారముల భారము గలిగిన పూర్ణ చైతన్యమును పట్టుకొని వదలకపోవుటయే.

మానవరూపములోని భగవంతుఁడు ద్వంద్వములు విరు ద్ధములునగు సంస్కారముల వలన నీపరిమితమగు సంస్కార ములను వదల్చుకొనుటకుఁ జేయు యత్నములను బునర్జన్మ మార్గ మని చెప్పెదరు.

మితిమగు సంస్కారముల భారమునుండి చైతన్యము తప్పించుటకు భగవంతుని స్థూలచైతన్యమీ సంస్కారముల యనుభవమును పొందవలెను. అనేకజన్మములలోని యన్యోన్య విరుద్ధ సంస్కారములద్వారమున వీని నశింపు చేయవలసి యున్నది. వస్తువుతో వ్యతిరేకములగు ననుభవములీ సంస్కా రములను క్షీణింపఁజేయుట కవసరములు. అన్యోన్యవిరుద్ధము

లగు అనుభవములచే వేళ్ళుబారియున్న సంస్కారములను నిర్మూలింపఁగలవు.

పునర్జన్మములను బొందుటలో మానవునిలోని స్థూల చైతన్యముగల భగవంతుఁడు పూర్తిగా పరిణామము పొందిన సూక్ష్మమనఃశరీరముల సహాయము గలిగి యుండును. స్మృతి లేకయే యివి యెల్లప్పుడు నుపయోగపడుచుండును. ఇట్టి భగవంతు డెడతెగనట్టియు, అన్యోన్యవిరుద్ధము నగు చైతన్య సంఘర్షణము పొందినగాని యివి పూర్తిగా క్షీణింపవు. ఈ సంస్కారములు మానవుని మనస్సుచే నాకర్షింపఁబడుచున్నవి. అంతరస్మృతిలోనుండి యవసరమునుబట్టి పైకి వచ్చుచుండును. ఈ సంస్కారము లాంతరస్మృతినుండియు భగవంతుని పూర్తి చైతన్యమునుండియు పైకివచ్చి వానిబలమునుబట్టి భిన్నములగు మానవప్రభావములను గలిగియుండును. కారణశక్తికి స్థానమైన సూక్ష్మశరీరము మానవుఁడు కర్మములుచేయుటకు వలసిన శక్తి నిచ్చుచుండును. ఈ కర్మములు జాగ్రదవస్థలోగాని, స్వప్నస్థితిలోఁ గాని చేయఁబడును. ఈ కర్మములుగూడ సంస్కారములనుబట్టి యన్యోన్యవైరుద్ధ్యముగా నుండును.

స్థూలావరణమున మనుష్యస్థితిలో ప్రాణశక్తి, మనస్సు పూర్తివికాసమునొంది నిరంతరము కార్యములో నిమగ్నమై యున్నను నవి పరోక్షముగాను స్మృతిలేని స్థితియందుఁ బని చేయుచున్నవి. కారణశక్తి తన ఆవరణమున చైతన్యముతో భగవత్ కార్యమునకు వినియోగింపఁబడును. కాని సూక్ష్మావరణములో మనస్సు స్మృతిలేక పరోక్షముగా నుపయోగింపఁ

బడును. మానసికావరణములో మనస్సు స్మృతిపూర్వకముగ దైవకార్యమునకు వినియోగింపఁబడినప్పుడు కారణశక్తి పరోక్షముగాను స్మృతిలేక వినియోగపడుచున్నది.

స్థూలచైతన్యముగల భగవంతుఁడు స్థూలప్రపంచములోని ద్వంద్వానుభవములను బొందునప్పుఁ డాయన యనేక పర్యాయములు జన్మము లెత్తుచుండును. పురుషుఁడుగా స్త్రీగా ననేకజాతులలోను, సంఘములలోను, నానా దేశములలోను విరుద్ధసంస్కారముల యనుభవముల వలన సంస్కారములను క్షీణింపఁజేయుటకు యత్నించుచుండును.

మానవరూపమున యనేక లక్షల జన్మముల నెత్తి యెత్తి స్థూలచైతన్యముతో నన్యోన్యవిరుద్ధములగు ననుభవముల ద్వారమున నీ సంస్కారములను రూపుమాపఁ గలుగును. మానవరూపములోనున్న స్థూలచైతన్యముగల భగవంతుఁడు పై నుదహరించిన పరిణామము నొందునిమిత్తమంతర్గతమగు చైతన్యభావమొందఁ బ్రారంభించును. స్థూలసంస్కారములు క్రమముగా బలహీనమగు కొలఁదియు నంతర్గతచైతన్యపరిణామము రూపొందుచుండును.

ఈ జన్మపరంపర పూర్తియై సంస్కారము క్షీణదశకు వచ్చినపుడు మానవరూపములోని భగవంతుని చైతన్యమంతర్ముఖత్వ మభివృద్ధిపొందును.

చైతన్యములోపలినుండి విస్తృతమగు కొలఁదియును స్థూలచైతన్యము మానవరూపములోని భగవంతుఁడు క్రమ

ముగా స్థూలప్రపంచమునకు దూరమగుచుండును. ఇప్పు డన్యోన్యవిరుద్ధములగు సంస్కారానుభవములుకూడ క్షీణించును.

చైతన్యము పరిణామము పొందినప్పుడు భగవంతుఁడు పూర్ణచైతన్యము పొందుట జూచితిమి. కాని యాచైతన్యము సంస్కారముల వాసన కలిగియున్నది. ఈ చైతన్యమునుండి సంస్కారములను దూరముచేయవలెనన్నచోఁ బునర్జన్మములఁ బడయుట, చైతన్య మంతరభివృద్ధి పొందుట జరుగుచుండవలెను.

భగవంతుని చైతన్యము క్రమాభివృద్ధి పొందుట మానవుఁడు కన్నులు క్రమముగాఁ దెఱచుట వంటిదని పోలిక చూపియుంటిమి. కన్నులు పూర్తిగా తెఱచిన స్థితి పూర్తి చైతన్యస్థితితోఁ బోల్చియుంటిమి.

చైతన్యముతో జాగ్రదవస్థలోనున్న మానవుఁ డదివఱకేండ్లకొలఁది పొందిన సంస్కారములకు భిన్నసంస్కారములను తనకార్యములో నిమగ్నుఁడై తన్నుదాను మఱచినస్థితిలోఁ బొందెడి యనుభవములవలెనే, మానవరూపములోనున్న భగవంతుఁడు తిరిగి తిరిగి జన్మముల నెత్తుటతోఁ బోల్చవచ్చును.

మానవుఁడు పగలంతయుఁ దనకార్యకలాపమున నిమగ్నుఁడై సాయంకాలమాత్మవిచారమునకు సంబంధించిన పనులకుఁ దన ధ్యానమును మరలించినట్లు మానవరూపమునందున్న భగవంతుఁడు తనచైతన్యము నంతఃపరిణామము వైపునకు మరలించును. ఇట్టి ప్రేరణమువలన మనుష్యుఁడు బాహ్యావ్యాసంగమునుండి మరలి యాత్మవిచారణము సేయఁగడఁగును.

పూర్ణచైతన్యము భిన్నభిన్నములగు నంతరముల నేడింటి ద్వారమున వృద్ధిపొందినట్లుగనే తచ్చైతన్యాంతఃపరిణామము కూడ నంతరముల నేడింటిద్వారమున వృద్ధిపొందును. ఈ చైతన్యాంతః పరిణామస్థితులును చైతన్యావరణ సప్తకమని పిల్వఁబడును. వీనిలో నేడవయావరణము చైతన్యాంతః పరిణామ వృద్ధిలోఁ దుదిఘట్టము. ఇందు భగవంతుఁడు స్మృతి పూర్వకముగా స్వీయానంత శాశ్వతస్థితి సాక్షాత్కారము నొందుచున్నాఁడు. అనఁగా మొదట స్మృతిహీనుఁడైన భగవంతుఁడు తన మఱపువిషయమునే మఱచినాఁడనుట.

మానవరూపమున భగవంతుని యీ స్థితిసప్తకము మానవుని తీవ్రమగు దూరదృష్టితోఁ బోల్పవచ్చును. స్వాత్మ సాక్షాత్కారమునకై చేయు యత్నమునఁ దన దృష్టి నంతర్ముఖ మొనరించి క్రమముగా నావరణ సప్తకమునఁ జొనిపి తుదకుఁ దనను దానే చూచుకొనుట తటస్థించును.

అనేకజన్మముల యనంతరము స్థూలానుభవముల పరమావధికిఁ జేరుట కల్గును. అత్తఱి స్థూలానుభవములు నీరసించి నశించును. మానవదేహమున స్థూలచైతన్యముగల భగవంతుఁడు క్రమముగా నంతఃపరిణతి నొందుట ప్రారంభమగును.

ఇత్తఱి స్థూలచైతన్యము మానవరూపమునఁ బరిపూర్ణుఁడైన భగవంతుని సూక్ష్మశరీరమార్గమునఁ బ్రథమావరణానుభవమును గొంతవఱకుఁ బడయును. స్థూలచైతన్యముగల భగవంతుని యంతశ్చైతన్యము మానవరూపముననుండి సూక్ష్మ

లోక ప్రథమావరణములోనికిఁ దొంగిచూచుట జరుగును. ఈ యనుభవములు కొంత స్థూలశరీరద్వారమునను, కొంతసూక్ష్మ శరీరద్వారమునను కల్గుచున్నవి. ఇచ్చట స్థూలసూక్ష్మేంద్రియము లేకకాలమున వినియుక్తము లగును.

స్థూలమునుండి సూక్ష్మప్రపంచమును వేఱుచేయు ద్వారమునొద్ద మానవరూపముననున్న భగవంతుఁడు నిల్చు స్థితి యిది. ఇచ్చట మానవుని చైతన్యము వింత యనుభవము నొందును. స్థూలదృష్టితో సూక్ష్మావరణమును గాంచఁగల్గు చున్నాఁడు. స్థూల శ్రవణేంద్రియముతో సూక్ష్మావరణము నుండి వచ్చు దివ్యగానమును వినఁగల్గుచున్నాఁడు. ఇట్లే ఘ్రాణేంద్రియముతో సూక్ష్మావరణమునుండి వీతెంచు దివ్య వాసనల నాఘ్రాణింపఁ గల్గుచున్నాఁడు. మానవరూపమున స్థూలచైతన్యముగల భగవంతుఁడు సూక్ష్మలోకప్రథమావరణ భాగమునుండి వచ్చు సూక్ష్మసంస్కారముల స్థూలేంద్రియ ములతోడనే యనుభవించుచున్నాఁడు.

స్థూలచైతన్య మంతర్గతమగుచున్నకొలఁది సూక్ష్మలోక ప్రథమావరణమందలి పూర్ణానుభవములను మానవరూపమం దలి భగవంతుఁడు పొందుచుండును. ఇప్పటికి మానవరూపము నందలి భగవంతుని చైతన్యమునకు స్థూలలక్షణము వదలిపోయి సూక్ష్మచైతన్యము లభ్యమగుచున్నది.

అంతర్గతచైతన్యము వృద్ధియగు కొలఁది సూక్ష్మచైత న్యము నొందిన మానవునకు (భగవద్యాత్రికి) ద్వితీయావర ణానుభవవృద్ధి కలుగుచుండును.

సూక్ష్మప్రపంచ మనంతశక్తి ప్రధానస్థానము. ఈ శక్తి యనంతమగు త్రిగుణలక్షణభాగము. ఈ శక్తికణ మనంతకాల గర్భమునుండి పరిమితమాయాలోకములకుఁ బ్రసరించునప్పుడు సూక్ష్మలోకమున ననంతశక్తిగా నావిర్భవించును.

రెండవ యావరణమున భగవత్ప్రేరిత మానవుఁడు సూక్ష్మచైతన్యమును గలిగియు స్థూలమనశ్శరీరముల చైతన్యము లేకయు నున్నాఁడు. కాని మానవుఁడు స్థూలశరీరము ద్వారమున మనస్సుతోఁ బనిచేయును. సూక్ష్మావరణముపై వీనికిఁ గ్రియాశక్తి యుండదుగాని సూక్ష్మలోకమందుండి పనిచేయును.

సూక్ష్మచైతన్యము కలిగిన మానవరూపమున భగవంతుఁడు స్థూలమనశ్శరీరముల చైతన్యము కలిగియుండకపోయి నప్పటికిని, స్థూలమనోలోకముల యనుభవములను బ్రత్యక్షముగా పొందనప్పటికిని, స్థూలశరీరమును బ్రత్యక్షముగాఁ గాక సూక్ష్మావరణమునుండి యుపయోగించుచుండును. ఈ స్థూలశరీరకార్యములను కర్మేంద్రియజ్ఞానేంద్రియముల ద్వారమున కొనసాగించుట కాన్పించును. అట్లే మానవరూపమునందున్న భగవంతుఁడు సూక్ష్మప్రపంచ ద్వితీయావరణచైతన్య మొంది నప్పుడు తన మనశ్శరీరమును (అనగా మనస్సును) గూడ వినియోగించును. పరోక్షముగా భావములు, వాంఛలు, మనోవికారము లనఁబడి పైకి స్థూలలక్షణముగాఁ గనఁబడు నట్టివాని ద్వారమున మనశ్శరీరముపై పనిచేయును.

ఇప్పు డంతశ్చైతన్యము వృద్ధియగు కొలది మానవ రూపములోని సూక్ష్మచైతన్యము కలిగి రెండవయావరణములో

నున్న భగవంతుఁడు సూక్ష్మలోక సంబంధానంతశక్తి యెఱుక యనఁదగు చైతన్యమును బొందును. ఈ శక్తితో మామూలుగా మాయమంత్రములు జూపుటకు,మహిమలు చూపుటకు సామర్థ్యము సంపాదించును. ఎండినచెట్టును బచ్చగాఁజేయుట, పచ్చనిచెట్లు నెండగట్టుట, రైళ్ళను మోటార్ల నాపుట, ఎండిపోయిన నూతిలో నీటిని పుట్టించుట మున్నగు మహిమలు చూపఁగల శక్తి వచ్చును.

సూక్ష్మచైతన్యముగల రెండవ యావరణలోనున్న మానవరూపములోని భగవంతుఁడు సూక్ష్మలోకానుభవములను సూక్ష్మశరీర సంబంధసూక్ష్మేంద్రియముల వలన పొందును. మామూలు మానవుని వలె నిద్రాహారవిహారములఁ జేయుచు, కష్టసుఖముల యనుభవములు పొందుచున్నను బైకిఁ గనఁబడుచున్నను, ఇప్పుడతఁడు నిజముగా స్థూలచైతన్యము లేక యున్నాఁడు. అతని అంతర్ముఖచైతన్యము సూక్ష్మలోకానుభవము పొందుచు, తన సూక్ష్మేంద్రియముల ముఖమున నూతనమగు సంస్కారములను బొందుచున్నాఁడు. ఇవి చూచుట, యాఘ్రాణించుట, వినుట యను మూఁడు లక్షణములు కలిగియున్నవి.

ఈ అంతఃపరిణామము వృద్ధియగుటచే మానవరూపముకల భగవంతునికి సూక్ష్మలోకతృతీయావరణానుభవము కలుగును. ఇచ్చట సూక్ష్మచైతన్య సూక్ష్మలోకానంతశక్తి యనుభవమును పొందును. మానవరూపములోని భగవంతుఁడు పరిమితమగు శక్తి నొక్కదాని నెక్కువగా ననుభవిం

చును. ఇట్టి స్థితిలో గొప్పమహిమలను ప్రదర్శింప శక్తి కలిగి యుండును. గ్రుడ్డివారికి దృష్టినిచ్చుట, పంగున కంగప్రదానముచేయుట, మృతునకు జీవముప్రసాదించుట వంటి యఖండ మహిమలు ప్రాప్తమగును. స్థూలచైతన్యములోనున్న మానవ రూప మొక భూభాగమునుండి మఱియొక భూభాగమునకు స్థూలవాహనములపైఁ బ్రయాణించినట్లు సూక్ష్మచైతన్యమానవరూపములోని భగవంతుఁడు సూక్ష్మలోకమందలి భిన్నలోకముల నావరణముల ననుభవింపఁ గలుగుచున్నాఁడు.

సూక్ష్మలోకములో నుండు ప్రధానావరణములు రెండు. అవి రెండవది మూఁడవది. మొదటి యావరణము గొంత సూక్ష్మలోకములోను గొంతస్థూలలోకములో నున్నది. అట్లే నాల్గవ యావరణము కొంతసూక్ష్మలోకములోను మఱికొంత మనోలోకములోను వ్యాప్తమైయున్నది. అందువల్లనే నాల్గవ యావరణము కొంత సూక్ష్మములోను మఱికొంత మనోలోకములోను వ్యాప్తమైయున్నది. అందువల్లనే నాల్గవ యావరణము మనోలోకమునకు సింహద్వార మనిచెప్పుదురు.

అంతరచైతన్యము వృద్ధిపొందగా సూక్ష్మచైతన్యములో నున్న మానవరూపములోని భగవంతుఁడు నాల్గవది యగు సూక్ష్మమానసికావరణానుభవమును బొందును. నాల్గవయావరణములో మానవరూపములోని భగవంతుఁడు సూక్ష్మశరీర పూర్తిచైతన్యము కలిగి, సూక్ష్మలోకపరిపూర్ణానుభవము కలవాఁడై యుండును. అందుచే, ననంతశక్తిమయమగు సూక్ష్మలోక, సూక్ష్మస్వభావజ్ఞానము కలిగి యున్నాఁడు. ఈ యనంత

శక్తియే సర్వమయుఁడగు భగవంతునందు నిబిడీకృతమైనట్టియు, శూన్యతనుండి మితమైన శక్తిగా నావిర్భవించిన యనంతమగు భగవంతునిశక్తి.

నాలుగవ యావరణములో మానవరూపములోని భగవంతుఁ డనంతశక్తిసంపన్నుఁ డగుచున్నాఁడు. దీని వలన మృతులను పునర్జీవితులుగా నొనర్చుట, క్రొత్తరూపములను సృష్టించుట, చైతన్యముతో కదలు క్రొత్తలోకములసృజించుట మున్నగు పనులను జేయఁగలుగుచున్నాఁడు. ఈ నాలుగవ యావరణములో భగవంతుఁ డఖండశక్తిమూర్తియని చెప్పవలెను.

నాలుగవ యావరణములోని యీ సూక్ష్మమనోలోకముల యనంతశక్తి స్థూలలోకమునఁ దెలిసిన సాధారణశక్తివంటిది కాదు. సర్వజీవరాసి యూపిరియనఁబడు నఖండమగు ప్రాణశక్తి. ఇదియే జీవనప్రదాత. ఈ యనంతశక్తియే మట్టినుండి జీవములను సృష్టింపఁగలదు.

ఈ శక్తియనంతమైనదైనను వాస్తవమగు భగవంతుని యఖండశక్తితో సరిదైనది కాదు. భగవంతుని యీయఖండశక్తి 'మాయ'గాఁ బరివర్తన మొందినప్పుడు నాలుగవ యావరణములోని సూక్ష్మమనోలోకముల యఖండశక్తి బరిమితమగు రూపాంతరముగా నవతరించును.

సూక్ష్మచైతన్యము కలిగి మానవరూపములోని భగవంతుఁడు, నాలుగవ యావరణములోని యఖండశక్తిరహస్యమును

బొందినవాఁడై మనఃప్రపంచద్వారమున స్థిరత్వమేర్పఱచు కొన్నాఁడు. ఇప్పుడు మనోలోకమందలి మనఃప్రధానలక్షణ మగు తీవ్రవాంఛలు, నాలోచనములు, మనోవికారములు నతనిని ఝంఝూమారుతమువలె చుట్టుముట్టినవి.

అఖండశక్తి స్వరూపుఁడననెడి యనుభవమును స్మృతి పూర్వకముగా మానవరూపమందలి భగవంతుఁడీ నాలుగవ యావరణములో నొందుచున్నప్పటి కీసమయముననే 'కాళ రాత్రి' యనుభవము కూడఁ గలుగుచున్నది. ఇప్పు డొకనైపు దయ్యము మఱియొక నైపు అగాధమగు సముద్రము మధ్య మునఁ దగుల్కొన్న యనుభవములు కలుగుచున్నవి. తనకుఁ బ్రాప్తించిన యీ యఖండశక్తి నుపయోగించుకొనవలెననెడి వాంఛ తీవ్రముగా వేధించుచుండును. సమస్తకోరికలను మనో వికారములను, దలంపులను బూర్ణముగా లొంగదీసిఁ స్వాధీ నములోనికి దీసికొని రాఁగల యచంచలశక్తి అంతశ్చైతన్య మునకుఁ గలుగుచుండు సమయములో మానవరూపమందలి భగవంతుఁడీ యనన్యములగు కోరికలనెడి శత్రుకోటి నెదు ర్కొన వలసియుండును.

ఈనాలుగవయావరణములోనున్న మానవరూపములోని భగవంతుని చైతన్యము నెదుర్కొనుటకు మానసావరణము నుండి తీవ్రమగు కోరికలు బయలుదేఱిన భగవంతుని పరా జితుని చేసినయెడలఁ దనకుఁ గలిగిన యఖండశక్తులను విని యోగించి వైచక్షణ్యము లేకుండ స్వార్థపూరితములగు కోరిక లను దృప్తిపఱచుటకు యత్నము జరుగును.

సూక్ష్మలోకసంబంధమగు నీ యఖండశక్తి మంచిచెడ్డల తారతమ్య మెఱుఁగక విడుదలయైనప్పుడు స్థూలచైతన్యమునకు గ్రాహ్యముకాని యపకారము జరుగును. అణుశక్తి విజృంభించి నప్పుఁడు జరుగు విపరీతానుభవము మనకుఁ దెలియును. అట్టి యీ యణుశక్తి సూక్ష్మలోకములోని యఖండశక్తిలో నొక చిన్న స్థూలభాగమై యున్నది.

నాలుగవ యావరణములోని చైతన్య మఖండశక్తి విడుదల వల్లఁ గలుగు తాకిడి వలన యనుభవమును బొంది దానికి వశమైపోయిన యెడల, నీ మానవరూపములోని భగవంతుని యంతశ్చైతన్య మంతవఱకు లబ్ధమైన దానిని, గలిగిన యనుభవములను బూర్తిగ కోల్పోయి మొదట కలిగిన స్థూలమును బహుపరిమితమైన చైతన్యము కలిగిన స్థూలమగు రాతిరూపముతో భగవంతుఁ డైక్యముపొందును. మొదట వివరించిన మాదిరి భగవంతుఁ డీయవస్థాపరంపరల యనుభవములను బొందుచు మానవరూపమునఁ బూర్తిగా చైతన్యము పొంద వలెను.

ఒకమాఱు ప్రాప్తమైన చైతన్యము కోల్పోవుట యనునది సాధారణముగా నుండదు. కాని నాల్గవఆవరణములోవిచ్ఛిత్తియైన చైతన్యమునకు మాత్రమీ గతిపట్టును. ఇది యసాధారణమైన విషయము. శక్తులు దుర్వినియోగము చేయఁబడి నప్పుడు సంభవించును.

నాలుగవ యావరణములోఁ బ్రతిఘటించు కోరికలను జయించిన* యఖండశక్తిని సద్వినియోగముచేసినచో మానవరూపములోని భగవంతుఁడు మనోలోకములోని యాఱవ యావరణము చేయును. దీనివలన నాలుగవ యావరణము ననుభవింపఁ బనిలేదు.

కాని మంచిచెడ్డలు లేక లబ్ధమైన యంతశ్చైతన్యమును నాలుగవ యావరణములోఁ గాపాడుకొనుచున్న యెడల మానవరూపములోని భగవంతుఁ డయిదవ యావరణము చేయును. ఇది మనోలోకము ద్వారము దాటిన తరువాత జరుగును.

---

* కోరికలను ప్రయత్నముతో నశింపచేయవలెను. అవి సంస్కారములకుఁ గారణము. అహంకారమునకు సంబంధించిన లక్షణములవల్లను కర్మములవల్ల మనశ్శరీరముపైఁ గలుగు ప్రభావములవల్ల నీ సంస్కారములు పుట్టుచున్నవి. కోరికలు స్థూలశరీరము ద్వారమున ప్రకటితమైనప్పుడు కర్మములకు దారి తీయుచున్నవి. ఈ సంస్కారములు చైతన్యమునకు పని కలిగించుచుండును. అందుచేఁ బరమాత్మ తన్నుదా తెలిసికొనుటకీ చైతన్యము పనికిరాక పడుటలేదు. ప్రయత్నములో నీ సంస్కారము తుడిచివేయబడినయెడల నాత్మ సత్యమును ప్రదర్శించుటకుఁ బ్రారంభించును. అప్పు డిహసంబంధములగు కోర్కెలనుండి మనస్సువిముక్తి పొందుటకుఁ బ్రారంభించును. వ్యక్తినుండి (జీవాత్మ) (కోరికలు) తీసివేయఁబడినప్పు డాత్మమిగులును; భగవంతుని చైతన్యము లేకపోయుండును. మనము జీవముతో నున్నప్పుడే యీకోర్కెలతో నిండిన జీవితమును త్యజింపవలెను. పరమచైతన్యస్మృతిని గోరికలను విసర్జించుట ద్వారమున నొందుటయే జీవితలక్ష్యము.

అయిదావరణములు చైతన్యప్రధానముగా మనస్సునకు సంబంధించిన మనోలోకమునకుఁ జెందియుండును. మనోలోకములో మానవరూపములోని భగవంతుఁడు తనమనస్సునకు యజమానుఁడు. కాని స్థూల సూక్ష్మలోకములలో, స్థూలసూక్ష్మ చైతన్యముతో మనస్సునకు లొంగియుండెడి వాఁడు.

అయిదవ యావరణమున వృద్ధిపొందుచున్న యీ అంతశ్చైతన్య మీ యావరణసంబంధ మనోలోకానుభవములను, మనోదృష్టివల్లను మనోనేత్రము ద్వారమున చూచుచున్నవి.

మనశ్చైతన్యము కలిగియున్నప్పుడు మానవరూపములో భగవంతుఁడు స్థూలసూక్ష్మరూపములస్మృతి యుండదు. కాని ప్రత్యక్షముగాఁగాక సూక్ష్మావరణమునుండియు, పైనను స్థూలసూక్ష్మశరీరములవలన నాతఁడు పనిచేయుచుండును. మానవరూపములో మనశ్చైతన్యము కలిగినప్పుడు స్థూలసూక్ష్మచైతన్యము లేమిచే నాలోకము యనుభవముల నొందనప్పటికిని, స్థూలశరీరమునుఁ గొన్నిట స్థూలకార్యములకు వినియోగించును. అందుచే మనశ్శరీర చైతన్యానుభవమును దన మనోనేత్రము ద్వారమున మాత్రము కలిగియున్నను, దినుట, త్రాగుట, నిద్రపోవుట మున్నగు స్థూలేంద్రియకర్మములు స్థూలమానవరూపములో సాగుచునేయుండును. అట్లే తన సూక్ష్మశరీరము స్ప్రయత్నముగను స్మృతిలేకయే తనయఖండశక్తిద్వారమున నుపయోగించుచునే యుండును. పైకి స్థూలముగాఁ గానఁబడు కార్యకలాపముస నిమగ్నుఁడైనప్పటికిని మన

శ్శరీరము మనశ్చైతన్యమునే కలిగియుండును. తన మానసేంద్రియముద్వారమున మనోలోకానుభవము పొందుచుండును. మనశ్చైతన్యముతో మనోలోకములోనున్న మానవరూపములోని భగవంతుఁ డొక్క-యింద్రియమునే కలిగియున్నాఁడు. అదే 'చూచుట లేక దృష్టి' (ఇది యేదృగ్దృశ్య వివేకమనెడి యద్వైతమందలి విచారణమును జాలవఱకుఁ బోలియున్నదన వచ్చును.)

అయిదవ యావరణమున మనశ్చైతన్యములోనున్న మానవరూపములగల భగవంతుఁడు తన మనోదృష్టి వలన వెడలు సంస్కారానుభవముల నొందుచున్నాఁడు. ఇప్పుడతని కొక్క మనస్స్ఫురితియే కలదు. ఈ స్థితిలో స్థూలసూక్ష్మ చైతన్యములలోనున్న మానవుల మనస్సుల నతఁడు స్వాధీనములో నుంచుకోఁ గలుగుచున్నాఁడు.

అయిదవయావరణములో నున్న మానవుఁడు మనశ్చైతన్యము కలిగి మహిమలను బ్రదర్శించు శక్తి లేకున్నాఁడు. మహిమలను ప్రదర్శించు నఖండశక్తికల సూక్ష్మలోకములో లేఁడిప్పుడు. ఇప్పుడు మనోలోకములో నున్నాఁడు. మనశ్చైతన్యము కలిగి సూక్ష్మచైతన్యములోనున్న మనస్సులపై దన ప్రభావమును గనపఱిచెడి శక్తి కలిగియుండుటచే వారిచే మహిమలను గనబఱుచునట్లు ప్రేరేపింపఁగల మూలశక్తి సంపన్నుఁడైనాఁడు. తనతన మనశ్చైతన్యస్థితిలోని మహిమలఁ బ్రదర్శింపఁ శక్తి లేకపోయినను సూక్ష్మావరణములో నున్న

వారిమనస్సులను నడిపించి వారిచే మహిమలఁ బ్రదర్శింపఁ జేయఁగల మనశ్శక్తిని గలవాఁడై యుండును.

మనశ్చైతన్యమున నున్న మానవుఁడు స్థూలసూక్ష్మ చైతన్యస్థితిలోనున్న మనస్సుల యాలోచనలను, గోరికలను, వికారములను సృష్టించుటకు, నశింపించుటకు శక్తి కలిగి యున్నాఁడు. అయిదవయావరణమునఁ జేరునప్పటి కొంత స్థిరత్వ మాయనకు సిద్ధించినది. అంతర్గతముగా నింతవఱకుఁ గలిగిన చైతన్యము దిగజాఱదు; విచ్ఛేదముకాదు.

ఈ మనశ్చైతన్యము వృద్ధియగు కొలఁదిని మనస్సుపైఁ దన యధికారము బలపడుచుండుట తెలిసికొనును. అప్పుడు మనస్స్వరూపము పొందిన చైతన్య మగును. ఇట్లు మానవుఁడు మనశ్చైతన్యలోకమైన యాఱవయావరణములోని మనోలోక సంపూర్ణానుభవమును బొందుచున్నాఁడు. ఈ యనుభవము ప్రత్యక్షముగాఁ దనను దానే' భగవంతుఁ డాదిమరూపమును "ముఖాముఖి'ని దర్శించుటయని చెప్పఁబడును. మన ఇంద్రియ మగు 'దృష్టిద్వారా మనశ్చైతన్యము చూచుటయే యీ "దర్శనము' అని చెప్పఁబడును. అనఁగా మానవరూపములో భగవంతుఁ డన్నిచోటులను బ్రతివస్తువులోను సర్వవ్యాపినిగా దర్శించును.

మొదటి యావరణము మొదలు ఆఱవయావరణమువఱకు క్రమపరిణామము పొందిన చైతన్యము క్రమముగా వృద్ధిపొందుచు నన్యోన్యవైరుధ్యములగు సంస్కారముల యనుభవములు

క్రమముగాఁ తరుగుచు క్షీణదశకు వచ్చెను. ఇట్లీ సంస్కార ములు నాశనమగు సరి కాజీవయానవరణములో భగవంతుఁడు మనశ్శరీరము పూర్ణచైతన్యమును బొందెను. చివరకు ఆత్మనిరుద్ధములై బహు నీరసస్థితిలోనున్న కొద్ది సంస్కారములుమాత్ర ము మిగిలియున్నవి. ఈ అంతశ్చైతన్యము మనస్సుతో నేకత్వము పొందినప్పుడు భగవంతుఁడు తానే 'మనస్స'ని తెలిసికొనును. 'మనస్సు'గా నున్న మానవరూపములోని భగవంతుఁడు తుదిపరిమితమగు ననుభవమును బొందుచున్నాఁడు. తాను మనస్సుగా నన్ని వస్తువులలోను భగవంతుని జూచుచున్నాఁడు. కాని తనలో మాత్రి మింకను దర్శింప లేకున్నాఁడు. ఇది మానవరూపములోని భగవంతుని యాజీవ యావరణములోని స్థితి.

ఈస్థితిలో మనశ్చైతన్యముకల మానవరూపములోని భగవంతుఁడు సంస్కారహీనుఁడైయున్నాఁడు. భగవంతుని ప్రత్యక్షముగాఁ జూచుచున్నాఁడు. సమస్తములోను గనుచున్నాఁడు. కాని తన యాత్మస్వరూపమును భగవంతునిలోఁ జూడలేకున్నాఁడు. దీనికిఁ గారణము మనశ్చైతన్యపరిభావమతని పైఁగలిమి. తానే మనస్సను కొనుచున్నాఁడు.

దీనివలన తానుభగవంతునికంటె భిన్నుఁడనను భావము విశదమగుచున్నది. తన మనశ్చైతన్యముతో భగవంతుని ప్రత్యక్షముగాఁ జూచుచున్నాఁడు. భగవంతుని స్థూలసూక్ష్మ రూపములలోకంటె నిప్పు డెక్కువనిస్పష్టముగాఁ జూడఁగలుగుచున్నాఁడు.

అన్యోన్యవిరుద్ధములగుసంస్కార లేశములు మిగిలియున్న వని పైనచెప్పితిమి. ఆఱవయావరణములో మన శ్చైతన్యము కలిగిన మానవరూపములో భగవంతుఁడు ద్వంద్వముల స్మృతి కలిగి తాను మనస్సుతో నేకత్వముపొందుచు భగవంతునికంటె భిన్నమగు భావములోనున్నాఁడు.

అయిదాఱావరణముల మనఃప్రపంచము నందలిచైత న్యాంతఃపరిణామము తెలిసికొనవలెనన్నచో నది మనసోధికార స్థానమని గుర్తెఱుఁగవలెను. మన ఆవరణములోని మనస్సునకు రెండుభాగములు కలవు.

మొదటి భాగములో మనస్స్థితి, విచారణము లేక యాలోచనాస్థితి. ఈస్థితిలో మనస్సాలోచనములో మునిఁగి యుండును. మంచివి, చెడ్డవి, యైహికములు, నాధ్యాత్మిక ములు నగు ఆలోచన లన్నిరకము లిందిమిడియున్నవి.

రెండవ భాగములో మనస్సు భావాకర్షణము చేయుట యనఁదగు సహానుభూతిస్థితిలోనుండును. ఈస్థితిలో కష్టసుఖ ములు, వాంఛావిచారణములు మున్నగు వివిధములగు రసాను భూతు లనుకంపాభావమ్మొదులను లైవహ త్రికొనును.

మనోలోకములో మనస్సు ద్వంద్వతత్వము కలిగియుం డుటచే నీ రంగములో మనోనుభవములు కూడ రెండువిధము లుగా నుండును.

మనోలోకము రెండుభాగములు. అయిదవయావరణము భావములు నేకాలోచనలతోఁ గూడియుండును. ఆఱవయావ రణము రసానుభూతు లనుకంపాభావములు నైయుండును.

మానవరూపములోని భగవంతుఁ డయిదవ యావరణములో మనస్సు మొదటి భాగముతో సంబంధము కలిగి యుండును. విచారణము ఆలోచనాన్వితమైన మనస్సు. ఈ యయిదవయావరణములోని మానవుఁడాలోచనముల సృష్టికర్త; యజమానుఁడు. ఆయన భావము మూర్తి. స్థూలసూక్ష్మచైతన్యము కల భగవంతుని మానసికప్రవృత్తులపై పెత్తనముచేయును.

స్థూలచైతన్యములో భగవంతుని మనస్సునే స్వాధీనము చేసికొనినాఁ డని భ్రమపడుచుండును. కాని వాస్తవ మేమి టనఁగా నయిదవ యావరణములోని భగవంతుఁడు మనస్సునంతటిపైన నధికారము గలిగియుండఁడు సంకల్పరూపమైన మనోభాగమునే స్వాధీనమునం దుంచుకొనును.

ఈ స్థితిలో భగవంతుఁడు భావముల నుత్పన్నముచేయు మనోభాగముతో సంపర్కము కలిగియుండి, వాంఛానుభూతులు గల ద్వితీయ మనోభాగముపై నధికారము పొందలేక పోవుచున్నాఁడు.

మానవరూపములో సూక్ష్మచైతన్యము కల భగవంతుఁ డయిదవ యావరణములో నుండి యారవయావరణములోఁ బ్రవేశించుచున్నాఁడు. ఇప్పుడు మనస్సు రెండవభాగముతో నైక్యము పొందుచున్నాఁడు.(సహానుభూతి, భావాకర్షణములు గల స్థితి యిది)

ఈ చైతన్య మారవయావరణములో మనోనేత్రసాహాయ్యమున మానవుఁడు మనోలోకానుభవము పొం

దుచున్నాఁడు. అనఁగా రసానుభూతులతోఁ గల సంబంధము వలన నచ్చటి వాని లక్షణములను మూర్తీభవించుచున్నాఁడు. అన్నిచోట్ల సమస్తవస్తువులలోను సదాప్రత్యక్షముగా భగవంతుని దర్శించుటవల్ల గలుగు రసానుభూత్యనుభవమును బొందుచున్నాఁడు. భగవంతునెల్లప్పుడును జూచు ననుభవము కలిగినను భగవంతునిలోఁ దన ప్రతిబింబమును గనలేకున్నాఁడు. భగవంతుని దర్శనమువల్ల గలుగుభావోద్రేకముచేఁ దాను భగవంతునితో నేకత్వమునుఁ బొందలేకపోవుచున్నాఁడు. తానింకను రసానుభవములోనే యుండుటచే నీస్థితిలో భగవంతునితో నేకమగుటకుఁ దీవ్రముగాఁగోరును, బరితపించును. మానవునిలో రసప్రధానమైన యీమనోద్వితీయభాగముతో నైక్యము పొందినప్పుడు క్రమముగా భగవంతునిలో నైక్యమైనప్రజ్ఞాపూర్వక భగవత్సాక్షాత్కారమును బ్రసాదించుఁ భగవద్ప్రేమము తీవ్రముగా నావిర్భవించును.

అయిదవ యావరణములో భావములపూర్ణచైతన్యము మాత్రమే యుండునని మనమెఱుఁగవలెను. ఇచ్చట భావములపై నధికారమేర్పడినది. కాని వాంఛలపై ననురాగములపైన నధికార మేర్పడలేదు. ఆఱవయావరణము రసానుభూతులపై పూర్ణస్వాధీన మేర్పడ్డ చోటు. ఇచ్చట నాలోచనయొక్క శేని జొరఁబడుటకు వీలులేదు.

ఆఱవయావరణ మాలోచనము లేక భావము ననుసవి లేనిది. భగవంతుని స్థూలసూక్ష్మస్థితిలోని రసానుభూతులఁ గలిగియుండును. దీనివల్ల భగవంతుని స్థూలసూక్ష్మచైతన్య

ములో నున్నవారి హృదయములపై నధికారము చేయుచున్న దను తప్పుటర్థమును జెప్పుచున్నారు. హృదయములపై నధికారము లేక మనోలోకములోని మనస్సు రెండవభాగముపై నధికారము కలిగియుండును. దీనినుండియే కోరికలు, రాగము ఉత్పన్నమగును.

చైతన్యము నాఱవయావరణములో భగవంతునియందు ప్రేమ, యాయనతో నైక్యము పొందుటకుఁ గోరిక ప్రస్ఫుటమగును. ఆఱవయావరణములోని మనోలోకము నధిగమించి నప్పుడు తుదిసంస్కారలేశములు నశించుటతో మాయకూడ సమసిపోవును. అప్పుడు సత్యమవగతమగును.

మనశ్చైతన్యముకల మానవరూపములోని భగవంతుఁడాఱవయావరణమున ద్వంద్వానుభవముల నింకను బొందుచున్నాఁడు. ఈ స్థితిని భగవంతుఁడు తననుదాను మనస్సుగానే కనుఁగొనుచున్నాఁడుగాని నిజదర్శనము చేయలేదు.

ఈ ద్వంద్వస్థితి, యంతశ్చైతన్యస్థితి కడపటిదగు నేడవయావరణము చేరువఱకు వ్రేలాడుచుండును.

ఈ యేడవయావరణములో మానవరూపమునందు పూర్ణమగు భగవంతుని చైతన్య మంతర్ముఖమగును. దీనివలన తనమీఁదనే తనదృష్టిని కేంద్రీకరింపఁజేసికొనును. తాను సృష్టించిన వస్తుసంచయమునుండి వెనుకకు మరలును.

ఈ పూర్ణచైతన్యము పూర్తిగానంతర్ముఖమైనది. శూన్యమునుండి బయలుదేఱి వాస్తవముగా నున్నట్లుకనఁబడిన వస్తువులన్నియు వాని సంస్కారములతోఁగూడ నంతర్ధానమైనవి.

శూన్యసంబంధము కలిగిన సంస్కారము లన్నియుఁ బూర్తిగా నశించినతరువాత సంస్కారముకలిగిన మానవరూపములోని భగవంతుని చైతన్యము చైతన్యహీనమగు చైతన్యముగా మాఱును. అంతర్ముఖముగా వృద్ధిచెందిన పూర్ణచైతన్యమొకప్పుడు భగవంతునకుఁ గలిగిన యాదిశూన్యస్థిత్యనుభవమును గలుగఁజేయును. ఈ యనుభవము స్మృతిపూర్వకముగాఁ గలుగును.

ఈ పూర్తిచైతన్యము 'మహాచైతన్య' మనఁబడును. శూన్యమునం దాదిస్థితిలో నిరాలంబస్మృతి హీనమగు భగవంతుఁ డిప్పుడు పూర్ణచైతన్యము గలవాఁ డయ్యెను. దీనినే పరమాత్మ పరబ్రహ్మస్థితిలోని భగవంతుఁడు మహాచైతన్యము పొందినాఁడనియు ననవచ్చును.

ఈ యాద్యస్థితియగు శూన్యమునఁ బ్రవేశించుట 'ఫానా'స్థితి నేడవయావరణమునం దొందుటయని చెప్పుదురు.

సూఫీభాషలో 'ఫానా' అనఁగా 'లోపలప్రవేశము గనుట'. అది రెండు కక్ష్యలుగా నుండును. శూన్యస్థితిని స్మృతిపూర్వకానుభవము పొందుట. రెండవస్థితి 'ఫానాపిల్లా' అనఁగా 'నేనే భగవంతుఁడ' నను స్థితిని స్మృతిపూర్వకముగా ననుభవించుట.

ఈ రెండవ కక్ష్యను చేరుట మానవరూపములోనున్న భగవంతుని లక్ష్యము పూర్ణచైతన్యముతో 'నేనే భగవంతుఁడ' నను సాక్షాత్కారము పొందుట. దీనినే సూఫీలు తుది 'మజూబియత్' అని చెప్పుచుందురు.

ఈస్థితి నొందుటకు మున్ముందుగానే పరిమితమగు నహ ము లేక నేను అను శరీరసూక్ష్మమనోలక్షణముల ప్రభావమును మామూలు జాగ్రిదవస్థలో మానవుఁడు కలిగియున్నాఁడు. పరి మితమగు సంస్కారముల ప్రభావము వానిమీఁద పడుచుండె డిది. కాని మానవరూపములోని భగవంతుని చైతన్యమంతః పరిణామము పొందుచున్నప్పుడీచైతన్యము క్రమముగా నాత్మా వరణముల యనుభవముల నాయా యావరణములలోఁ గలుగు చున్న సంస్కారములవల్ల పొందెడిది. లోపలి యీ మహాచైత న్యము పూర్తియగు నంతర్గత పరిణామముపొందినప్పుడు మాన వుఁడు సంస్కారములు లేని యోఁడవ యావరణములోని మహా చైతన్యమును పొందినాఁడు. లక్ష్యమును చేరుటలో నిది తుది ఘట్టము.

ఈ స్థితి వచ్చునప్పటికి 'మనస్సు' పూర్తిగా నాశనమై సంస్కారములతోఁ బా టదృశ్య మగుచున్నది. పరిమితమగు నేను అను అహంకృతితోఁగూడిన శారీర సూక్ష్మమానసిక ప్రపంచసంబంధమాయాసంస్కారములుకూడ నంతరించును. ఈ సంస్కారములుశూన్యములోనుండి బయలుదేఱిన శూన్య ములే.

ఐహికసుఖములతో సంబంధము కలిగిన యీ పరిమితా హంకృతిలక్షణములన్నియు వాని హంగులతోఁగూడ నశింపు కావుటతోఁడనే యొక విధమగు శూన్యతానుభవము చైతన్య మునకుఁ గలుగుచున్నది. ఇది యొకమాఱు ప్రాప్తించినతర్వాత

శాశ్వతముగా నిలిచియుండును. ఇప్పుడు మానవుఁడు నిరా లంబమగు శూన్యచైతన్యమును గలిగియున్నాఁడు.

ఏమియు లేని ఆకాశము సర్వ స్వతంత్రము. శూన్యము కాని, సర్వముకాని యిందు లేవు. ఇది పవిత్రమును నిరాలంబ మునగు నాకాశము లేక సర్వశూన్యము (Divine, Absolute, Vaccum) అని చెప్పఁబడుచున్నది. ఇది మాయాజనితముకాదు. సత్యమునుండి జనించినది.

శూన్య మంతరించి యాకాశములో సర్వము ప్రవేశిం పకపూర్వము 'నేనే భగవంతుఁడ'నను అనుభవము కలుగఁక పూర్వ మీ పవిత్రాకాశస్థితి యుండును.

ఇది పానా మొదటిస్థితి. శూన్యత్వము పూర్తిగా నశిం చును. 'మహాచైతన్యము' నిరాలంబమగు నాకాశముపై (absolute vaccum) కేంద్రీకరింపఁబడును. గాఢమగు దివ్యనిద్రలో నున్న పరమాత్మ పరబ్రహ్మస్థితిలో నిట్టియాకాశము వ్యాపించి యుండును.

మానవరూపస్థితిలో భగవంతుని చైతన్యము 'పానా' ప్రథమస్థితి పరిమితమగు నహమునకు మనస్సూక్ష్మప్రాణలోకము లకు సంబంధించినది కాదు. భగవంతుని చైతన్యమునుగాదు. అపరిమితమగు 'ఆత్మ' లేక అహము చైతన్యమునుకాదు. సర్వ వ్యాప్తమగు మనస్సునకుఁగాని యనంతమగు ప్రాణశక్తికిఁగాని లోకశరీరమునకుఁగాని సంబంధము లేదు. ఇట్లు పానా మొదటి స్థితిలో శూన్యాకాశచైతన్యముమాత్ర ముండును. 'మహాచైత

న్యము' పూర్తిగా సంతరున్ముఖమై శూన్యాకాశము స్మృతిని గలిగి యున్నది.

ఇదివరలోఁ దెలిపినరీతిలో సాధారణమానవుని గాఢ నిద్రలో నిట్టి శూన్యస్థితి ప్రచలనమున నుండును. అప్పటికి సంక్రమించిన చైతన్యము నిద్రాణమైయుండును. పరిమితమగు నహంకారసంబంధమగు మనస్సూక్ష్మశరీరలక్షణము లీ గాఢ నిద్రావస్థయం దదృశ్యమగును.

ఈ గాఢ నిద్రాస్థితిలోని శూన్యతకును 'ఫానా' మొదటి కక్ష్యయందలి శూన్యతకును వ్యత్యాసమున్నది. 'ఫానా'స్థితిలో శూన్యత నిద్రాణమై యుండదు. ఇచ్చట పరిపూర్ణవికాసము కలిగిన చైతన్యము భగవంతుని ఆదిస్థితిలోని నిరాలంబమగు శూన్యత యనుభవము పొందుచుండును.

'ఫానా' మొదటిఘట్టముయొక్క అనుభవము 'నిర్వాణ' స్థితి. 'నిర్వాణ'ము 'భగవంతుఁడు లేఁడు' అనుస్థితి తోఁచు నట్లొసరించును. భగవంతుఁడు లేనట్టి, చైతన్యము గలదను స్థితి యిది యొక్కటియే. బుద్ధుఁ డీ'ఫానా'స్థితినిగూర్చి వక్కా ణించినాఁడు. భగవంతుఁడు లేఁడని బుద్ధుఁడు దెల్పినట్లు తరు వాత దీనికిఁ దప్పుటర్థము చెప్పఁబడినది. సత్యమేమనఁగా నది భగవంతుని పరమాత్మపరబ్రహ్మస్థితి (God is). కాని 'ఫానా' మొదటిస్థితిలో నిరాలంబమగు శూన్యత్వము ననుభవించు చైత న్యము మాత్రము మిగులును.

భగవంతుఁడు లేనిస్థితి యసంభవ మగుటచే, నిర్వాణ స్థితిలోని భగవంతుఁడు చైతన్యపాత్రను ధరించును. దీనినే మహాచైతన్య మనిపిలుతురు.

'పానా' రెండవస్థితి నిర్వాణస్థితి వెనువెంటనే వచ్చును. 'నేను భగవంతుఁడ' నను అనుభవము స్మృతిపూర్వకముగాఁ గలుగును.

'పానా' మొదటిస్థితి నంటి రెండవస్థితి వచ్చును. దీనిని 'పానా పిల్లా' అని పిలుతురు. గతించినట్టియు, మితము నగు నహామికపై సత్యానంతమగు మహాహము బయలుదేఱును. దీనియందు మహాచ్చైతన్యము లగ్నమగును. అప్పుడు నిరాలంబ శూన్య మనంతమగు మహాత్ముతో నిండును.

భగవంతుని యీ మహాచ్చైతన్య మనంతమగు నహము నందుఁ గేంద్రీకరింపఁబడి నప్పుడు, మానవుఁ డనంతమగు భగవంతునితో నైక్యము పొందుచున్నాఁడు. అప్పు డనంత మగు భగవంతుని మహాచ్చైతన్యము 'నేనే భగవంతుఁడ' నను స్థితియం దేకత్వము పొందును. అదియే లక్ష్యము, లక్ష్య సిద్ధియు.

లక్ష్యసిద్ధి నొందుట యనఁగా నిర్వికల్పసమాధిని బొందుట.

నిద్రిపోయిన మానవుఁడు తిరిగి మానవుని స్థితియందే మేల్కాంచినట్లు, దివ్యనిద్రను బ్రివేశించినవారు భగవంతుని దివ్యస్థితియందే మేల్కొనవలెను. 'పానా' మొదటిస్థితి పూర్ణ చైతన్యము కల గాఢనిద్రాస్థితి. 'పానా పిల్లా' యను 'పానా' రెండవస్థితి భగవంతుని ప్రిత్యక్షముగా నెఱిఁగియుండుట.

'పానా' మొదటి కక్ష్య వెంటనే రెండవ కక్ష్య యగు 'పానాపిల్లా' ప్రవేశించినప్పుడు పరిమితమగు నహము,మనస్సు,

ప్రాణశక్తి, స్థూలశరీరమునకు సంబంధించిన లోకచైతన్యము తిరిగిరాదు. కాని యది మహాచైతన్యము రూపములో సర్వ వ్యాపకమైన యాత్మ లేక భగవంతునియం దైక్యము పొందును. 'నేను భగవంతుఁడ'ను 'అహం బ్రహ్మాస్మి'యను అనుభవము నీ మహాచైతన్యము పొందును. దీనిని 'అనల్‌హక్' స్థితి యని అందురు. ఇదియే నిర్వికల్పసమాధి యనుభవము. అనఁగా 'నిస్సందేహముగా నేనే భగవంతుఁడ'ను. ఇందాత్మస్మృతి పూర్వకముగా 'ఆత్మ' 'పరమాత్మలో' లీనమగును.

ఈ యనుభవమే పరమావధి. ఇది చైతన్యము పరిణామము పొందిన తరువాత లభ్యమైనది. ఇది శూన్యమున నిమిడియున్నది; పరిమితమగుశూన్య మనంతమగు శూన్యముగా పరిణమించినప్పుడిది సాధ్యమైనది. వృద్ధిపొందిన చైతన్యము శూన్యమునం దంతములేకుండ శూన్యతను దగుల్కొని శూన్యతయను మాయానుభవమును సత్యముగాను అనంతమైనదిగాను బొందినది. ఈ చైతన్య మంతర్ముఖమై పురోగమనము పొందినప్పుడీశూన్య మంతు లేని యాత్మానుభవమునుబొందును. క్రమముగా సత్యస్వరూపుఁడు ననంతుఁడు నగు భగవంతుఁడు 'సర్వము' అను సత్యమును గ్రహింపఁగలిగెను. ఇదే నిస్సందేహమును ప్రతిబంధముల కతీతమునగు 'నేను భగవంతుఁడ'నను 'పానాపిల్లా' స్థితి.

'నేనే భగవంతుఁడ'నను స్థితి ననుభవించు పరమావధిని "పానా" అందురు. ఈ స్థితిని బొందినవారిని 'మజూబ్'లు అందురు. అనఁగా భగవంతుని స్వాధీనములో నున్నవా రన్న

మాట. వీరినే 'బ్రిహ్మీభూతు'లని పిలిచెదరు. ఈస్థితిలో నంత రాయము లేకుండ స్మృతిపూర్వకముగా 'తానే భగవంతుఁడ' నను అనుభవము పొందుచుఁ దోడనే త్రిస్వభావలక్షణమగు సచ్చిదానందముల యనుభవమును బొందుచుండును.

ఏడవభూమికలోనున్న మానవరూపములోని యాత్మ చైతన్యముగల భగవంతుఁడు శాశ్వతము ననంతమునగు 'ఆత్మ' చైతన్యమును బొందును. తన యనంతశక్తి పరిమితలక్షణములు గల ప్రాణశక్తి, మనోమూలమును గుఱించిన స్మృతిని గలిగి యున్నాడు.

తన యాత్మను సాక్షాత్కరించుకొను యత్నముసఁ దన యనంతస్థితిని గుఱించి మఱచి యనేకములగు సంస్కారము లను సముపార్జించుకొనెను. ఇందులో స్థూలసూక్ష్మమనఃప్రపం చములతో సంపర్కము కలిగియుండెను. ఈ పద్ధతిలో స్థూల ప్రపంచస్థూలచైతన్యమును, సూక్ష్మమనోభూమికల యంతర్గత చైతన్యమును బొందుచు వచ్చెను. తుదకుఁ దన యాత్మ యనంతస్థితి సాక్షాత్కారము పొందెను.

భగవంతుని చైతన్య మాత్మచైతన్యమును బొంది యనంతశక్తిజ్ఞానానందముల యనుభవములను బొందినప్పుడు స్థూలసూక్ష్మమనశ్శరీరముల ద్వారమున తద్వివిధలోకముల సం స్కారముల యనుభవమును బొందినప్పు డీలోకములు పసలేని కలలనియు, శూన్య మనియుఁ దెలిసికొనినాఁడు. ఈ స్థూలశరీర ములతోను, జీవములతోను, మానవులతోను గలిగిన సంయో గములు మూఁడులోకముల భూమికల యనుభవములు పొంది

నప్పు డవియన్నియు దన చైతన్యమున బరిపక్వదశ కలిగిన యనుభవముగాఁ దెలిసికొనినాఁడు. చైతన్యము పూర్తిగా సంతఃపరిణామముపొందిన యేడవభూమికలోఁ బరిపూర్ణవికాసము ప్రాప్తించినది. దీనివలన భగవంతుఁడు తన 'ఆత్మ' సాక్షాత్కారము పొందినాఁడు. భగవంతుఁడు తన యనంతస్థితియగు 'నేను భగవంతుఁడ' నను ననుభవమును స్మృతిపూర్వకముగాఁ బొందఁగలిగెను.*

అనఁగా భగవంతుఁడు మొదట స్థూలమార్గమున ననుభవములను బొందును. అనఁగా నన్నమయకోశములో (అన్నభూమిక) శరీరమగును. తరువాత సూక్ష్మదశలో ప్రాణమయకోశము (ప్రాణభూమిక) ప్రాణశక్తి యగును. తరువాత మనోమయకోశములో (మనోభూమిక) మనస్సగును. దీనిపైనవిజ్ఞానమయకోశములో భగవంతుఁడు తానేయగును. అనఁగా నుండినవాఁడు, ఉండువాఁడు, ఉండబోవువాఁడు తానే. ఆదిని చైతన్యము లేక స్మృతి లేని స్థితిలోనివాఁడు, మఱపు అనుదానిని మఱచిపోయి 'నేనెవరు' అను మొదటి ప్రశ్నకు 'నేను భగవం

---

* సమస్తసృష్టిలక్ష్యము భగవత్సాక్షాత్కారము వల్ల కలుగు నానందమును బొందుట. ఇది లబ్ధమగుటకు లోకములో ననేక విధములగు శారీరక మానసిక కష్టములు పడుట యవసరము, యోగ్యము. అప్పుడు కష్టము కష్టముగాఁ దోఁచదు. ఈ యానందము స్వయంపోషకము, శాశ్వతము, పతనము కానిది; అనంతము, వర్ణనాతీతము. ఈ యానందముకొఱకే యీ లోకము సృష్టింపఁబడినది.

తుఁడను' అను సమాధానము పొందుచున్నాఁడు. స్థూల సూక్ష్మమనోలోకములలో భగవంతునిస్థితి వాస్తవికమైనది కాదు. విజ్ఞానమయకోశమునం దాయన నిజస్థితిలో నున్నాఁడు. ఆదిని భగవంతుఁడు భగవంతుఁడుగానుండెను. ఇప్పుడు భగవంతుఁడు భగవంతుఁడుగాఁ బరివర్తనమొందెను.

'పానా'లో మొదటిస్థితియం దంతర్గతమై నిరాలంబమగు నాకాశములోఁ బ్రవేశించుచున్నాఁడు. 'పానా' రెండవయంతరములో 'నేనే భగవంతుఁడను' అను ననంతస్థితిని బొందుచున్నాఁడు. అదే తుదిలక్ష్యమగు 'పానాపిల్లా' అందురు. ఈతుది ఘట్టమును జేరుటతో భగవంతుని మొదటి దివ్యయాత్ర పరిసమాప్తి యైనదని చెప్పవలెను. ఇది (Gnosis) యాదివిలాసములోఁ బ్రారంభమై చైతన్యము, వివిధ భూమికలను దాటి తుదకు దేవతాస్వరూపముతో నంతమొందినది.

'పానా'రెండవయంతరములో మానవుఁడు భగవంతుఁడైనాఁడు. అనఁగా భగవస్స్వరూపమును పొందినాఁడు. మానవుఁడు భగవంతుఁడై భగవంతుని జ్ఞానమును బొందియున్నాఁడు. ఆయనశక్తిని, నానందమును గలిగియున్నాఁడు. లక్ష్యము సిద్ధించిన నింకను పూర్ణత్వము రాలేదు.

'పానాపిల్లా'స్థితిలో మొదటి దివ్యయాత్ర ముగిసి మానవుఁడు భగవంతునిలోఁ బ్రవేశించి భగవంతుఁడైనాఁడు. కాని భగవంతుని జీవితములో నింకను బ్రవేశింపలేదు. భగవంతుని యనంతమగు శక్తిజ్ఞానానందముల ననుభవించుచు 'నేనేభగవంతుఁడను' అని తెలిసికొన్నాఁడు.

ఈస్థితిలో భగవదంశము పొందిన మానవుఁడు 'నేను భగవంతుఁడ'నను మహాచైతన్య స్థితినుండి సామాన్య చైతన్య స్థితిలోనికి వచ్చి 'బాఖా' అను రెండవ దివ్యయాత్రలోఁ బ్రవేశింపఁజొచ్చును.

సూఫీపదము 'బాఖా' అనఁగా 'శాశ్వతస్థితి'(Abiding-in).

'మహాచైతన్యస్థితి'నుండి సాధారణ చైతన్యములోనికి వచ్చుటయు, 'శాశ్వతస్థితి' ననుభవించుటయు, అనఁగా భగవంతుని జీవితములోఁ బాదుకొనియుండుట. 'బాఖా'స్థితిలో మానవునిలో భగవంతుని జీవితము స్థావరమై యున్నదని చెప్పుదురు. మానవుఁడు స్మృతిపూర్వకముగా భగవంతుఁడుగా పాదుకొనినాఁడు. దీనిని 'సులుకియత్' అందురు. 'మజూబియత్' లేక 'నేను భగవంతుఁడ'ననుస్థితిలో నపారమగు నానందములో మునిఁగియుండుటకును బైన వివరించిన దానికిని దారతమ్యము కలదు. 'బాఖా'స్థితి ననుభవించువారిని నిజమగు 'సాలిక్' లని సూఫీ పర్యాయభాషలోఁ బిలుతురు. సత్యమును, దైవమును అగు 'బాఖా'ను 'బాఖాబిల్లా' అని పిలుతురు. వేదాంతములో దీనిని 'ఆత్మప్రతిష్ఠాపన'మని అందురు.

'సాలిక్' 'మజూబియత్' స్థితిలోవలె అనంతమగు శక్తి జ్ఞానానందముల ననుభవించుటయే గాక తన "సులుకియత్" సాధారణచైతన్యముతో భగవంతుని జీవితములో స్థాపితుఁడై యఖండ జ్ఞానానందశక్తులను స్మృతిపూర్వకముగా సేకరించుచుండును.

తుదియగు 'పానాపిల్లా' దశలోనికిఁ బూర్ణత చెందిన చైతన్యములో నంతర్లీనమగుటకు ముందును 'బాఖాబిల్లా' దైవ స్థితిలోఁ బ్రతిష్ఠింపక పూర్వమునను 'మాయా'పరిభాషాపద ముతోఁ జెప్పవలెనన్న "పానాబాఖా" అను భావు లెందరు వ్యక్తులు గలరో యన్నివిధముల భిన్నములుగా నుండును. సృష్టి లో జీవితపరిమాణములు స్థితులలో నెన్ని భేదములున్నవో యవన్నియు పైయవస్థలో నుండును.

ఈ 'పానా బాఖా' యనుభవములన్నిటిని మూఁడు ప్రధానలక్షణములు కలవిగా విభజింపవచ్చును.

ఇందులో మొదటిది బహుసామాన్యశ్రేణికిఁ జెందినది. ఈ సామాన్యతరగతి మాయలు మాయావృతమైన జీవితాను భవములలో మేల్కొన్నస్థితికి, గాఢనిద్రాస్థితికి సంబంధించినవి.

ఇదివరలోఁ దెలిపినట్లు మాయాసంస్కారములన్నియు గాఢనిద్రలో లీనమైనప్పటికి నాదిలోని పరమాత్మపరబ్రహ్మస్థితి యేర్పడుచున్నది. అచ్చట అనంతము సత్యము నగు 'సర్వము' తప్ప వే రేదియులేదు. ఉండబోదు. అదే పరమాత్మపర బ్రహ్మస్థితి. మాయాసంస్కారములు గాఢనిద్రలోనున్న వానిని మేల్కొనునట్లు చేయునప్పు డాసంస్కారములలోనే వేరువస్థితిలోఁగూడ నుండుట తటస్థించును. అందుచే 'మాయ' అనుదినజీవితము నావరించును.

నిత్యజీవితములో గాఢనిద్రపోవునప్పుడు చైతన్యములేని భగవంతుని స్థితి పొడుకొనుచున్నది. తిరిగి లేచునప్పుడు తిరిగి మాయాజీవితములో వ్యక్తి బలపడుచున్నాఁడు.

'పానాబాఖా' రెండవస్థితి లక్ష్యసిద్ధిని బొందుట కనువగు భూమికలకు సంబంధించినది. ఇది బహుసాధారణమగు జీవితము నావరించు మాయాసంభవములకు భిన్నమైనది. అయిన నీ 'పానాబాఖా' కూడ మాయకు సంబంధించినదే.

మొదటిది మొదలుగా నాఱవభూమిక వఱకు వికాసము పొందుచున్న చైతన్య మంతర్ముఖమై పరిణామము పొందుచుండెను. ఈ భూమికలకు సంబంధించిన 'పానాబాఖా' యీ యంతర్ముఖమైన చైతన్యము పొందుచున్న సంస్కారసంయోగముపై నాధారపడియున్నది. ఇది బహుసాధారణస్థితిలో నున్న 'పానాబాఖా' నుండి భిన్నమైనది. ఇది యింకను పరిణామస్థితిలో నున్నది.

లక్ష్యమువైపు 'పానా పిల్లా' పోవు త్రోవలోని ప్రతి భూమికలో ననుగుణమగు 'పానాబాఖా' యుండనేయున్నది. పూర్తియైన చైతన్య మంతఃపరిణామము నొందుచు నీ భూమికలలో గుండ పురోగమనము చేయుచున్నది.

కాని 'పానా' యను సూఫీపదమునకు సాధారణముగాఁ జెప్పఁబడెడి యర్థ మేమిటనఁగాఁ బరమాత్మపరబ్రహ్మస్థితిలో నుండెడి నిరాలంబమగు శూన్యము లేక యాకాశములోఁ బ్రవేశము గనుటయని. పైనుదహరింపఁబడిన సర్వసామాన్యస్థితిలో నున్నట్టియు, లేక భూమికలలోఁ బ్రవేశించిన రెండవస్థితిలోనున్నట్టి 'పానా'ల కెక్కువభేదము లేదు. రెండురకముల 'పానా'లలోను, గాఢనిద్రాస్థితిలో, సంస్కారములుగల చైతన్యమొక్కటే.

రకమగు శూన్యములోఁ బ్రవేశము పొందుచున్నది. మాయా సంబంధమగు సంస్కారములు భేదమును గల్పింప లేవు.

బయట వృద్ధిపొందు చైతన్యములోను, నంతర్ముఖమై పరిణామముపొందు చైతన్యమునను 'పానా' ఒకటియేయైనను, చైతన్యములోఁ జొరఁబడు మాయాసంస్కారముల లక్షణము లనుబట్టి మార్పు జరుగుచుండును.

గాఢనిద్రలోనున్న యేజంతువు 'పానా' అయినను దానినంటియున్న మాయాసంస్కారములతో శూన్యస్థితిలోనికిఁ బ్రవేశించుటకును, దనమాయాసంస్కారములతో మనుష్యుఁడు గాఢనిద్రాస్థితిలోని శూన్యములోనికిఁ బ్రవేశించుటకును వ్యత్యాసము కలదు. అట్లే యూర్ధ్వమార్గములోని భూమిక లలోనున్న మానవుని మాయాసంస్కారములకును సాధారణ మానవుని మాయాసంస్కారములకును దారతమ్యము కలదు.

బహువిధముల 'పానా' పానాగానున్నప్పటికిని 'బాఖా' జాగ్రదవస్థలో వ్యక్తి చైతన్యములు పొందెడి వివిధసంస్కార ములు ప్రత్యేకతను గలుగఁజేయును. ఇది సృష్టిలోని యన్ని రకముల భిన్నావస్థలలో నున్న జీవకోటికి వర్తించును.

దీనికి భిన్నముగా 'పానా' గాఢనిద్రానంతరము జాగ్ర దవస్థలో "బాఖా' వ్యక్తిగతజీవితము పొందినప్పుడు, 'పానా' స్థితిని వదలునప్పుడు కల వ్యక్తిగతప్రధానసంస్కారములనుబట్టి 'బాఖా'లో బ్రతిష్ఠను బొందుచుండును. అందుచే 'బాఖా' స్థితులలోఁ దారతమ్యము లేర్పడుచుండును. సంస్కారప్రభా వముకల ప్రతిజీవి చైతన్యము ప్రతివ్యక్తి జీవములోను మాయను బ్రతిష్ఠించును.

ఇందువలన గాఢనిద్రలోని "పానా" మాయ వెనువెంటనే మేల్కొను స్థితిలోని "బాఖా" మాయ సిద్ధమగుచున్నది. ఇట్లే ఒకటి వెనుక నొకటిగా సంవత్సరముతరువాత సంవత్సరము, జన్మముతరువాత జన్మములోను సంక్రమించుచుండును. ఇది సాధారణమానవుని జీవితమునకుఁ బురోగమనమార్గభూమికలో నున్నజీవికి భేదముచూపదు. మాయయందున్నంత వఱకు దీనికి స్థిరత్వ మేర్పడదు.

వ్యక్తిత్వముకలజీవి "పానాపిల్లా" వాస్తవమునఁ బ్రవేశించి "బాఖాబిల్లా" దైవత్వమునఁ బ్రతిష్ఠింపఁబడువఱకు ననంతములును, బలురకములు నగు మాయారూపములుగల "పానాబాఖా" లుండక తప్పదు. పెరుగుచున్నటువంటి, యంతర్ముఖవృద్ధి పొందుచున్న చైతన్యముకల "బాఖా"లోని జీవితము నంటు సంస్కారములు దీనికిఁ గారణము.

మొదటిభూమిక మొదలు నాఱవభూమికవఱకు ప్రతి భూమికకు నొక ప్రత్యేక 'బాఖా' యుండును. అది పొందిన మాయాసంస్కారములను బట్టి యుండును.

మొదటిభూమికలో నొకమనుష్యుఁ డున్నప్పు డతని నిండుచైతన్య మంతర్ముఖము కాఁజొచ్చును. అతని పూర్తిచైతన్యము సూక్ష్మలోక ప్రథమభూమికలోఁ గేంద్రీకృత మగును. ఎందుచేతననఁగా మొదటిభూమికలోని సంస్కారములంతర్ముఖమైన చైతన్యముపై తాకిడి కలిగి మొదటిభూమికలోనే యతనిని బంధించి దానిమాయానుభవముకలుగఁజేయును. మొదటి భూమికలో లేని మానవుని స్థూలశరీరమువలెనే యున్నవాని

శరీర మున్నప్పటికిని, మొదటిభూమికలోనున్న మానవుఁడు సాధారణమానవునివలనే నిద్రపోవుచు మేల్కొనుచున్నను, నతని యంతశ్చైతన్యము మొదటిభూమికపై ప్రసరింపఁబడి యున్నది. దానివలన మొదటిభూమిక "పానా" సంస్కార ముతో గాఢనిద్రలోఁ బ్రవేశించుచున్నాడు. మఱునాడు మేల్కొనునప్పుడు మొదటిభూమిక "బాఖా"లో ప్రతిష్ఠింపఁ బడుచున్నాఁడు.

ఆ భూమిక సంస్కారముల యనుభవములను పొందును— ఉత్తమమార్గ భూమికలోఁ బ్రవేశించు మానవుని "పానా బాఖా"కును, సాధారణమానవునికిని భేదము కలదు. మొదటి వాఁడొకవ్యక్తి యొకచోట చిరకాలముండి, తరువాత నచ్చట తన బంధము లన్నిటిని తెగతెంపుచేసికొని ఖండాంతరములు దాటి భూసంచారము చేయువానిని బోలియుండును. ఇతఁడు నిద్రపోవుచు మేల్కొనుచున్నను దన నూతన పరిసరముల కొత్తసంస్కారముల యనుభవములను బొందుచుండును.

అంతశ్చైతన్యము మొదటి భూమికను బ్రవేశించు వాఁడు క్రమముగా నాభూమిక పూర్ణానుభవములనుబొందును. ఈభూమికలోఁ బ్రతిష్ఠింపఁబడువాఁడు "తన స్వంత ప్రపంచ ము"లోని జీవితము నేర్పాటుచేసికొనును. అందులోనే నిద్రిం చును, మేల్కొంచును.

ఇదే విధముగా వ్యక్తిత్వము పొందిన చైతన్యము మిగి లిన భూమికల 'పానా'లోఁ బ్రవేశమును పొందుచు నాభూమి కలో మేల్కొని వాని 'బాఖా'లో స్థిరపడుచున్నది.

అయినప్పటికిని ప్రతిభూమిక "పానా-బాఖా"యీమార్గ ములలో నొకే మాదిరిగా నుండును. ఎందుచేతననఁగా నది పై యభివృద్ధిచైతన్యమునలె గాక యంతర్ముఖమై పరిణామము పొందుచున్న చైతన్యమునకు సంబంధించిన దగుటచేతనే. ఒక భూమికలోను మఱియొక భూమికలో నున్న 'పానా-బాఖా'ల మధ్యమున దారతమ్యము లొక భూలోకములోని రెండు ఖండముల పైనున్న మానవుల మధ్యమున నున్న తారతమ్య ముల వంటివి. అచ్చటి పరిసరముల ప్రభావము మాత్రమే వారిపై నుండును. అమెరికా లోనుండు వ్యక్తిపై నచ్చటి పరి సరప్రభావమున్న ట్లాసియాఖండములోని వానిపైఁ గూడ నచ్చటి భిన్న ప్రభావ ముండును.

ఇద్దరువ్యక్తు లొకే భూలోకములో నున్నారనుమాట తథ్యము. ఈ యిద్దరకు సంక్రమించు సంస్కారములవలని యనుభ వములు భిన్నములైన యిద్దరు గాఢనిద్రలో నొకమాదిరిగానే ప్రవేశించుచున్నారు. ఒకరు తూలికాతల్పముమీాద నిద్రించి నను,మఱియొకరు నేలపై పరుండినను యిద్దరు గాఢనిద్ర ననుభ వించిరి. ఇద్దరు మేలుకొనినప్పుడు మాయావృతమైన తమవ్యక్తి గతజీవితము నేకలోకముననే గడుపుచున్నారు. ఇట్లే యన్ని భూమికలలోని "పానాబాఖా"లలో పెద్ద వ్యత్యాసములు లేవు. భూమికలోని వ్యక్తిగత జీవితము చూచినప్పుడు ప్రతిభూమిక తన 'పానాబాఖా' కలిగియుండునట్లు కనఁబడును.

సాధారణనీచశ్రేణియందలి "పానాబాఖా'లో కుక్కలు గుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు యింకను మామూలుగా

ప్రత్యక్షమై స్థూలప్రపంచములో మాయచేఁ జుట్టఁబడిన జీవితము గడుపు జంతుజాలము, మానవులు నుందురు. అట్లే "పానా-బాఖా"లో రెండవ శ్రేణి యందలి యున్నతమార్గములోని భూమికలోని వారు వ్యక్తిత్వము పొంది యున్న (ఆఱు) భూమికలలో నున్న "పానా-బాఖా"కు చెందియున్నారు.

తన యంతర్ముఖచైతన్యము క్రమముగా వృద్ధిపొందుచు పోక యీ యావరణములో నున్న మనుష్యుఁడాభూమికలోని యద్భుతము, నాకర్షణీయము నగు ననుభవములచే దిగ్భ్రమ చెందినప్పుడతఁడాభూమిక "మజూబ్" అని చెప్పుదురు.* ఆ భూమికకు సంబంధించిన మాయాసంస్కారములు తన చైతన్యమునకు తాకిడి నిచ్చుచుండుటచే వానివల్ల పూర్తిగా "మజూబ్" జయమొందుచున్నాఁడు. జాగ్రదవస్థలోఁ గూడ తనభూమికలోని "మజూబ్" ఆ యాభూమికయొక్క సమ్మోహనస్థితిలో పూర్తిగా మునిఁగియుండును. అట్టి వానిని భగవంతునిలో మత్తుకొన్న "మస్తు" అని అతనిని బిలతురు.

లేక యా భూమికలోఁ బైనచెప్పిన రీతి ననుభవముల పూర్తిజయమొందిన వాఁడు గాక, మాయాసంస్కారముల ననుభవములను పొందుచు తనలో చైతన్యవృద్ధిని బడయుచు పోక సమరసభావమును బెంపొందించుకోఁగలిగిన వాని నా భూమికకు చెందిన "సాలిక్" *అని చెప్పుదురు. అట్టి "సాలిక్"

*బాబా గారిట్లు చెప్పుచున్నారు. వివిధభూమికలలోనున్న "మజూబ్"లు సాలిక్"లలో నేడవభూమికలోనున్న "మజూబ్-యి-కమిల్" అనఁబడు పూర్ణసిద్ధి కలిగిన మజూబ్) తో నిజముగు "సాలిక్"ల సేవము చేయరాదు.

లోకవ్యవహారమున కంతయు సాధారణమానవునివలెఁ గనఁ బడుచుఁ దనలోని చైతన్యమును వృద్ధిచేసికొనుచుండును. కాని తన చైతన్యమునకు సంబంధించినంత వఱకు స్థూలప్రపంచము తో నొక నిస్సంగత్వము కలిగియుండును.

ఒకప్పు డీభూమికలోని యనుభవములలోఁ బూర్తిగ నిమగ్నుఁడై "మజూబ్"వలె సంచరించును. మఱియొకప్పుడు సమరసముతో నిగ్రహముకలిగి యాభూమికకు చెందిన సాధారణ "సాలిక్" వలె సంచరించును. అతని నడతలోని తరతమ వ్యత్యాసమును బట్టి "మజూబ్-సాలిక్" అనియు, "సాలిక్-మజూబ్" అనియు చెప్పుదురు. దీనినే మాయలో సత్యస్థితి లోని పవిత్రమైన కూడలిస్థానము లేక "తురీయావస్థ" అని చెప్పుదురు.

అంతశ్చైతన్యము తుదిఘట్టమగు నేడవ భూమికలోనిది మూఁడవ రకపు "పానాబాఖా", వస్తుసత్యమైన "పానాపిల్లా" యును, దివ్యసత్యమైన 'బాఖాబిల్లా'యు నైయున్నవి. మాయా సంస్కారములు పూర్తిగా నశించినతరువాత సంస్కారశూన్యమైన వ్యక్తి "ఆత్మ"ఆదిలోని పవిత్రశూన్య మనఁదగు నాకాశములోఁ బ్రవేశించి "పానాపిల్లా" ను బొందినప్పుడు అనఁగా "నేను భగవంతుఁడను"అనుస్థితిని బొందినప్పుడు లక్ష్యసిద్ధి ప్రాప్తించెనని చెప్పుదురు. ఇది వాస్తవమగు 'మజూబియత్' స్థితి.

వివిధ జీవరాసులకును, మాయాజీవస్థితులకు సంబంధించిన లెక్కలేని "పానా"లతో, చివరిస్థితి చేరిన పవిత్రము, నిజమునగు "పానా"కును వ్యత్యాసము కలదు. మొదటివానిలో

చైతన్యములేదు. రెండవవానిలో పూర్తిచైతన్యము పాదుకొని యున్నది.

"ఫానా-ఫిల్లా"స్థితి తరువాత కొంద రాత్మన్యక్తులు భూమిపై 'మానవరూపములోని భగవంతుని'గా మను 'బాఖా-బిల్లా'లో స్థాయిత్వము పొందుచున్నారు. అట్టి భగవదంశము గల మానవుఁడు నొకే సర్యాయ మన్ని భూమికలలోను జీవిత వివిధావస్థలలో నుండఁగలుగుచున్నాఁడు. మాయను మాయ గాగుర్తించి మాయావృతమగు మానవజీవితములో నుండును. వాస్తవమగు భగవంతునిలోనుండును. ఇది నిజమగుఁ 'సులూకి యత్' అందురు.

"ఫానా-ఫిల్లా"స్థితి నొందిన తరువాతను "బాఖాబిల్లా" లో పాదుకొనక పూర్వమును వీని రెండిటికిని బవిత్రమగు కూడలిస్థానము కలదు. దానిని "తురీయావస్థ" యందురు. ఇందులో "మజూబియత్", "సులూకియత్" యీ రెండింటి యనుభవములు కలుగుచుండును. ఇది సందర్భమును బట్టి వాస్తవమగు"మజూబ్-సాలిక్" లేక "సాలిక్-మజూబ్" అయి యుండును.

"ఫానా"కంటె మున్నున్న యసత్యమును బరిమితమగు "నేను" అను అహమిక క్రమముగా నూర్ధ్వగతిని బరిణామము పొంది "ఫానా-ఫిల్లా" లోని సత్యము, ననంతము నగు "నేను" గా మాఱినది, "బాఖా-బిల్లా"లోని పూర్ణత చెందిన చైత న్యము, సత్యము, ననంతమునగు "నేను" మీఁదఁ గేంద్రిక

రింపఁబడినది. అది మనస్సుపై సర్వవ్యాపకమగు "మహా మనస్సు"గాను, ప్రాణశక్తిపై నఖండశక్తిగాను, శరీరముపై మహాకారణశరీరముగాను, ప్రభావముచూపుచున్నది. ఈయను భవములతోడనే "బాఖా-బిల్లా"స్థితిలో నీ చైతన్యమే పరిమిత మగు నహంకారమనశ్శక్తి శరీరములపైఁగూడ దృష్టిని కలిగి యుండును. అందుచే "సాలిక్"అవాస్తవికమగుదానితో నసత్తు ననుభవము, వాస్తవికముతో సత్తు ననుభవము పొందు చుండును.

"బాఖా-బిల్లా"స్థితిలో నొకే చైతన్యము ద్వంద్వాను భవములు పొందుచుండును. 'నేనుభగవంతుఁడను, నేనుమాన వుఁడను' అను అనుభవములు పొందుచుండును. అట్లే యీ చైతన్యము భగవంతుని అనంతజ్ఞానశక్త్యానందముల యనుభవ ముల నొక వైపునను, మానవలోకబాధలను దౌర్బల్యములను మఱియొకవైపున నేకసమయమున ననుభవించుచుండును.

"బాఖా-బిల్లా" యను దైవస్థితిలో సాధారణ మానవ రూపములోనున్న భగవంతుఁడు తన పవిత్రజీవితమునఁ బ్రతి ష్ఠితమగుచున్నాఁడు. లేక మానవుఁడు భగవంతుని జీవిత ములో స్థిరీభూతుఁ డగుచున్నాఁడు.

"సాలిక్"లు లేక జీవన్ముక్తు లనువారు భగవంతునిలో స్థిరప్రవేశము గనుట "బాఖా-బిల్లా" యందుము. 'సాలిక్' భగవంతుని స్థితి మానవుని స్థితి యేకసమయమున ననుభ వించు నని తెలిపియుంటిమి. అవాస్తవమగు ననుభవములు

మితమగు శూన్యమునుండి బయలుదేఱెనవని యవి తిరిగి అనంతమగు సర్వముగాఁ బరివర్తనము చెందునని మనము చూచితిమి.

సహజసమాజస్థితిని (బాఖాబిల్లా) మానవుఁ డనుభవమును బొందుచున్నాఁడు. మానవుఁడు మానవుఁడుగాను భగవంతుఁడుగా నొకే పర్యాయ మనుభవము పొందుచున్నాఁడు. ఇది నిరంతరము ప్రయత్నములేకయే జరుగుచుండును. ఇదే పరిపూర్ణదశ. ఈస్థితిలోనే కార్యసిద్ధి పరిపక్వము చెందినదని చెప్పుదుము. సత్యమునుగూర్చి మనము ప్రస్తావించునప్పు డీ పరిపూర్ణత మూఁడు లక్షణములుకలదిగా నుండును. "బాఖాబిల్లా" లేక "సులుకియత్" స్థితిలో—

మొదటి శ్రేణికిఁజెందినది, 'కమిల్'—పూర్ణత కలది.

రెండవశ్రేణి "అక్మల్"—ఉత్తమమైన పూర్ణతకలిగినది.

మూఁడవది "ముకమ్మిల్"—సర్వోత్తమమైన పూర్ణత్వము కలది.

ఈ మూఁడిటిలోను శాశ్వతమగు సత్యానుభవమున భేదము లేదు. ఈ పూర్ణత్వము నిర్వర్తించు కొన్ని పనులలోఁ గొంత తారతమ్యము కలదు. ఒక్కొక్కరక మగు పూర్ణత్వమునకు భిన్నమగులక్షణము లాపాదింపఁబడుచున్నవి.

"కమిల్" ఒక మనుష్యునికే భగవంతుని పొందుశక్తి నియ్యగలఁడు. తనవలెనే యతఁడును భగవంతుని సాక్షాత్కారము పొందునట్లు చేయఁగలఁడు. "అక్మల్" తనతో సమానముగా ననేకులను మార్పఁగలఁడు. "ముకమ్మిల్" తన

శక్తిచేఁ బరమశక్తిని గ్రహించు శక్తిని సృష్టిలోఁ *బలువురకుఁ బ్రసాదింపఁగలఁడు.

కాని భౌతికశరీరముల రూపమును మార్పఁగలఁడు. స్థూలప్రపంచములోని తనశరీరమువలెనే మార్పఁగలఁడు. అనఁగా నీ శరీరములోనుండి శాశ్వతముగా సత్యానుభవము నీయఁగలఁడు. "బాఖా-బిల్లా" రెండవ దివ్యయాత్రాపరిసమాప్తి. "పానాపిల్లా" "బాఖాబిల్లా" నడిమి ఘట్టము, దివ్యమార్గసంధి, (ముఖమ్-యే-పురుతాత్) వద్ద తురీయావస్థ (పానా-మా-ఆల్-బఖా) యున్నది.

తురీయావస్థలో "నేను భగవంతుఁడను" అను మహా చైతన్యము ననుభవమును, సాధారణచైతన్యప్రధానమగు "నేను-మానవుఁడను" అను అనుభవమును గలుగుచున్నవి.

"మజూబ్-సాలిక్" లేక "పరమహంస" లనువారీస్థితి ననుభవించుచున్నారు. ఈ తురీయస్థితిలో నేనే నాయొక్క-భగవంతుఁడను" లేక "నేనే నా స్వాధీనములోని జీవిని" అను

---

*బాబాగారీ విషయమై యింక నిట్లు తెలుపుచున్నారు, "తనకిష్టమైనచో 'మాజిమ్మల్' సృష్టికంతకును భగవత్సాక్షాత్కార మియ్యఁగలఁడు. సృష్టియనఁగా సర్వమానవకోటి, జంతుకోటి, అచరమగునిర్జీవకోటి. కాని 'ముకిమ్మిల్' అట్టి పనిచేయఁడు. ఎందుకనఁగా దానితో నీ సృష్టిమాయ యంతరించిపోవును. అనఁగా దైవలీలనే యంతమొందించుట యగును. అనఁగా నిది యున్న రెండవస్థితిలో భగవంతుఁడు చైతన్యము కలిగియుఁ జైతన్యము లేకయు నున్న యవస్థ.

అనుభవమును స్మృతిపూర్వకముగాఁ బొందు చున్నారు. మొదటి దివ్యయాత్రకు రెండవ దివ్యయాత్రకు నడుమ నున్న కూడలి యందు "నేనుభగవంతుఁడను" "నేను మానవుఁడను" అను ననుభవము కలుగుచుండును. అది క్రమముగా భగవంతునియందుఁ బ్రతిష్ఠింపఁబడు ఘట్టము చేరిన తరువాత యే ప్రయత్నము లేకయే భగవంతుఁడు, మానవుఁడు నను రెండను భవములు స్వభావసిద్ధముగాఁ బొందుచుండును.

ఈ కూడలి స్థానము దాటిన తరువాత "పానాపిల్లా" లోని "మజూబియత్" "బాఖాబిల్లా"లోని "సులికియత్"గా ప్రతిష్ఠింపఁబడును. "మజూబియత్", "మజూబ్" అఖండమగు నానందములో మునిఁగియున్నప్పు*డఖండమగు జ్ఞానశక్తులయను భవమును స్మృతిపూర్వకముగాఁ బొందఁగలుగు చున్నాఁడు. "సులికియత్"లోని "సాలిక్"అనంతజ్ఞానానందశక్తుల ననుభవించుటయేగాక వానినిఁ గూడఁబెట్టి వృద్ధిని చేసికొనుచుండును.

---

*'నేను భగవంతుడను' అను మాటతప్ప స్థూలసూక్ష్మమనోలోకముల స్మృతి 'మజూబ్'లకు లేనియెడల, వారు తినుట, త్రాగుట, వస్తువులయందు మనుష్యులయందు నిష్టానిష్టములను జూపుట, యెట్లు జరుగుచున్న దని శ్రీ బాబా గారి నడుగఁగా వా రిట్లు సమాధానము చెప్పిరి. ఈ వికారములు మజూబ్లకు స్మృతిలేకయే వానియంతట యవిసైన జరుగు కార్యముల ప్రతిఫల రూపములుగా జరుగుచుండును. గాఢనిద్రలోనున్న మనుజుఁడు గుఱ్ఱు పెట్టినట్లు, నిద్రలో నడచువారు కూడ నట్లే చేయుదురు. మజూబ్ స్థితికూడ నట్లేయుండును. 'భగవంతుఁడ నేను' అను భావములో మునిఁగి యుండును.

"కుతుబియత్"లోని "కుతుబ్"వలె నీ దీశక్తుల నితరులకొఱకు వినియోగింపడు.

రెండవ దైవయాత్ర దాటిన తరువాత మూడవప్రయాణము నందు "కుతుబియత్" స్థితిని పొందుదురు. ఇందు భగవంతుని జీవితమునే జీవింతురు. వీరినే "కుతుబ్" లనియు సద్గురువులనియుఁ జెప్పుదురు.

ఇందు "పానా-పిల్లా" స్థితిలోని యఖండశక్తి జ్ఞానానందముల ననుభవించుచు "బాఖాబిల్లా" స్థితిలో వలె నీ శక్తులను స్వప్రయోజనమునకు మాత్రమేకాక మాయలో నున్నవారి యుద్ధరణకై "కుతుబియత్" స్థితిలో నీ శక్తుల నుపయోగించెదరు. అట్టి దైవాంశుఁడగు మానవుని సద్గురువు అనిపిలతురు. మానవరూపమునుండి భగవంతుఁడై భగవంతునిలోఁ బ్రతిష్ఠితుఁడై యీ మాయలో భగవంతుని వ్యక్తిగత ప్రతినిధిగా భగవంతుని జీవితమునే జీవించుచున్నాఁడు.

ఈ స్థితిలో భగవంతునియు, మానవునియు, ద్వంద్వావస్థల ననుభవించుటయే గాక మొదటిదానిలోని యఖండశక్తులను, మానవరూపములోని కష్టనిష్ఠురములను గూడ ప్రత్యక్షజీవితములో ననుభవించును.

ఈమూఁడవ దివ్యయాత్ర పూర్తియగు సరికి సద్గురుఁడు ద్వంద్వజీవితమును గడపుటయేగాక, బలమును దుర్బలము నొకేపర్యాయము ప్రదర్శించుచుండును. తనకుఁగల యఖండ శక్తిజ్ఞానానందముల నొకవైపున ప్రదర్శించుచు, నజ్ఞానములో

నుండి మాయనే సత్యముగా నెంచుచు, జీవించు వారికొఱ కెక్కువ బాధపడుచుండును. దీనికి విరుద్ధముగా"బాఖాబిల్లా" స్థితిలో భగవంతుఁడు సదా తనభగవత్తత్త్వము ననుభవించుట యేగాక, తనమానవత్వమునుగూడ ననుభవించుచుండును. ఐనప్పటికిని దనయనంతశక్తిజ్ఞానములను, తనయనంతవిచారానుభవము నజ్ఞానములోనున్నవారి నుద్ధరించుట కుపయోగింపలేఁడు. "కుతుబి యత్" స్థితిలోవలె నీ స్థితిలో భగవంతుఁడు భగవంతుని జీవితము జీవించుట లేదు.

"కుతుబియత్" లేక సద్గురుస్థితిలో నుండు మూఁడవ పవిత్రియాత్రి యంతమును బహుస్వల్పసంఖ్యాకులు చూడఁగలుగుదురు. ఈ స్థితిలోని మానవుఁడు భగవంతుఁడుగానే జీవించును. తన యనుభవములోనున్న యఖండజ్ఞానానందశక్తులను భగవంతుఁ డుపయోగించును. దైవాంశసంభూతుఁడైన మానవుఁ డవిభాజ్యమైన "యేకమేవాద్వితీయ" మ్మనఁబడు విభూతి ననేకత్వమునం దవతరించునట్లు చేసినాఁడు. అతఁడు స్వతంత్రిమగు సత్యమును మాయావలయములోనికిఁ దీసికొనివచ్చెను.విజ్ఞానభూమికలోనుండి తన దివ్యశక్తిచే నీ మాయను స్వాధీనములో నుంచుకొన్నాఁడు.

ఈ సద్గురువు నిత్యజీవితము సహజసమాధి. అట్టిసద్గురువొకేమా రొకేకాలము నన్ని లోకములలోను, నన్ని భూమికల నుండి సర్వవ్యాపిగాను, ఒక్కఁడుగాను గడపుచున్నాఁడు. ఆ యా భూమికల జీవిగా, నొకయంతస్థులోని వ్యక్తిగా నీతఁడు

ప్రకాశించుచున్నాఁడు. భగవంతుని స్థితిలోనుండియు నీ భూలోకముపై మానవత్వమున నీతఁ డున్నాఁడు.*

ఈ "కుతుబియత్" స్థితిలో భగవంతునకు భగవత్త్వమున నేకత్వము సిద్ధించును. అనఁగా భగవంతుని చైతన్యము సర్వములో వ్యాపించియు నింక ననంతముగాను విజ్ఞానస్థితిలో నుండియు, పరమాత్మపరబ్రహ్మస్థితిస్మృతిలో నెల్లప్పుడు నుండును.

నాలుగవ పవిత్రయాత్ర యనఁగా "కుతుబ్" శరీరమును త్యజించుట.

తన శరీరమును విసర్జించి నప్పటికిని "కుతుబ్" వ్యక్తిగాను స్మృతిపూర్వకముగా, ననంతుఁ డగు భగవంతుఁడుగా నుండును. వ్యక్తిగతమై యవిభాజ్యమైన "నేను భగవంతుఁడను" అను అనుభవము శాశ్వతముగా ననుభావ్య మీతని కగును. అద్వితీయమగు నేకత్వముగా, అనంతమగు సర్వముగా నీ యనుభవ మీశరీరము జారిపోయిన తరువాతఁగూడ నుండును.

---

* శ్రీ మెహెర్‌బాబాగారి వచనములలో పరిపూర్ణత్వము ఒక్క భగవంతునిదో, లేక ప్రత్యేకమానవునిదో కాదు. పరిమితమగు జీవి తన పరిమితానుభవముతోఁ బూర్ణత్వమును బొందియుండలేదు. కాని తన వ్యక్తిత్వ మవంతునితో నైక్యము పొందినప్పుడు పరిపూర్ణుఁడగుచున్నాఁడు. పరిమితిని నధిగమించి భగవంతునిలో లీనమైనప్పుడును భగవంతుఁడు మానవభూమికలోనికి వచ్చి మనుష్యుఁడైనప్పుడును, పరిమితాపరిమితత్త్వము లొకదాని పడిచి యొకటి యుండదు. ఈ రెండిటికిని స్మృతిపూర్వకమును మనోరంజకము నైన కలయిక కలిగినప్పుడు, పరిపూర్ణత ఫలస్వరూపము నొందును.

'నేను భగవంతుఁడను, నేను మానవుఁడ' నను భగవంతుని "బాఖాబిల్లా" స్థితిలోని ద్వంద్వచైతన్యము, స్మృతిపూర్వకముగా నుండిన మాయాపటము జారిపోవు వఱకు నుండును. శరీరము రాలిపోవునప్పుఁడు స్మృతివిశిష్టాఖండావిభక్త మగు 'నేను భగవంతుఁడ' నను వ్యక్తిత్వము మిగిలి పోవును. భగవంతుఁడు సర్వమును వ్యాపించిన యనంతము, శాశ్వతము నగు బ్రహ్మము. శాశ్వతుఁడు ననంతుఁడు నగుటచే ననంతములగు స్థితులుకూడ భగవంతునికిఁ గలవు. ప్రధానముగా రెండు స్థితులుమాత్రము గలవు. ఆదిస్థితి, అంతిమస్థితి.

ఆదిస్థితి, "పరమాత్మపరబ్రహ్మస్థితి" చైతన్యము లేనిస్థితి. తుదిపరిణామస్థితి, పరమాత్మపరబ్రహ్మములోని భగవంతునస్తిత్వ (పరమాత్మ) స్థితి యందు సచేతన మగు స్థితి.

పరమాత్మపరబ్రహ్మస్థితిలోఁగాని పరమాత్మస్థితిలోఁగాని భగవంతుని యస్తిత్వము (బ్రహ్మత్వము) శాశ్వతముగా నుండును. చైతన్యములోనే తరతమ భేదములుండును. పరమాత్మస్థితిలోనుండి యస్తిత్వజ్ఞానమున (existence) తాను పరమాత్మ పరబ్రహ్మములో శాశ్వతముగానున్న స్థితిని గనుచున్నాఁడు.

అందుచే పరమలక్ష్యము "నేను భగవంతుఁడ" నను సాక్షాత్కారము పొందుట యని స్పష్టమగుచున్నది. ఇది సత్యము. ఈసత్యము స్మృతిపూర్వకముగా లభ్యమైనప్పుడదిశాశ్వతముగా నిలచియుండును. ఇంకేయితర రూపములలో గాక భూలోకమున మానవరూపములో నిది యావిష్కృ

వించుచున్నది. భగవంతుని వివిధావస్థలలోను స్థితులలోను 'మజూబిసత్'గా తురీయావస్థగా లేక "ఫానా-మా-అల్-బాఖా-సులుకియత్-కుతుబియత్" లుగా నది ప్రస్ఫుటమగు చున్నది.

మిగిలిన యంతరాంతరకక్ష్యల భగవంతుని స్థితులన్నియు మాయావస్థలు. శాశ్వతమును, సర్వవ్యాపకమునైన భగవంతుఁ డనేకములగు చేతనాచేతనవస్తువుల రూపములను దాల్చుచు సజీవ నిర్జీవరూపములలోఁ బ్రకటితమగుచున్నాఁడు. ఇదియంతయుఁ దన పూర్తిచైతన్యమును బొందు పద్ధతిలో నడచు కలాపము.

భగవంతుని మృగతృష్ణాప్రాయములగు నీ యంతరాంతర కక్ష్యల స్థితులన్నియు నీ లోకసంబంధమగు సృష్టిలో మాయా స్థూలసూక్ష్మ మనస్సంస్కారము లభివృద్ధి పొందుచుండును. ఈ బ్రహ్మాండమంతయు మాయ యైనప్పటికిని, భగవంతుని నిమిత్తకారణశక్తి (incubation) (కార్యానుకూల వ్యాపారవత్కారణము) జీవప్రదానశక్తి చైతన్యముపై ప్రభావమును జూపును. ద్వంద్వములు, ననేకములు నగు సంస్కారముల సంయోగము వలన నీ చైతన్యము వృద్ధిని బొంది చివఱకు శాశ్వతమగు "సత్యమును" పొందుటకు శక్తిని సంపాదించును.

అనంతుఁడు రూపరహితుఁడు నగు భగవంతుఁడు తన యీ లోకసృష్టిసంపర్కప్రభావముల వలన, స్థూలసూక్ష్మ మనశ్చైతన్యముల ద్వారా ఆ యా లోకముల యనుభవము

పొందుచుండును. చివఱ కనంతమగు తన 'ఆత్మానుభవము' వలన శాశ్వతస్థితి నొందును.

స్థూలవస్తువుల చైతన్యము కలిగినప్పుడు భగవంతుఁడావస్తువుల లక్షణములను బ్రకటించుచు వానితో నైక్యమొందును. అనంతము, శాశ్వతము, రూపరహితము నైన భగవంతుఁడు, పరిమితము, అశాశ్వతము, స్థూలము నగు రూపములలో నుండును. అజ్ఞానమునకుఁ గారణములు సంస్కారములు.

ఆదిని పరాత్పర పరబ్రహ్మస్థితిలో నున్న భగవంతుఁడు సంస్కారముల సంపర్కముచే నజ్ఞానమును బొందుచున్నాఁడు. అందుచే నొక రూపములేని వాఁడొక శరీరము నొందినప్పుడు భగవంతుఁ డాశరీరమునలెనే యనుభూతిని బొందుచు ననుభవించును.

రాతిస్వరూపములో రాతియనుభవమును పొందును. అట్లే లోహ, వృక్ష, కీటక, మత్స్య, పక్షి, జంతు, మానవ రూపములలో నా యా భిన్నభిన్నానుభవములను బొందుచుండును. ఆ వస్తువు లక్షణమెట్టిదైనను తన పరిణామమార్గమున నున్న జీవుఁడావస్తువులతో నైక్యము పొందుచు నా యా యనుభవములను గ్రహించుచుండును.

సూక్ష్మశరీరము స్మృతి కలిగి నప్పుడు (ప్రాణ) సూక్ష్మలోకానుభవము కలిగి తానే 'ప్రాణ' శరీరముగా నెంచును. అట్లే మనోలోకములోఁ గూడఁ దానే మనస్సును ననుభవము పొందును.

రూపములేని యనంతుఁడగు భగవంతుఁడు (over soul పరమాత్మ) సంస్కారముల కారణముగా, స్థూలప్రపంచములో స్థూలశరీరుఁడుగా (అనగా అన్నభూమికలో జీవాత్మగాను) సూక్ష్మలోకములో సూక్ష్మశరీరముగాను (అనఁగా ప్రాణభూమికలో జీవాత్మగాను) మనోలోకములో మనశ్శరీరముగాను (అనఁగా మనోభూమికలో జీవాత్మగాను) మను చున్నాఁడు. స్థూలరూపముతో స్థూలప్రపంచము ననుభవించుచున్నాఁడు. అనేకములగు స్థూలరూపములతో సంయోగ వియోగములను బొందుచున్నాఁడు. దీనిని జననమరణము లని పిలతురు.

శాశ్వతుఁడు, నిర్గుణుఁడు, సమ్మతుఁడు, నగు భగవంతుఁడు సంస్కారముల కారణముగా ననేకములగు జనన మరణములకు లోనగుచున్నాఁడు. ఈ స్థూలప్రపంచము ననుభవించు దశయందు భగవంతుఁ డందుండు కష్టసుఖములను, పాపపుణ్యములను కూడ ననుభవింపవలసిన వాఁడగు చున్నాఁడు.

భిన్నములగు రూపములు, లోకములు, భూమికలు, జననములు, మరణములు, పుణ్యములు, పాపములు.— అన్నియు సంస్కారముల ప్రభావము కలిగిన చైతన్యము వల్ల శాశ్వతుఁ డగు భగవంతుఁ డనుభవింప వలసి వచ్చుచున్నది. సంస్కారములన్నియు శూన్యములో నుండి బయలుదేరుటచే వాని ప్రభావమువల్ల భగవంతుని చైతన్యము పొందు పైనున

హారింపఁబడిన యనుభవము లన్నియుఁ గూడ శూన్యమే. ఇ వన్నియు శుద్ధమాయ తప్ప వేరుకాదు.

సంస్కారపరివృతమైన చైతన్యము, మానవరూపములో సంస్కారములనుండి బయటపడుటయే 'ముక్తి' యందురు. శూన్యములోనుండి బయల్వెడలిన సంస్కారములు నాశన మగుటతోడనే భగవంతుని యస్తిత్వము చైతన్యమునకు మిగులును. ఇదే నిర్వాణమందురు.

ఈ నిర్వాణస్థితి పొందిన వెంటనే ముక్తినిగన్న చైతన్యము 'ఫానా'లోని రెండవయవస్థయగు శాశ్వతబ్రహ్మత్వమును పొందును. నిస్సందేహముగా 'నేను భగవంతుఁడ'నను అనుభవము స్థిరపడును. సంస్కారరహితమైన మానవరూపములోని జీవుఁడు 'నేను భగవంతుడ'నను సాక్షాత్కారము పొందు 'నిర్వికల్ప' స్థితి యిదియే. ఇంక 'నే నిప్పుడు భగవంతుఁడను; ఇదివఱకు భగవంతుఁడను; భవిష్యత్తులో నేను భగవంతుఁడ'నను భావసాక్షాత్కారము కలుగును. అనఁగా మానవుఁడు భగవత్సాక్షాత్కారము పొంది పరమాత్మలోని జీవాత్మ, శివాత్మలోని పరమాత్మ యాయె నని చెప్పుదురు.

శాశ్వతమగు సత్య మేమనఁగా 'పరమాత్మయే' ఆత్మ. ఇది యెప్పుడు విశదమగు ననఁగా 'జీవాత్మలో' బంధింపఁబడిన చైతన్యము శివాత్మగా, సంస్కారరహితమైన చిత్కళగామాఱి నప్పుడు. అప్పుడు పరమాత్మలో లీనమై యేకీభావమొందును.

వాస్తవముగా నాత్మ పరమాత్మయైనచో, నాత్మ పరమాత్మలో లీనమగు సందర్భ మెట్లేర్పడును ?

ఇవి సరిగా నర్థముచేసికొనుటకుఁ బరమాత్మ నపార సముద్రముతోఁ బోల్చెదము. ఆత్మ పరమాత్మకు పైభూమికలో నుండఁజాలదు. ఆత్మ పరమాత్మలో నున్నప్పుడు తాను పైకెట్లు పోఁగలదు ?

అందుచే నాత్మ పరమాత్మ కూడ.

ఈ సముద్రములోనుండి ఒక నీటిబిందువును పైకిఁదీసితి మనుకొనుఁడు. ఈనీటిబిందువు పైకి వేఱుచేయఁబడక పూర్వము సముద్రములో నొక ప్రత్యేకత లేకుండ లీనమైయున్నది. సముద్రమునకుఁ గల యపరిమితలక్షణము, అక్కడనున్నంత సే పీ బిందువునకుఁ గూడఁ గలదు.

ఈ నీటిబిందువు పైకి వేఱుచేయఁబడినప్పుడే, యపరిమితమగు సముద్రములోని బహుపరిమితమైన బొట్టుగా నెన్నఁబడుచున్నది.

విశాలము నపారమునగు సముద్ర మపరిమితమగు తన ప్రతిబింబమున పరిమితమగు నీటి బిందువున నున్నది. నీటిబిందువు బహుపరిమితమైనప్పటికి నపరిమితమైన మహా సముద్రలక్షణములను తనలో నిముడ్చుకొనినది.

అట్లే యాత్మకూడ ననంతమగు పరమాత్మను మించి బయటకు పోలేదు.

సముద్రములోని నీటిబిందువు బుద్బుదస్వరూపముపొంది నప్పుడు, సముద్రముపైఁదేలుచు సముద్రము కంటెఁ బ్రత్యేకమును బరిమితమును నగు స్థితిని చూపుచున్నది. అట్లేయాత్మ పరమాత్మయై పరమాత్మలో నున్నప్పటికిని సంస్కారముల యాత్మను జుట్టుకొని దాని కజ్ఞానమును గల్పించుచున్నవి. దీని

వలన నాత్మ పరిమితికలిగి పరమాత్మకంటె భిన్నమను అనుభవ ము పొందుచున్నది.

సంస్కారబుద్బుదములవల్ల ఆత్మ ప్రత్యేకమును పరిమితము నగు స్థితిని పొందుచున్నది. అనంతలక్షణము బరమాత్మతో నైక్యమువల్ల గలిగియు నాత్మ పరిమితలక్షణము గలిగి బహుళ మగు సంకుచిత సంస్కారముల లక్షణములను బొందుచున్నది.

చైతన్యమంతర్ముఖమై పూర్ణత్వము పొందినతరువాత నీ సంస్కారబుద్బుదము బద్దలగును. సంస్కారఫలముగా జీవు నావరించిన స్మృతిపూర్వకమైన యజ్ఞానము, జ్ఞానముగా మా ఱును. ఇది సంస్కారదూరమైన చైతన్యము. దీనితో పరిమితమగు నాత్మ యనుభవము లంతరించును. ప్రత్యేకమును పరిమితము నగు స్థితినుండి యాత్మ విముక్తమై పరమాత్మతో నైక్యము నొందును. ఇదే యాత్మ పరమాత్మలో లీనమగును. పరాత్పర పరబ్రహ్మముతో నాత్మ యైక్యానుసంధానము పొందినది. సూఫీ మాటలలో నీ పరమాత్మను 'అల్లా'అని పిలుతురు. పరాత్పర పరబ్రహ్మమును'వారా_ఉల్_వారా' లేక 'ఘైబ్_ఉల్_ఘైబ్' అనిపిలుతురు.

మానవరూపములో నతిపవిత్రము నుచ్చము నగుస్థితిని 'కుతుబియత్' అందురు. అందు 'కుతుబ్' లేక సద్గురు వనంత మగు జ్ఞానానందశక్తులను, మహాసౌందర్యమును, ప్రకాశమును యోగ్యతను స్మృతిపూర్వకముగా ననుభవించుటయే గాక యీ యఖండలక్షణములను మాయను బడియున్న జీవాత్మల కొఱకై వినియోగించును.

ఇట్టిపవిత్రమగు నున్నతస్థితిలో మానవుఁడు భగవంతుఁ డగుటయేగాక, భగవంతుని దివ్యజీవితమునే జీవించును. ఇట్టి దేవాంశుఁడగు మానవుని బూజించుట యనంతుఁడగు భగవంతుని పూజించుటయే.

మానవరూపములో స్మృతితో భగవంతునివలె మనుట చాల సకృత్తుగా సంభవించును. కొలది శివాత్మ లీ స్థితిపొందును. మొదట యాత్మచైతన్యహీనస్థితిలో నుండి యనేకావస్థలు మాఱి, జీవాత్మలుగా ననేకజన్మముల నెత్తి చైతన్య మంతర్ముఖవృద్ధిని పొంది నిర్వాణమును, తరువాత నిర్వికల్పసమాధి మహాచైతన్యానుభవమును బొంది తుదకు శివాత్మస్థితి చేరును.

ఎల్లకాలములయందు నన్నియుగములయందు నొకే పర్యాయ మీ భూమిమీఁద 56 శివాత్మలు లేక భగవత్సాక్షాత్కారము పొందిన యాత్మ లుండును. వీరిలో బలువురు 'మజూబియత్' స్థితిలో నుండురు. కొందఱు తురీయావస్థలో నుందురు. కొలదిమంది కూడలిస్థానము దాటి 'సులుకియత్' స్థితిలో నుందురు. వీరందఱిలో నైదుగురుమాత్రము 'కుతుబియత్' స్థితిలో నుందురు. వీరందఱు మానవరూపమును కలిగియున్నంతకాల మీ పై స్థితులలో నుందురు.

అన్నికాలములయందు యుగములయందు మానవలోకములో నివసించుచు నైదుగురు 'కుతుబ్'లు లేక సద్గురువులున్నారు. వీరు విజ్ఞానభూమికయందలి విజ్ఞానముపై నధికారమును గలిగియున్నారు. ఇది పరమాత్మస్థితి. మాయలోఁ బడి

యున్న మానవులను క్రమముగా విముక్తులను జేయుటకే సద్గురువులు తమ యఖండశక్తులను వినియోగించెదరు.

భగవద్ధర్మముప్రకారము మీా యైదుగురు 'కుతుబ్' లు లేక సద్గురువులు, ఒక్కొక్క కాలచక్రపరిభ్రమణానంతరము, భూమిపై మానవరూపములో భగవంతుఁ డవతరించునట్లు సద్గురువులు పనిచేసెదరు. అట్టితరి మానవరూపములో నవతరించిన భగవంతుఁడు మానవకోటికిఁ దన దివ్యదర్శనము నిచ్చును. అతఁడవతారమనియు, 'మెస్సయ్య' అనియు, ప్రవక్తయనియు గుర్తింపఁబడును. చైతన్యవృద్ధి లేక ఉత్క్రాంతి, అంతర్ముఖచైతన్యవృద్ధి, జన్మపరంపర మున్నగు ననుభవములతోఁ బ్రమేయము లేకుండగనే భగవంతుఁడు తనంతటతానే స్వతంత్రవ్యక్తిత్వముతో మానవరూపములో నవతారము నెత్తుచున్నాఁడు. అందుచే భగవంతుఁడు నేరుగా మానవరూపములోని భగవంతుఁ డగుచున్నాఁడు.

ఈ యవతారపురుషుఁడు మానవులలో మానవుని జీవితమును గడపుచుండును. 'పురాణపురుషుఁడు' గాను 'శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడు' గాను సద్గురువులద్వారా తన దివ్యస్థితిని తెలిసికొనుచున్నాఁడు.

'శివాత్మలు' 'మజూబియత్' తురీయావస్థ 'సులుకియత్' లేక 'కుతుబియత్' లకు చెందిన సత్యమును గుఱించిన యనుభవముల దారతమ్యములు లేవు. గమ్యస్థానము చేరిన తరువాత వివిధములగు సంతస్థులలో నున్న శివాత్మ లఖండశక్తి జ్ఞానానందముల ననుభవించుచుండును.

ఈత్రివిధములగు ననుభవముల యానందములో భేద మున్నను వానికి నంతర్భేదములు కలుగుటలేదు. విజ్ఞానస్థితిలో స్థిరపడిన తరువాత నీశక్తులను వినియోగించుటలోఁ దారతమ్యములు కనఁబడుచున్నవి. అనఁగా నపరిమితానందము నొందుచు జ్ఞానమువల్లఁ గలిగిన శక్తిని వినియోగించుటయందు భేదము కలదు.

'కుతుబ్' లేక సద్గురువునకును, అవతారమునకును భేదముకలదు. 'కుతుబ్' భూలోకములో పరిణామమార్గానుభవమును బొంది మానవరూపములో భగవంతుని జీవితములోఁ బ్రవేశించును. అవతారమున కిదియేమియు నవసరము లేదు. భగవంతుఁడు స్వయముగామానవజన్మమెత్తి భగవదంశ కలిగిన సద్గురువుగా జీవించి యవతారమును భగవంతుని యొద్దనుండి నేరుగా బొందుచున్నాఁడు.

సద్గురువు నవతారముకూడ దైవజీవితములో నొకేమారిరి యనుభవము కలది. ఉభయులును మాయైకావస్థలలోను భూమికలలోను నుండెదరు. ఇరువురు నొకేపర్యాయము తక్కువ అవస్థలోను, నున్నతావస్థలోను నుందురు. అయినప్పటికి నొక ముఖ్యమగు భేదముకలదు. 'కుతుబ్' ఆ అంతస్థులో క్రియాత్మకుఁ డగుచున్నాఁడు. అవతార మాయవస్థలో లీనమై యా జీవితమును గడపుచున్నాఁడు (becomes).

ఈరెంటికిని గల వ్యత్యాసము గొన్ని యుదాహరణములద్వారా తెలియును.

'కుతుబ్' లేక సద్గురువు జబ్బుపడ కూడదు. జబ్బుపడడు. ఆయన జబ్బుపడినట్లు కనబడినప్పుడు జబ్బుగానున్నట్లు నటించును*. ఆయన జబ్బుగానున్నట్లు చూచువారికి గనబడును. అవతారపురుషుఁడు జబ్బుపడినచో నాయన కది నిజముగా వ్యాధి. వాస్తవికముగా నతఁడు రోగియగును. అయినప్పటికి నాయనయం దనంతమైన శక్తిజ్ఞానానందములు గలవు.

ప్రత్యంతరమునను, బ్రిత్యవస్థను, ప్రతిభూమిక నొకపర్యాయముగా సద్గురువా యవస్థలోని జీవిగా, నాభూమికయందలి మానవుఁడుగాను వర్తించును. అవతార మొకే పర్యాయము జీవిగాను, మానవుఁడుగాను మనును. ఇట్లే మనుగడవలన నన్నియవస్థలలో నన్ని భూమికల నుండగలిగిన యవతారపురుషుఁడు సమస్తజీవకోటిని, మానవులను ముందునకుఁ దీసికొనిపోఁగల నొక 'త్రోపు' నియ్యఁగలుగుచున్నాఁడు. దీని వలన జీవుఁడు త్వరలో పరిపక్వము చెందుటకు సాయపడుచున్నాఁడు.

వాస్తవముగా భగవంతుఁడే సర్వమున నున్నవాఁడు. భగవంతుని యవతార మతఁడు సర్వమయుఁడేగాక యాయన యేసర్వము నగుచు సర్వవ్యాపియై యున్నాఁడు.

సద్గురువు క్రియాప్రధానుఁడు. అవతారపురుషుఁడు మనుచున్నాఁడు (becomes)

---

*నటన అను మాటవల్ల నపార్థము కలుగు ననుభయముచే నీపుస్తకము యొక్క సంపాదకులు బాబాగారిని ఆమాట యొక్క అర్థమును విశదముగాఁ దెలుపవలసినదని కోరిరి, అది అనుబంధము 27 లోఁ దెలుపఁబడినది

ఎల్లప్పుడు నన్ని కాలములయందును, యుగములయందు ను, భగవంతుని సాక్షాత్కారమును బొందిన యాత్మలు లేక శివాత్మలు మానవరూపములో నీ భూమిపై 56 కలవు.

ఈ యేబదాఱుగురను పూర్ణత చెందిన వారని (perfect ones) మనము పిలువవచ్చును. కానివీరందరును సద్గురువులు మాత్రము కారు. వీరందరకును భగవంతునిగూర్చిన యనుభవ మొకటియే యైనప్పటికిని, వారు చేయుకార్యమునందు భేదము కలదు. అందుచేవారిని పూర్ణత్వము చెందిన వారనే పిలువ వలెను గాని సద్గురువులని పిలువ వీలులేదు.

ఈ 56 గురు మానవజన్మముకల పరిపూర్ణులు లేక శివా త్మలలో నన్ని కాలములలోను, యుగములలోను *నయిదుగురు సద్గురువులు లేక 'కుతుబ్'లుందురు. సమస్త సృష్టియొక్క వ్యవ హారములను వీరు పరిపాలింతురు.

అవతారసమయముతో యుగము కలిసిరానప్పుడీ య యిదుగురు సద్గురువులుసమిష్టిగా లోకవ్యవహారములను జూచు చుందురు. ఇందులో సర్వబ్రహ్మాండమును నడపుట కధిష్ఠితుం డగు నొక సద్గురువును 'సూఫీ'లు 'కుతుబ్-యే-యిర్షాద్' అని పిలతురు.

---

*ఈ 'మాయ' తోఁగూడిన కాలచక్రముల పరిమితి 700 మొదలు 1400 సంవత్సరములకఱకుండును. ఈ పరిమితిలో వవియంత మొందుచుండును; తిరిగి ప్రారంభమగుచుండును. కాలచక్రములుగల, మహాచక్రములో నిట్టి చక్రములు వేన వేలుండును. కావున 'మాయ' అంతమనునది లేక శాశ్వతమై యెల్లప్పుడున్నదని శ్రీబాబాగారు చెప్పిరి.

కాని యవతారము అవతరింపవలసిన సమయ మీ కాలచక్రభ్రమణములోఁ దటస్థించినప్పు డవతారము (సనాతనుఁడు, ఉత్కృష్టులలో నుత్తముఁడు, సర్వస్వాతంత్రుఁడగు సత్యము, పరమాత్మానంతచైతన్యము) యీభూలోకమున బురుషునిరూపమున భ్రమలేక మాయ(Illusion)లో నవతరించును. దీనినే మనుష్యరూపములో "భూమిపై భగవంతుఁడు నేరుగా నవతరించుట" (అవతరణము-దిగుట) యందురు, భగవంతుని యవతరణమే యవతార మందురు.

యుగ మవతారమువచ్చు కాలమైనప్పుడు భగవంతుఁడు భూలోకముపై నవతరించినప్పు డీ పరబ్రహ్మస్వరూపుఁడు (GOD-MAN) పైనఁదెలుపఁబడిన 56 సద్గురుసంఖ్యలోఁ జేరక భిన్నముగా నుండును.

అత్తరి సర్వలోకవ్యవహారములను నడుపు నయిదుగురు సద్గురువులు, నవతారకాలము వచ్చినప్పుడు, వేరు వేరుగాను, సమిష్టిగా నవతారము భూమిపైనవతరించునట్లు చేయుదురు. సృష్టిలో నజ్ఞానములో మునిఁగి మాయాపరివృతమైన జీవకోటి నుద్ధరించుటకై వారిపై నపారకరుణను ప్రేమను జూపుచు నీ యవతారము జనింపఁ గారకు లగుదురు. అనంతమగు దివ్య చైతన్యము నీ భూలోకములో మాయావృతమై యావిర్భవింప గారకులగుదురు. పరమసత్యమున కనువగు మాయాచ్ఛాదనము కల్పింతురు. అదియే పరమపురుషు మానవాకృతి. దీనివలన మాయాప్రపంచమున సత్యమగుభగవదంశ కాహ్లాదమగురూప

ముకల్పింపఁబడు చున్నది. అదే పరమపురుష మానవస్వ రూపము.

ఇట్లు భగవంతుఁడు భూమిపై మానవరూపమున నవతరించి తన దివ్యదర్శనము మానవలోకమునకుఁ బ్రసాదించి నప్పుడాయన నవతారమని, 'మెసయ్య' యని, ప్రవక్తయని గుర్తింతురు. భగవంతుఁ డీ విధమున మానవరూపము దాల్చు చున్నాఁడు.

అనంతుఁడగు భగవంతుఁ డీ కాలచక్రములోని యుగ ములెపుడాత యుగములలో దన యపారకరుణను జూపుచు మానవరూపములో మానవకోటికి మధ్యమున నవతరించుట కిష్టపడుచున్నాఁడు. ఆయన నిజస్థితిని మానవకోటి గ్రహింప లేక పోవుటచే నతఁడొక లోకసామాన్యుఁడగు మనుష్యుఁడు గా నెన్నఁబడుచున్నాఁడు. తన దైవత్వమును వక్కాణించుచు, దా నా యుగములో భగవంతుని యవతారము నని ప్రకటించు కొనుచో నాయన నంగీకరించిన వారిచే నాయన పూజింపఁబడు చున్నాఁడు. భూలోకముపై నవతరించిన భగవంతుఁడని యా యనను గుర్తించినవారాయనను గీర్తింతురు. వారినడుమ భౌతిక శరీరములో నున్నంతకాలము మిగిలిన మానవులాయనను గుర్తింపక గర్హింతురు.

మానవరూపములో నున్న భగవంతుఁడు దా నవతార పురుషుఁడ నని ప్రకటించుకొని మానవకోటిచే నవమానింపఁ బడుటకు, బాధింపఁబడుటకుఁ దనంతట తానే గురి యగుచు

న్నాఁడు. ఆయన యపారప్రేమ యిట్లు చేయఁ బురికొల్పినది. అవతారపురుషు నిట్లు ఖండించుట కవకాశముకల్పించి భగవంతుని యనంతశాశ్వతమగు సత్యమును మానవలోకము గుర్తించునట్లు చేసెను.

అవతారము దాల్చునది యెప్పుడును అవిభాజ్యమూ ననంతము శాశ్వతము నగు భగవంతుఁడొక్కఁడే*. ఆయనయే అవతారము 'మెసయ్య,ప్రవక్త,బుద్ధుఁడు', సనాతనుఁడుగా నవతరించుచుండును. సత్యమును బ్రకటించుట 'కేకోనారాయణ' యనబఁడుటకు భగవంతుఁడు వేరువేరు యుగములందు, ప్రపంచము వివిధభూభాగములం దాయాజాతులలోను, భాషలలోను, భిన్నమగు మానవరూపములలో నవతరించి మానవకోటి నజ్ఞానరూపమునుండి లేవనెత్తి మాయాబంధనములనుండివిముక్తి నిజేయును.

ఈయవతార సమయములో నప్పుడు సజీవులైయున్న యైదుగురు సద్గురువులలో నొకరు తమరుచేయు నుద్యోగమును వదలి సమస్తసృష్టి కార్యకలాపములను గూర్చిన కర్తృత్వ మవతారపురుషునకు నప్పగించును. తాను మిగిలిన నలుగురి వలెనే మానవశరీరములోనుండి 'కుతుబ్' ఉద్యోగములో నుండును.

---

*సద్గురువు ఈ భౌతికశరీరమును వదలిన తరువాత తిరిగిభూలోకములో జన్మమెత్తుదురా యను ప్రశ్నకు బాబాగారిట్లు సమాధానముచెప్పిరి. తిరిగి మానవజన్మ మెత్తరు. అవతారము మాత్రము తిరిగితిరిగి నరజన్మ మెత్తును"

అవతార మీలోకములో నవతరించినప్పటికిని మానవ రూపములో భగవత్సాక్షాత్కారము పొందినవారు 56 గురుండవలెను. అందులో నైదుగురు సద్గురువులు భూమిపై నివసించియుందురు. ఈ 56 భగవత్సంబంధముకల యుద్యోగములు నెల్లకాలములయందు నున్నవి.

ఈ 56 గురులో నొకరు భౌతికశరీరమును త్యజించినప్పుడాపదవి యట్లేయుండదు. అప్పటికి భగవంతుని సాక్షాత్కారము పొంది సజీవులైయున్న మరియొకరిచే బూర్తి చేయఁబడును. అవతారము భూలోకముపైనున్న సమయములో నున్నప్పుడుకూడ నీ 56 సద్గురువులు మనుష్యరూపములో నీ 56 ఉద్యోగములను నిర్వర్తించుచుందురు. కాని అవతారము మాత్రము సర్వాధికారి.



# భగవంతుని ప్రధానావస్థాదశకము

శ్రీ మెహర్ బాబా వివరణము*

అవస్థ 1 పరాత్పరతరబ్రహ్మ

అవస్థ 2 పరమాత్మ (ఎ, బి, సి, ఉపస్థితులు)

అవస్థ 3 బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (సృష్టిస్థితిలయ కారకులు)

అవస్థ 4 శరీరి

అవస్థ 5 పరిణామాంతర్గతబ్రహ్మ

అవస్థ 6 అవతరన్మానవ రూపబ్రహ్మ

అవస్థ 7 దివ్యవిభూతియోగ పురోగామిబ్రహ్మ.

అవస్థ 8 బ్రహ్మీభూతులు

అవస్థ 9 జీవన్ముక్తాత్మలు

అవస్థ 10 గురుస్వరూపము

---

* పటమునం జూడఁదగును.

# తొమ్మిదవ భాగము

## భగవంతుని యవస్థాదశకము*

భగవంతుని పదియవస్థలను చూపు చిత్రమును గురించి వివరముగాఁ దెలుపుట కీ యధ్యాయ ముపయోగింపఁబడినది. ఈ పటమును శ్రీమెహర్ బాబాగారే నిర్మించిరి. వారి యాధ్యాత్మికజ్ఞాన మహార్ణవమునుండి వెలువడిన రత్నమిది. ఈ చిత్రములో నుపయోగింపఁబడిన పర్యాయపదములన్నియు 'సూఫీ' వేదాంత క్రైస్తవమత రహస్యపరిభాష యందలివి.

ఈ పటము నొకసారి పరికించినచోఁ బరమాత్మనుండి మనుజుఁడగు జీవాత్మస్థితికిఁ బోయెడి యధోముఖయాత్రను దెలుపుచున్నది. తిరిగి యా తుదిమెట్టునుండి క్రమక్రమముగా చిదావరణములఁ గడచి యూర్ధ్వగామియై పుట్టిన చోటికి జీవాత్మ చేరుట గ్రాహ్యమగును. మొదట బ్రాహ్మీభూతస్థితికిఁ జేరిన తరువాత సద్గురువుస్థితికిఁ బోవును. ఈ పదియవస్థలు ప్రయాణములోఁ బదిముఖ్యఘట్టములు. ఇందు చైతన్యము లేని భగవంతుఁడు చైతన్యముకల మానవుఁడై తరువాత భగవంతుఁడగును.

---

*'భగవంతుని పదియవస్థలు' అను నీభాగము శ్రీబాబాగారి పర్యవేక్షణమున శ్రీయెరుచ్ బి జస్సావాలాచే వ్రాయఁబడినది. శ్రీ బాబాగారిచే నిర్మింపఁబడిన యీచిత్రములోని అంశములు విశదీకరింపఁబడినవి.

భగవంతుని యవస్థ లొకదానికొకటి భిన్నమైనట్లు కన బరుపఁబడినను అవి "యేకమేవా ద్వితీయ"మ్మను తెలుఁగున భగవంతుని పదియంశములు లేక లక్షణములై యున్నవి. పర మాత్మ యధిరోహణావరోహణము లూహాజనితములు. ఈ ఊహ యవతరించినప్పుడు భగవంతుఁ డొక్కఁడే యున్న వాఁ డని, యున్నట్లు కనబడునదంతయు నాయన ఛాయయని పూర్ణ చిత్కలాభావమున ద్యోతకమగును.

(శ్రీ) మెహర్ బాబా యాధ్యాత్మజ్ఞాన మసందిగ్ధముగా ఏకత్వసిద్ధాంతమును (Indentityism)అద్వైతసిద్ధాంతమునుగూడ దృఢపఱచును. ఇందున్న పటములో నిజ మూహాజనితములు నగు వివిధపాత్రలను భగవంతుఁడే ధరించునని స్పష్టముచేయఁ బడినది. ఆద్యంతములయందు భగవంతుఁడే కలఁడు. మధ్యాం తరములలోఁగూడ భగవంతుఁడే కలఁడు.

మహమ్మదీయమతములో నాధ్యాత్మికసూత్రము :— "ఆయన మొదటివాఁడు, తుదివాఁడు; ఆయన బయటివాఁడు,- ఆయన లోపలివాఁడు".

గుల్‌షాన్ మేరాజ్‌లో మౌలానాషాబిస్తారి యిట్లు చెప్పుచున్నాఁడు.

"త్రోవఁగలయన్ని గడపలఁ ద్రొక్కి-త్రొక్కి
మొదటవెల్వడ్డ గడపకే పోవునతఁడు".

(శ్రీ) మెహర్ బాబా చెప్పిన ప్రకారము భగవంతుని యీ పది యవస్థలను వర్ణించెదము.

# అవస్థ 1

పరాత్పరతరబ్రహ్మస్థితి.

ఈ యవస్థ నుత్కృష్టము, సతీతమునగు స్థితిలో నుండు టచే దానిని గుఱించి యిదమిద్ధమని భావించుటకు వీలులేదు. అది శుద్ధసత్త్వము, పరిశుద్ధమునై యితరమగు లక్షణరహితము. సమస్తము నంతర్గతమునగు సత్యమున గుప్తమైనది, రహస్య జ్ఞానమున గుప్తమైనదియు. అది మాటల కందనిది; దానిని సరిగా వర్ణించుట సాధ్యముకాదు. అది పరిమితమునుగాదు; అపరిమితమును గాదు. సగుణమునుకాదు. నిర్గుణమునుకాదు. ఇందు భావనావిచక్షణాగ్రహణశక్తులుఁగూడ కుంఠితములై యుండును. ప్రయోజనకారులు కావు.

"సర్వమయుఁడగు నా నిత్య సత్యమూర్తి
దిగ్విదిగ్వ్యాప్తి లేనట్టిదివ్యు నతని
నెందుఁగలఁడని వెదకఁగా నేమిఫలము !
బుద్ధికందగరాని ప్రబుద్ధు నతని
బుద్ధి నూహించి శ్రమ నీవు పొందఁబోకు"

హాఫీజు.

(శ్రీ) బాబాగారిట్లు చెప్పుచున్నారు: భగవంతుని యీ స్థితిని సాక్షాత్కారముచేసికొన్నవారు ఆయన నితరులకుఁ దెలియునట్లు వర్ణింప యత్నించినప్పుడు; మొదటిస్థితిగాక రెండవ యవస్థయగు పరమాత్మస్థితిని వర్ణింపఁ గలుగు చున్నారు.

అది శాశ్వతము లన్నిటికంటెను శాశ్వతమైనది. దానికిఁ బూర్వాపరము మఱియొక శాశ్వతవస్తువు లేదు. ఇచ్చట సూచనములు చిహ్నములన్నియుఁ దుడిచివేయఁబడినవి. సూచనము నియ్యకలదేదియు నందు లేదు. ఈ స్వచ్ఛమైన తత్వము న కేఋయు నెఱుకయనునది లేదు. తనసంగతియే తనకు తెలియదు.

ఈ స్థితిని సూఫీలు—"వారా_ఉల్_వారా_సుమ్మావారా ఉల్_వారా" స్థితి లేక పరాత్పరతరబ్రహ్మస్థితి యని చెప్పియున్నారు.

ఇచ్చట భగవంతుఁడు నిర్గుణుఁడుకాఁడు, సగుణుఁడు కాఁడు, నిరాకారుఁడు కాఁడు, సాకారుఁడు కాఁడు.

భగవంతుని యీ పది ప్రధానావస్థలలో నీ పరాత్పర తరబ్రహ్మస్థితి మొదటిది; అనాదియగు స్థితి.

ఆదికాలముకంటె పూర్వమగు ప్రారంభమందు భగవంతుని యితరస్థితులు లేనప్పుడు పరాత్పరతరబ్రహ్మస్థితి మాత్రి మున్నది.

ఆ యనంతమగు పరాత్పరతరబ్రహ్మస్థితిలో నిరాలంబమగు ననంతాకాశము లేక శూన్యముండెను. అనంతమగు చైతన్యము జడత్వము లేక చైతన్యహీనతమున్నగు భగవంతుని లక్షణములు సర్వమగు మహాకాశములో శూన్యముగా నిమిడియున్నవి. (అనఁగా నీసర్వములో శూన్యము చేరియున్నది)

అనాదిలో నీ పరాత్పరతరబ్రహ్మస్థితిలో భగవంతుఁడు శాశ్వతముగా నున్నాఁడనిమాత్రము చెప్పఁగలము. ఈస్థితిలో మాయాస్ఫూర్తినిఁగాని, చైతన్యస్ఫూర్తినిగాని కలిగియున్నాఁడని చెప్ప నేరము. చైతన్యహీనుఁడని కాని చెప్పఁజాలము.

# అవస్థ 2

పరమాత్మస్థితిలో భగవంతుఁడు.

పరాత్పరతరబ్రహ్మస్థితిని సరిగా వర్ణించుటకుఁ దరము కాదని యిదివరలోఁ దెలిపియుంటిమి. భగవంతుని సాక్షాత్కారము పొందినవారు పరాత్పరతరబ్రహ్మస్థితినిగూర్చి తెలుపుటకు యత్నించి పరమాత్మస్థితినిగూర్చి మాత్రము వర్ణింపఁ గలుగు చున్నారు. దీనినే సూఫీలు 'అల్లా'యనియు, జోరాస్ట్రియనులు 'అహోరామజ్ద్' అనియు, వేదాంతులు 'పరమాత్మ' యనియు, క్రైస్తవులు 'పరమపిత'యనియు, కొందఱు వేదాంతులు 'మహాత్మ'యనియుఁ బిలుతురు. పరమాత్మస్థితిలో భగవంతుఁ డనంతుఁడు శాశ్వతుఁడు, స్వతంత్రుఁడు— "ఏకమేవా ద్వితీయమ్".

శ్రీ మెహర్ బాబాగారి రెండవస్థితిని విపులీకరించుచుఁ బ్రధానముగా రెండవయవస్థ మొదటియవస్థకంటె భిన్నము కాదని వక్కాణించుచున్నారు. ఎ.బి.సి. యను రెండవయవస్థలో నంతరయవస్థలవల్ల వ్యత్యాసము కనఁబడుచున్నది.

చిత్రమునుబట్టి (ఎ) పరమాత్మస్థితి; (బి) నిర్గుణస్థితి నిరాకారస్థితి; (సి) మితలక్షణయుతమైన రూపము.

వ్యత్యాస మెక్కడ యెప్పుడు వచ్చినది (శ్రీ) బాబా గారీ క్రిందివిధముగాఁ దెలుపుచున్నారు.

తన్ను దాను దెలిసికొనవలె నను 'నేనెవరు?' అనుప్రశ్న మాదిని భగవంతుని యనంతచిద్విలాసముగా జనించినప్పు డఖండ శూన్యముగా నుండెను. పరాత్పరతర బ్రహ్మస్థితిలో ననంతమగు దివ్యశూన్యము (ఆకాశము) నుండి 'నేనెవరు ?' అను ప్రశ్న ఉత్పన్నమగుట యూహించుటకుఁగూడ వీలులేని దిగా తోఁచును.

ఈ చిద్విలాసము కదలికతో నుత్పన్నమైన విషయము భగవంతుని మరియొక లక్షణము బయలుదేరుటకు కారణమగు చున్నది. చైతన్యముండుట కాని, లేకపోవుట కాని కలస్థితి, శాశ్వతము అనంతము నగు భగవంతుని స్థితితప్ప మిగిలిన దంతయు తన్ను తెలుసుకోవలె నను విలాసభ్రమముతోఁగూడ పరాత్పర పరబ్రహ్మములో నంతర్గతమైయుండును.

ఈ పరాత్పర పరబ్రహ్మస్థితిలోనున్న యనంత చిద్విలాసము నూతన విశాలదృశ్యమును బహిర్గతముచేయును. ఈ దృశ్యమువల్ల అనంతమగు భగవంతుని ఆదిస్థితికి భిన్నమైన మార్పు కలుగును.

ఈ రెండవస్థితి భగవంతుని అనంతమగు అదిస్థితికి మరి యొక అనంతలక్షణముగా బహిర్గత మగును. భగవంతుని యీ దశావస్థలలోను రెండవది అనాదియగు పరమాత్మస్థితియని చెప్పుదుము.

చిత్రములో రెండవదిగాఁ దెలుపఁబడిన రెండవయవస్థలోనున్న పరమాత్మగాఁ దెలుపఁబడినస్థితి, చిత్రములో నన్నిటి కంటె సనాతనము మొదటియవస్థలోనున్న పరాత్పర పరబ్రహ్మమునకు భిన్నమని యెంచకూడదు.

ఒకటి రెండుఅవస్థలకు గల భేదమిదియే. మొదటిఅవస్థ అనంతమగు, శాశ్వతమగు దివ్యశూన్యము లేక ఆకాశము. ఇందనంతమగు చిద్విలాసము నూహింప నలవికాదు. పరాత్పరతరబ్రహ్మస్థితిలో నాదిని కలిగిన చిద్విలాస మీస్థితిని గలఁచి నప్పుడు 'నేనెవరు'? అను భావము బయలు వెడలుచున్నది. అప్పుడేలక్షణము లేని పరాత్పరతర బ్రహ్మస్థితిలోని (మొదటిది) భగవంతుఁడు పరమాత్మయను రెండవస్థితిని బొందుచున్నాఁడు. పరమాత్మకుఁగల యనంతలక్షణమును 'పరాత్పరతరబ్రహ్మ' పొందుచున్నాఁడు.

చిత్రములో రెండవయంశము పరమాత్మస్థితియు, నందు ఒకటవయంశము 'పరాత్పరతరబ్రహ్మము' అనునదియు ప్రధానవిషయములలో నొకటియే. ఇవి రెండును వేఱుగాఁ జూపఁబడుటకుఁ గారణమేమనఁగా 'పరమాత్మస్థితి' సనాతనమగు 'పరాత్పరతర బ్రహ్మ'స్థితికిఁ గొంచెము భిన్నమైయున్నది. ఆదిని భగవంతుని చిద్విలాసమువల్లఁ గలిగిన యాందోలనము నుండి బయలుదేరిన ప్రేరణమువల్ల 'నేనెవరు' అని తెలిసికొనవలెననెడి సంకల్పము రెండవ యవస్థయగు పరమాత్మస్థితి నుండి బయలుదేరినది. 'పరాత్పరతర బ్రహ్మస్థితిలోనున్న భగ

వంతుఁడప్పుడు 'పరమాత్మ' సంబంధమగు ననంతస్థితిని బొందు చున్నాఁడు.

భగవంతుని యీ రెండవస్థలలోను (అనంతశూన్యాకాశ స్థితిలో తప్ప) మిగిలిన గుణములు, లక్షణములు, స్థితులు. అనంతము బహుపరిమితముకల చైతన్యము, చైతన్యహీనస్థితి, భగవంతుని త్రిలక్షణమగు శక్తిజ్ఞానానందములు ఇవన్నియుఁ గూడ ననంతమగు దివ్యశూన్యములో నిమిడియున్నవి.

శాశ్వతము ననంతమునగు దీనియందు గర్భీభూతమై యున్న యివియన్నియు 2వ యవస్థయగు 'పరమాత్మ'స్థితిలో నావిర్భవించుట కవకాశము కలదు. అనంతరూపముగాను, పరిమితముగాను శూన్యముగాను, సర్వముగాను, ఆవిర్భవించుట కెడతెగని యవకాశము కలదు.

అందుచేఁ జిద్విలాసమువల్లఁగలిగిన కల్లోలము భగవంతుని రెండవయవస్థలో సాధ్యమైనది. ఆ కల్లోలము కలిగి నప్పు డదిభగవంతుని యనంతస్థితియందే సమగ్రముగాఁ గలుగును. ఈ చిద్విలాసము కలిగించిన యాందోళనానుభవమును మొదటియవస్థలోని 'పరాత్పరతరబ్రహ్మ'స్థితిలో భగవంతుఁడు పొందలేఁడు. అనుభవమును 2వ యవస్థలోని 'పరమాత్మ' స్థితిద్వారా మొదటియవస్థలోని 'పరాత్పరతరబ్రహ్మ' పొందుచున్నాఁడు.

ఆద్యచిద్విలాసమువల్లఁ గలిగిన యనంత పరిణామములు భగవంతుని రెండవస్థితియగు పరమాత్మస్థితిలో కలుగుచున్నవి.

"నే నెవరు?" అను ప్రశ్న బయలుదేరినప్పు డుత్పన్నమైన చిద్విలాసము సమగ్రమగు స్వభావము కలదగుటచే, భగవంతునిలో సంతర్గతమైన చైతన్యజడత్వముల ననంతముగా నేకకాలమందు "పరమాత్మస్థితి"యం దావిర్భవింపఁ జేసినది.

స్వతస్సిద్ధములగు నీ యనంతాంతర్గత చైతన్యజడత్వముల యేకకాలావిర్భావము మనుష్యుని బుద్ధి కవగాహనము కాదు. యాథార్థ్యవిషయభూమికలఁగల యీ వైరుధ్యము మానవుల యెఱుక కతీతము. భగవంతుఁడు యేకకాలమం దనంతచైతన్యమును, చైతన్యహీనతను, (జడత్వమును) కలిగియున్నాఁడు. (శ్రీ) మెహర్ బాబాగా రిది సత్యమేయని తెలుపుచు నిది "యథార్థ"లోకముల సంబంధమైనది; మనస్సున కర్థముకానిది; సత్యమును సాక్షాత్కారముచేసికొనినప్పుడే తెలియఁనగునదనిరి. ఇది మనకు సరిగాఁ దెలియుటకుగాను (శ్రీ) బాబాగారు తల్లి గర్భములోనున్న శిశువుపోలికను తెలుపుచున్నారు.

గర్భోత్పత్తియైనప్పుడు తల్లి గర్భములో శిశువు వృద్ధి పొందుచుండును. ఆ పిండము క్రమముగాఁ బెద్దదై మిగిలిన యంగసృష్టితోఁ బాటు కన్నులుకూడ నేర్పడును. ఆగర్భములో నెదిగిన శిశువునకు దర్శనాదర్శనశక్తు లొకే పర్యాయము ప్రాప్తించును. జననమైన తరువాతఁ గన్నులతోఁ జూచినను జూడకపోయినను గర్భములోనున్న పరిస్థితినిబట్టి బిడ్డ కన్నులు ద్వంద్వలక్షణములు కలిగియుండును. పిల్ల కన్నులు తెఱచినప్పుడు 'చూచును' మూసికొనినప్పుడు 'చూడదు'. కాని

కన్ను లేర్పడి పూర్తిగాఁ బరిణామముపొందినప్పుడీ ద్వంద్వలక్షణము వానియం దేర్పడినది.

ఆద్యచిద్విలాసఫలమగు కల్లోలములో భగవంతునియం దంతర్గతమైయున్న యనంతచైతన్యము, చైతన్యహీనతయుఁ (జడత్వము) నేకకాలమందు బయల్వెడలును. సంకుచితమైన మనస్సున కిది యాత్మవైరుధ్యముగాఁ దోఁచును.

మొదటియవస్థయగు పరాత్పరతరబ్రహ్మస్థితిలోనున్న భగవంతుఁడు చిత్రములో ఎ. బి. స్థితులలోఁ జూపఁబడినట్లు తన యనంతచైతన్యస్థితి, చైతన్యహీనస్థితి నేకకాలమందు పొందుచున్నాఁడు. (చిత్రము. ఎ.)

పరాత్పరతరబ్రహ్మస్థితిలో భగవంతుఁడు తన యనంత చైతన్యహీనస్థితిలో నుండుటయేగాక, పరమాత్మస్థితిలోఁగూడ నట్టి చైతన్యహీనస్థితిలోనే యుండును. (చిత్రములో 2 గా చూపఁబడినది.)

అనంతముగా చైతన్య మావిర్భవించినప్పుడు చిత్రములో "బి"లోఁ జూపినట్లు భగవంతుఁడు పరమాత్మస్థితిలోఁ దన పరాత్పరతరబ్రహ్మస్థితి, శాశ్వతస్థితినిగూర్చిన చైతన్యము కలిగియుండుటయేకాక రెండవచిత్రములోఁ జూపఁబడినట్లు తన పరమాత్మస్థితియందలి యనంతచైతన్యమునుగూడఁ గలిగి యున్నాఁడు.

అనఁగాఁ 'బరమాత్మ' స్థితిలో భగవంతుఁడు (చిత్రములో రెండవఅవస్థగాఁ జూపఁబడినది) ఏకకాలమందు శాశ్వ

తమగు ననంతచైతన్యహీనస్థితి (అంతరవస్థ-ఎ-గా చూపఁబడి నది) అనంతచైతన్యస్థితి (అంతరవస్థ-బి-గాఁ జూపఁబడినది) పొందుచున్నాఁడు.

అంతరవస్థ 'ఎ' 'పరమాత్మ' స్థితిలోని భగవంతునిది. ఇది రెండవయవస్థగాఁ జూపఁబడినది. ఇదియే భగవంతుని యనంతశక్తిజ్ఞానానందముల యనంతచైతన్యహీనత. (జడత్వము) ఈ యంతరవస్థలో (ఎ) భగవంతుఁడు తన యనంత శక్తిజ్ఞానానందములను స్మృతిపూర్వకముగా ననుభవింపలేఁడు. వాని నుపయోగింపఁడు.

అంతరవస్థ 'బి' కూడ 'పరమాత్మ'స్థితిలోని భగవంతునిదే. అది రెండవయవస్థగాఁ జూపఁబడినది. ఈ యంతరవస్థ 'బి' నిర్గుణము, నిరాకారము కాని భగవంతుని యనంతస్వభావత్రితయమగు శక్తిజ్ఞానానందముల దివ్యచైతన్యమును కలిగి యున్నది. ఈ 'బి' యవస్థలో భగవంతుఁడు తనయఖండశక్తిజ్ఞానానందములను స్మృతిపూర్వకముగా ననుభవించును గాని వాని నుపయోగింపఁడు. తనయథార్థతస్మృతి కలిగియున్నాఁడు. కాని తనమాయనుగూర్చి స్మృతిలేదు.

వేదాంతపరిభాషలో మొదటియవస్థయగు పరాత్పరమగు పరబ్రహ్మస్థితి నుండి రెండవయవస్థయగు పరమాత్మయుత్పన్న మగుచున్నది. ఈ రెండవయవస్థలో శాశ్వతమగు చైతన్యము లేకున్నాఁడు. కాని యదే సమయమునఁ దన యాదిస్థితియగు పరాత్పరతర బ్రహ్మమునుగూర్చి శాశ్వ

తమగు చైతన్యము గలిగియున్నాఁడు. ఈ యనంతమగు పరమాత్మ ద్వంద్వలక్షణములు చిత్రములో 'ఎ' అనియు 'బి' అనియుఁ జూపఁబడినవి.

పరమాత్మస్థితి (2 గా చూపఁబడినది) లో శాశ్వతమగు చైతన్యహీనస్థితిలోనున్న పరమాత్మ (ఎ); శాశ్వతమగు చైతన్యస్థితి (బి) పొందఁగోరుచుండును. అది పరమాత్మ యనంత ద్వంద్వలక్షణములలో రెండవది.

అనఁగా పవిత్రపరమాత్మది 'ఎ' లోనున్న భగవంతుని చైతన్యహీనస్థితి 'బి'లోని యథార్థతయొక్క చైతన్యస్థితిని స్మృతిపూర్వకముగాఁ దెలిసికొనుట. అనఁగా 'ఎ' స్థితి స్మృతిపూర్వకముగా'బి'స్థితి అనుభవమును బొందినప్పుడు లక్ష్యసిద్ధి కలిగినది.

ఇది జరుగుటకు క్రమముగా 'ఎ' స్థితి 'బి' స్థితిలోనికి మాఱి పూర్తిగా 'బి' స్థితి అయిపోవలెను.

ఈపైన దెలుపఁబడిన పరివర్తనము 3,4,5,6,7 అవస్థలుగా చిత్రములో విశదీకరింపఁబడినవి. 8వ అవస్థలో 'ఎ' అవస్థలోని భగవంతుఁడు 'బి' అవస్థ పూర్తి చైతన్యము నొందును.

ఈ 8వ అవస్థలో 'ఎ' స్థితిలోని చైతన్యహీనాంతస్థితి 'బి' స్థితిలోని పరిపూర్ణచైతన్యమును పొందుటయేగాక, తన యనంతచైతన్యసత్యములో పూర్తిగా మగ్నుఁడైయుండును. 'బి' స్థితిలోని అనంతచైతన్య స్థితిలో నైక్యమగును. 8వ అవస్థలోవలె నిమగ్నుఁడైయున్న భగవంతుఁడు పూర్ణత్వముపొందిన మానవ

రూపములో మనస్సూక్ష్మస్థూలలక్షణముల మూలమున నా యా లోకముల సాధారణ చైతన్యమునొంది నిలుపుకొనినచో, 8, 10 అవస్థల పవిత్రకూటస్థానమగు 9వ అవస్థనొందినవాఁ డగును. ఈతొమ్మిదవ యవస్థ కనంతరము భగవంతుని 10 వ యవస్థ చిత్రములో వివరింపఁబడి భగవంతుని "సి" స్థితితోఁ గల సంబంధము చూపఁబడినది.

భగవంతుని యీ 10 వ యవస్థ సద్గురువుగా లక్షణములు కలిగి మానవరూపములో జననమొందును. ఈ 10 వ యవస్థలో భగవంతుఁడు తన లక్షణత్రయమగు ననంతశక్తి జ్ఞానానందముల ననుభవించుటయేగాక, వానిని, చిత్రములో "సి" లోఁ జూపఁబడిన పదియవస్థకు సంబంధించిన యుచ్చాధికారముగా నుపయోగముకూడఁ జేయును.

అనంతమగు చైతన్యహీనస్థితిలో (౧) భగవంతుఁడు "నిర్గుణుఁడుఁకాఁడు, నిరాకారుఁడు కాఁడు, సగుణుడు కాఁడు, సాకారుఁడు కాఁడు. కాని "బి" స్థితి నిర్గుణ నిరాకారస్థితి. "సి" స్థితి సగుణసాకారస్థితి. అదియుత్కృష్టమైన సద్గురుస్థితి. అందు భగవంతుఁడు మాయాసత్యముల రెండింటి యనంతస్మృతిఁ గలిగి యున్నాఁడు.

## అవస్థ 3

భగవంతుఁడు సృష్టిస్థితి లయకారకుఁడు.

ఈ యవస్థలో భగవంతుఁడు సృష్టించుట, పోషించుట లయించుట యను మూఁడుప్రధానగుణములఁ గార్యరూపము

నకుఁ దీసికొనివచ్చును. ఈ త్రిగుణములు నొకచోనుండు స్థితిః వేదాంతములోని త్రిమూర్తులతోఁ బోల్చవచ్చును. బ్రహ్మ (సృష్టికర్త) విష్ణువు (రక్షకుఁడు) మహేశుఁడు (విధ్వంసకుఁడు); వీనిని సూఫీమతములో 'అఫ్రిడ్‌గార్', 'పరవర్దిగార్' 'ఫానా కార్,' అని పిలుతురు.

భగవంతుని యీమూఁడు గుణములు ముగ్గురు దేవదూతలద్వారా తెలియఁజేయఁబడుచున్నవి. ఇస్రిఫీల్ (సృష్టి) మికయీల్ (స్థితి) యిజ్‌రేయీల్ (లయము) అని యీదివ్యదేవదూతలను పిలుతురు.

మూఁడవ యవస్థయందలి యీమూఁడుగుణములు భగవంతుని ప్రథమావస్థయగు నాద్యస్థితిలో లీనమైయున్నవి. ఆదిని మొదటియనంతమగు చిద్విలాసకల్లోలముతోఁ దన్ను దానెఱుఁగవలెనను కోరిక రెండవయవస్థలోఁ గలిగినప్పుడే యీమూఁడుగుణము లేకకాలమందు ప్రకాశము పొందఁజొచ్చెను. అప్పుడు రెండవయవస్థలోని భగవంతుఁడు 'ఎ' స్థితిలోని యనంతచైతన్య హీనతయును, 'బి' స్థితిలో ననంతచైతన్యస్థితికి సంబంధించిన ద్వంద్వలక్షణము నేకకాలమునందుఁబొందెను.

ఆదినిగలిగిన తన్ను తాను దెలిసికోవలెననెడి యిచ్ఛ 'ఎ' అవస్థలోనున్న భగవంతునిలో నింకను బ్రబలముగా నుండును. కాని, యప్పుడు తననుగుఱించి స్మృతియేలేనిస్థితిలో నింకను భగవంతుఁడున్నాఁడు. ఈ స్థితిలోఁ దన్ను దాను దెలుసుకోవలెననుకోరిక ప్రాబల్యమువల్ల సర్వములో నంతర్గతమైయున్న

ట్టియు, శూన్యములో నున్నట్టియు, భగవంతుని గుణములను లక్షణము లావిర్భవించుట సాధ్యమయ్యెను. కాని, సర్వములో గర్భీకృతమైన శూన్యమంతయు పరమాత్మస్థితిలోనే యిమిడి యుండుట కవకాశము కలదు.

పరమాత్మస్థితిలో నిమిడియున్నదంతయు ననంతమగు ప్రేరణమువల్ల నావిష్కరణముపొంది శూన్యపూర్ణరూప ముగా రూపొందును. శూన్యతలోని శూన్యము సృష్టిగా నావిర్భవించినది. చైతన్యహీనమగు ననంతస్థితిలోనుండి తన్ను దాఁ దెలియవలెనను ప్రేరణమునుండి యీ సృష్టి బయలు దేఱును. అందుచే 'ఎ' స్థితియైన యనంతమగు చైతన్యహీనత నుండి భగవంతుఁడు సృష్టికర్తగా మూఁడింటిలో మొదటిలక్ష ణమును బొందుచున్నాఁడు.

ఈ సృష్టికర్త లక్షణమును బొందుటతోడనే తన మూఁడవయవస్థలో సృష్టికంతకును సృష్టికర్తయగును.

సహజమగు తరువాతస్థితి, సృష్టించినదానిని బోషింప వలసినస్థితి.అందుచే మూఁడవ యవస్థలోవలెఁ బోషకుఁడగును.

సృష్టించినదానిని బోషించుటతోడనే సృష్టింపబడిన దాని నాశనమునకుఁగూడ నేర్పాటుచేయును. ధ్వంసములేని సృష్టి యసంభవము. అందుచే మూఁడవఅవస్థలో భగవం తుఁడు లయకారకుఁ డగుచున్నాఁడు.

మూఁడవయవస్థలో భగవంతుఁ డేకకాలమందు సృష్టి స్థితిలయకారకుఁడగుచున్నాఁడు.

ఈ త్రిగుణముల ప్రదర్శనమున శూన్యములోని శూన్యత వ్యక్తమగుచున్నది. ఈ శూన్యము (భ్రమ) మాయకారణముగా సృష్టిగాఁ గనఁబడిన నిది నిజముగా శూన్యమే లేక "లేనిది"

నిజమగు సర్గములో సృష్టియనునదియే లేనిదని శ్రీ మెహర్ బాబాగారు తెలిపియున్నారు. మనము "సృష్టి" యని పిలుచునది అసంఖ్యాకములగు శూన్యరూపముల యావిర్భావము. ఈ శూన్యము నిజముగా 'నేమియుకానిది–లేనిది'. కాని యది యొక భ్రమచే చుట్టఁబడిన భూమికలోనున్నది. కాని సర్వమునగు భగవంతుని భూమికను దాటిలేదు. ఈ సర్వములో శూన్యము లేక "లేనిది" యిమిడియున్న నీశూన్యములోమాత్రము సర్వము నిమిడిలేదు. భగవంతుఁ డొక్కఁడే శూన్యమునుగూడ నిముడ్చుకొన్న సర్వము. సృష్టికిఁబూర్వము సర్వమునగు భగవంతుఁడుతప్ప మిగిలినదంతయు "లేనిదే"

"దైవమొక్కఁడెయున్న డెందైనఁగాని
దానిలీలలు నిల్చుగుప్తముగనందె;
శాశ్వతంబుగ మ్రోగెడు శబ్దమొకటె,
దానగానస్వరములు నిదాఘ్రణములగు.
అదియెపానశాల, అమృతభాండములవె,
మధుపరీమళమదమత్తమచటు,
మధువుఁగ్రోలువారు, మధుపాత్రలందించు
వారలెవరుకాన రారదేమొ!

చూడఁజూడ మిథ్యస్థూలప్రపంచమ్ము
నాకలోకమేని నాస్తినాస్తి
ఆమహాత్ముఁడేవమస్తునఁజిత్కళా
లలితజీవకోటిపాలిచేఁగాదె!" "మున్సిఫ్ అస్గార్"

భగవంతుఁ డొక్కఁడే యుండెను. కాని యాయన చైత
న్యమంతర్గతమై యుండెను. అందుచేఁదన్నుదా నెఱుగకుండెను.
చైతన్యము లోపల నిమిడియున్నట్లే యాయనలో సృష్టికూడ
నిమిడియున్నది.

అంతర్గతమైన సృష్టికిని బైకావిర్భవించినదానికి భేదము
విత్తునకు వృక్షమునకుఁ గలభేదము వంటిదే. ఏదియెట్లున్నను
సృష్టిమాత్రము లేనిదే. అది శూన్యతగాఁ బైకావిర్భవించిన
యంతర్గతశూన్యము.

రెండవఅవస్థలోని పరమాత్మస్థితి భగవంతునసంతమగు
సర్వములో నిమిడియున్న శూన్యము. భగవంతుని యనంత
త్వములో బహుసూక్ష్మమై పరిమితమైన మొననుండి యావిర్భ
వించును. ఈ మొనను సృష్టిమొనలేక "ఓమ్" మొనయనిచెప్పె
దము. ఈ మొననుండి 'సృష్టి' బయటకు నెట్టఁబడినది. ఈసృష్టి
స్థానము భగవంతుని పరాత్పరతరబ్రహ్మస్థితిలోఁగూడ నంతర్గ
తమైయున్నది.

నిరంతరము జరుగుచున్న సృష్టిస్థితిలయముల కార్య
కలాపమొక యుదాహరణపూర్వకముగాఁ దెలుపవచ్చును.

మానవశరీరము భగవంతుఁడని యూహింతము. కన్నులుమూసి కొని నిద్రపోవుచున్న మానవశరీరము పరమాత్మస్థితిలోనున్న (2 ఎ అవస్థ) భగవంతునితోఁబోల్చవచ్చును. మెలఁకువవచ్చి కన్నులు తెరచిన మొదటిక్షణములు,సృష్టికర్తయగు భగవంతుని స్థితితోఁ బోల్చవచ్చును. తరువాత శరీరమునకు కలిగియుండు జాగ్రదవస్థ భగవంతుని పోషకుని యవస్థతోఁ బోల్చవచ్చును. తిరిగి కన్నులమూసికొని నిద్రపోవుస్థితి భగవంతుని ప్రళయ స్థితితోఁబోల్చవచ్చును. అట్లేకకాలమం దొకేమూర్తియందు భగవంతుడు సృష్టిస్థితిలయకర్తగాఁ బరగుచున్నాఁడు.

# అవస్థ 4

జీవుఁడుగానున్న భగవంతుఁడు.

"వేలువేలురూపంబుల నెలసి, వేలు
వేలునామంబులను మఱివేలుపడుట
కతఁడుతలపెట్టెఁ దన్నుతానఖిలమందు
గాంచిమోదంబునందఁ గామించుకతన"

"నియాజ్"

అనంతమగు చైతన్యహీనస్థితిలోనుండి (ఎ) భగవంతుడు అనంతమగు చైతన్యస్థితి (బి) లోనికెట్లుఁవచ్చినది తెలుపుటకు శ్రీమెహర్ బాబాగారు రీకిరింది సాదృశ్యమును దెలుపు చున్నారు.

సృష్టికిఁబూర్వము భగవంతునందున్న యనంతచైతన్య హీనస్థితిని విశాలమగు ప్రశాంతమగు సముద్రముతోఁ బోల్చెదము. ఒకగాలి తెరవచ్చి యీశాంతసముద్రమును గదలించెను. విపరీతతరంగములు, నీటిబిందువులు, నీటిబుడగ లీ సముద్రసంక్షోభమునుండి బయలుదేరినవి. ఈవాయుసంచలనమాదిని గలిగిన పరమాత్మస్థితిద్వారా తన్నుదాను దెలిసికోవలెనను ప్రశ్నమురూపముగా జనించిన యాద్యచిద్విలాస ప్రేరణము వంటిది.

మహాసముద్రముపైకలిగిన సంచలనము ప్రతిజలబిందువును తన్నుదాను తెలిసికోవలెనను ఆదిప్రేరణతో నింపినది. తనచే చైతన్యస్థితి (వి స్థితి)లోఁ బరమాత్మ తన్నుదాను తెలిసికొనవలెనను ప్రోద్బలమువలన తనకు లోఁబడిన ప్రత్యాత్మను గూడఁ దన్నుదాను తెలిసికొనవలెననేకోరికతోఁ బ్రకోపింపఁజేయును. పరమాత్మపైన తెలుపఁబడిన శాంతమగు మహాసముద్రముగను మిగిలిన యాత్మలు జలబిందుబుద్బుదములుగ మన మూహించినయెడల విషయము బోధపడును. కాని సముద్రముతోఁ గలిసియున్నంతకాలము ప్రతిజలబిందువు సముద్రముగా నెంచవలెను. ఈనీటిబొట్లు సముద్రముపై దేలు బుడగలుగా మారినప్పుడు ప్రత్యేకత్వమును బొందుచున్నవి. ప్రతిబుద్బుదము ప్రతిజలబిందువునకు నొక ప్రత్యేకతనుబ్రసాదించుచున్నది. నీటిబొట్లు సముద్రముతో నేకత్వము కలిగియున్నప్పటికి బుడగలు కల్పించిన ప్రత్యేకతవల్ల సముద్రమునుండి వేఱుపడుచున్నవి. ఈబుడగలు బ్రద్దలగుటతోడనే

నీటిబొట్లనంతమగు సముద్రమునందలివేయని తెలిసికొనును. మొదట సముద్రముకంటె భిన్నమగుభావమునుపొందిన యనంతరము నీటిబిందువులు తమకు నిజముగాలేని భిన్నత్వము కల్పించిన బుడగల యజ్ఞానమును పారద్రోలి యనంతమగు సముద్రములో నవి శాశ్వతమగు చైతన్యమును తిరిగి పొందును.

ఈ లెక్కలేని నీటిబిందువులు భ్రమమాత్రముగా దమకుఁ గలిగిన భిన్నత్వము ననుభవింపనంతవఱకు దా మనంతము, శాశ్వతమునగు సముద్రముతో నేకత్వము కలవని గ్రహింపలేవు. పైకి భిన్నత్వమువలె దోఁచుదాని యనుభవము పొందినతరువాతగాని యాత్మలు పరమాత్మతోఁ దమ యవిభక్తమగు నేకత్వము ననుభవము నొందలేవు.

4వ యవస్థలోని భగవంతుని 'భగవంతుఁడు జీవుఁడు' అని వర్ణించుటకు పరమాత్మ 'ఎ' స్థితిలోననంతచైతన్యహీనమైన ఆత్మను గూర్చి యోచింతము. ఆది 'ఎ' స్థితిలో నాత్మకు చైతన్యము లేదు. సంస్కారములును లేవు.

ఆయవస్థలోను ఆస్థితిలోను ఆత్మకు స్థూలరూపము కాని స్థూలసూక్ష్మ మనశ్శరీరములుకాని లేవు. ఆ యా సంస్కారములు కలిగినప్పుడే యా యాశరీరములు కలుగగలవు. ఆ యా స్థూలసూక్ష్మమనశ్శరీరములు కలిగినప్పుడు స్థూలసూక్ష్మమనోలోకములు బయలుదేరుటకు సాధ్యమగును.

ఆదిని (ఎ)స్థితిలో భగవంతునిలోనున్న యాత్మ యనంతమగు చైతన్యహీనతలో సంస్కారములు లేకపోవుటచే

స్థూలసూక్ష్మమనశ్శరీరముల చైతన్యమును లేకయుండుటయే గాక తన యనంతస్మృతినిగూడ లేకయున్నది. అందుచే నాత్మ స్థూలసూక్ష్మమనోలోకముల యనుభవములను గలిగి యుండ లేదు. పరమాత్మానుభవమును గలిగియుండలేదు.

ఈ యనంతమగు సంస్కారవిహీనమును, చైతన్యహీనమునైన శాంతమగు నాత్మస్థితి 'తన్నుదాను దెలిసికోవలెనను ఆదిప్రేరణము తాకిడివలన దీవ్రసంచలనమునకు లోనయ్యెను.

ఈ సంచలనముతోఁబాటు బహుస్థూలమగు మొదటి సంస్కార మొకటి బయలుదేరెను. దీనివల్ల ననంతమగు పరమాత్మ ( Over Soul )కు వ్యతిరేకముగాను, బహు పరిమితమగు ప్రతిరూపముగాను వ్యక్తిత్వముగలిగినయాత్మ యీ సంస్కారమువల్ల రూపొందెను.

ఆత్మ పరమాత్మలో శాశ్వతముగా నున్నప్పటికిని దానితో నేకత్వము కలదైనప్పటికిని బరమాత్మకుఁ గలిగిన యనంతశక్తులనుగూడఁ గలిగియున్నది. చైతన్యహీనస్థితియందీశక్తులాత్మయం దంతర్గతమైయున్నవి. కనుకనే యాత్మ కూడ ననంతశక్తిజ్ఞానానందములను గలిగియున్నది.

సంస్కారములులేని యనంతమగు నాత్మ మొదటి సంస్కారమును పొందినప్పుడు అది బహుస్థూలమైన సంస్కారముగా నున్నది. ఆత్మ తన 'ఆత్మ' జ్ఞానమునుపొంద యత్నించుచున్నది గనుక యనంతమగు జ్ఞానముకలిగిన యాత్మకీ భావము బహుస్థూలముగాను లేక మోటుగానుండును. ఈ స్థూలభావప్రభావమువల్ల సంస్కారము నెఱుఁగని యాత్మకు

బహుస్థూలమగు సంస్కారముతాకిడి కలుగుచున్నది. అనంత మగు నచేతనస్థితిలోనున్న యాత్మ యీస్థూలసంస్కారసంపర్కముచే బహుపరిమితమగు "మొదటి చైతన్యమును" కూడఁ బొందినది. స్థూలసంస్కారములు వృద్ధియైనకొలఁదిని చైతన్యము పెరుగఁజొచ్చెను. దీనితో స్థూలరూపముల పరిణామముకూడ వృద్ధికాఁజొచ్చెను.

ఆదిని భగవంతుఁడు దన్నుదా తెలిసికోవలెనను ప్రథమ సంకల్పమువలన, చైతన్యవృద్ధి, అనేకస్థూలరూపాభివృద్ధి, స్థూల ప్రపంచానుభవములు పెంపొందుట మున్నగునవి బయలు వెడలినవి.

ఈపై నుదహరింపఁబడిన సంకల్పమువల్లఁ గలిగిన మొదటి స్థూలసంస్కారమువల్ల ననంతమగు, నచేతనమగు, నాత్మ మొదటి పర్యాయము సంస్కారలక్షణములను పొందెను. ఈ యనంతాత్మ మొదటిసంస్కారసంపర్కమువల్ల బరమాత్మ (ఎ.స్థితిలోని)కు భిన్నమును, వ్యతిరేకమునగు ననుభవమును బొందెను. ఈ భిన్నత్వము లేక వ్యతిరేకానుభవము, ననంత మగు నాత్మ శాశ్వతత్వములో నవిభాజ్యమగు నిశ్చలతత్వములో నస్థిరతారూపపరిణామమును దీసికొనివచ్చెడి లక్షణము నుత్పన్నము చేసెను. అనంతాత్మకుఁగల స్ఫూర్తిలేని శాంతము లోను, విడివడని సమరసములో నొక యుత్పాదనము కలిగినది. ఈ యుత్పాదనమువల్ల బహుతీవ్రమగు నాఘాతము కలిగెను. ఈ యాఘాతమువల్ల ననంతచేతనాహీనతనలోనున్న ఆత్మకుఁగల యచైతన్యమునకుఁ దాకిడి గలిగి మొదటి చైతన్య

నుందు ప్రవేశించెను. ఈ చైతన్యమే యవిభాజ్యమగు పర మాత్మస్థితిలో విభాగీకరణస్థితిని కల్పించెను. కాని యాత్మ యనంతమగుటచేఁ బూర్తిగా వ్యతిరేకమును, బహుస్థూల మునగు మొదటి సంస్కారము తాకినవల్ల ననంతమగు నాత్మలో మొదట బయలుదేరిన చైతన్యము బహుపరిమితమై యుండెను.

తన కాదియగు ననంతస్థితి (ఎ) యొక్క భిన్నవ్యతిరేక లక్షణములతోఁ బోల్చిచూచినయెడల నాత్మకుఁ గలిగిన మొదటి చైతన్యము బహుపరిమితమైనదని చెప్పవలెను.

అందువల్లనే మొదటకల్గిన సంస్కారము బహుపరిమిత మైనస్థూలసంస్కారము. ఆత్మకు గలిగిన మొదటిచైతన్యముబహు పరిమితమైనది. అనఁగా అనంతాత్మచైతన్యహీనస్థితి, స్థూలమగు సంస్కారమువల్ల జనించిన పరిమితమును, స్థూలము నగు చైత న్యానుభవమును పొందెను.

ఇప్పు డాత్మకు సంస్కారముల చైతన్యము కలిగెనేని యీసంస్కారముల యనుభవము నాత్మ తప్పక పొందును. ఈ సంస్కారముల యనుభవములను బొందవలెనన్నచో, నాత్మచైతన్యము వీనిని తగిన యోగ్యమైన మధ్యవస్తులద్వారా పొందవలెను.

అనంతము శాశ్వతము రూపములేని యాత్మ బహు స్థూలమైన మొదటిసంస్కారమువల్ల గలిగినబహుపరిమితమైన మొదటి చైతన్యమును బొందినది గనుక, యీ సంస్కారాను

భవము పొందవలెనన్నచో, నాత్మ బహుపరిమితమై స్థూలమైన మధ్యవర్తి నుపయోగింపవలసియున్నది.

పరమాత్మస్థితిలో (ఎ) భగవంతుఁ డుపయోగించిన మొదటి మధ్యవర్తి (జీవుఁడుగానున్న భగవంతుఁడు) స్థూలమైనను, బహుసూక్ష్మమై పరిమితమగుటచే స్థూలమైనదని చెప్పుటకు వీలులేదు. దానికి రూపములేదు పుష్టిలేదు. అందుచే నది స్థూలమని తలంచుటకైన వీలులేదు. అయినప్పటికి నిది యే మొదటి స్థూలరూపము. ఈ స్థూలరూపమే తరువాత మొదటి యేడు 'వాయురూప' మగు స్వరూపములలోను మొదటి మూఁడు రూపములుగా మార్పుచెందును. మొదటి మూఁడు వాయురూపములను వర్ణింపవలెనన్నచో వాని సాంద్రతను (చిక్కదనము)బట్టి తెలిసికొనఁగలము; మొదటి దానికి బొత్తిగా లెక్కలోనికిరాని సాంద్రత, రెండవస్థితిలో లెక్కలోనికిరాని సాంద్రత, మూఁడవస్థితిలో సాంద్రతా ఛాయలు కనఁబడును. తరువాత మూఁడురూపములు మన ఊహకుఁ గొంచె మందవచ్చును. అవి సగము వాయువు సగము పదార్థము కల రూపములు. తుద కేడవది యీ వాయురూపములలోఁ జిట్టచివరిది వాయురూపము. ఇందు (ఎలకట్రాన్) విద్యుత్కణము కూడియున్నది.

ఈ యేడు 'వాయురూపము'లగు స్వరూపములును మనకు లోకములోఁ దెలిసినప్రాణవాయువు, ఉదజని, నత్రజని మొదలగు వాయువులకు సంబంధించినవికావు. నేడు విజ్ఞాన శాస్త్రజ్ఞులకుఁ దెలిసిన వాయువులకంటె భిన్నమై బహుసున్నితమైనవిగా నుండును.

# అవస్థ 5

పరిణామాంతర్గతబ్రహ్మ

ఈ స్థితిలోఁ దన'సృష్టి'జ్ఞాన మల్పమైనప్పటికిని భగవంతుఁ డొక'జీవము'గా 'సృష్టి' (శూన్యత) అనుభవమును పొందుచు దానిని గుఱించి తెలిసికొనఁ బ్రారంభము చేయును. ఈ పరిమితమగు చైతన్యము బహ్వాల్పమైన జ్ఞానమెక్కువ సంస్కారములను గలుగఁ జేయును. వీనివల్ల బిందురూపములో నున్న (ఆత్మ) మొదట బుడగరూపములో నున్నరూపమునుండి విడిపోవును. బుడగను వదలివేయుట యనఁగా మొట్టమొదటగాఁ గలిగిన రూపమును విసర్జించుట.

రూపము వదలివేయఁబడిన వృద్ధి యగుచున్న యాత్మ చైతన్యము సముపార్జించుచున్న సంస్కారములు నశింపవు. పరిణామముపొందిన చైతన్యము నీ సంస్కారము లంటిపెట్టుకొని యుండును. దీని వలన నీయాత్మయొక్క 'చైతన్యము' తనకుఁ దగిన యున్నతస్థితిలోనున్న యిం కొకనీటిబుడగతో (రూపము)సంయోగము పొందును. ఈ రెండవరూపము వలన నాత్మ సృష్ట్యనుభవము నింక నెక్కువగాఁ బొందుచుండును. రూపవృద్ధితోఁబాటు దేకాలమున దృక్కోణము విశాలమై తెలిసికొను చైతన్యముకూడ వృద్ధియగుచుండును. స్థూలచైతన్యము వృద్ధియగు కొలఁదియును సంస్కారములుకూడ వృద్ధియగును. ఇదివరలోనున్న స్థూలస్వరూపమును విసర్జించినప్పుడు

మిగిలిన సంస్కారముల స్వభావమువల్ల మూఁడనమా రింకను స్పష్టమగు స్థూలరూపముతో నాత్మ సంయోగము పొందును.

ఇట్లు చైతన్యపరిణామము యుగముల పర్యంతము జరుగుచుండును. కలిగిన రూపుతోఁబాటు సంక్రమించిన సంస్కారములను నిలుపుకొనుచు, రూపములను విడనాడుచు, నిట్లు పలుమార్పు లొందుచు గ్రమముగా రాళ్ళ, లోహముల, వృక్షముల, కీటకముల, మత్స్యముల, పక్షుల, జంతువుల రూపములు పొందుచు, విసర్జించుచుఁ జివరకు 'ఆత్మ' మానవరూపమును బొందును.

ఉన్నతశ్రేణిలోని వస్తుజాలము రూపములను పొందుచున్నకొలదియు నాత్మచైతన్యము క్రమానుగత వృద్ధిపొందుచుండును. ఈమార్గములో స్వల్పశ్రేణియందలి రూపములో సంక్రమించిన సంస్కారములు కూడఁ గ్రమముగా క్షీణించి పోవుచుండును.

స్థూలప్రపంచమునందలి వివిధములగు స్థూలరూపముల సృష్టితో నాత్మలకు సంయోగము కలిగినందువల్లఁ జైతన్యము వృద్ధిపొందుచుండును. ఇది లెక్కలేనన్ని మారులు జరుగుచుండును. చైతన్యవృద్ధిలో ప్రత్యేకఘట్టములు చేరినప్పుడాత్మలు రాతినుండి లోహమునకు, లోహమునుండి వృక్షమునకు, వృక్షమునుండి కీటకమునకు, గీటకమునుండి మత్స్యమునకు, మత్స్యమునుండి పక్షికి, పక్షినుండి జంతువునకు మాఱి చివరకు జంతువునుండి మానవరూపము నాత్మకై కొనును.

ఇంక చైతన్యవృద్ధిని గురించి యొకసంగతి సరిగానర్థ ముచేసికో వలసియున్నది. ఇది బుద్బుదములు లేక రూపముల తో సంబంధించిన దేకాని "బిందువులు" లేక యాత్మలతో సం బంధించినదికాదు.

ఆత్మ లనంతమగు సముద్రమువలెనే (పరమాత్మ) అనంతము నవిభాజ్యము.

ఆదినుండి స్వరూపపరిణామముతోఁ బూర్తియగు చైత న్యక్రమాభివృద్ధి పూర్తియగువర కాత్మ లనంతమగు సముద్ర మువలెనే (పరమాత్మ) యనంతము నవిభాజ్యముగానే నిలచును.

అనేకములగు సంస్కారముల కారణముగా రూపవృద్ధి మార్గమున నజ్ఞానము, లేక సృష్టిని తెలిసికొనుటయను చైత న్యము క్రమముగావృద్ధియగుచుండును. మనుష్యరూపమునఁ గాని వ్యక్తిత్వమునొందిన యాత్మ పరమాత్మ సాక్షాత్కారము నుపొందలేదు. ఆత్మయనంతము కనుక నాత్మచైతన్యముకూడ ననంతము కావలెను. చైతన్యము మానవరూపములోఁగాని యనంతము కాలేదు. అందుచే రూపపరిణామములో మానవ రూపముతుదిమెట్టు.

ఆత్మ 84 లక్షల మానవరూపము లనఁగా మనుష్య జన్మలెత్తవలెనని చెప్పుదుము. అనఁగా మానవరూపముధరించి నది మొదలుకొని యీ లెక్క. అంతకుముందు వహింపవలసిన రూపములు లెక్కపెట్టలేము.

సరిగాఁ జెప్పవలసివచ్చినచో నొక్కటే రూపముకలదు అది మానవరూపము. పూర్వరూపములన్నిటిలో నీమానవ రూపము అంతర్గతమైయున్నది. ఖనిజ (లోహ) వృక్షజంతు రూపములన్నిటిలోను మానవరూప మిమిడియున్నది. ఇదిక్రమ ముగా వికాసమును బొందుచుఁ జివరకు మానవ శరీరములో మానవరూపమునుఁజెందును.

మానవశరీరములో స్త్రీగానో పురుషుఁడుగానో మానవ రూపముఁ దాల్పకపూర్వ మంతర్గతమైన మానవరూప మనేక విధములుగా నొకప్రక్కన దిరుగుచుండును. గడ్డకట్టిన జాతి స్థితిలో నంతర్గతమైన మానవరూపము తలక్రిందుగానుండును. వృక్షస్థితిలోఁగూడఁ గొంచె మించుమించుగా నాస్థితిలోనే యుండును. ఈరూపములు పరిణామముపొందినకొలఁది నీశరీర ముల నిలచు నడ్డుకట్ట (యిరుసు) క్రమముగాఁ దిరుగుచు బల్ల పఱుపగు సమస్థితికి వచ్చును. సరీసృపము (వెన్నెముకకలవి) లున్నత శ్రేణిలోనికి వచ్చినప్పుడు తల కొంచెముకొంచెముగాఁ బైకి లేచును. అప్పుడు శరీరముయొక్క వెన్నెముక లేక యిరుసుకూడ నిలువుగా నెదుగుచుండును. స్త్రీ పురుషులలో మానవరూపము పూర్తిగా నిడివిని కలుగుస్థితికి వచ్చు చున్నది.

ఈ రూపముపొందు వృద్ధినిగుఱించిన వివరములు చాల క్లిష్టముగా నుండును. కొన్నిరకముల రాయి, లోహము, వృక్షము, జంతువు (శ్రీబాబాగారు వర్ణించిన ట్లీసృష్టి పరిణా మములో నొక ప్రత్యేకస్థానము నాక్రమించియున్నవి. ఈ

ప్రధానమగు రూపజాతు లీసృష్టిపరిణామమార్గములో మైలు రాళ్లవంటివి. అవి యొక రూపజాతులకు సాధారణములగు తరగతుల యాద్యంతములను సూచించును. ఉదాహరణముగా మత్స్యజాతులలోని తుదితరగతి అనంతరము పక్షిరూపములో మొదటితరగతి వచ్చును. జంతురూపములోని మొదటితరగతి పక్షిరూపములోని తుదితరగతి తరువాతవచ్చును. వీని కన్నిటికి సృష్టిపరిణామములోఁ బ్రత్యేకస్థానము కలదు.

ఇకముందు ప్రపంచమున కందఁజేయఁబోవు తనపుస్తకములో* సవివరణముగా నీవిషయము తెలుపఁబడినదని శ్రీ మెహర్ బాబాగారు తెలుపుచున్నారు.

జీవునకు రూపపరిణామదశ లెట్లున్నవో యట్లే లోకములకును బరిణామదశలు కలవు.

వృద్ధినిపొందిన యాత్మచైతన్యము, పూర్ణత్వముబొందిన రూపములతో నాత్మను సంయోగపఱచుచు నెక్కువసంస్కారములను పొందుచుండును. ఈ సంస్కారములను క్షీణింపఁజేసికొనుట కాత్మ తన వికాసరంగమును నిర్ణయించుకొనుచుండును; భూమికి సంబంధించిన సంస్కారముల ననుభవించుచుండును. ఈబ్రహ్మాండసృష్టిపరిణామ ధర్మములతోఁ బాటు మిగిలిన లోకములతోఁబాటివి కూడ వృద్ధినిపొందుచుండును.

---

*ఈ ప్రస్తుత పుస్తకముతో దీనికి సంబంధములేదు. శ్రీబాబాగారు కర్తృత్వము వహించిన వేరియొక పుస్తకము. అది ముందు ప్రకటింపఁబడవచ్చును.

ఆత్మ తన చైతన్యవృద్ధిపొందు కాలమున ననేకములు, పరిమితములు నగు స్థూలరూపములతో స్మృతిపూర్వకముగా నాత్మసంయోగము కలిగియుండినప్పుడే స్మృతిలేకయే యాత్మ పరిమితమగు సూక్ష్మమనోరూపములతోఁగూడ సంయోగము పొందుచున్నది. ఈరూపములు మొదటిప్రేరణము మొదలు కొని చైతన్యపరిణామపద్ధతిలో నెల్లప్పుడును స్మృతిలేకయే సంబంధము కలిగియుండెడివి.

చైతన్యము క్రమాభివృద్ధి నొందుటకు సంస్కారములను పొందుచు విసర్జించుచు మరలఁ బొందుచు నందులఁ గలుగు మార్పులందు మధ్యవర్తిగా లేక ఉపకరణముగా వినియోగించు స్థూలరూపములనుండి యాత్మస్మృతిపూర్వకముగా విడిపోవుచున్నప్పటికి నాత్మ స్మృతిపూర్వకముగాగాని, తత్ వ్యతిరేకస్థితిలోకాని పరిమితమగు తన సూక్ష్మరూపమును, మనోరూపమును మాత్రము విడనాడదు.

ఆత్మ తన స్థూలరూపములనుండి వేఱుచేయఁబడినప్పుడు తనస్మృతిలేని సూక్ష్మరూపముతోడి సంబంధమే యాత్మకు బలముచేకూర్చును. ఇట్లుచేకూరిన బలముతో లేక పరిమితశక్తితో నాత్మ తరువాతఁ దనకులభ్యమగు స్థూలరూపముతో సంయోగము పొందును. ఇంతకు పూర్వపు స్థూలరూపమునఁ బొందిన సంస్కారముల నాత్మ తన పరిమితమగు మనోరూపములో భద్రపఱచికొని వానిని బహిర్గతము చేయుచునే తన స్థూలరూపములో వాని ననుభవించుచున్నది. ఈ మనోరూపముల స్మృతిలేకయే ఆత్మతో సంబంధము కలిగియున్నది.

ఆత్మచైతన్యము క్రమముగా నిట్లు వృద్ధినిపొందుచున్న కొలఁదియు నా పరిమితమగు నాత్మ, సూక్ష్మరూపముకూడ వృద్ధిని పొందుచు నాత్మ కెక్కువ శక్తి, బలమును కలిగించుచున్నది. ఈశక్తివలన స్థూలచైతన్యము కలిగిన యాత్మచైతన్యమిదివరలోని స్థూలరూపావస్థలలో పొందిన సంస్కారముల ప్రభావముచే నింక నున్నతశ్రేణియందలి పరిమితమైన స్థూలరూపములతో సంబంధమును బొందుచుండును.

క్రమశః ప్రవర్ధమానమగుచున్న యాత్మ చైతన్యము వల్ల సముపార్జితమగుచున్న వివిధసంస్కారముల ననుభవించుటకు, భద్రపఱచుటకును దగినట్లు పరిమితమగు నాత్మ, మనోరూపముగూడ వృద్ధిపొందుచుండును.

మానవరూపములోనే సూక్ష్మశరీరము, మనశ్శరీరము నభివృద్ధిని గాంచును. మానవరూపమున నాత్మ స్మృతిపూర్వకమగు సంబంధముకలిగి స్థూలసూక్ష్మమనశ్శరీరములనెడి యుపకరణములను గలిగి యున్నది. దీనితోఁబాటు మానవరూపమునఁబొందిన స్థూలచైతన్యముకూడ నున్నది.

మనుష్యుని రూపములో ఆత్మ పూర్ణచైతన్యమునొంది స్థూలప్రపంచానుభవమును గలిగియున్నను దానికి సూక్ష్మశరీర స్మృతిలేదు. అందుచే స్థూలప్రపంచానుభవమును పొందలేదు. ఆత్మ యట్లే మనశ్శరీరము స్మృతిలేకపోవుటచే మనోలోకానుభవమును పొందలేదు.

# అవస్థ 6

## అవతరన్మానవరూపబ్రహ్మ

చిత్కళాశూన్యమగు నాత్మ నావరించిన యపారనిశ్చేతనతకు మిక్కిలి పరిమితమగు నాదిప్రేరణసంస్కార మాధ్యమును, బహుపరిమితము నగు చైతన్యమును గలుగఁజేసెను. వివిధములును, స్థూలములు నగు నుపకరణములద్వారా అనుభవింపఁబడినసంస్కారము లాత్మకు పరిమితమగు స్థూలప్రపంచ చైతన్యమును సంక్రమింపఁ జేయుచున్నవి. క్రమముగా మానవరూపముతో సంయోగముపొందునప్పటికి చైతన్యమునకొక పరిపూర్ణస్థితివచ్చినది. ఈ స్థితిలో చైతన్యవృద్ధికొఱకు మానవరూపముకంటె నుత్కృష్టమగురూప మాత్మకవసరము లేదు. క్రమముగా మానవరూపమునఁ బరిణతమైన చైతన్యము పరిపూర్ణత్వము కలదియై యున్నది.

ఇప్పటికి చైతన్యమునకుఁ బూర్ణత్వము సిద్ధించినప్పటికి నాత్మ తన సూక్ష్మమనశ్శరీరముల స్మృతిని బొందలేదు. అవిభాజ్యమును, శాశ్వతమును, ననంతము నగు తన యఖండ స్వరూపస్మృతియు నాత్మకుఁ గలుగలేదు. మానవరూపముతో తనకుఁగల సంబంధమును గుఱించియు, స్థూలప్రపంచ వివిధలక్షణముల యనుభవముల గుఱించియు, నాత్మస్మృతి కలిగి యున్నది.

ఈ యవస్థలో మానవరూపముదాల్చుటకుఁ బూర్వ స్థితిలో వదలిన జాంతవసంస్కారముల నీ స్థూలప్రపంచము లోని మొదటి మానవరూపములో ననుభవించుచుండును.

ఈ స్థూలమానవరూపములోఁ బూర్వపుజాంతవసం స్కారములు క్రమముగా క్షీణించిపోయి నప్పుడు మొట్ట మొదటి మానవరూపము రాలిపోయి యాత్మ చైతన్యముతో సంబంధము వీడిపోవును. ఈ విధ మగు పరిణామమున్ఁ గ్రమ ముగాఁ జైతన్యముపొందిన యాత్మానుభవమునే మానవుని మరణ మనిచెప్పుదురు. ఆత్మ చైతన్యము మొదటిమానవరూప ముతో సంబంధము పోఁగొట్టుకొనినను, తనకు స్మృతి లేకయే సూక్ష్మమనశ్శరీరములతోఁ గల సంయోగమును విడఁగొట్టు కొనలేదు. వదలిన మానవరూపములో సంక్రమించిన సం స్కారము లాత్మచైతన్యము నంటిపెట్టుకొనియుండును. ఇవి సూక్ష్మమనశ్శరీరములద్వారా సంబంధము కలిగియుండును. ఈసంస్కారములను క్షీణింపఁజేసికొనుట కాత్మచైతన్య మొక స్థూలరూపముతో సంబంధము పెట్టుకోవలసియుండును. అందు కొఱకు తరువాత శ్రేణిలోనున్న మరియొక్క మానవరూపము నాత్మ గ్రహించుచున్నది. ఈ స్వరూపము, పూర్వపు స్థూల శరీరముద్వారా సేకరించిన పూర్వసంస్కారముల ప్రతిస్వరూ పము. ఆత్మచైతన్యము తరువాత మానవరూపముతో సమ కూర్చుకొను సంయోగమునే మానవుని జన్మమని పిలతురు.

ఆఱవయవస్థలో భగవంతుని మానవాత్మ పునర్జన్మ మెత్తినప్పుడు ఆత్మ మానవరూపమునఁ బూర్ణచైతన్యము

పొందినది. అందుచే స్థూలరూప మింతకంటె నెక్కువ యభి వృద్ధి పొందనవసరములేదు. మానవరూపము పొందుటతోడనే స్థూలచైతన్యపరిణామము తుదిదశకు వచ్చును. మానవరూప మున నంతకుఁ దక్కువశ్రేణియందలిరూపమునఁ గల్గు సంస్కారముల యనుభవములను పొందవలెనన్నచో నాత్మ తిరిగితిరిగి మానవజన్మ మెత్తుచుండవలెను.

ఆత్మచైతన్యముపొందవలసిన మానవరూపముల మంచి చెడ్డ లదినఱకుఁగలిగిన సంస్కారముల పుణ్యాపాపములు, సుఖ దుఃఖములు మొదలగువానిపై నాధారపడియుండును. స్థూల ప్రపంచానుభవము నొందుచు నాత్మ స్థూలశరీరముతో నేక త్వమును బొందుచున్నది. ఆత్మ శాశ్వతమైనప్పటికిని శరీ రము నాశనము కలిగియున్నది. (అంతవంత ఇమే దేహా నిత్యా స్యోక్తా శ్శరీరిణః—భగవద్గీత 2-18)

మానవరూపమునకుఁ గ్రింది యంతరస్థితిలో రూపచై తన్యముల పరిణామము స్మృతిలేకయే జరుగుచుండును. కాని యెడ తెగక జరుగుచుండును. అందువల్ల నీస్థితిలోనుండి మరల నంతకంటె హీనస్థితిఁగల రూపములలోనికిఁ జైతన్యము దిగ జారిపోదు. రూపచైతన్యముల పరిణామము పూర్వదశచెందిన మానవజన్మములో మానవు నాధ్యాత్మికోన్నతి ప్రయత్న పూర్వకమైనది. ఇది పునర్జన్మములలో పొందు ననుభవముల మార్గమున జరుగును. ఇది తిరిగి మానవస్థితికంటె హీనమైన యవస్థలోనికి దిగజారదు. పూర్ణచైతన్యమొకసారి వచ్చిన తరువాత నది తిరిగి పోవుటయనున దుండదు. ఆత్మకు మానవ

రూపముతో సంయోగము కలిగినప్పుడే చైతన్యపరిణామము పూర్ణదశకువచ్చును. అందుచే మానవజన్మ మధోగతికిఁ బోవుట యసంభవము. స్థూలప్రపంచములో స్థూలశరీరములో వృద్ధిని పొందిన చైతన్యముతోఁబాటే కాలమందాత్మ పూర్తిగా వృద్ధిపొందిన సూక్ష్మమనశ్శరీరములతోఁగూడ సంయోగమును బొందుచున్నది. చైతన్యము స్థూలప్రపంచముతోఁ బరిమితమై యున్నంతకాల మాత్మ సూటిగా మనశ్శరీరముల నుపయోగము నొందలేకున్నది. ఆత్మ యీ సూక్ష్మమనశ్శరీరముల స్మృతిని గలిగి వానికి సంబంధించిన సంస్కారముల యనుభవముల నా యీ ప్రపంచములద్వారా పొందకలుగును. ఇది జరుగవలెనన్నచో నిప్పటివఱకు స్థూలవిషయస్మృతి కలిగిన యాత్మచైతన్య మంతర్ముఖమై తననైపునకు తిరిగి పరిణామముపొందుట ప్రారంభముకావలెను. అనేక యుగములుగా చావుబ్రతుకులు కల జన్మములను మాటిమాటికెత్తుచు నందుగలుగు ద్వంద్వములగు కష్టసుఖముల యనుభవముల తాకిడిని పొందుచు, నిరంతరము కలుగుచుండు వివిధములగు స్థూలజీవితములోని సంస్కారముల యనుభవముతోఁ దనిసి విసుగు చెందుస్థితి చేరినతరువాత నాత్మచైతన్యము తన నైపునకుఁదానే యంతర్ముఖత నొందును. చైతన్యవృద్ధియగు నీపద్ధతిలో సంస్కారములు పైకిఁ దీసికొనిపోవుమార్గములోఁ బనిచేయుచు స్థూలరూపముల నున్నతశ్రేణిని సృష్టించుచుండును. మానవావస్థలోఁ బూర్ణాభివృద్ధిని చెందిన చైతన్యము నిలచిపోవును. తరువాత నీసంస్కారముల పట్టు సడలుచుండును. ఈ జననమరణచక్ర

మున నాత్మ చైతన్యమునకుఁ దగులెడి యన్యోన్యవిరుద్ధానుభూతు
షులవలన నీ సంస్కారములు బలహీనము లగుచుండును; లేక
వలుచఁబడును.

# అవస్థ 7

దివ్యవిభూతియోగపురోగామిబ్రహ్మ

స్థూలప్రపంచమున నీ స్థూలేంద్రియములతో దీర్ఘకాల
సంఘర్షణము జరిగినతరువాత నాత్మచైతన్యము స్థూలపరిసర
ములలో నున్న స్థూలశరీరములో కేంద్రీకరింపఁబడియుండుట
కంటె, తన 'పరమాత్మ'పై దృష్టిని మరల్చును. ఇట్లు లెక్క
లేనన్ని జననమరణముల యనంతర మీ స్థూలచైతన్యముగల
మానవాత్మ చిట్టచివఱకు మానవరూపముతోడనే భగవత్
సాక్షాత్కారముపొందుటకు వీలైన మార్గమును పట్టును.

ఈ యాత్మచైతన్యము స్థూలేంద్రియాకీర్ణమైన ప్రపం
చమునుండి వేరుపడి, యంతర్ముఖమార్గమునుబట్టుటకు సిద్ధ
పడును. అనఁగా సూక్ష్మమనోలోకములద్వారా 'అత్మ'
యధ్యాత్మమార్గమునఁ బురోగమించుచున్నదని చెప్పుదురు..

అంతర్గతవృద్ధినిపొందుచున్న యాత్మచైతన్యసంబంధము
లగు మొదటి మూఁడు భూమికలును సూక్ష్మలోకమునకు
సంబంధించినవి. నాలుగవభూమిక సూక్ష్మమనోలోకముల
మధ్యమున నున్నది. మనోలోకమందలి వైదాఱు భూమికలు

సూక్ష్మమనోలోకములుదాటిన జిజ్ఞాసువు భగవంతుని యేడవయవస్థ చేరెనని చెప్పుదురు. ఆధ్యాత్మికమార్గమునం బురోభివృద్ధికలిగినకొలఁది నంతర్ముఖమగు చైతన్యము వృద్ధి పొందును. సూక్ష్మశరీరముద్వారా సూక్ష్మలోకస్మృతి యాత్మకుఁ గలిగినప్పు డది సూక్ష్మశరీరముతో నైక్యమును బొందును. మనోశరీరముద్వారా మనోలోకస్మృతి కలిగినప్పు డాత్మ మనశ్శరీరముతో నేకత్వము పొందును. ఇట్లే స్థూల శరీరముతో నైక్యము కలిగినప్పుడు స్థూలప్రపంచకస్మృతి నాత్మ కలిగియుండెడిది.

ఈ లోకములవలన నాత్మ సాధించెడి యాధ్యాత్మికోన్నతి కేవల మూహాజనిత మైనది. అంతర్గతచైతన్యము వృద్ధిపొందుచున్నప్పుడు జిజ్ఞాసు వదివఱకున్న యూహాప్రపంచముకంటె నుచ్చస్థితి కలిగిన యూహాలోకమును సృష్టించుకొనుచున్నాఁడు. ఇది మొదటిభూమిక మొద లాఱవభూమిక వఱకు జరుగుచున్నది. ఏడవభూమిక చేరుసరికి చైతన్యాంతర వృద్ధి పూర్తియగును. ఊహాప్రపంచ మంతరించును. సత్యము సాక్షాత్కార మగును. దానికి భావముతోఁగాని యూహతోఁ గాని పనిలేదు.

గురువు దర్శకత్వము సాహాయ్యములేనిదే యీదివ్యవిభూతియోగమార్గములోఁ బ్రవేశించువారు తరచు పద్మవ్యూహములలోఁ దగుల్కొందురు. కన్నులుమిఱుమిట్లుగొల్పుతోవ్రలలోను దృశ్యములలోను దోవ్రను గోల్పోవుదురు. అందుండి తప్పించుకొని బయటపడుట యరుదు.

త్రోవలో నేమో చిత్తవిభ్రమముగొల్పు దృశ్యముల చూచి త్రోవతప్పిపోయిన పాఠశాలకుఁబోవు బాలుని యవస్థ యీ పైన తెలుపఁబడిన వారికి సంభవించును. ఈ దివ్యవిభూతి యోగమార్గమున మోహమును గొల్పి విభ్రమమును గూర్చి చిత్తమునాకర్షించు శక్తి తీవ్రమైనది కలదు. దీని వశమునఁబడి సచోఁ బ్రయాణము ప్రారంభదశలలో భగవంతుని పొందితి ననెడి యొక యాభాసభావమతని నావహించును. దీనికిఁదగిన సద్గురువుల సాహాయ్యముండిన కాని దీనినుండి తప్పించుకొన లేఁడు.

సూక్ష్మలోకములో నున్నతమార్గములో నున్న జిజ్ఞాసువు జననమరణములనుండి తనకుఁ బూర్ణమగు ముక్తి లభించిన దని యనుకొనును. అది వాస్తవము కాదు. ఈ భ్రమమంత గతచైతన్యము నాలవభూమికవఱ కుండును. ఇది మూఁడు నాలుగు భూమికల మధ్యమున మఱింత ప్రబలముగా నుం డును. జిజ్ఞాసువు తన యాత్రామార్గమునఁ జైతన్యచతుర్థ భూమిక నమ్మఁదగినదిగా నుండును. ఎందు వల్లననఁగా, సూక్ష్మలోకానంతశక్తిస్థితులు లేక శక్తు లతని స్వాధీనములో నేరుగానుండును. ఈ శక్తుల నేవిధముగానై నను విడుదలచేసినయెడల నాత్మచైతన్యము పతనము చెంది శిథిలమైపోవును. చైతన్య మొక పర్యాయము లభ్యమైనచో నది జారిపోదనుమాట సాధారణముగా వాస్తవమే యైనప్పటి కిని, దీని కపవాదమును గలదు. ఆత్మకులభ్యమైన చైతన్యము పటాపంచలగుట కవకాశ మీనాలుగవభూమికలోఁ గలదు.

ఈ చైతన్యము పూర్తిగా నశింపకపోయినను, రాతిరూపము లోనికి వెనుకకుఁ జైతన్యమును తీసికొనిపోవుట కవకాశముండును. తిరిగి మానవరూపములోనికి వచ్చుటకును, జైతన్యము పూర్ణత్వము పొందుటకు నంతరము ప్రారంభమునుండి జరుగవలెను.

నాలుగవభూమికలో, తనకు లభ్యమైన సిద్ధులను దుర్వినియోగముచేసినందువల్ల జిజ్ఞాసువు పతనమునైన చెందును; లేదా తన యంతశ్చైతన్యపురోగమనమువల్ల నయిదవ భూమికలోఁ బ్రవేశముకని మనఃప్రపంచానుభవములనైనఁ జేచిక్కించుకోవలెను. నాలుగవభూమికను దాటి యైదవ భూమికలో నడుగుపెట్టుట యనఁగా 'భగవంతుని సింహద్వారము' సమీపించుట.

ఆఱవభూమికలో యాత్రికుఁడు భగవంతుని ముఖాముఖిని దర్శించును. ఈ దర్శనము మనోనేత్రముద్వారా జరుగును. చైతన్యము నాత్మ మనశ్శరీరముతో నైక్యము చేయుట తటస్థించును. తన పరిణామముపొందిన యంతశ్చైతన్యముతో నాఱవభూమికలో భగవంతుని ప్రత్యక్షముగ దర్శించిన ద్వంద్వత్వము వదలలేదు. 'చూచువాఁడును, చూడఁబడువాఁడును' చూచుటయను క్రియవలన వేఱుగానే యున్నారు: మాయాక్షేత్రముదాటి వాస్తవము లేక సత్యభూమికను (ఏడవభూమికను) చేరుటతోడనే, యాత్రికునికి భూమికలోఁ గలిగిన యూహాస్థితికూడ జారిపోవును. ఈ భూమికలో సంస్కారలక్షణము లన్నియు పూర్తిగా నశించి

పోయినవి. ఏడవభూమికలోని చైతన్యము పూర్ణత్వము కలిగినది; సక్రియాభివృద్ధి కలిగినది. ఈ సంస్కారరహితమైన చైతన్య మాత్మకుఁ దన పరమాత్మతో నైక్యము ఘటించుచున్నది. ఆత్మ భగవంతుఁడుగా తన శాశ్వతత్వమును గ్రహించును, లేక యనుభవమును బొందును. 'నీటిబిందువు' (ఆత్మ) నీటిబుడగతో సంబంధము(మాయలోనజ్ఞానరూపము) విడిపోయిన 'బిందువు' తన శాశ్వతత్వమును మహాసముద్రములోఁ గనును. ఆ మహాసముద్రమే 'పరమాత్మ' లేక (Over soul).

# అవస్థ 8

బ్రహ్మీభూతత్వము

భగవంతుని యీస్థితి యాత్మ నడపిన చైతన్యసంగ్రామమున కంత్యదశ సూచించును. పునర్జన్మవిధానమునకు భూమికలద్వారా సాక్షాత్కారమార్గమునకును తుదిమెట్టును చూపుచున్నది. వ్యక్తిగతాత్మయింతకంటె నాశింపఁగల యున్నతస్థితి లేదు. ఎందుచేతననఁగా నాత్మ భగవంతునితో నైక్యానుసంధానము పొందినది. భగవంతుని సాక్షాత్కారము పొందిన యీ వ్యక్తిని సూఫీప్రపంచములో 'మజ్జూబ్' అనియు, వేదాంతులు బ్రహ్మీభూతుఁ డనియుఁ బిలుతురు. 'మజ్జూబ్' లేక బ్రహ్మీభూతుఁడు శరీరస్మృతి కలిగియుండఁడు. స్థూలసూక్ష్మమనశ్చైతన్యముల స్మృతికూడ వాని కుండదు. ఈ 8వ యవస్థలో భగవంతుఁడు బ్రహ్మ

భూతుఁడుగా దన యనంతమగు, స్వభావత్రితయము నగు శక్తి జ్ఞానానందములను స్మృతిపూర్వకముగా ననుభవించు చుండును. కాని తన స్వభావముల సంబంధము లగు నీ యనంత లక్షణముల నుపయోగింపఁడు.

ఈ 8వ యవస్థలో భగవంతుని యనంత చైతన్యహీనస్థితి (ఎ) చైతన్యహీనమగు 'పరమాత్మ'(బి)అవస్థలోని యుత్కృష్ట మైన దివ్యచైతన్యమును బొందుటయేగాక చైతన్యముకల పర మాత్మ, యీస్థితిలో భగవంతుఁడు తనయనంతమును వాస్త వమునైన చైతన్యస్థితిలో లీనమైపోవును. అనంతమును శాశ్వ తమునగు తన (బి)స్థితితో నేకత్వముపొందును.

భగవంతుని యీ 8వ యవస్థ భగవంతుని చైతన్యము నత్యుత్కృష్టస్థితి. దీనిని సూఫీలు 'అర్ష-యే-ఆలా'అని పిలతురు. వేదాంతులీస్థితిని 'విజ్ఞానావస్థ' అని చెప్పుదురు. భగవంతుని సాక్షాత్కారముపొందిన జీవులు-'కుతుబ్'లు (సద్గురువులు), 'ఆజాద్-యే-ముతలక్'(జీవన్ముక్తులు), రసూల్ (అవతారము) దేహవిముక్తిని బొందిన తరువాత పరమాత్మలో (బి) లీన మగుదురు. దేహవిముక్తిని బొందిన సద్గురువును సూఫీలు 'హాలత్-యే-మహమ్మద్' (మహమ్మదుస్థితి) అని పిలుతురని శ్రీ మెహర్ బాబాగారు తెలుపుచున్నారు. ఈయన 'ముఖమ్ యే-మహమ్మద్' కంటె భిన్నము. (మహమ్మదు కార్యకర్తృ త్వము). సశరీరులైనవారి పేర్లివి: 'హకి-కట్-యే-మహమ్మద్'. భౌతికశరీరములోనున్న భగవంతుని పదియవ యవస్థ 'ముఖమ్- యే-మహమ్మది' (సి) పటములో చూపినట్లు విజ్ఞానభూమిక-

# అ వ స్థ 9

## జీవన్ముక్తాత్మత్వము

ఎనిమిదవయవస్థలోవలెఁ దన దివ్యస్థితిలో లీనమైపోయిన భగవంతుఁడు తన చైతన్యమును తిరిగి మానవరూపమున స్వీయస్థూల సూక్ష్మమనోలక్షణములద్వారానాయా లోకముల చైతన్యమును తిరిగి పొంది పోషించుకొనినచో 'మజూబ్' అని పిలువఁబడెడి యాయన బ్రహ్మీభూతుఁడు, 8, 10 అవస్థలకు మధ్యనున్న పవిత్రకూడలిస్థాన మగు 9వ యవస్థ ననుభవించును.

ఆత్మ స్థూలసూక్ష్మమనశ్శరీరములయు, లోకములయు సాధారణచైతన్యమును దిరిగి పొందినయెడల నది 8వ యవస్థకుఁజెందిన 'మజూబ్'స్థితినుండి బయటకు వచ్చును. 'ఫానాఫిల్లా'స్థితిని దాని 'బాఖాబిల్లా'స్థితిలోఁ బాదుకొనును. ఇవి జరుగకముందు తురీయావస్థలోఁ బ్రవేశింపవచ్చును. ఇది 'ఫానాఫిల్లా', 'బాఖాబిల్లా'స్థితుల సంధిలో నున్న 9వయవస్థ.

మానవశరీరములో నున్న భగవత్సాక్షాత్కారము పొందిన యాత్మ యీస్థితిలో నున్నప్పుడు 'జీవన్ముక్త' మని చెప్పుదుము. అనంతశక్తి జ్ఞానానందము లనుభవించుచు 'నేనుభగవంతుఁడ' నను స్మృతిని గలిగియుండును. బ్రహ్మీభూతునకు, (మజూబ్) జీవన్ముక్తునకు నొక భేదము కలదు. జీవన్ముక్తునకు, స్థూలసూక్ష్మమనశ్శరీరములయు, నా యా

లోకములయు స్మృతియుండును. 'కుతుబ్' సద్గురునకుఁ దనకు భేదము కలదు. ఒకప్పుడు బ్రిహ్మీభూతస్థితిలో నిమగ్నుఁడై యుండును. ఒకప్పుడు 'నేనే నా భగవంతుఁడ' నను భావమును (అహమేవాహమ్) మరియొకప్పుడు 'నేను నాసృష్టి' యనుభావమును స్మృతిపూర్వకముగాఁ బొందుచుండును. (పితామహస్యజగతో మాతాధాతాపితామహః— భగవద్గీతలు 9,–17). బ్రిహ్మీభూతస్థితి (మజ్ భూత్) భగవంతునిలో నెడతెగని నిమగ్నతకలిగినది.జీవన్ముక్తస్థితి (ఆజాడే–ముటలక్ స్థితి) యొకప్పుడు భగవంతునిలో మగ్నమై యుండుట, మరియొకప్పుడు సాధారణ చైతన్యముతో నుండుట జరుగుచుండును.

'సులుకియత్'యొక్క 'సులుక్'ను అనుభవించుట ('బాఖాబిల్లా' స్థితిలోశాశ్వతముగా బాదుకొనుట). 'కుతుబ్' అనఁగా సద్గురువునకు నితనికి నీ భేదముకలదు. తనకు నిరంతరము ననుభవములోనున్న యనంతశక్తి జ్ఞానానందముల నుపయోగింపలేకపోవుట.

జీవన్ముక్తునివల్ల లోకమునకు నేరుగా *ఆధ్యాత్మికలాభమొనగూడకపోయినప్పటికిని తనజీవితాంతమున నొకయాత్మను దనవలెనే పరిపూర్ణునిగాఁజేయును. మూఁడులోకములలోను (స్థూలసూక్ష్మమనస్సులు) తానుఁ జేయవలసినపని లేకపోయిన నొకదానితరువాత నొకటిగా 'పానాపిల్లా' 'బాఖాబిల్లా' స్థితుల నానందించుచుండును.

---

*కానివారితోఁ బరోక్షముగా సంపర్కము కలిగినవారు లాభము పొందుదురు.

# అవస్థ 10

## గురుస్వరూపము

ఇది భగవంతుఁడు మానవరూపములో సద్గురువుగా నున్న స్థితి (కుతుబ్). భౌతికసృష్టి నొక క్రమపద్ధతిని బరిపాలనచేయు 'మాయాధర్మము'న కతీతమై నిస్సంగుఁడై యనంత స్థితిఁ బవిత్రుఁడై సద్గురువు విలసిల్లును. తాను భగవంతుఁడనను చైతన్యముతోఁ దన యనంతశక్తి జ్ఞానానందములను నిరంతర మనుభవించుచు దేశకాలపాత్రల పరిమితలక్షణములకుఁగూడఁ గట్టుబడియుండును. తానీ శక్తుల ననుభవించుచు సత్యమును గ్రహింపలేక యజ్ఞానములోఁబడియుండు నాత్మలకు మోక్షమునిచ్చుటకు వాని నుపయోగించును.

నిరామయమగు పరిపూర్ణతాస్థితి యిదియే. ఇచ్చట భగవంతుఁడు సగుణుఁడు-సాకారుఁడు.

సూఫీమతప్రకార మాధ్యాత్మికమార్గములో కుతుబ్ (సద్గురువు) శిఖరాగ్రమును సూచించును. అతఁడు సృష్టికి బరమ ప్రమాణము. మానవలోకములో నుత్కృష్టమగు పుష్పము. "మజూబ్"బ్రహ్మీభూతస్థితిలో "నేను భగవంతుడ" ననెడి యపరిమితానందము నాత్మ పొందుచున్నది. కాని సద్గురువు (కుతుబ్) "నేను భగవంతుఁడ" ననెడి యపరిమితానందమును బొందుటయేగాక "నేనే సర్వము, సర్వము నానుండే ప్రసరించుచున్నది" యను దివ్యచైతన్య మహానందమును బొందుచున్నాఁడు.

మానవశరీరములోని యీపదియవయవస్థ (హాకీకట్-యే-మహమ్మద్) సద్గురువులు (కుతుబ్‌లు) అవతారములు (రసూల్), యీ యవస్థకుఁ జెందినవారు. భగవంతుఁడు సద్గురువుగాఁగాని, లేక యవతారముగాఁగాని యున్నప్పుడు పదియవయవస్థనుండి పటములో 'సి'లో చూపినట్లు 'విజ్ఞాన భూమిక'నుండి వ్యవహరించును. తన యనంతచైతన్యముతో భగవంతుఁడు మొదట యావిర్భవించినప్పు డీ భగవదధికార మును స్వీకరించెను. ఈ యధికారము శాశ్వతముగా సాగు చుండును. శాశ్వతముగు శక్తిజ్ఞానానందములు ప్రసాదించు చుండును. ఈ శక్తులను సద్గురువులు, నవతారపురుషుఁడును తాము శాశ్వతముగా ననుభవించుటయేగాక, యజ్ఞానములో నున్న యాత్మలకు మోక్షమునిచ్చి, పరమాత్మతో నైక్యము పొందుట కా యాత్మలు చేయు ప్రయత్నమునకుఁ దోడ్పడుదురు.

'భగవంతుని పదియవస్థలను' చిత్రించినపటములో 'సి'గాఁ జూపఁబడిన విధమున మానవరూపములో భగవంతుఁడు తన పరిపూర్ణత్వముతో నవతరించి యీ మహా కార్యమును సాధించుచుండును.

ఈ భగవదుద్యోగము లేక యధికారరూపమున భగవంతుఁడు సద్గురువుగాఁగాని యవతారముగాఁగాని,జోరాస్టర్, రాముఁడు, కృష్ణుఁడు, యేసు, బుద్ధుఁడు, మహమ్మదు మున్నగువారి రూపమున నవతరించెను. ఈ కాలచక్రములో యుగము ననంతరము యుగములోఁ దాను రక్షకుఁడ

నని, ప్రవక్తనని, అవధూతనని, భగవంతునిపుత్రుఁడనని, అవ తారమునని, రసూల్ లేక బుద్ధుఁడనని ప్రకటించుకొనుచున్నాఁడు. సద్గురువులు లేక యవతారపురుషు లిట్టి యధికారరూపమున నీ భౌతికసృష్టిలోఁ గార్యము నిర్వహింతురు.

సూఫీ లీ భగవంతుని కార్యకర్తృత్వమును మహమ్మద్ ప్రవక్త పేరిట 'ముఖమ్-యే-మహమ్మదేదే' యని పిలతురు. భగవంతుని యవతారమని, యట్లే భగవంతుని కుమారుఁడగు 'యేసు'నియు, మహమ్మద్, జోరాస్టర్, కృష్ణ, రామ, బుద్ధులనియు, యేసుయొక్క పవిత్రోద్యోగమును 'క్రైస్తు' అనియు పిలతురు.

భగవంతుని వివిధావస్థలను (మజలీలు) మనము సంగ్రహముగా నైదింటిలోనికిఁ దగ్గించితిమేని చైతన్యహీనమైన పరమాత్మ పూర్ణచైతన్యమును బొందిన కష్టములు లేక సంఘర్షణాలు మనకు విశదము కాఁగలవు.

**మొదటి మజిలీ**

(ఎ) ఆత్మ, పరమాత్మ రెండు ననంతము నవిభాజ్యమూనైన ఒక్కటియే యగు వాస్తవికతలో నేకమై యున్నవి.

(బి) ప్రారంభమునకుఁ బూర్వమగు నారంభదశలోఁ బరమాత్మయును మిగిలిన యాత్మలును చైతన్యహీనములై సంస్కారము లేక యుండినవి.

(సి) ఆదియం దాత్మకు స్థూలసూక్ష్మమనశ్శరీరముల చైత
న్యములేక యుండినది. అందుచే నా యా లోకముల
యనుభవమును లేక యున్నది. ఆత్మకుఁ దన స్మృతి
లేకుండెను. అందుచే దన పరమాత్మస్థితి యను
భవముకూడ లేదు. ఇది భగవంతుని పదియవస్థలను
జూపుచిత్రములో 'ఎ' అవస్థగాఁ జూపఁబడినది.

## రెండవ మజిలీ

ఆత్మ చైతన్యమును బొంది సంస్కారములను గ్రహించు
చున్నది. ఈ స్థితిలో నాత్మకు స్థూలసూక్ష్మమనశ్శరీరము
లలో నేదో యొకదాని జ్ఞానముండి యాయాలోకముల
యనుభవమును బొందుచున్నది. కాని యాత్మ 'తన్ను తాను'
తెలియకపోవుటచేఁ బరమాత్మస్థితి యనుభవమును బొంద
లేకున్నది.

చిత్రములోఁ జూపఁబడిన 3, 4, 5, 6, 7 అవస్థల
మజిలీ యిది.

## మూఁడవ మజిలీ.

ఆత్మ సంస్కారహీనమై యుండును. కాని పూర్తి
చైతన్యమును గలిగియుండును. ఈ చైతన్యము స్థూలసూక్ష్మ
18

మనశ్శరీరములకు సంబంధించినది కాకపోవుటచే నా యా లోక ముల యనుభవములను గలిగియుండదు.

ఈచైతన్య మాత్మయనంత "స్థితి" సంబంధి. అందుచే నాత్మ స్మృతిపూర్వకముగాఁ బరమాత్మస్థితి ననుభవించును. "నేను భగవంతుఁడ"నను స్థితియం దపరిమితానందము ననుభ వించును.

చిత్రములో 8వ యవస్థగాఁ జిత్రించిన మజిలీ యిది.

**నాలుగవ మజిలీ.**

స్థూలసూక్ష్మ మనశ్శరీరముల సాధారణ చైతన్యము నాత్మ తిరిగి పొందును. అందుచే నొకేపర్యాయము స్థూల సూక్ష్మమనోలోకముల యనుభవము బొందును. ఈమజిలీలో నాత్మ తన పరమాత్మత్వ స్మృతికలిగియుండి యనంతశక్తి జ్ఞానానందముల యనుభవమును బొందుచున్నది. కాని యాత్మ యీశక్తుల నుపయోగింపలేకున్నది.

చిత్రములోనిది 9వ యవస్థ.

**అయిదవ మజిలీ.**

అనంతమగు నాత్మ తన యత్యుత్కృష్టమగు భగవ చ్చైతన్యమనుభవించుచు,స్థూలసూక్ష్మమనశ్శరీరములజ్ఞానమును

గలిగి యా యా లోకముల యనుభవములను గూడ నాత్మ యప్పుడే పొందగలుగు చున్నది. పరమాత్మస్థితియగు తన యనంతశక్తిజ్ఞానానందముల ననుభవించుటయేగాక యుపయో గమున కుపకరించుచున్నది.

చిత్రములోఁ జూపఁబడిన పదియవ యవస్థ యిది.

## పదియవ భాగము | సమాప్తము

భగవంతుఁడు వ్యాఖ్యానించి చెప్ప వీలైనవాఁడు కాఁడు. ఆయనను గుఱించి వాదోపవాదములు ప్రయోజనము లేదు; ఒక సిద్ధాంతమునకు బద్ధుని చేయలేము. ఆయనను జర్చిం చుటకు గాని, యర్థము చేసికొనుటకు కాని వీలు లేదు. భగవం తుని జీవితమును జీవించి యనుభవింపవలసినదే. అయినప్పటి కిని మానవుని బుద్ధివిశేషముచే కలుగు మనస్సంక్షోభమును శాంతపఱచుట కింతవఱకు భగవంతునిగూర్చి తెలుపఁబడిన దానిలో లోపము కలదు. అందు విపులార్థబోధకములు, సందర్భసూచకములగు మాటలును లోపించి యున్నవి. సత్యమేమనఁగా వాస్తవమగు దానిని సాక్షాత్కారము పొందికాని తెలియలేము. భగవంతుని దివ్యస్థితిని పొంది

జీవితములో ననుభవింపవలసినదేగాని మాటలతోఁ దెలుపఁ వీలైనదికాదు.

ఈ మాయాసృష్టిలో వ్యక్తిజీవుల లక్ష్యమనంతమగు సత్యము నర్థముచేసికొనుట లేదు. సత్యమెప్పుడును బుద్ధి కవగాహనము కాదు. అది చైతన్య (స్మృతిపూర్వక) పూర్వకానుభవముతో సాక్షాత్కారము పొందవలసినదే.

అందుచేఁ బరమలక్ష్యమేమియనఁగా 'సత్యమును' సాక్షాత్కరించుకొని, మానవరూపములో 'నేనుభగవంతుఁడ'ను సిద్ధిని పొందుటయే.

---

# అనుబంధము

1. (30 వ పేజీలోని ఫుట్ నోటు.)

సంపాదకులు కోరఁగా శ్రీ మెహర్ బాబాగారు క్రిందివి సమాచారమును అదనముగాఁ దెలిపిరి.

మొదటి మానవరూపమును పొందుటతోడనే విజ్ఞానము పూర్తియగు స్థితికి వచ్చుచున్నది. కాని వెంటనే యది యంతర్ముఖతనొందుట కారంభింపదు. అంతర్ముఖస్థితి ప్రారంభమైనప్పుడు మానవుఁడాధ్యాత్మికమార్గమున నడుగు పెట్టినాఁడని చెప్పవలెను.

మానవజన్మము మొదట నెత్తినప్పటికి నాధ్యాత్మమార్గమున నడుగిడుటకును నడుమున కొంత వ్యవధియుండును. సంస్కారసంయోగము కలిగిన మానవుని చేతన్యజ్ఞానము తనపై నావహించిన సంస్కారములపట్టును వదలించుకొనుటకు కొంత ప్రయత్నము చేయవలసియున్నది.

ఈ మధ్యకాలములోఁ గొన్ని వేలజన్మములు పునర్జన్మములు మానవుఁ డెత్తవలసియుండును. గట్టిగా బిగిసికొని తనపైఁ గూర్చున్న సంస్కారము లీ పునర్జన్మమార్గమున సడలి చిక్కశవానినుండి విముక్తి కావలెను. ద్వంద్వములు నన్యోన్యవ్యతిరేకములునగు సంస్కారానుభవముల యంత్యదశ యనేక జన్మపరంపరలవలన గలుగును.

ఈ నిబిడ స్థూలసంస్కారములు క్రమముగా బలహీన ములైనకొలదిని స్థూలశరీరముద్వారా స్థూలప్రపంచమున ననుభవింపఁబడు స్థూలసంస్కారములు క్రమముగా నంతమొందు దశకు వచ్చును. ఈ సంస్కారములు తమ తమోలక్షణములను క్రమముగాఁ గోల్పోవునప్పు డవి కలుగఁజేయు ననుభవములు కూడఁ దమోలక్షణములనుగోల్పోయి సున్నితము లగుచుండును. ఈ సంస్కారములు సున్నితములగుకొలఁది, పెరిగినప్పుడు వానినిసూక్ష్మసంస్కారములందుము. ఈసూక్ష్మ సంస్కారములు సూక్ష్మలోకమునకు సంబంధించిన యనుభవములకుఁ గారణభూతులగును. సూక్ష్మశరీర మీ సంస్కారముల యనుభవములనొంది వానిని క్షీణింపఁ జేయుటకు యత్నించును.

ఈ సూక్ష్మసంస్కారము లింకను క్షీణదశకు వచ్చి మిక్కిలి సున్నితమగును. ఈ సున్నితములగు సంస్కారముల సమూహమంతయు మనస్సంస్కారము లని పిలువఁబడును. ఈ సంస్కారములు మనోలోకమునకు సంబంధించిన యనుభవముల నిచ్చును. మనశ్శరీరము వీని యనుభవములను పొంది, యీ సంస్కారములను క్షీణింపఁజేయుటకు యత్నించును.

మనశ్శరీరముద్వారా కలిగెడి యనుభవములవల్ల మనస్సంస్కారములు పూర్తిగా క్షీణించి చివరిఛాయ లున్నప్పుడాత్మ పరిపూర్ణచైతన్యమును బొంది సంస్కారములను వీడియుండును. ఈచైతన్యము మొదట మానవరూపము పొందినది మొదలు తుదకెత్తిన మానవజన్మము వఱకు సంస్కారపరిభా

వముననఁబడి నలుగుచుండెను. సంస్కారహీనమై పరిపూర్ణతను బొందిన చైతన్యము 'నేనేభగవంతుఁడ'నను నాత్మస్థితి యనుభవమును బొందును.

జన్మపరంపరలచే స్థూలసంస్కారములు బలహీనము లైనప్పు డవి సూక్ష్మసంస్కారము లగును. వీని వల్ల స్థూల ప్రపంచమునకు సంబంధించిన యనుభవము లుత్పన్నములు కావు. ఈ సమయములో స్థూలచైతన్యము కలిగిన మానవుని చైతన్యము సూక్ష్మలోకానుభవమును పొందుచుండును. చైతన్య మంతర్గతపరిణామము పొందు లక్షణ మిప్పుడు వ్యక్తమగును. జిజ్ఞాసువిప్పు డీ మార్గము నవలంబించును. సూక్ష్మసంస్కారములు సూక్ష్మప్రపంచసూక్ష్మానుభవములను గలుగఁజేయును. ఈ సూక్ష్మసంస్కారములు క్రమముగా క్షీణించును. చైతన్య మంతర్గతముగా పురోభివృద్ధిని పొందుచుండును.

2. (53 వ పేజీ పంక్తి 6 వెనుమరలినపుడు)

### అభ్యాససిద్ధమైన యాధ్యాత్మిక రహస్యము—ధ్యానము.

సత్యాన్వేషణము వ్యక్తిప్రయత్నసంబంధము కలది. భగవంతుని పొందదలఁచిన వారికి వర్తించు సాధారణపద్ధతి కాని, మార్గముకాని లేదు. ప్రతిమానవుఁడు తన ముక్తిని సాధించుకోవలెను. తనమార్గమును నిర్ణయించుకోవలెను. పూర్వజన్మములలోఁ దనకు సంక్రమించిన సంస్కారములను బట్టి యీ మార్గము సాధారణముగా నిర్ణయింపఁబడును. తన

యంతరాత్మ నడిపించినట్లు నడువవలెను. తన బహిఃపరిసరము లకు, శరీరసౌలభ్యమునకు, ఆధ్యాత్మికభావలక్షణములకు నను సైన మార్గము ననుసరింపవలెను. సత్యమొక్కటే. దానిని పొందుమార్గము వ్యక్తిగతమైనది. 'సూఫీలు' యిట్లు చెప్పె దరు. "మనుష్యుల యాత్మలెన్ని యున్నవో, భగవంతుని చేరుట కన్ని మార్గములు కలవు".

"బహుముఖంబుల వెలయునీ ప్రకృతిశోభఁ
దెలియమార్గంబులెన్నియో కలవుగాని;
ఎవరికేమార్గమిట నిర్ణయింపఁబడెనో
యెఱుఁగరాదెవ్వరును నిశ్చయింపలేరు."

(అక్బర్)

## త్యా గ ము

యాత్రికుఁడనఁగా జిజ్ఞాసువుకాని, యొక గురువు, శిష్యుఁడుగాని, త్యాగమువల్ల ఆకర్షితుఁడయ్యేనేని, త్యాగస్వ భావమతని యందదివఱకే యంతర్గతమైయున్న దన్నమాట. పునర్జన్మములలోని లెక్కలేని జననమరణముల ననుభవించిన కష్టసుఖముల యనుభవములవల్ల నీ త్యాగసంసిద్ధత యలవ డును. ఈ త్యాగలక్షణ మంతర్గతమై యుండుటచే దానిని పైకితీసికొనివచ్చుట కొక యుద్రేకకారణ ముండవలెను. అది పైకివచ్చినప్పుడే దాని ప్రభావలక్షణములు మనకు గోచరిం చును. అనేక కష్టములవల్ల కలిగిన బాధకారణముగా,

కొంత సుఖము పొందవలెనను కోరికతో నీ త్యాగలక్షణ మంతరమున బుట్టినచో నిట్లు పైకావిర్భవించు త్యాగము తాత్కాలికమై బలహీనముగా నుండును. అసంతుష్టినుండి తప్పించుకొనుట కిదియొక యుపశమనము మాత్రమే కావచ్చును. కాని దీనిని మంచిగాఁ జూచినచోఁ బ్రపంచముపై కలిగిన తీవ్రాసంతృప్తికిని, విసుగుదలకు, భగవంతుని పొందవలెనను గాఢమగు కోర్కెను సంధించినప్పుడే త్యాగలక్షణము బయలుదేరును. ఇది పైకావిర్భవించినప్పుడు, తన తక్కువస్థితిలోని జీవాత్మను జయించుటకు తన వ్యక్తిలోని శక్తినంత నుపయోగించును. ఈ భగవంతుని పొందు ఘోరమగు సంఘర్షణమునఁ దన కడ్డంకులుగా నుండువాని నన్నింటిని తొలఁగించుకొనును. 'ఇట్టి యసంబద్ధములను విసర్జించును' అనుమాట మెలఁకువమై గమనింపదగినది. అంతులేని జననమరణముల యందుకల వైముఖ్యము, నాధ్యాత్మికోన్నతి కొఱకు జనించిన కోరికయును వానిసంయోగఫలమే త్యాగమని చెప్పవలెను. త్యాగ లక్షణముప్రస్ఫుటమైనప్పుడు, దాని ననేకవిధములుగా మనమర్ధము చేసికోవచ్చును. అందు సామాన్యమైనది బహిర్గతాంతర్గతత్యాగము అని రెండు ముఖ్యవిధములు.

బహిరంగత్యాగ మనఁగా, ఇహలోక సంబంధమైన కోరికలను, సుఖములను భౌతికవస్తుచయముతో ననుబంధములను వదులుకొనుట. ప్రాథమికదశలలో నీ త్యాగ మాంతరంగికనిస్సంగత్వమునకును, భగవత్ సంబంధమైన వ్యాసంగము

నకును తోడ్పడును. వేలకొలఁది సన్న్యాసులు మనదేశ ములోఁ గలరు. బహిర్గతమగు త్యాగమును మాత్రమవ లంబించి నిరుపయోగమగుజీవితమునుగడుపుచున్నారు.బహిర్గత త్యాగము తరచు సత్యమైనదిగానే యుండును. అట్టి యెడ నది యంతర్గతసన్న్యాసము లేక నిస్సంగత్వమునకు గూడఁ దోవఁదీయును. ఇది చాలా ముఖ్యమైనది. ఆంతరంగిక సన్న్యాస మనఁగా నాదిలోనే కోర్కెలను బూర్తిగా నదుపులో నుంచుట. దీని వలన మనస్సు కామక్రోధలోభము లకు లొంగిపోదు. అట్టి యాలోచనములు లేక భావములే కలుగుట జరగదని యనుకొనఁగూడదు. సంస్కారమున్నంత కాల మీా భావములు బాధించుచునే యుండును. ఈ సంఘర్షణము దీర్ఘమై కర్కశమైనది.

పశ్చిమదేశములలో బహిరంగసన్న్యాస మాచరణ యోగ్యము నంగీకార్యమును గాదు. ప్రారంభము నుండియు నది మనస్సునకు సంబంధించి యాంతరంగికమై యుండవలెను. ప్రపంచములో జీవయాత్ర నడుపుచు, విద్యుక్తధర్మముల నెఱ వేర్చుచు, మానసికముగా నిస్సంగత్వము కలిగియుండవలెను. ప్రపంచములో నున్నను దానిలో లీనమైపోఁగూడదు. సూఫీ లిట్లు చెప్పెదరు. "హృదయము భగవదర్పణము; కరములు కార్యబద్ధములు". ఢిల్లీసద్గురువగు హాజరట్ నిజాముద్దీన్ ఆలీయా గారిని ఒక పెద్దమనుష్యుఁడు వచ్చి ప్రపంచములో మనుష్యుఁడెట్లు మనవలెనని యడిగెను. ఆ సమయమున కొందఱు స్త్రీలు నీటికడవలను తమతలలపైఁబెట్టుకొని యా

వైపునఁ బోవుచుండిరి. వారు నీటితో నిండిన కుండలు దలపై నుండగనే చేతులుతిప్పుకొనుచు నభినయయుతమైన సంభాషణములు సాగించుచు నడచుచుండిరి. శ్రీ నిజాముద్దీన్ ఆ స్త్రీలను జూపి "ఆ స్త్రీలను జూడుము – నీవు నట్లే ప్రపంచములో జీవింపవలెను" అని చెప్పెను. "ఆ స్త్రీలు ఏమి లక్ష్యము లేనట్లు మాట్లాడు కొనుచున్నారు. కాని తలపై నున్న కడవలు పడిపోకుండునట్లు వారిమనస్సు కడవలపై లగ్నమై యున్నది. అట్లే నీశరీరమింద్రియములు, ఉపరిభాగమున నున్న మనస్సు నే పనిలో నున్నప్పటికి నాంతరంగికముగా నున్న మనస్సు మాత్రము భగవంతునిపై లగ్నము చేసి యుంచవలెనని" యాయన చెప్పెను.

## వైతగ్యము – వైరాగ్యము

సన్యాసము లేక త్యాగము ప్రత్యేకమగు మనస్థితియని మనమెంచినచో, నీ మనోవృత్తి తాత్కాలికము కావచ్చును; లేక శాశ్వతము కావచ్చును. వేదాంతమార్గములో మొదటిది 'వైతగ్యము' రెండవది 'వైరాగ్యము' అని చెప్పుదురు.

ఏదైన నష్టమువల్లగాని, యాశాభంగముకలుగఁజేయు సంఘట్టమువల్ల కలుగు తాకిడిచేగాని ప్రపంచవ్యవహారములపై అసంతృప్తి విముఖత కలిగినప్పుడు, భగవంతుని యందు క్షణికమగు కోరికయొకటి కలిగినప్పుడు వైతగ్యము(తాత్కాలిక సన్యాసము) ఆకస్మికమగు ప్రేరణమువల్ల కలుగవచ్చును. వైతగ్యములో ప్రపంచమునుండి దూరమై మనస్సుభగవంతుని వైపునకు దిరుగును. ఈమనోవృత్తి చిరకాలము నిలువదు. పరి

స్థితులు మారుటతోడనే మనస్సుతిరిగి పూర్వప్రవృత్తిని పట్టును; లేక యీ ప్రేరణము క్షీణించినప్పుడుకూడ నిదియే సంభవించును.

వైరాగ్యము (తిరుగులేనిసన్యాసము) మాత్రమిట్టిది కాదు. ప్రపంచవిషయములందు బూర్తిగా నుదాసీనత కలిగి భగవంతునికై తీవ్రపరితాపములో నుండును. అందుండి వెనుకకు మరలుట యుండదు. ఎట్టియాకర్షణలకు లొంగుటజరుగదు. గౌతమబుద్ధుని జీవితమువైరాగ్యమునకు ప్రసిద్ధమైన యుదాహరణము.

త్యాగమనునది యంతర్గతమైయున్న ప్రపంచముపై విముఖత్వము, భగవంతునియం దనురాగము ననునది కలసి సన్యాసముగా బహిర్గతమగును. పుష్పము, పుష్పాడి, ఫలము అనువాని క్రమస్వరూపమిట నుదాహరణముగా గమనింతము. గర్భధారణము కలుగవలెనన్నచో పుష్పము పుష్పాడివేరుగా నుండి నిస్సహాయస్థితిలో నున్నవి. వీటిరెంటికిని గాలియో, తుమ్మెదయో లేక యేకీటకమో సంధానము కూర్పవలెను. ప్రకృతిలో నీగర్భధారణక్రియ మనకుఁదెలియని యనేకవిషయములపై నాధారపడియుండును. విజ్ఞానశాస్త్రజ్ఞులది యొక తెలియని సంఘట్టనపై నున్నదని తెల్పెదరు. కాని మన మీ విషయమును భగవద్దత్తమైనదిగా నెంచెదము.

ఈవైరాగ్యవృత్తి లేక భగవంతునిలో లీనమగుకోర్కె సజీవుఁడైయున్న ప్రతిమానవునిలో నంతర్గతమైయున్నది. శ్రీ

మెహర్ బాబాగారు చెప్పినట్లు భగవంతుని నిర్ణయములో భగవత్ సాక్షాత్కారయత్న ప్రారంభములో నీ పైనుదహరింపఁబడిన వైరాగ్యవృత్తి చైతన్యములోనికిఁ జొచ్చుకొని ప్రవేశించును. ప్రపంచముపై విముఖత్వముగూడ నైసర్గికముగానే పెరుగుచుండును. భగవంతుని దగ్గరకుచేరినకొలఁది యీవిముఖత్వము మరింతబలపడుచుండును. పుష్పముపూర్తిగా వికసించినప్పుడు, పుప్పొడి సిద్ధమైనప్పుడు, గాలికాని తుమ్మెదకాని, పుష్పము గర్భవతియగుటకు సాయపడి ఫలప్రాప్తిని కలుగఁజేయును. ఇదేవిధముగ నాంతరికమగు సంసిద్ధతకలిగినప్పుడు, భగవంతుని ప్రసాదమాత్మపై నవతరించి భగవంతునియందు గలకోర్కెను, లోకమునందుగలవిముఖతను గర్భధారణముచేసి, వైరాగ్యమనే ఫలసృష్టికిఁ గారణములగుచున్నవి. ఈభగవత్ ప్రసాదమంతస్థితుఁడైన భగవంతుని కరుణకావచ్చును. లేదా యొకమహాయోగి లేక సద్గురువు సంబంధముకావచ్చును.

కాని యిది యెప్పటికిని దైవదత్తమో లేక గురుప్రసాదమో యైయుండును.

వైరాగ్యము మొదటిసారిగా పొడసూపినప్పుడు బహిస్సన్యాసముగా ప్రకటితమగును. వైరాగ్యము శాశ్వతలక్షణము కలిగియుండుటచే నాంతరంగికమై నిజమగుసన్యాసమునకుఁ దోవదీయును.

జిజ్ఞాసువు సత్యపదార్థమును పొందుటకు తీవ్రముగా నాకాంక్షించేనేని అతఁడన్వేషణ మార్గమునఁ బ్రవేశించుట

కర్మతను గలిగినవాఁడగును. తానెప్పుడు భగవంతుని సాక్షాత్కారము పొందగలఁడో తెలుపవలసినదని శిష్యునిచే బాధింపఁబడిన యొక గురువుకథకలదు. వారుభయులు నదిలోస్నానము చేయుటకు వెళ్ళి నప్పుడు గురువుశిష్యుని నీటిలోముంచి యదిమి కొంతకాలము పట్టుకొనియుంచెను. ఉక్కిరి బిక్కిరైయూపిరి యాడని స్థితిలోనికి వచ్చినతరువాత గురువు శిష్యుని పైకిలాగి నీటమునిఁగి ప్రాణాంతకముగా దోఁచినప్పుడేమి యాలోచించుచుంటివో చెప్పుమని గురువు శిష్యునడిగెను. శిష్యుఁడు గాలి కావలెనని బాధపడుచుంటినని చెప్పెను. భగవంతుని కొఱకట్టి తీవ్రమగు కోరికయు, నావేదనయు గలిగినప్పుడు భగవంతుఁడు లభ్యమగునని గురువుచెప్పెను. మహాలానారాయి యిట్లు చెప్పెను. "నీటికొరకు కేకలువేయుట తగ్గించుము; పిపాసను వృద్ధిచేసికొనుము."

(శ్రీ) మెహర్ బాబాగారిట్లు చెప్పుచున్నారు. "గహనమగు నస్తిత్వగ్రహణమునకు స్మృతిపూర్వకమగు తీవ్రకాంక్షతో మార్గగమనము ప్రారంభమగును. నీటిపైఁబడిన చేప తిరిగి నీటిలోనికిఁ బోవుట కాతురపడినట్లు లక్ష్యగుణమును గుర్తించిన జిజ్ఞాసువు భగవంతునితో నేకత్వము పొందుటకుఁ బరితపించును.

తన సృష్టికర్త(మూలము) నుండి మాయయను తెరచే వేఱుచేయఁబడినప్పటినుండియు తిరిగి యామూలస్థానమునకుఁ

జేరవలెనను వాంఛ ప్రతిజీవిలో నున్నది. కాని, జిజ్ఞాసు వీ ముక్తిమార్గమున బ్రవేశించువఱకు స్మృతి లేకున్నాఁడు. *

సూఫీలు యీమనస్తత్వమును "తవ్వబా"అని అందురు. అనఁగా పశ్చాత్తాపము లేక యింద్రియములకు లోఁబడిన జీవితమును త్యజించి యాత్మవిచారమార్గమునకు జీవితము మరల్చుట. ఒకమారీ మార్గము నవలంబించినవా రదివరలోవిసర్జించినదానివైపు తిరిగి చూడరు.

ముక్తిమార్గాన్వేషకులు వేలమంది యన్నివిధములగు నాధ్యాత్మికానుభవములను పొంది యుండవచ్చును. కాని, యాధ్యాత్మికజ్ఞానమును ప్రసాదించు మార్గ మొక్కటియే కలదు. అది యాంతరంగికమైనదియేగాక వాస్తవికము నగు మార్గము. ఆమార్గమునబోవు యాత్రికుని మనోనేత్రమునకీ యసాధారణమార్గము గోచరమగును. నిజమగు ననుభవములను పొందిన యాధ్యాత్మికతత్వవేత్తలు (mystics) తామాచరించిన మార్గభాగములను గుఱించి మాత్రమే మనకు విశదముగాఁ జెప్పగలరు. మూఁడవ భూమికలోని క్లిష్టమగు ఘట్టముచేరినవారికి నాల్గవభూమికవిషయ మేమియుదెలియదు. తమతోపాటు వారు మరియొకరిని తమవెంట తీసికొనిపోలేరు. వారిజ్ఞానము, అనుభవము వారికే పరిమితమై యుండును. అయిదారు భూమికలలోనున్నవారుమాత్రము మిగిలినవారిని

---

*శ్రీ మెహర్ బాబాగారి ప్రసంగములు రెండవసంపుటము 261 వ పేజీ

దయతో సమానస్థితికిఁదీసికొని రాఁగలరు. అట్టివారి కరుణ ఎవరిమీద ప్రసరించిన వారెక్కువ ప్రయోజనము పొందుదురు.

ప్రపంచములోని వ్యక్తిగతాత్మలన్నియు స్థూలలోకావరణములో నుండును. ఈలోకములో స్థూలరూపమున సూర్యచంద్రులు, లోకము, నాకాశము నిమిడియున్నవి. యుక్తాయుక్తవిచక్షణలేని కేవల మూఢుఁడు, నజ్ఞుఁడునగు నడవిమనుష్యుఁడు నొక ప్రసిద్ధుఁడైన వేదాంతవిజ్ఞానవేత్త యను రెండురకముల వ్యక్తులు నీ స్థూలలోకములో నుందురు. వేదాంతికి సిద్ధాంతరీత్యా సూక్ష్మలోకమును గుఱించిన జ్ఞానముండవచ్చును. ఆధునికభౌతికశాస్త్రజ్ఞానావధులును జ్ఞానికి తెలిసియుండవచ్చును. కాని, సూక్ష్మవిషయజ్ఞాన దృష్టితోఁ జూచినచో నీ యిద్దఱు పండితులును మూఢుఁడగు నడవి మనుష్యుఁడు నొకే స్థూలలోకములో నున్నారు. సూక్ష్మలోకానుభవమును పొందువఱకు స్థూలలోకములోనున్న వారికిభగవంతుని గుఱించిన జ్ఞానము కేవలము బుద్ధివిశేషము ద్వారా గ్రహింపవలసిన తర్కవిషయమే. ఇచ్చట సూక్ష్మమనఁగా స్థూలవస్తుసంబంధమై సున్నితమగు రూపాంతరముకాదు. సాధారణముగా నుపయోగించెడి యర్థములో మిక్కిలి సున్నితమగు వస్తువులు, హిమద్రవము (Ether) అణువు, వెల్తురు, ఆకాశము, స్పందనము-యివన్నియు సూక్ష్మములే. అవి మిగుల సున్నితములగు రూపములలో నున్నప్పటికిని నిస్సందేహముగా స్థూలవస్తుసమూహములోనివే.

ఆధ్యాత్మికభాషలో సూక్ష్మమనఁగా నెంత సున్నితము లైనప్పటికిని భౌతికవస్తువులకు పూర్తిగా భిన్నమైనది. స్థూల ప్రపంచము సూక్ష్మలోకమునుండి బయల్వెడలి దానిపైనాధార పడినప్పటికిని సూక్ష్మలోకము స్థూలప్రపంచముతో సంబంధము లేక స్వతంత్రమై యున్నది. ఉదాహరణకు:- మనము భుజించు క్రియను చూతము. స్థూలకార్యమాలోచనము లేక భావమునుండిబయలు దేరినది. దానిమీద నాధారపడియున్నది. కాని యాలోచనము లేక భావము, శరీరము చేయు పనిపై నాధారపడియుండ లేదు.

## విస్మృతి

సత్యపదార్థమును సమీపించి సాక్షాత్కరించుకొను తత్త్వమంతయు విస్మృతి యాధారముగాఁ గలది. ఈ విస్మృతి యనెడి శబ్దము మనము మామూలుగా నొక పనిని జేయుట మఱచిపోయినామనెడి యర్థముగలదిగా గ్రహింపరాదు. ఈ యాధ్యాత్మికసందర్భములో మఱపనునది క్రమముగా నాధ్యాత్మికానుభవముగాఁ బరిణమించెడి యొకానొక చిత్తవృత్తి, మనోదృష్టి. బహిర్గతమగు సన్యాసము "మఱపు" కాదు. అది కొంత శారీరకము, లేక భౌతికము, కొంతమానసికము. కాని యాంతరంగికసన్యాసము స్వచ్ఛముగా మానసికమైనప్పుడు దానికి గరిష్ఠమైన విస్మృతిలక్షణమువచ్చును. ప్రపంచమును త్యజింపవచ్చును. కాని దానిని మఱచిపోవుట యంత సులభసాధ్యమైన పనికాదు.

మానవు లనుభవించు నాధ్యాత్మికానందము లేక తదితరసంబంధమైన సుఖమునకు వెనుక యీప్రత్యేకార్థముగల మఱపు అను రహస్యమున్నది. ఈమఱపునుసూఫీలు "బీఖుది" అనిపిలతురు. దీనిని 'బిహోషి'(స్మృతిహీనత) యని భ్రమపడ కూడదు.

మఱపునకును స్మృతి లేకపోవుటకును గల తారతమ్యము ముఖ్యము. స్మృతిహీనసంబంధోదాహరణములు చూచినచో నిది మనకు విశదముకాఁగలదు. భౌతికప్రపంచమునుండి కొంత కాని పూర్తిగాఁగాని మనస్సును వేరుపరచుట మఱపందురు. స్మృతిహీనతయనునది కొంతకాని పూర్తిగాఁగాని మనస్సునకు భౌతికప్రపంచముతోఁగల సంపర్కమును దెగతెంపు చేయుట యగును. మొదటిది కొన్ని తరతమభేదములు కల యాధ్యాత్మికానందమునిచ్చును. రెండవది యానందము. కష్టముల యనుభవములను వివిధములుగా నణచివేయును; లేకయంతరింప చేయును.

స్మృతిహీనతను గురించిన యుదాహరణములను బరిశీలింతము. ఆరోగ్యము బాగుగానున్నంతకాలము ప్రధానాంగమగు హృదయమెట్లు పనిచేయుచున్నది మనము గమనింపము. హృదయ మెడతెగకుండ నారోగ్యముగాఁ బనిచేయుచు బాగుగానున్నదను విషయమే మనకుజ్ఞప్తికిరాదు. కానిహృదయస్పందనములో నేదైనప్రమాదము సంభవించినయెడల బాధ కలుగును. హృదయమునకు ప్రమాదస్థితి తటస్థించును.అప్పుడు

మనకు హృదయము "గుండెకాయ" యున్నదను సంగతిజ్ఞాపక మునకువచ్చును. ఈబాధహృదయమునుండి బయలుదేరినను మనస్సుపనిచేయుచుండుటచే నాటుచున్నది. హృదయము వైపుమనస్సు లగ్నమైనకొలఁదిని బాధయెక్కువగాఁ దెలియు చుండును. బాధతీవ్రమైనప్పుడుస్మృతితప్పిపోవచ్చును. బాధను మఱపునకుఁ దెచ్చునట్లు స్మృతిధార కట్టుబడిపోవును. ఇది స్మృతిలేకపోవుటయేకాని యాధ్యాత్మికదృష్టిలోని మఱపు కాదు. వైద్యుఁడు కంటిగుడ్డుపై శస్త్రముచేసి మనోదృష్టిని కేంద్రీకరింపఁజేయు కొన్ని నరముల గమనికను మార్పుచేయఁ గలుగును. విపరీతమగు వ్రణబాధపై కేంద్రీకరింపఁబడు మనో దృష్టిలో నిట్లు మార్పు తీసికొని రాఁగలుగుచున్నాఁడు. బాధ యెప్పటివలె నున్నప్పటికిని శస్త్రచికిత్స జరిగినతరువాత రోగి తనమనస్సు నాబాధ కలుగఁజేయు వ్రణముపై మరల్పఁడు. అందుచే దానినిగురించి బాధపడఁడు. భౌతికమార్గముద్వారా పాక్షికస్మృతిహీనత సృష్టింపఁబడినది. ఇది యాధ్యాత్మికదృష్టి లోఁజెప్పఁబడు నిజమగు మఱపుకాదు. జీవితములో శ్రమల వల్లకలుగు రాపిడినుండి తాత్కాలికోపశమనము నిచ్చు స్మృతి హీనతను 'నిద్ర' యందుము. నిద్రమాత్రము నిజమగు మఱపుకాదు.

కావున కష్టసుఖముల దేనితత్త్వమునకైన స్మృతి-విస్మృతులాధారములు. స్మృతియనునది భావపురుషవస్తుప్రదేశ ముల దేనితోనైన మనస్సునకుఁగల కొండొకసంబంధము. విస్మృతి దీనికి వ్యతిరిక్తము. స్మృతి బాధను గలుగఁజేయు

సని గ్రహించినప్పుడు, దీనికి విరుగుడేదో విధముగు నొక విస్మృతియే. ఈవిస్మృతి రూఢమార్గమునైన నుండును, లేదా వ్యతిరేకమార్గమునైన నుండును. మనస్సు రూఢ మార్గములో బహిరంగముగాఁగలుగు ప్రేరణముల నెఱఁగియే యుండును. కాని వానికిఁ బ్రతిప్రేరణమును చూపదు. వ్యతిరేకమార్గములోని మఱపు కేవలము స్మృతిలేమియైయుండును. గాఢనిద్రలో మునిఁగియున్న మనస్సువలె- లేక పిచ్చిస్థితిలోవలె నుద్వేగము కలిగియుండును. ఇదిబాధాస్మృతిని తప్పించుకొనుమార్గమని చెప్పుదురు. నిద్రనుగాని పిచ్చినిగాని మత్తుపదార్థముల, మందుల నుపయోగించి కల్పింపవచ్చును. కాని యవి యస్వాభావికములు. ఐనను జ్ఞప్తినుండి విడివడుట కిది కూడ నొక విరుద్ధమార్గము.

రూఢిగానడచు మఱపు బాధను నివారించును. దీనిని శ్రద్ధగా వృద్ధిచేసికొనినచో మనస్సున కొక నిలకడ కలిగిన సమత్వముకలుగును. దీనివల్ల నుదారత, దానము, క్షమ, దమము, స్వార్థహీనత, సేవాపరత యలవడును. ఇట్టి రూఢి కల 'మఱపు' నలవఱచికోలేనివ్యక్తి తన పరిసరముల వాతావరణములనుబట్టి మాఱిపోవుచుండును. దూషణభూషణము లేమాత్రము విన్న నతని స్థైర్యము కదలిపోవును. మనోవికారమను గాలిచే నతనిమనస్సు కెల్లుగడ్డివలె నూఁగిపోవును. అతఁ డెప్పుడు నంతర్యుద్ధముతో సంక్షోభము చెందుచు శాంతము నెఱుఁగఁడు.

ఈ నిరూఢవిస్మృతి నలవఱచుకొనునప్పు డననుకూల పరిస్థితు లెదురైనప్పుడు వానికి లొంగెడి మనోవికార ముండఁ జూడదు. అదియుఁగాక అనుకూలమై సంతోషజనకమైన సందర్భములలోఁగూడ మనస్సేవిధముగను సంచలింపఁగూడదు. ఎవరు నంతగా నుదాహరింపకపోయినప్పటికిని రెండవ సందర్భము కష్టతరమైనది.

ఆనందమునకుఁ బునాదియైన యీ నిరూఢవిస్మృతి నొందుట సులభమైనపని కాదు. ఒకమాఱు మానవుఁడీ మానసికస్థితిని పొందెనేని యతఁడు కష్టసుఖముల నధిగమించి యాత్మసంయమి యగుచున్నాఁడు. తన్నుఁదాను జయించిన వాఁడతఁడు. ఆధ్యాత్మికజీవనములో దీనివల్ల పూర్తి ప్రయోజనము పొందవలెనన్న నీ మఱపు శాశ్వతము కావలెను. అనేక జన్మములలో నొనర్చిననిరంతరసాధనమువలన నిదిలభ్యమగును. పూర్వజన్మములలో నీసందర్భమునఁజేసిన సాధనమువల్ల తరువాత జన్మమునఁ దాత్కాలికమగు ప్రకాశమునుపొందుదురు. అట్టి మహానుభావులు, గొప్పకవిత్వమును, కళలను, వేదాంతమును, శాస్త్రవిజ్ఞాన పరిశోధనలను. ప్రపంచమునకుఁ బ్రసాదింతురు.

నిజమగు మఱపుకల యట్టిసమయములలో భౌతికపరిసరములనుండి దూరమై తన యూహాశక్తి నున్నతపథముల కెగురునట్లుచేసి కవి గొప్పకావ్యమును సృష్టించుచున్నాఁడు. కళాకారుఁడు తన భౌతికపరిసరములను మఱచి తన యాదర్శమునకు రూపము నిచ్చి రమ్యమగు సృష్టిని చేయఁగలుగు

చున్నాఁడు. తన వ్యక్తిగతమైన జీవితములోని కష్టసుఖము లతో సంబంధము లేక జీవితసమస్యను పరిశీలించినప్పు డుత్కృష్టమగు వేదాంతజ్ఞానమును మానవుఁడు లోకమునకు వెదఁ జల్లుచున్నాఁడు. గొప్పవగు విజ్ఞానపరిశోధనఫలితములుగూడ నిట్టి మనోస్థితిలో నున్న విజ్ఞానవేత్తలద్వారా బయటకు వచ్చినవి. అప్రియత్నమును, నిర్మలము నగునట్టి మఱపునుండి యీ మహావిషయము లుత్పన్నములైనవి. కవులు, కళావేత్తలు, వేదాంతులు పుట్టుకతో గొప్పవారని చెప్పుట కర్థ మేమనఁగా నీ మఱపుతో వారు జన్మించిరి. అది వారనేక పూర్వజన్మములలో సలిపిన కృషిఫలము.

జీవితము సహింపయోగ్యముగా నుండుటకుఁ గొందఱు లోకవిధమైన నిర్లిప్తత లేక మంచిచెడ్డలయందు నిర్లక్ష్యము నవలంబింతురు. కొందఱు ముందువెనుకలు చూడకుండ సుఖానుభవములో మునిఁగి పోదురు. మొదటి తరగతివారు నిర్లక్ష్యముతో నోటమి నొప్పుకొందురు. రెండవ తరగతివారు సుఖానురక్తియందుఁ దమ యోటమిని మఱచిపోయత్నింతురు. ఈ రెండును స్వచ్ఛమగు మఱపునకు సంబంధించినవి కావు. నిజమగు మఱపును పొందినవాఁడు నిజమైన యాధ్యాత్మికలోకమునఁ బ్రవేశించి, లక్ష్యసిద్ధిఁ బడయువఱకు నీమఱపునందలి వివిధములగు నంతరములద్వారా పురోభివృద్ధికనును. శ్రీ మెహర్ బాబాగారిట్లు చెప్పుచున్నారు. "ప్రపంచమును మఱచుట యాత్రికుని లక్షణము.(సాధకుఁడు) పరలోకమును మఱచుటవల్ల పావనుఁడగును. తన్ను దాను మఱచుట

యనఁగా సాక్షాత్కారము పొందుట. మఱపునే మఱచుట సద్గురులక్షణము.".

3 (54వ పేజీ 21వ పంక్తి ప్రథమ భూమికయందు)

హాఫీజు యీ క్రిందిమాటలను చెప్పినప్పుడు మొదటి భూమిక నుద్దేశించెను.

"ప్రేమధాముని నిలయంబదే మొకాని
యెచటనున్నదొ యెవ్వరికెఱుఁగరాదు;
వచ్చిపోయెడువారలుభక్తిమీర
చేయుగంటలరవళులే చెవులఁబడును."

భూమికలు గంటలనుగుఱించి శ్రీబాబాగారిట్లు చెప్పుచున్నారు.*

"ఏడుభూమికలలో శబ్దముండునని తెలిసికోనుము.
కాని యీ భావోద్రేకానందములలో వ్యత్యాసము లుండును."

శబ్దము, దృశ్యము, వాసన, ఉన్నతభూమికల విషయములకును భౌతికయావృత్తిలోనున్నవానికిని గలవ్యత్యాసమును మన మూహింపలేము. ఉన్నతమగు భూమికలోని యనుభవములను పొందుట కానందించుటకు, మన శ్రవణ, నేత్ర.

---

*"ప్రశ్నలు బాబాగారి సమాధానములు" మెహర్‌బాబాజర్నల్ జనవరి 1939.

ఘ్రాణేంద్రియము లుపయోగింపవు. ఈ యనుభవములను పొందు నింద్రియములు వేరైయున్నవి. మానవునిలో పైన కనఁబడు స్థూలేంద్రియములకుఁ బ్రతిగా నంతరింద్రియము లున్నవని తెలిసివచ్చినది. పై భూమికల యనుభవముల నీ యింద్రియముల ద్వారా పొందనగును.

"భౌతికభూమికలోని శబ్దములే, యుద్వేగమున, స్పందనమున భేదము కలిగిన శబ్దములు మాత్రము పై భూమికలలో నుండునని భ్రమపడకూడదు. మొదటిమూఁడుభూమికల లోను ప్రత్యేకమగు శబ్దముండు నని గ్రహింపవలెను. ఈ శబ్దముల శ్రావ్యత్వస్వరూపము నవి కలుగఁజేయు నానందము వర్ణింప వీలైనవి కావు. ఈ దేవతాసంబంధమగు సంగీతము లేక నాదము మొదటి భూమికకుఁ బ్రత్యేకత నిచ్చును. దీనినే హాఫీజ్ ఘంటానాదమని చెప్పెను."

"పైనచెప్పిన రీతి నేడు భూమికలలోను శబ్దమున్నప్పటి కిని రెండుమూడుభూమికలకుఁ బ్రత్యేకమైన వాసనలు కలవు. ఐదేడుభూమికలను బ్రత్యేకదృష్టి కలదు."

"ఏడవభూమిక యసాధారణమైనది. ఇచ్చట శబ్దము దృష్టివాసన కేవల భగవదంశప్రధానములైనవి. మిగిలిన భూమికలనుండి వెలువడువానితో సంబంధములేనివి. ఈభూమికలో వినుటకాని, చూచుటకాని, యాఘ్రాణించుటకాని యుండదు. ఒకేమారు త్రీ మూఁడిటి ననుభవించును. అది భగవంతుని చైతన్యముతో నిండియుండును.

4 (55వ పేజీ పంక్తి 19 ద్వితీయభూమిక)

హాఫీజ్ యీ క్రిందిమాటలను చెప్పినప్పుడు రెండవ భూమిక నుద్దేశించెను.

"మద్యగృహమున సర్వమున్ మఱచిరాత్రి
యొడలు తెలియక మత్తెక్కియున్న వేళ
తెలియరానట్టి లోకాల తెన్ను నుండి
యరుగుదెంచిన దేవతయందియిచ్చు
వార్తనొరులకుఁ దెలియంగఁ బలుకఁగలనె ?"

5 (57వ పేజీ పంక్తి 16 మూఁడవభూమిక)

మూఁడవ భూమికను గుఱించి హాఫీజ్ యీ క్రింది మాటలు చెప్పెను.

"గాయకుండీతఁ డాధ్యాత్మగాథ లెల్ల
ప్రేమమయు, దేవదేవుని నామములను
గానమొనరింపఁ బ్రేమికుల్ గాసిచెంది
వినుచునుండిరి మానసవిభ్రమమున"

6 (58వ పేజీ 6వ పంక్తి స్వాధీనములోనున్న వాహన సముచ్చయముల నుపయోగించి)

మూఁడు నాలుగుభూమికల మధ్యనున్న మజిలీ.

మూఁడునాలుగు భూమికల మధ్యప్రయాణము కష్టమైనది, ప్రమాదమైనది. ఏమనఁగా నీ రెంటుభూమికలమధ్యను మన

స్సును సమ్మోహింపఁజేయు స్థితి యున్నది. చాల మంది సాధకులు మూఁడవభూమికనుండి నాలుగవభూమికకు నేసుగాఁ బోవునప్పటికి నొక మా త్రీయాకర్షణీయమగు స్థానముననిలిచెనేని నదిదాటిపోవుట కష్టమగును. అందే చెప్పలేనంతకాలము నిలిచిపోవుట తటస్థించును. అందు దినములు, మాసములు,సంవత్సరములు కూడ నిలిచి పోవచ్చును. ముందునకుఁ బురోగమనము చేయలేఁడు. వెనుకకు మరలలేఁడు. అచ్చట స్థూలచైతన్య ముండదు. సూక్ష్మచైతన్య ముండదు. చైతన్యహీనుఁడని చెప్పుటకు వీలులేదు. ఎందుచేతననఁగా నాహ్లాదకరస్థితియనుభవమును బొందుచున్నాఁడు. ఈ స్మృతివల్లనే బ్రతికియుండియు మరణబాధను పొందును.

ఇట్టి యాకర్షణీయమగు స్థితిలోఁ దగుల్కొనినవాని శారీరకస్థితి యిట్లే యయోమయముగా నుండును. ఒకి యాసనములోఁ గూర్చున్నవాఁ డట్లే మాసములు నేండ్లు స్థిరముగా గూర్చుండును. నిల్చుండినప్పు డా యానందమయ స్థితిని దగుల్కొనిన యెడల నా యవస్థ యంతమగు వరకు నిలచియుండును. నిర్జీవప్రతిమవలె కనఁబడినప్పటికిని మామూలు లోకములోని మానవునికంటె నెక్కువ జీవస్పృహ కలిగియుండును,

పిరాన్ కల్యార్ కు చెందిన శ్రీ ఆలీఅహమ్మద్ సబీర్ (యీాయనతరువాతసద్గురువు) ఒక చెట్టు దగ్గర యేండ్లతరఁబడి యెట్లు నిలచినదియు సూఫీ ప్రపంచమునకుఁ దెలియును. ఈ సమయములో నాయన యా బహుసమ్మోహితమైన స్థితిలో

నిమగ్నుఁడై యుండెను. ఆయన నొక సద్గురువు ఆస్థితినుండి తప్పించెను. ఎందునను పొందని యీ యాధ్యాత్మికదుస్థితి నుండి పైనచెప్పిన స్థితిలోనున్న సాధకు నొక గురువు సాహాయ్యము రక్షింపఁగలదు. అట్లు కానిచో మరణము తథ్యము. సద్గురు వా సాధకుని వెనుకకు మూఁడవ భూమికలోనికిఁ దీసికొని వచ్చును. కాదేని ముందునకుఁ దోసికొనిపోవును.

హాఫీజు యీ పైన తెలుపఁబడిన స్థితిలో నున్న సాధకుని గురించి యిట్లు చెప్పెను.

"అచ్చెరువు విభ్రమంబు మోహమును గొల్పు
మాపరవశతను మనోలయంబెసంగు".

మూఁడవ భూమికలోనుండి నాల్గవభూమికలోఁ బ్రవేశించు మార్గములో నీ ప్రమాదస్థితి రావచ్చునని శ్రీమెహార్ బాబాగారు తెలుపుచున్నారు. ఈ మార్గములో నితరభాగములలోఁ గూడ నిట్టి సమ్మోహనస్థితులు కలవు. కాని వాని యన్నిటిలోను ముఖ్యమైనది యీమూఁడు నాలుగుభూమికల మధ్యమున నున్నది. ఇది దృఢముగా నుండవచ్చును లేక బలహీనమైనదిగా నుండవచ్చును. ఆ తరుణములో నేదైన సంచలనము కలిగించు సంఘట్టనము జరిగెనేని యీ సమ్మోహనస్థితి (హైరట్) దుర్బలముగా నుండును. మూఁడు నాలుగు భూమికలమధ్యమున సాధకుఁ డీ సమ్మోహనస్థితి (బలమైనదికావచ్చు బలహీనమైనదికావచ్చు) యొక్క యను.

భవమును పొందెనేని పై భూమికలలోనికిఁ ద్రోయఁబడుట సంభవించును. అప్పుడు తప్పక యైదారుభూమికల మధ్యము ప్రవేశించును. పూర్వపు సమ్మోహనస్థితియే యిందుగూడ నుండును. కాని యట్లు జరిగిన యుదాహరణములు బహు సకృతు. కల్యార్ కు చెందిన ఆలీఅహమ్మద్ సబీర్, బొంబయికి చెందిన బాబాఅబ్దుర్ రహమాన్ మూఁడునాలుగు భూమికల నుండి బహుతీవ్రమైన సమ్మోహనస్థితిలో నైదాఱు భూమికల లోనికిఁ ద్రోయఁబడిరి.

మొదటివారు గురువుకృపవల్లను, రెండవవారు హఠాత్సంభవము, దైవికము నగు భగవత్కృపావిశేషమున నీస్థితిని పొందఁగలిగిరి.

తీవ్రమగు సమ్మోహనస్థితి కలిగిన సాధకులలో నా మరణాంతముగాని లేక యొక సద్గురుని సంయోగము కలుగు వఱకు కాని యొక నిశ్చలమైన యునికి యేర్పడిపోవును. (శ్రీ మెహర్ బాబాగారితో చాలసంవత్సరములునుండి మస్త్ (భగవంతుని మత్తులోనున్నవాఁడు) 1936 వ సంవత్సరములో రాహురి గ్రామమునుండి యాయన దగ్గఱకుఁ దీసికొనిరాఁబడి నప్పుడు మూఁడునాలుగు భూమికలమధ్యమున సమ్మోహన స్థితిలో నుండెను. కాని యీ సమ్మోహనస్థితి దుర్బలముగా నుండెను. ఒకస్థితిలో నామస్త్ గంటలకొలఁది నిలువకలిగి నప్పటికి నీ స్థితి శాశ్వతముగా నిలుపలేక పోయెడివాఁడు. ఆలీ అహమ్మదుసబీర్ స్థితిమాత్రము దృఢమైనది. సద్గురువువచ్చి యాయన నుద్ధరించు వఱ కాయన యట్లే నిలచియుండెను.

ఇదివఱకు తెలుపఁబడిన సమ్మోహనస్థితి సందర్భశుద్ధి లేని యొక విధమగు మనోవికారములోఁ గలుగు మనస్సబ్బత యని తలంపఁగూడదు. కాని పైకట్లే కనఁబడవచ్చును. రెండింటికిని చాల వ్యత్యాసము కలదు.

7 (66వ పేజీ 1వ పంక్తి ఐదవభూమిక)

(శ్రీ) బాబాగారిట్లు చెప్పుచున్నారు. మనోలోకమున నున్న సాధకుఁడు భారతదేశములో నుండి, అమెరికాదేశమును జూడవలెనని సంకల్పించెనేని ఆ సంకల్పముతోఁబాటు మానసికముగాఁగాని, భౌతికముగాగాని యతఁ డక్కడకుఁ జేరఁగలఁడు. దీనికర్థమేమనఁగా మనస్సు సర్వవ్యాపకము. మనోలోకములోని సాధకుఁడు ప్రయాణముచేయ నవసరములేదు. స్థూలసూక్ష్మాంగముల నుపయోగించు నవసరములేకయే యాతఁడు యాత్రలు చేయవచ్చును. తెలిసికోవలెనను నిచ్ఛ కలిగినంత మాత్రమున స్థూలసూక్ష్మలోకములను, మనోలోకములో నాఱవభూమికవఱకును సమస్తమును దెలిసికోఁగలఁడు. ఇంతకంటె ముఖ్యమైన విషయమేమనఁగాఁ దనకంటెఁ గొంచెము దిగువమెట్లులో నున్నవారిని, సాధారణమానవులను, దనతో సమానమైన మెట్టునకు రా సాయము చేయఁగలఁడు. ఐదవ భూమికలోనున్న సాధకుఁడు దనకుఁ దోఁచినచో జిజ్ఞాసువును చేయిపట్టుకొని యాధ్యాత్మమార్గమున ముందునకు నడిపింపఁగలఁడు. అట్టి సందర్భమున సాయముపొందు జిజ్ఞాసువు మానసిక భూమికలోనున్న గురువు తనలో నిరంతరము వసించునట్లు తెలిసికొనును. (ఈగురువును 'వాలి' అని సూఫీలు

పిలచెదరు.) గురువు తనను నడిపించుచున్న సంగతి స్వానుభవమువల్ల తెలిసికొనును. ఇట్టి యనుభవమును గుఱించి హాఫీజు కవితను వ్రాసెను.

"వాహనము లెక్కి చనుచున్న వారి వెనుక
తప్పటడుగుల కాల్నడన్ దరలుచుంటి;
చేతి నూతగనిచ్చినన్ జిత్తగించి
పరమపథమున నడపుమో పరమపురుష!"

సాధారణముగా మహాపురుషుఁడు, సాధకుని కన్నులలోనికి తీక్ష్ణముగాఁ దనదృష్టిని బఱపి, లోపలి మనోనేత్రమును గప్పిన తెరను భేదించుచున్నాఁడు. ఇట్లు దృష్టివల్ల ప్రసాదింపఁబడు నాధ్యాత్మికశక్తిని 'తవజ్జో' యని సూఫీలు చెప్పుదురు. ఈ శబ్దము సద్గురువులకు వర్తింపదు. వారి విషయమై 'సంకల్పము' అను మాట యుచితముగా నుండును. ఆ భూమికలో నుండు మహాపురుషుల కవసరమైనట్లు సద్గురువులకు భౌతికశరీరములతో సంబంధ మవసరము లేదు.

(శ్రీ) మెహర్ బాబాగారిట్లు తెలుపుచున్నారు. ఐదవ భూమికలో సాధకుఁడు, భగవంతుని సామీప్యమును గోరును. మరియొకప్పుడు లౌకికప్రపంచవ్యవహారములను బరిష్కరించుచుండును. వాస్తవమునకు భగవంతుఁ డైదవభూమికలో నిత్యము సన్నిహితుఁడై యున్నాఁడు. కాని ప్రపంచవ్యవహారములలో మగ్నుఁడైయున్నప్పుడు సాధకుఁడు తన మోక్ష

భగవంతుఁడు నిలచియుండుట వాంఛింపకపోవచ్చును. ఆఱవ భూమికలో భగవంతుఁడును సాధకుఁడు నొకరినొకరు విడువ కుండనుండుటకుఁ బూర్తిగాఁ గోరుచుందురు. ఐదవభూమిక లోని యీ యనుభవమునుగూర్చి హాఫీజు యిట్లు చెప్పు చున్నాఁడు. "ఓ హాఫీజు, నీవు భగవంతుని సాన్నిధ్యము కోరె దవేని, నీవు గైరుహాజరు కాకుము."

8 (71వ పేజీ 2వ పంక్తి యాఱవభూమిక)

ఈభూమికకుఁ జేరిన యాత్రికుఁడు 'పీరు' సత్పురుషుఁడని పిలువఁబడుట కర్హతఁ గలిగియున్నాఁడు. ఇంగ్లీషుభాషలో నీ మాటలకు సరియగు మాట లేదు. సాధువు, యోగి యనునర్థ మిచ్చుపదము ఆంగ్లములో కలదు. కాని యది సరియగు భావమును దెలుపలేదు.

ఆఱవభూమికను గుఱించి హాఫీజ్ యీక్రిందిభావమును దెలుపుచున్నాఁడు.

"ప్రేమస్వరూపుని ముఖము మా హృదయపాత్రము లోఁ బ్రతిబింబించుట చూచినాము. అజ్ఞానుఁడా! దానినుండి మేము గ్రోలు నానందవిశేషము నీకు గ్రాహ్యము కాదు".

9 (72వ పేజీ 18వ పంక్తి భగవంతునికంటె భిన్నుఁడనను)

ఆఱవభూమిక యధ్యాత్మికవిశేషమును గుఱించి శ్రీ మెహెర్ బాబాగా రిట్లు తెలుపుచున్నారు. భగవంతుఁ డొక్కఁడే యున్నవాఁడు. అజ్ఞానమువల్ల నింకేదైన నున్నది అన్నచో (నదిమిథ్య యనుటసత్యము)నది భగవంతుని ఛాయగా

నున్నది. అనఁగా భగవంతుఁడు జ్ఞానాజ్ఞానస్థితుల రెండింటి లోను నున్నాఁడు. ఈ క్రింద తెలుపఁబడిన నాలుగు దృక్కోణములు, భగవంతుని యెదుట ప్రత్యక్షముగానుండియు నింకను ద్వంద్వస్థితిలోనున్న యాఅవభూమికలోనున్న యాత్మల భిన్నములగు నాధ్యాత్మికస్థితు లీ లక్షణములన్నియు నొక్కే మారు అనుభవములోనికి వచ్చుచున్నవి.

(1) హమాఅస్ట్—సమస్తము ఆయనే; ఈ సత్యమును అనుభవించువానికి భగవంతుఁడొక్కఁడే సత్యము.

(2) హమాఅజ్ అస్ట్— సమస్తమాయననుండియే వచ్చినది. ఈ యనుభవమును పొందినవారికి తారతమ్యములు ననేకత్వములు నజ్ఞానజనితమైన మాయలోఁ బుట్టుచున్నవి.

(3) హమా-బఅస్ట్— సమస్తమాయనతో నున్నది. ఈ యనుభవము కలిగిన వారికి భగవంతుఁడు నిర్గుణుఁడును, సగుణుఁడును. జ్ఞానము కలిగినప్పు డాయన గుణము లనంతములు, అజ్ఞానమున్నప్పు డాగుణములు పరిమితములైనవి. శరీరము మనస్సుమాఁడు లోకములు లేనివే. అవి యున్నట్లు తోచెనేని యవి ఛాయామాత్రములే.

(4) హమాదార్ అస్ట్—సమస్తమాయనలో నున్నది. ఇది తెలిసినవారి కజ్ఞానముకూడ వాస్తవమైనది కాదు. ఇది పైకిఁ బ్రస్ఫుటమైనప్పుడు భగవంతుని చైతన్య రహితానంతజ్ఞానమునుండి పైకివచ్చును. అజ్ఞానము నుండి ద్వంద్వముగా బైకివచ్చునదంతయు శాశ్వత ముగా భగవంతునిలోనున్న స్థానమునుండియే వచ్చినది.

10 (73వ పేజీ 5వ పంక్తి సాధ్యమైన పనికాదు.)

ఏడవభూమికలో లీనమగు సందర్భములో లోకముతోను, స్థూలసూక్ష్మమనశ్శరీరములతోను సంబంధము తెగిపోవును. ఈ సంఘట్టనతోఁ బోల్చుటకు వీలైన యంశము మామూలు భౌతికజీవితములో నుండదు. మరణము పైదానితోఁ బోల్చి చూచినయెడల బహుస్వల్పవిషయము. అది త్రాడును త్రెంపి నట్లు తోచును. సాధారణముగా సూక్ష్మశరీరము ప్రాణశక్తి స్థూలశరీరమునుండి పూర్తిగా విడిపోవును. కాని మనస్సు మాత్రము మరణానంతరము ఐదుదినములవరకు భౌతిక శరీర ముతో సంపర్కము కలిగియుండును. పిదప నంతకంటెఁ గొంచెము తక్కువగా మరియొక వారముదినములు సంబంధము కలిగియుండును. ప్రధ్వంసాత్మకమగు వియోగము శరీరమునకు మనస్సునకు గాక సంస్కారనాశాత్మకమగు మనోలయము.

11 (76వ పేజీ 6వ పంక్తి భగవంతుని స్థానము)

[శ్రీ పరీద్ ఉద్దీన్ అట్టార్ వ్రాసిన సూఫీగ్రంథము 'మన్ టిక్ ఉట్ తయార్' అను "పక్షులసమావేశము" చదివినచో నీ భూమికల

20

గుండా జరుగు ప్రయాణమును గురించిన మనోహరమగు వర్ణ
నమును జూడఁగలరు. సంపాదకుఁడు.]

12 (94వ పేజీ 16 పంక్తి జ్ఞానసంపాదనమున)

## వివిధములగు సద్భుతక్రియలు (మహాత్మ్యప్రదర్శనములు)

శ్రీ మెహెర్ బాబాగారు, ఈ క్రిందివారు చూపు మహాత్మ్యప్రదర్శనములలోని వ్యత్యాసములను గూర్చి తెలుపు చున్నారు.

1. అవతారము 2. సద్గురువు 3. పీరు, వాలి (ఆఱు ఐదుభూమికలలోనున్న వారు) 4. తక్కిన క్రిందిభూమికలలో నున్న వారు (1,2,3,4 భూమికలు.)

ఈనాలుగు తరగతుల వారిలోను:—

1. అవతారపురుషుఁడుచూపు ప్రదర్శనము లోకవ్యాప్తమై లోకసహాయార్థమవసరమైనప్పుఁడు జరుగును. సందర్భములనుబట్టి యవతారము 6,5, లేక 4వ భూమికలోనికి వచ్చి యీ యద్భుతక్రియలను జరుపును. ఈ యద్భుతక్రియలు బహుతీవ్రముగా నుండవలెనని యుద్దేశించిన యెడలనాసమయమునకు 4వభూమికలో ప్రవేశించును.

2. సద్గురువుచూపు మహాత్తులు పెద్దయెత్తున నుండును. కాని యవి బ్రహ్మాండమంతయు వ్యాపింపవు. అవతార కార్యములవలెనే యితరులలో నాధ్యాత్మికజ్ఞానము మేల్కొలుపుటకే మహాత్తును ప్రదర్శించెదరు. అవతారమువలెనే సద్గురువు

కూడ నీ పనిని నిర్వహించుటకు, 6, 5, లేక 4వ భూమికలో తాత్కాలికముగాఁ బ్రవేశించును. ఏడవభూమికలోనుండి యిట్టి మహాత్ములు ప్రదర్శింపఁబడవు. దానికిఁ గారణమేమ నఁగా మజూబ్ స్థితిలోనున్న యాత్మకు స్థూలసూక్ష్మమనఃకో శము లుండవు.

(3) పీర్ లేక వాలి చేయు సద్భుతకార్యములు పరిమి తముగానుండును. వారు నేరుగా నే పనులను చేయరు. ఇత రుల యాలోచనలమీాద, భావములమీాద తమ మనః ప్రభావ మును ప్రవేశపెట్టి పనిచేయుదురు. దీనివల్ల ఆధ్యాత్మిక లాభము, ఐశ్వర్యాదిభౌతికలాభముకూడ కలుగును. బలమైన యాధ్యాత్మికశక్తులు కలిగిన నాలుగవ భూమికలోనికి వారు దిగి రారు

(4) 1,2,3 భూమికలలోనున్న సాధకులు తామున్న భూమికనుండియే యీశక్తులను బ్రదర్శింతురు. ఇతరుల మన స్సులలోనుండు విషయములను జెప్పుట, యేమియు లేనిచోట వస్తువులను బుట్టించుట, ఒకపుస్తకములోనివిషయమును చూడ కుండఁగనే చదువుట, రైళ్ల నాపుట, గంటకొలఁది భూమిలో గప్పఁబడియుండుట మున్నగునవి. ఈశక్తులు కేవలము మాయ యని, గారడియని చెప్పుటకు వీలులేదు. సాధకున కాయా భూమికలలో సంక్రమించిన శక్తు లివి. సద్గురువులు నవతార పురుషులును సాధకులనుండి 1,2,3 భూమికలకు సంబంధించిన శక్తులను నాలుగవభూమికాశక్తులనుగూడ లాఁగుకొనఁగలరు.

దిగువభూమికలలోనున్న వారి శక్తులను లాగికొనుట సూఫీలు "సల్బ్ యే విలాయత్" అని చెప్పుదురు.

మహత్తరమైన శక్తులన్నియు నాలుగవభూమికలో కేంద్రీకరింపఁబడి యున్నవి.* వానిని సాధకుఁడు వినియోగించుకొనినయెడల నాశనము తప్పదు. అట్టి మహత్వప్రదర్శనములు లోకమున కపకారము చేయలేవు. ఎందుచేతననఁగా నా పరిత్యాధ్యాత్మికయుగపురుషుఁడు నీమహత్తుల నిష్ఫలములఁ జేయును.

(శ్రీ) మెహర్ బాబాగారింకను చెప్పునదియేమనఁగా సాధకుఁడు మొదటి మూఁడుభూమికల యాధ్యాత్మికశక్తులను విచక్షణలేకుండ వినియోగించినయెడల చాల ప్రమాదము తటస్థించును. కాని నాల్గవభూమికలోని శక్తులను దుర్వినియోగముచేసినవాఁ డధఃపతనము చెంది చివరకు వృక్షగుల్మాద్యావస్థలోనికిఁ దిగిపోవును.

కబీరు యీప్రమాదములనుగురించి యిట్లు చెప్పెను.

"సాహెబ్ కాఘర్ దూర్ హై జైసిలంబీఖజూర్
చాఢేసోచక్కేప్రేమ్ రస్ గిర్ సోచక్నా చోర్"

ఖర్జూరపుచెట్టువలె భగవంతుని నివాసము ఎత్తున నున్నది. ఆయెత్తును జేరితివా ప్రేమామృతమును గ్రోలఁగలవు. అక్కడనుండి పతనముజెందితివా నీ నడుము విరిగిపోవును.

---

* నాలుగవభూమికలో నున్న వానిని మహాయోగియని పిలుతురు.

## స్మృతి-విస్మృతుల జరుగు మహాత్మ్యలు

అవతారపురుషులు సద్గురువులుచేయు మహాత్మ్యలకు వెనుక నొక పవిత్రోద్దేశముండును. అవి ప్రయత్నపూర్వకము కావచ్చును; అప్రయత్నముగా కావచ్చును. ప్రయత్నపూర్వకముగా జరుగు మహాత్మ్యలు యవతారము లేక సద్గురువు యొక్క బలమగు క్రియాశక్తి సంకల్పమునకుండును. అప్రయత్నమైన మహాత్మ్యలు జరుగునప్పుడా మహాత్మ్యల సంకల్పము లేకయే వారి నావరించియుండు గొప్పశక్తులవలన జరుగుచుండును. తనలోనుండి బయలుదేరినప్పటికి నీమహాత్మ్యలగురించి యామహాత్మ్యలకు స్పృహ యుండదు. ప్రయత్నపూర్వకమైనవి, యప్రయత్నపూర్వకమైనవి యను రెండురకముల మహాత్మ్యలుకూడ లోకాధ్యాత్మిక కళ్యాణముకొఱకు బ్రయోగింపబడుచుండును.

## అవతారపురుషులు సద్గురువు లీ మహాత్మ్యల ప్రదర్శనము లెందులకు చేసెదరు ?

లోకకార్యములలో నిమగ్నులైనవా రాధ్యాత్మికముగా నుందులై యుందురు. అట్టి జడత్వమునుండి వారిని మేల్కొల్పుట కప్పుడప్పుడిట్టి మహాత్మ్యల ప్రదర్శనము లవసరము. ఈ క్రింది యుపమానమువల్ల విషయము తెలియఁగలదు.

ఒకపిల్లవాఁ డొక పిచ్చుకను తనచేతితోఁ బట్టుకొని సరిగా పట్టుకోలేక దానిని నలిపి చంపెడి స్థితిలోనున్నాఁ డను కొందము. ఆ పిట్టను రక్షింపవలెనన్న నా బాలునిచేతినుండి

పిచ్చుకను బలాత్కారముగా లాగుకొన ప్రయత్నించుట ప్రయోజనకారి కాదు. ఈ ప్రయత్నములో నా పిల్లవాఁడా పిచ్చుకను మరింతగట్టిగా పట్టుకొన్నచో నది వానిచేతిలోఁ జని పోవచ్చును. వానికొక రూపాయి చూపినచో పిచ్చుకను వదలి వానిదృష్టి రూపాయిపైకి మరలును. సద్గురువులుచూపు మహాత్ములుకూడ నిశ్శ్రేయుపకరించును. ఆధ్యాత్మికవిషయముల యజ్ఞానమువల్ల తమకు నితరులకును గల్గు హానినుండి రక్షించుటకీమహాత్ములు చూపఁబడుచున్నవి.

తక్కువమెట్టులోనున్న యోగి తన శక్తిని ప్రదర్శించి చూచువారిని సమ్మోహితులను చేయుటకు యత్నించును. అట్టియోగికి వారు లొంగిపోయినచో వారు కొంతకాలమునకు తమకు జరిగిన మోసమును గుఱించి తెలిసికోఁ గలుగుదురు. అవతారపురుషులు, సద్గురువులు అట్లుగాక లోకమాయలోఁ దగుల్కొనియున్న వారి సంతకంటె నాకర్షణీయమైనవస్తువును చూపి దానిద్వారా ఆత్మదర్శనమునిచ్చు నాధ్యాత్మికమార్గములలోనికి మరలింపఁ గలుగుచున్నారు.

దృష్టిదోషముగల వ్యక్తికి ప్రపంచమంతయు నీలముగాఁ గనఁబడును. అతనికన్నుల నీలపుటద్దములు పెట్టుకొన్నట్లు తోఁచి సర్వము నీలపురంగుగాఁ గనఁబడును. ఆధ్యాత్మిక భాషలో చెప్పినచో లోకమునకు రంగులేదు. యోగి తన మహిమలను బ్రదర్శించినపు డామనుష్యుని నీలపుదృష్టినిమార్చి యాతని కన్నులకెఱ్ఱనివో,పచ్చనివో యద్దముల నమర్చి యంతయు నెఱ్ఱగానో, యాకుపచ్చగానో కనఁబడునట్లు చేయును.

ఇదివర కొకేరంగుచూచుట కలవాటుపడినవారికి, యోగి యేదో మహాఘనకార్యముచేసినట్లు తోచును. సద్గురు వీ రంగు లన్నియు వాస్తవమైనవి కావని తెలిసినవాఁడగుటచే నీ రంగు లను మార్చుటకై తనకాలమును వ్యర్థముచేయఁడు. అనఁగా నీ లోకమునకు రంగనునది లేదను నంశము మనకు త్వరలో తెలియఁజెప్పుచున్నాఁడు. మహత్తులఁబ్రకటించు తక్కువమెట్టు నందలి వారొక మాయకు బదులు వేరొకమాయను చూపు చున్నారు. సద్గురు వీ మాయ యను తెఱను శాశ్వతముగా చించివైచి, సృష్టియంతయు నూహాజనితమని భగవంతుఁ డొక్కఁడే సత్యమని తెలుపును. సద్గురువుచూపు త్రోవ కష్ట ముతోఁగూడినది; క్రమముగా సాగవలసినది. యోగులు చూపునది డాంబికపరిదర్శనముతోఁ గూడి తప్పుత్రోవలోనికి లాగును. అందుచేతనే సద్గురువులు తమ జీవితకాలములో గుర్తింపఁబడలేకున్నారు.

## మహత్తులను జూపు శక్తికధికారి యెవరు?

మహత్త్వప్రకటనమున సద్గురుశక్తులును నాలుగవ భూమికలోనున్న యోగిశక్తులు నొకే మాదిరిగా పైకిఁగనఁ బడును. ఒకప్రధానమైన భేదముకలదు. సద్గురువుశక్తు లాయ నవే; ఎందుకనఁగా ఆయన శక్తిస్వరూపుఁడు. ఆయన సంకల్పిం చినమాత్రమున నది జరిగితీరును: 'అగుగాక యనినంతనే యది జరుగును' అనుమాట సూఫీలు చెప్పినట్లు భగవత్ స్వరూప శక్తియే.

యోగులశక్తులట్లుకాదు. అవి వారి స్వంతము కాదు. ఈ మహత్తులను చూపుటకు వారు పైనుండి శక్తినిపొందవలసి యున్నారు. సద్గురువులనుండి నిరంతరము పైకి ధారావాహిని గాఁ బ్రవహించు శక్తుల నీయోగులు గ్రహించి యీమహత్తు లను చూపుచున్నారు. సూఫీవిశ్వాసముప్రకారము 'వాలీ'లు మహమ్మద్ ప్రవక్తయొక్క సాక్షులు. వారు చేయు మహ త్తులనన్నింటిని నరఁటిపండునుండి ద్రవించు మధురబిందువులవలె మహమ్మదునుండి పొందుచున్నారు. ఈ విశ్వాస మొక్క మహమ్మదుకే వర్తించునట్లున్నది. కాని యాదినుండియు నొకే యవతారమున్నదనియు భిన్న భిన్న దేశములలో వేరు వేరు పేర్లతో నాయన కనఁబడుచున్నాఁడన్న నమ్మకము సర్వత్రవ్యాపించి యున్నది.

ఈవిషయమై విపులీకరించుచు శ్రీ మెహర్ బాబాగా రిట్లు తెలిపిరి. బ్రహ్మీభూతస్థితిలో మహత్తులుండవు. తురీ యావస్థలో జీవన్ముక్తునకు నియమితమైన పనిలేదు. మహ త్తులను జూపఁడు. కాని యాయనకుఁదెలియకయే జీవన్ము క్తునిద్వారా కొన్ని మహత్తులు జరుగుట కవకాశము కలదు. దిగువభూమికలోనున్న సాధకు లాయనశక్తులను గ్రహించి యామహత్తులను ప్రదర్శించెదరు. కాని జీవన్ముక్తునిశక్తులు దానివల్ల క్షీణింపవు.

### అవతార పురుష సద్గురువుల మహత్తులు

భగవంతుఁడు నరజన్మము నెత్తినప్పుడాయన యవతా రము లేక రక్షకుఁడు అగును. మానవుఁడు భగవంతుఁడై

నప్పుడు బ్రహ్మీభూతస్థితిని పొందును. మానవలోకమున కా యన నిర్వర్తింపవలసిన ధర్మము లున్నప్పుడు రెండు మూడు దివ్యయాత్రలను చేసి సద్గురుస్థితిలోనికి వచ్చును. పక్షకుం డును సద్గురువు నాధ్యాత్మికముగా పరిపూర్ణతం గలవారు. వా రిద్దరు భగవంతునిలో నైక్యము పొందినారుగనుక మరల వా రిద్దరిలో నవతారము నిర్వహింపవలసిన ధర్మము ప్రత్యేక మైనది. ఇందులో వీరిద్దరికి భగవంతుని సామీప్యములో కొద్ది తారతమ్యము కలదు. అవతారమున కప్రయత్నమైన సన్నిహితత్వము కలదు. సద్గురువునకు ప్రయత్నపూర్వకమైన సామీప్యము కలదు.

అవతారము మహత్తులను జూపినప్పుడు భగవంతుడు కర్త; మానవుడు నిమిత్తమైన పనిముట్టు. సద్గురువులో నిది భిన్నముగానుండును. మానవుడు కర్త. భగవంతుడు పనిము ట్టుగా నుండును. మహమ్మద్ ప్రవక్త బదర్ యుద్ధములో శత్రు ముఖముపై గుప్పెడు మట్టిని పోసి వారిని పరాజితులనుగాం జేసిన సంగతి యవతారపురుషుడు చూపిన మహత్తున కుదాహార ణము. మహమ్మదు మానవమాత్రుడుగా కనంబడినప్పటికిని భగవంతుడే మహమ్మద్ రూపములో మట్టిని గొట్టెను. మహ మ్మదు మనుష్యాంశములో శత్రువుల నోడించెను. ఇదే యప్రయత్నమైన భగవంతుని సన్నిహితత్వమువలన కలిగిన మహత్తు.

సద్గురువులు చేయు మహత్తులు బుద్ధిపూర్వకముగా నుండును. అనంగా మృతుడైన వానిని బ్రతికించుట యొక

మంచి యుదాహరణము. "షామ్స్-ఎ-తబ్రీజ్" ఉదాహరణ మిం దుల్లేఖింపఁబడినది. షామ్స్ 'భగవంతుని పేరుమీఁద కోరుచున్నాను లెమ్ము' అనియడిగినప్పుడు మృతుఁడైన రాజకుమారుఁడు లేవలేదు. 'నాపేరుమీఁద నడుగుచున్నాను లెమ్ము'అని అడిగినప్పుడు రాజకుమారుఁడు సజీవుఁ డయ్యెను. అనఁగా నిచ్చట మనుష్యుఁడు కర్తగాను భగవంతుఁడుపకరణముగానుండెను. పశ్చిమదేశములకు బ్రిద్దేశముల కీ మహాత్ముల యందుఁగల దృక్పథములలోని తారతమ్యములను గమనింతము. సద్గురువులతో నాధ్యాత్మికోన్నతినొందిన వ్యక్తులతోఁ జిరకాలపరిచయముకల ప్రిద్దేశము లనంతుఁడగు భగవంతుని నర్థము చేసికొనుట పరిమితమగు మనస్సునకు సాధ్యము కాదని గ్రహించెను. ఆధ్యాత్మికసంబంధమైన సమస్యలను బరిష్కరించుటలో మానవుని పరిమితమగు బుద్ధికుశలత కొంతదూరము వఱకు మాత్రమే యుపయోగపడునని ప్రిద్దేశములకుఁ దెలియును. వేదాంతి డాక్టర్ ఇక్బల్ యిట్లు రచించెను.

"బుద్ధి లేక తెలివితేటలు (భగవంతుని) ద్వారము నుండి దూరముగా లేకపోయి నప్పటికిని, భగవంతుని విభూతుల, శక్తి ననుభవించు యోగము లేకయున్నది."

మానవాతీతమైన విషయములను దెలసికొనలేక బుద్ధి తన ప్రయత్నమునుండి విరమించినచోట,' ప్రేమ తన పనిని బ్రారంభించును. పశ్చిమదేశములు బుద్ధికి హేతువాదమునకుఁ బ్రాధాన్యమిచ్చెను. తనహేతువున కందని దానిని దిరస్కరించును లేదా హేళనముచేయును. పాశ్చాత్యదేశము లీ

దృక్కోణమునుండి చూచుటచే నమెరికాదేశములో (mystic) 'ఆధ్యాత్మికపిపాసి' అను మాటకు పూర్తియగు నర్థము ప్రాప్తించినది. మధ్యయుగములనాఁటి యూరప్ దేశములలోని మతసంబంధమైన సన్నివేశమునకు బదులుగా శాస్త్రవిజ్ఞానములు బలుపు దేరినవి.

విజ్ఞానశాస్త్రసూత్రములు కొంతవఱకు కనిశ్చితములై యున్నవి. శాస్త్రములందు శ్రద్ధకల శాస్త్రవేత్త విషయము యొక్క నిజస్థితి గ్రహించుటకు యత్నించును. విజ్ఞానశాస్త్రము బహుముఖములఁ బురోగమించినప్పటికిని, స్థూలపదార్థసత్యము నుండి యింకను దూరముగానేయున్నది. ఆధ్యాత్మికవిషయముల నుండి యింక నెక్కువ దూరములో నున్నది యనియు, హృదయమునకు బుద్ధికిని సమన్వయము కుదురవలసియున్నదనియు శ్రీ మెహర్ బాబాగారు దెలుపుచున్నారు.

ప్రజాసామాన్యములో మహాత్ములుగా 'చలామణి' యగు కొందఱి యోగులప్రదర్శనములు భౌతికసంబంధములగు చర్యలగుటచే వైద్యశాస్త్రము వానికి సహేతుకమగు నర్థము చెప్ప వచ్చును. సద్గురువులు చూపు మహాత్కార్యములు విజ్ఞానశాస్త్రరీతిని విశదపఱచుటకు వీలైనవి కావు. అవతారపురుషులు సద్గురువులు మహాత్ములు చూపెడి యీ మహత్తులను గుఱించి యా యా ప్రజల మతగ్రంథములలోఁ బురాణములలోను దెలుపఁబడియున్నది. నిరంతరము కార్యాన్వితమైయుండెడి యా యాధ్యాత్మికాధికారబృంద మనుక్షణ మీ మహాకార్యముల సంఖ్యను బెంచుచునేయున్నది. వాస్తవములగు విషయ

ములను గమనింతము:— క్రైస్తు తదితరసద్గురువులు, మృతులైన వారికిఁ బ్రాణమిచ్చిరి. రోగుల నారోగ్యవంతులుగాఁ జేసిరి. ప్రత్యక్షముగాఁ దమ కన్నులయెదుట చూచినప్పటికి నది మాయకాదు మహత్తేయని గుర్తించినప్పటికిని దీనికి సహేతుకమైన యర్థమును జెప్పుటకష్టము. హేతుపూర్వకమగు బుద్ధి కందని విషయ మది. జీవితమెంత మర్మమైనదో యిదికూడ నంతే.

దీనికి కారణము లేకపోలేదు. ఈ సద్గురువు లెట్లు వర్తింతురో దాని రహస్యము లోకమునకు సామాన్యముగాఁ దెలియదు. వీని రహస్యములు సద్గురువులతో సన్నిహిత సాహచర్యము కలిగి, వారి యనుగ్రహమును పొందినవారి హృదయములలో నీ సత్యములు దాఁగియున్నవి. ఒక సద్గురునిలో నణఁగియున్న విషయము లాయన పెదవులనుండి బిందురూపములోనైనను బైకివచ్చినచో భూమ్యాకాశములు భయముతో దద్దరిల్లును.

ప్రజాసామాన్యమున నీమహాత్ములయం దొక విధమైన మోహ మున్నప్పటికి నాధ్యాత్మికగురువులయందొక విధమగు నాకర్షణమున్నప్పటికినిఁ బశ్చిమదేశములలోవలెనే యీప్రాగ్దేశములలోఁగూడ నొక సందేహదృష్టి వానియందుఁ గలదు. చిరకాలానుభవము కారణముగా ప్రాగ్దేశములలో నీయాధ్యాత్మికరాజవర్గమును విశ్వాసముతోఁ నంగీకరింపకపోయినను, తిరస్కరించుటయనునది లేదు. చిరకాలమునాటి సూఫీలలో నొకరిట్లు ప్రకటించుచున్నారు. "భగవంతునిచేరు మజిలీల

యనేకమున మహాత్ములనునవొక మజిలీ". యుగమునకు సంబంధించిన యవతారము శ్రీమెహర్ బాబా సద్గురువు చేయఁగలిగిన మహత్తు సాధారణమానవునొకని దనవలెనే పూర్ణునిగాఁ జేయుటయని తెలుపుచున్నారు.

13 (95వ పేజీ 18వ పంక్తి ధ్యానము చేయునపుడు)

## ధ్యానము

"ఆరంభదశలోని సాధకులకు భగవంతుని సృష్టినిగురించిన విషయపరిశీలనపై నిర్ణయింపఁబడిన విధానము" శ్రీమెహర్ బాబాగారివలన.

ధ్యానమనఁగా నొక భావముపైనగాని వస్తువుపైనగాని మనస్సును బలవంతముగా(యంత్రమువలె) ప్రవేశపెట్టుటయను తప్పుడభిప్రాయము సాధారణముగాఁ గలదు. ఒక ప్రత్యేక మార్గములో మనస్సును బలవంతముగా నిలుపుటకుఁ జేయు యత్నమున గొందరు కష్టపడుదురు. అట్లుగాక యొకవస్తువుపై దీర్ఘముగా మనస్సు నణఁచియుంచుటకుఁగూడ నిట్లే కష్టపడుదురు. ఈపద్ధతిని మనస్సు నొక యంత్రముమాదిరి చేయవలెననెడి సాధనలో శ్రమయున్నది. చివరకు జయము పొందలేరు.

మనస్సే సూత్రములతో సృష్టిలోనిర్మింపఁబడినదో వానిపై నాధారపడి ధ్యానములోమనస్సును స్వాధీనములోనుంచికొని నడపవలెనన్న ప్రథమసూత్రమును సాధకుఁడు జ్ఞాపకముంచుకోవలెను. కేవలము సంకల్పబలముచే సాధించుటకుయత్నము చేయఁగూడదు.

కొందరు సిద్ధాంతప్రకారము ధ్యానముచేయనివారైనప్పటికి నేవిషయమును గురించిగాని, క్రియాత్మకమగు సమస్యను గుఱించిగాని కట్టుదిట్టమైన, నిర్దుష్టమైన యాలోచనల చేయఁగలశక్తి కలిగియుందురు. అనవసరమగు విషయములతోఁ బ్రసక్తి లేకుండ నే సమస్యను గురించియైన దీవ్రముగా చింతనముచేయఁగలశక్తియే ధ్యానమునందుగూడ గావలసియుండును. ఈవిధమైన మనోయత్నమువల్ల ధ్యానము సులభమగుటకుఁగారణమేమనఁగా మనస్సున కభిమానముకలిగిన విషయమై చింతించుట. దీనివలన నా విషయరహస్యము క్రమముగా విశదమగుచుండును. మామూలుగా మనశ్చింతనము ముఖ్యమగు నాధ్యాత్మికవిషయముపై జరుపకపోవుటవల్ల నభాసగుచున్నది. ధ్యానమునకు వలసినవిషయమునుఁ బరిశీలించి యేర్చి గ్రహింపవలెను. అది యాధ్యాత్మికముగా దగినంత ముఖ్యమైనదిగా నుండవలెను. దైవసంబంధమైన ధర్మముల సత్యములను గురించిన విచారణమున మనస్సును బ్రవేశపెట్టుటయేగాక వాని యంతరార్థమును గ్రహింపనేర్చుకొనినచో ధ్యానము జయప్రదమగును. విచక్షణతకలిగినధ్యానము మనస్సును నైసర్గికమార్గములో నడపును. దీనివల్లఁ గేవలము బలవంతముగా మనస్సు నదిమి విసుగును గలిగించెడి యొకే నిదానమగు మార్గమున నడపనవసరములేదు. దీనివల్ల ధ్యానమప్రియత్నముగ, నుత్తేజకరముగ నుండుటయేగాక సులభసాధ్యమై జయప్రదమగును. (జ్ఞాత్వాకుర్వీత)

బుద్ధియుతమైన జ్ఞాన మనఁగా నొకవిషయమై కూలంకషముగా నాలోచనముచేయుటకాన యుచితమైన విషయమును

దీసికొని సంక్షిప్తమును స్వచ్ఛమునగు విమర్శనముచేయుటవల్ల ధ్యానము బాగాసాగును. అట్టికార్యమునకు భగవంతుని సృష్టిపరిశీలనముకంటె మంచివిషయము లభ్యముకాదు. దానినే చిత్రములద్వారా నీక్రింద వివరింపఁబడినది.

శ్రీ మెహర్ బాబాగారు నిర్వచించిన ధ్యానపద్ధతి మూఁడంతరములు కలది.

(1) మొదటిమెట్టులో, సాధకుఁడు చిత్రముల సాహాయ్యముతో భగవంతుని సృష్టిని గూర్చి పూర్తిగాఁ జదివి యవగాహనచేసికొని, దానిని గుఱించి తీవ్రమగు నాలోచనము చేయవలెను.

(2) రెండవయంతరములో నీ విషయమంతయు సాధకునికి మనోగతమై తలఁచినంతనే జ్ఞాపకమునకు వచ్చునట్లు క్షుణ్ణముగా వచ్చినతరువాత నింకపైనఁ జదువుట యనవసరము. అవసరమని తోఁచినప్పుడు చిత్రములసాహాయ్యమున నీ విషయము నంతను మనస్సులోనే పరిశీలించుచుండవలెను.

(3) రెండవయంతరమునుండి స్వాభావికముగా సాధకుఁడు మూఁడవయంతరములోఁ బ్రవేశించును. అప్పుడు తనకుఁ దెలిసిన యంశములనుగాని భావములనుగాని క్రమానుగతముగాఁ దనమనస్సునఁ జింతనము చేయవలసిన యవసరము లేదు. ఈ విషయమైన మనన మంతమునకు వచ్చును. ధ్యానములో నీ యవస్థచేరునప్పటికి భావపరంపరలనుండి మనస్సధిగమించును. కాని యీ పైనుదహరింపఁబడిన విషయమంతయు పరమసత్యముయొక్క భావనగా నప్రయత్నమై

హేత్వతీతమైన జ్ఞానముగా సాధకునికి లభ్యమగును.("ప్రమాణ ప్రమేయసంశయ ప్రయోజనదృష్టాంతసిద్ధాంతావయవ తర్క నిర్ణయ వాదజల్పవితండ హేత్వా భాసచ్ఛలజాతినిగ్రహస్థానానాం తత్త్వజ్ఞానాన్నిశ్రేయసాధిగమః" అనిన్యాయదర్శనము, "ధర్మవిశేషప్రసూతాద్ద్రవ్యగుణకర్మసామాన్యవిశేష సమవాయానాంపదార్థానాంసాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిశ్రేయసమ్" అని వైశేషికదర్శనము చెప్పుచున్నవి.)

14 (చిత్రముల పీఠిక)

## భగవంతుని సృష్టివస్తువు.

శ్రీమెహర్ బాబాగారివల్ల పరిణామము పునర్జన్మము, ఆత్మసాక్షాత్కారమార్గము.

పరిణామమార్గము, జన్మపరంపర సాక్షాత్కారముల ద్వారా ఆత్మ* పరిపూర్ణతను పొందును. పూర్ణచైతన్యమును పొందుటకుఁ బరిణామమార్గములో సంస్కారముల నెక్కువగాఁ బొందుచుఁ జీవులకు మానవరూపములో పూర్ణచైతన్యము నన్ని స్థూలసంస్కారములను పొందును. జన్మపరంపరానుభవములో నీ యాత్మచైతన్యమును నిలబెట్టుకొని వివిధములగు సంస్కారములను దనలోనే పొందుచుండును. సాక్షాత్కారము పొందుమార్గములోఁ జైతన్యముమాత్రమింకను నిలబడి సంస్కారములుమాత్రము క్రమముగా క్షీణించుచుండును. తుదకు సంస్కారములు పోయి చైతన్యముమాత్రము

---

* 6, చిత్రము చూడనగును. 'ఏ' ఆత్మ 'జడ్' గా మారును.

మిగులును. ఈ పద్ధతిలో స్థూలదశనుండి సంస్కారములు సూక్ష్మదశలోనికి మారి తరువాత మనోదశలోనికిఁ బోయి తుద కంతరించిపోవును.

మానవరూపము ధరించువఱకు సంస్కారములు క్రమముగా వృద్ధియగుచుండును. మానవరూపములో జన్మములు మారినప్పుడుకూడ నీసంస్కారముల ప్రభావమట్లే యుండును. కాని యాత్మసాక్షాత్కారము పొందుటకుఁ జేయుయత్నముస నీ సంస్కారములు బలహీనమగుట ప్రారంభమగును. తుదకవి రాలిపోవును.

భగవంతుఁడు పరమాత్మ యొక్కఁడే, సత్యము లేక యథార్థము. భగవంతుఁడుతప్ప యేదియు లేదు. ఈ యాత్మలన్నియు పరమాత్మలోనుండి దానితో నేకమైయున్నవి. పరిణామపునర్జన్మ సాక్షాత్కారము లన్నియు నాత్మకుఁ దన్ను తాను తెలిసికొనుట కవసరములు. సంస్కారము లొకప్రక్క బంధనములు కల్పించుచున్నను చైతన్యము వృద్ధియగుట కవి సహాయముగా నున్నవి. కాని క్రమముగా నీ సంస్కారములు బలహీనములై నశించుచున్నవి. ఇట్లయ్యు వృద్ధిపొందిన చైతన్యమట్లే నిలచియుండును.

సంస్కారములు వృద్ధియగుచున్నకొలఁది నాత్మ క్రింది మెట్టునుండి యేడంతరములను దాటును. సంస్కారములు క్షీణించుటకు వలసినమార్గములో నాత్మ యేడంతరములు ఊర్ధ్వగతిని పోవును. ఈ యధోమార్గము ఊర్ధ్వమార్గము రెండును మాయతోఁగూడినవి. ఆత్మ సర్వవ్యాపకము

అవిభాజ్యముగా ననంతమైనది. అది చలనము లేనిది. ఆరోహణావరోహణములు లేనిది.

అన్ని జాతులందలి, మతములందలి, స్త్రీ పురుషుల యాత్మ లొక్కటే. మంచి చెడ్డ, మిత్రిత్వము, శత్రుత్వము, యుద్ధము, శాంతము అనునవియన్నియు స్వకపోల కల్పితములు, మాయావృతములు. ఈ యనుభవములన్నియు శరీరమువల్లను మనస్సువల్లను గలుగుచున్నవి. వానికి నిజమైనస్థితి లేదు. అవి శూన్యములు.

రూపములు ద్వంద్వములుగల లోకము సృష్టిలోనికి రాకపూర్వ మనంతమగు శక్తిజ్ఞానానందమయసముద్రముతోఁ బోల్పదగు భగవంతుఁడుతప్ప వేరెవరును లేరు. కాని యీ మహాసముద్రమునకు స్వీయస్మృతి లేదు. నిశ్చలము, ప్రశాంతమునై స్వీయశక్తిజ్ఞానానందములయు, సముద్రతయు, స్మృతి లేని సముద్రముస్థితి నూహించుకొనుము. సముద్రములోనున్న కోట్లకొలఁదిబిందువులకు స్మృతి లేదు. తాము సముద్రములో నున్నట్లుకాని సముద్రములో నొకభాగమనికాని వానికి స్మృతి లేదు. అస్తిత్వసనాతనస్థితి యిట్లుండును.

తన్ను తాను తెలిసికోవలెననెడి ప్రేరణ మీ యస్తిత్వమునకుఁ గదలిక పుట్టించుచున్నది. ఈప్రేరణము సముద్రములో నిమిడియున్నది. అది పరిస్ఫుటమైనప్పుడే నీటిబిందువులకు వ్యక్తిత్వము కలుగఁజేయుచున్నది. ఈ ప్రేరణము కదలిక లేని ప్రశాంతమైన నీటిలోఁ గదలిక పుట్టించును. దీనివలన నీ నీటిబిందువులచుట్టును బుడగలు కట్టును. ఈబుడగలు బిందు

వులకు వ్యక్తిత్వము నిచ్చును. అవిభక్తమగు మహాసముద్రము నీబుడగలు విడదీయలేవు; బిందువును సముద్రమునుండివిడ దీయలేవు. ఈబిందువులు తాము వేరనిభావముకలిగెడి పరి మితమగు వ్యక్తిత్వము నిచ్చును.

ఈబిందువొకదాని వివిధావస్థలలోని మార్పును గమ నింతము. నీటిబుడగ బయలుదేఱుటతోడనే బిందురూప మగు నాత్మకు చైతన్యహీనతపోయి వ్యక్తిత్వముకలుగును. దీనివల్ల ప్రత్యేకతతోడి చైతన్యలేశము కలుగును. ఈ చైత న్యము సముద్రసంబంధికాదు. బిందువు ఆత్మసంబంధియు కాదు. కాని యది నీటిబుడగయను రూపసంబంధి. ఆబుడ గకు స్వతస్సిద్ధమైన యస్తిత్వములేదు. ఈ యసంపూర్ణమైన నీటిబుడగ యీ స్థితిలో నొక జాతిరూపములోనికి మార వచ్చును. ఈజాతిరూపము కొంతకాలమున కింకొకరూప ముదాల్చవచ్చును. ఒక నీటిబుడగ బద్దలైనప్పుడు రెండు విషయములు జరుగును. ఒకటి చైతన్యాభివృద్ధి కలుగును. రెండు పూర్వరూపములలో సంక్రమించిన సంస్కారములు మఱింత బలపడును. బిందువు నాత్మచైతన్యము కొంచెము వృద్ధియైనది. ఈబిందువు తనకుఁ గ్రొత్తగాకలిగిన బుద్బుద చైతన్యమును గలిగియున్నది. కాని తన బిందుతాచైతన్యమును గాని సముద్రతాచైతన్యమునుగాని యెఱుఁగదు. ఈక్రొత్త బుడగ లోహరూపమును దాల్చుచున్నది. ఈబుడగకూడ కాలక్రమమున బద్దలగును. అప్పుడు తిరిగి వెనువెంటనే యొకేమారు చైతన్యసంస్కారముల వృద్ధి బలపడుటయు జరిగి

యింకొక క్రొత్తబుడగ యుద్భవించును. పరిణామదశయంతయు నిట్లేజరుగుచు జాయి,లోహ,వృక్ష,మత్స్య,పక్షి,పశురూపముల బరిణామమునుబొందుచుండును. ఇట్లు చివరకుచైతన్యము పూర్ణత్వమునుబొంది మానవబుద్బుదము లేకరూపమును బొందును. సంస్కారము లిట్లే వృద్ధియగుచు నాత్మచైతన్యమును బలపఱచుచువచ్చుచుండును. ఈచైతన్యము నీటిబుడగతోఁబోల్పఁబడినరూపమునే యాశ్రయించియుండునుగాని తన నిజస్వరూపమును బొందఁజాలదు. మానవరూపములోనికి వచ్చినతరువాతగూడ నిట్లేయుండును.

మానవరూపమును బొందిన తరువాత రెండవవిధానము ప్రారంభమగును. అది జన్మపరంపర లేక పునర్జన్మలతో సంబంధించినది. ఇప్పటికి సంస్కారవృద్ధి యంతమగును. బిందువుతోఁ బోల్పఁబడిన యాత్మ యొకటితరువాత నొకటిగా ననేక రూపములను బొందుచుండును. ఈ రూపములు 84 లక్షలు. ఈ రూపము లొకప్పుడు పురుషుఁడుగాను, మరి యొకప్పుడు స్త్రీగా నుండును. అవి జాతులు, అందచందములు, వర్ణమతములు, మార్చుకొనుచుండును. ఈ బిందాత్మ మానవజన్మములద్వారా యొకప్పుడు ఫకీరుగాను మరియొకప్పుడు అమీరుగాను ననుభవములను బొందుచు నా యా సంస్కారముల మంచిచెడ్డల ననుసరించి సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఈ జన్మపరంపరలో బిందురూపమగు నాత్మ తన పూర్ణచైతన్యమును నిల్పుకొని ద్వంద్వములు నన్యోన్యవిరుద్ధములు నగు సంస్కారముల యనుభవములను

సాక్షాత్కారమార్గమును జేఱువఱకుఁ బొందుచుండును. ఈ సాక్షాత్కారమార్గములో సంస్కారములు క్షీణించుట ప్రారంభమగును. జన్మపునర్జన్మములలో సంస్కారములు తగ్గుట జరుగును. ఈ క్షీణించుటకును సాక్షాత్కారమార్గములో బలహీనమగుటకును భేదము కలదు. సంస్కారములు వ్యయమగునపుడు క్రొత్త సంస్కారములు బయలుదేరుచున్నవి. ఇవి యాత్మను బంధించును. సంస్కారములు క్షీణింప మొదలిడినప్పుడు క్రొత్తసంస్కారములు సృష్టింపఁబడవు. బిందాత్మ చిక్కుకొనియున్న సంస్కారముల బలమైన పట్టును సడలించుటయే ప్రధానోద్దేశము.

పరిణామపద్ధతిలో మానవరూపమును పొందువఱకును సంస్కారములు వృద్ధియగుచుండును. జన్మపరంపరలలో, పరిమితముచేయు విధమున సంస్కారములు వృద్ధియగుచుండును. మానవరూపము(బుడగ)మారుచున్న కొలఁది నిదివఱకు కలిగిన సంస్కారముల బిగువు 84 లక్షల జన్మముల వలన సడలుచుండును. సాక్షాత్కారపద్ధతిలో సంస్కారములు వెనుకముఖము పట్టుట యప్పుడు ప్రారంభమగును.

ఇప్పుడు సాక్షాత్కారపద్ధతిలో మూఁడవయంతరము ప్రారంభమగును. అవరోహణము ప్రారంభమగును. బిందాత్మసంస్కారములను వదల్చుకొనుచుండును. అప్పుడవి బలహీనము లగుచుండును. వెనువెంటనే బిందాత్మచైతన్యము తనవైపునకే మరలుచుండును. అట్లు బిందాత్మసంస్కారము లన్ని రాలిపోవువఱకును సూక్ష్మ మానసికావరణములను

దాటును. అప్పుడు తానే మహాసముద్రము నని తెలిసి కొనును.

అనంతమగు మహాసముద్రమువంటి 'మహాత్మ'లో నీ వొక బిందువవు లేక యాత్మవు. సాధారణస్థితిలోని యాత్మవు నీవు. నీ చైతన్యముతో రూపము లేక బుద్బుదానుభవమును పొందుచున్నావు. జలబుద్బుదస్థూలభూమికద్వారా మరియొక స్థూలబుద్బుదమగుభూలోకము ననుభవమును పొందుచున్నావు. మహాత్మకంటె భిన్నుఁడవుగాక అవిభాజ్యమై యీమహాత్మ యందే శాశ్వతావాసము నేర్పఱుచుకొన్నవాఁడవు నీ వయ్యె దవు. కాని నీ కా యనుభవము లేదు. మూఁడవ భూమిక లోని వృద్ధిస్థితి వచ్చినప్పుడు, నీ చైతన్యసాహాయ్యముతో, సూక్ష్మ ప్రపంచమును సూక్ష్మబుద్బుదముగఁ జూడఁగలుగు చున్నావు; లేక యట్టి యనుభవమును బొందగలుగుచున్నావు. ఇది నీ సూక్ష్మశరీరము లేక రూపముద్వారా పొందుచున్నావు. నీ చైతన్యము మహాత్మవైపునకు మరల్పఁబడకపోవుటచే నీవు వసించుచున్న 'మహాత్మను' చూచుటకాని, దాని యనుభవ మును బొందుటకాని జరుగదు. నాలుగవభూమికలోనుండి యైదవభూమికలోనికిఁ బురోగమించినప్పుడు నీ చైతన్యసాహా య్యమునఁ బెద్దదగు మనోబుద్బుదముగా దర్శించెదవు. ఈ మనోమయలోకమును మనశ్శరీరముద్వారా చూచుట లేక యనుభవించుట జరుగును. ఇప్పుడుకూడ మహాత్మానుభ వము నీకుఁ గలుగదు. భగవత్ సాక్షాత్కారము పొందిన స్థితిలో నీ చైతన్యసాహాయ్యమున నెడతెగకుండ మహాత్మను

చూచుటయు ననుభవించుటయు, దటస్థించును. అప్పటికీ రూపములన్నియు నీటిబుడగలకంటె వేఱుకావను సంగతి నిశ్చయమగును.

స్థూలరూపముస కయిదుపొరలవెనుక మహాత్మలో నున్న యాత్మబిందువను నేనని యెంచుకొనుము. నీవు (అనఁగా నీయాత్మబిందువు) స్థూలశరీరమువైపునకుఁ జూచుచున్నావు. దానిద్వారా స్థూలప్రపంచమును జూచుచున్నావు. దానిద్వారా రెండవపొరను జూచునప్పుడు మొదటిది కేవలమొక పొరగానే కాన్పించును. ఒకదాని వెనుక నీ పొరలను జూచినయెడల నవి ఛాయామాత్రములగు నాచ్ఛాదనములుగా మాత్రమే కనఁబడును. చివఱకు మహాత్మను దర్శించిఅందులోలీనమై పోయినప్పుడు, నీవు మాత్రమే సత్యము లేక యదార్థపదార్థమనియు, నీవు చూచునది యనుభవించునది, నీ ఛాయతప్ప వేరేమియు కాదని తెలిసికొందువు.

## ఆ ఱేడు చిత్రముల వివరణము

### ఆఱవచిత్రము.

ఆఱవచిత్రములోని యర్ధవలయము మహాత్మనుదెలుపుచున్నది. బ్రహ్మాండములోని సమస్తము నం దిమిడియున్నది. ప్రతిప్రత్యేకాత్మ జీవితప్రధానమగు పరిణామము, పునర్జన్మ, సాక్షాత్కారమార్గము నను మూఁడవస్థలు నిందుఁ జూపఁబడినవి. (8) వ్యక్తిగతాత్మను (జీవాత్మను)చూపును. మానవరూపమును బొందుటకుఁ బూర్వ మీక్రింద తెలుపఁబడిన సస్తా

వస్థలను పొందును. గుల్మ, లోహ, తరు, కీటక, మత్స్య, పక్షి, జంతువుల యొడవయవస్థలో గొత్త రూపమును పొందుటకు ముందు చిత్రములో నొక ముడివంటి తిరుగుడు కనబడును. దాని యర్థము అంతకుముందు సంక్రమించిన సంస్కారముల ఘనీభావమది. వ్యక్తాత్మ (S) కు పైనచుట్టు కొని యెఱ్ఱరంగు గల వలయము, పరిణామమార్గమున సంక్రమించిన సంస్కారములను దెలుపును. దానిచుట్టును (S) చుట్టు కొన్న నీలపు రంగుగల వలయము వెనువెంటనే వృద్ధియగు చున్న చైతన్యమును దెలుపును. (A) స్థితిలోనుండిన యాత్మ (Z) స్థితిలోనికి వచ్చును. అది పరిణామదశ; పునర్జన్మ. ఆత్మ సాక్షాత్కారముపొందినయనంతర మా స్థితిలోనికి వచ్చును. భగవంతుని స్థితికలిగినప్పుడే సంస్కారములనుండి విముక్తి కలుగును.

స్థూలప్రాణమనోలోకములు ప్రత్యేకముగా నొక్కొక్క వలయముగా కుడివైపునఁ జూపఁబడినవి. మానవరూపమునకుఁ బూర్వములగు పరిణామదశలలో స్థూలప్రపంచచైతన్యము పూర్తిగా వృద్ధిపొందకపోవుటచే ఱాతి, లోహ, వృక్ష, కీటక, మత్స్య, పక్షి, జంతుసంబంధమగు నాత్మ లా యా రూపము లతో గీతలవల్ల కలుపఁబడినవి. అవి స్థూలప్రపంచమందలి యొక భాగముతోఁడనే సంబంధము కలిగినట్లు చూపఁబడినవి. మానవరూపమున చైతన్యము పూర్తిగా వృద్ధిపొందుటచే సర్వ తోముఖముగా స్థూలప్రపంచము నర్థముచేసికోఁగలిగినట్లు గీతలద్వారా చూపఁబడినది.

జన్మ పునర్జన్మములనాత్మ పురుష స్త్రీరూపములలో నొకదాని దాల్చవచ్చును. అది ఒక జాతి, మత, కులసంబంధము కలది కావచ్చును. ఆత్మజ్ఞానదృష్ట్యా మానవరూపము దాల్చువరకు జరుగు కార్య మవరోహణము. అది యారోహణమువలెఁగనఁబడును. సాక్షాత్కారమార్గమారోహణము, అది యవరోహణమువలెఁ గనఁబడును. ఈ రెండుమార్గములు రెండు గీతలవలె చిత్రములోఁ జూపఁబడినవి. ఒకగీతవృద్ధియగుచున్న సంస్కారములముళ్ళు (అవరోహణము పొందుచున్నట్లుగా) జాతినుండిస్థూలప్రపంచమువఱకును బోవునట్లుచూపును. రెండవగీత (ఆరోహణముచూపునది) విడిపోవుచున్న లేక క్షీణింపుచున్న సంస్కారముల ముళ్లు. స్థూలప్రపంచమునుండి భగవంతునిస్థితిలోనికి క్రిందికి వచ్చునట్లు చూపును. సంస్కారవృద్ధి పూర్తియైనతరువాత సాధారణపునర్జన్మ ప్రారంభమై యీ సంస్కారములు సడలుట లేక క్షీణించుట ప్రారంభమగునర కదిసాగును.

ఆత్మసాక్షాత్కారమార్గమున మొదటిభూమికనుండి మూఁడవభూమికవఱకుఁ బరిపక్వదశలోనున్న యాత్మలు, తమ సూక్ష్మశరీరములద్వారా సూక్ష్మలోకచైతన్యమును మాత్రము కలిగియుండును. స్థూలచైతన్యముకల సాధారణాత్మలపై తమ ప్రభావమును సూక్ష్మలోకమున చూపకలవు. కాని యిదంతయు తమ సూక్ష్మశరీరముద్వారా సూక్ష్మలోకములో సాధింపఁగలవు. వానికి స్థూలశరీరముద్వారా స్థూలప్రపంచముతో సంబంధ ముండదు. అట్లే నాలుగునుండి

యూఱువఱకుగల భూమికలనున్న పరిపక్వాత్మలు, స్థూలా సూక్ష్మచైతన్యములుగల యాత్మల నెఱేఁగియున్నవి. కాని యవి తమ మనశ్శరీరములద్వారా వానిపై మనోప్రపంచములో తమ ప్రభావము చూపును. వానికి స్థూలసూక్ష్మ శరీరములద్వారా స్థూలసూక్ష్మప్రపంచములలో సంబంధ ముండదు. అందుచే చిత్రములోని గీతలద్వారా, సూక్ష్మ చైతన్యముకల యాత్మలు సూక్ష్మలోకముతో సంబంధ మున్నట్లు చూపఁబడినవి. అట్లే మనశ్చైతన్యము కల యాత్మలు గీతలద్వారా మనఃప్రపంచముతో సంబంధమున్నట్లు చూపఁబడినవి. సంస్కారములన్నియు తిరుగుముఖముపట్టిన 'భగవంతునిస్థితి'లో జీవచైతన్యము భగవంతునివైపు మాత్రమే తిరిగియుండును. ఇది మజూబ్ లఁ (బ్రహ్మీభూత) స్థితి. వీరికి స్థూలసూక్ష్మమనోలోకములతో సంబంధముండదు. భగవంతునిస్థితిని ఆనందించు కొందఱు క్రిందకువచ్చి, సమస్త సృష్టిచైతన్యమును మరల బొందుదురు. ఇవి గురువులయో యజమానులయో (Masters) యాత్మలు. యజమానుని యాత్మ యేక కేంద్రముకలిగిన యేడురంగుల వలయముల వలనఁ జూపఁబడినది. *గీతచేఁ గూర్పఁబడిన యీక్రింది విషయములు జాగ్రత్తగా గమనింపవలెను. (1) గురువు నాత్మవిజ్ఞానభూమికతో లేక గురువులు వసించుస్థానముతోఁ గలియుచున్నది. (2) భగవంతునిస్థితితోఁ గలియుచున్నది.

---

* వీనిని గురించిన విశేషములు 7వ చిత్రమున జూడనగును.

(3) మూఁడులోకములతోఁ సంబంధమును గలిగియుండుట యే కాక, స్థూలసూక్ష్మమనశ్చైతన్యముగల యాత్మలతోను, మానవరూపమునకుఁ బూర్వాత్మస్థితులతోను సంబంధము కలదు.

## 7 వ చి త్ర ము.

7వ చిత్రము మానవరూపమువఱకు పరిణామపద్ధతిని భగవంతుని సాక్షాత్కారము పొందినయాత్మమార్గమును వివరములతోఁ విశదము చేయుచున్నది. అన్నిటికిని మధ్యనుండి (8) గుర్తుగల చిన్నవలయము వ్యక్తిగతాత్మను (జీవాత్మను) తెలుపుచున్నది. ఈ యాత్మనుబట్టి మానవరూపమువఱ కనేకవలయములు కలవు. తరువాతగూడ నీ వలయములన్నియు నిలచియున్నట్లు చూపఁబడినవి. ఆత్మకు తరువాతనున్న వలయము, చైతన్యమును సూచించును. ఇది మానవరూపము నొందువఱకు వృద్ధిపొందుచుండును. తరువాత నది వృద్ధిలేక నిశ్చలముగా నుండును. పరిణామమువ వృక్షజాతి యపరిపూర్ణమైన ప్రకృతి (instinct) లక్షణము కలిగియున్నది. కీటకములు, సరీసృపములలో సూక్ష్మశరీరముండును. ఇది వృక్షజాతిలో లేదు. మానవరూపము నొందువఱకు నీ సూక్ష్మశరీరము వృద్ధిచెందుచునే యుండును. ఈ సూక్ష్మ శరీరముతోఁ గూడ వెనువెంటనే ప్రకృతి(స్వభావ)లక్షణముకూడ వృద్ధి పొందుచుండును. కొంతవఱకు బుద్ధివికాసము జంతుస్థితిలోఁ బొడచూపును. కాని మనశ్శరీరముమాత్రము మానవరూపము చేరినతరువాతనే కనఁబడును.

మానవరూపములో నన్నిటికంటె లోపలనున్న వల యము వ్యక్తిగతాత్మను (జీవాత్మను) తెలుపును. తరువాత వలయము పూర్తిచైతన్యమును తెలుపును. దానితరువాత నున్న వలయములు (1) వ్యక్తిత్వస్థానము (2) సంస్కారములు లేక అప్రకటితమైనవాంఛలు. (3) బుద్ధి (4) మనశ్శరీరము ద్వారా అనుభవమునకు వచ్చుకోరికలు (5) సూక్ష్మశరీరము (ఇందు కోరికలు కొంతవఱకు ప్రజ్వలించుచుండును.) (6) స్థూల శరీరము (ఇందు కోర్కెలు పూర్తిగా ప్రకాశముపొందును.) ఆత్మనుజూపు మొదటి వలయము చుట్టునున్న వలయములు, చైతన్యమును దెలుపురెండవ వలయము తప్ప తక్కిన వన్నియు చైతన్యము పొరలు. ఈ పొరలలో నన్నిటికంటె పైనున్న వల యము, దానికిక్రిందనున్న వలయము స్థూలసూక్ష్మశరీరములను దెలుపును. చైతన్యము చుట్టునున్న మిగిలిన నాలుగు పొరలు మనశ్శరీరము నాలుగు కార్యక్రమములను దెలుపును. ఈ నాలుగు మనశ్శరీరకార్యములలోను రెండు (అనుభవములగు కోర్కెలు, బుద్ధి) సాధారణముగా మనస్సునకు చెందినవి. మిగిలిన రెండు (అనఁగా సంస్కారములు లేక ప్రకటింపఁబడని కోర్కెలు, భావలక్షణముగల వ్యక్తిత్వము) అహంకారము నకు చెందినవి. ఈ విధముగా మానవస్థితి నందిన యాత్మ, తన చైతన్యముతో మూఁడుశరీరములు గలిగియున్నది. కాని యీ స్థూలశరీరమని పిలుఁబడెడు స్థూలమగు పొరతోఁగూడ నాలుపొరలఁ గలిగియున్నది.

పునఃపునరావృత్తిగా జన్మించిజన్మించి జీవాత్మ మోక్ష మార్గమును బట్టునెడ విజ్ఞానవికాసమునకు బదులుగా భావావేశము కలుగును. ఇది మొదటి మూఁడుభూమికల వ్యక్తమగును. నాలుగవభూమికనుండి యాఱవభూమికను బ్రవేశించునప్పటికీ భావావేశము జ్ఞానజ్యోతిగాఁ బ్రకాశించును.

ఏకకేంద్రముగల రంగుల వలయములు, భగవదనుభూతినిగల మానవుని యాత్మను దెలుపును. ఈ యాత్మకు వలసిన యుపకరణములన్నియు దాని స్వాధీనములోనుండును. ఈ చిత్రమువిషయమై యీ క్రింది విషయములను జాగ్రత్తగాఁ బరిశీలింపనగును. (1) పైనున్న మూఁడు వలయములు నొక్కొక్కటిగా స్థూలసూక్ష్మ మనశ్శరీరములను దెలుపును. ఇవన్నియు సాధారణమానవులలోనుండును. (2) భగవదనుభూతిఁగల మానవునియందొక నూతనమగు శరీరము బయలు దేరును. దానినే మహాకారణశరీరమని చెప్పుదురు. ఇట్లు భగ్నావరణమై మనస్సు సర్వవ్యాపకత్వము నొందును. పాత్రలో జల ముండునట్లు మహాకారణశరీరములో మహామనస్సుండును. ఈరెండును రెండు ప్రత్యేకవలయములుగాఁ జూపఁబడినను అవి విడివిడిగా నుండఁజాలవు. (ఇట్లావరణభంగము నీమహాకారణశరీరముద్వారా పనిచేయుగురుమనస్సు సృష్టిలోనున్న ప్రతివ్యక్తియందున్న జీవుల మనశ్శరీరములతో నేరుగా సంబంధము కలిగియుండును. అది యీ మనశ్శరీరముల ద్వారా మనస్సూక్ష్మస్థూలప్రపంచములలో మార్పులు గలిగింపఁగలదు. గురువునకు మామూలుమానవులకువలె మన

శ్శరీరమున్నప్పటికి నాతఁ డెప్పుడును మహామనస్సుద్వారా పనిచేయును.) (3) గురువు ఆత్మలో మానవస్థితిలోని పరిమితమగు నహమిక గురువు నాత్మయం దనంతమగు మహాహంకారముగా రూపొందుచున్నది. అనఁగా సంకుచితమై ప్రత్యేకమైన వ్యక్తిత్వమునకు బదులుగా నవిభక్తమై సర్వవ్యాపకమైన యస్తిత్వము పొడుకొనినదనుట. (4) గురువునాత్మకనంతచైతన్యము ప్రాప్తించునది. మానవరూపమున గలిగిన చైతన్యమువలన నాత్మ యానంత్యము పూర్తిగా విశదము కాఁజాలదు. సంస్కారముల పరిమితప్రభావమే దీనికిఁ గారణము. కాని భగవంతుని సాక్షాత్కారము పొందినవానిలో పూర్తిచైతన్యము సంస్కారములచే బంధింపఁబడదు. అందువల్ల ఆత్మానంతత్వమతనికి గోచరమగును.

15 (100 వ పేజీ 8వ పంక్తి అలామ్-యే-మాలకుట్)

## శ్రీ మెహర్‌బాబాగారు వర్ణించిన అయిదు గోళములు

శ్రీ బాబాగారు అయిదుగోళము లున్నవని చెప్పుచున్నారు. (1) స్థూలము, (2) సూక్ష్మము, (3) మనోమయము, (4) సమగ్రము (విశ్వరూపము Composite) (5) యదార్థము లేక వాస్తవము. మొదటినాలుగు నన్యోన్యసంబంధముగల అస్తిత్వమును గురించినవి. ఐదవది కేవలము సత్యమునై యస్తియనఁబడునది.

విషయము సామాన్యమానవుల యనుభవమునకందనిదగుటచే నీసంబంధమగు వివరములు తెలిసికొనుట యవసరము.

ఎక్కువ వివరములలోనికిఁ బోయినచో బుద్ధి మోహము పుట్టించును. లేనిచో విషయము సరిగా బోధపడదు. అనేక దృక్కోణములనుండి వివిధసందర్భములను గురించి తెలుపవలసినప్పు డనేకములగు పదజాలము నుపయోగింప వలసియుండును. తగిన యనుభవము లేకపోయినప్పు డొకేవిషయమై వర్ణింపఁబడినప్పు డావర్ణన లన్యోన్యవిరుద్ధము లుగాఁ గనఁబడును. కాని పరస్పరసంబంధములగు ననుభవ ముల విజ్ఞానముతోఁ జూచినప్పుడు లేక అంత్యమున దర్శింపఁ బడిన సత్యమునుండి గ్రహించినప్పు డన్యోన్యవిరుద్ధములుగాఁ దోఁచినవిషయములే పరమసత్యమగు నొక్కదాని సమన్వయ స్వరూపములుగాఁ దెలియును. వాస్తవికములును గోళపంచక మున విజ్ఞాతమగు పారమార్థిక యాదార్థ్యముల నీవిషయము ద్యోతకము చేయును.

తన యునికికి సూక్ష్మలోకమాధారమైనను మొదటిదగు స్థూలలోకము, సూక్ష్మలోకముకంటె బహువిషయముల భిన్న మైనది. స్థూలలోకము లెక్కలేని లోకములు-సూర్యులు, చంద్రులు, నక్షత్రములు నున్నితము మొదలు మోటుపదా ర్థమువఱకును కలిగియున్నది. కొన్నిలోకముల ఖనిజములు, వృక్షజాలమునుకలదు. కొన్నిలోకముల నసంఖ్యాకములగు దేహధారణముకల జీవులుకలవు. కొన్నిటిలో మానవ జీవులు కూడఁగలవు. ఈస్థూలప్రపంచములోఁ బ్రధానమైనది భూలో కము. ఇందు హెచ్చుతగ్గులుగల చైతన్యముకల జీవులలో చైతన్యపూర్ణుఁడగు మానవుఁడు శ్రేష్ఠుఁడుగానున్నాఁడు. అతఁ

డన్ని స్థూలలోకములలోని జీవకోటికంటె నధికుఁడు.* ఇచ్చట మానవుఁడు దనలోని సూక్ష్మలోక చైతన్యము గ్రహించువఱకు నతని చైతన్యమంతయు స్థూలపరిసరములలో మునిఁగియుండును. ఇచ్చట మనము చర్చించుచున్న యాధ్యాత్మికవిషయములను గుఱించి యతఁడు చదువుచున్నప్పు డాలోచించుచున్నప్పుడు గూడ స్థూలవ్యాసంగములలో నిమగ్నుఁడై యుండును.

రెండవలోకము ప్రాణమయలోకము. అందేడు భాగము లున్నప్పటికి నది యంతయు గలిసి యొకటే లోకము. దాని శక్తికి మనోలోక మాధారము. దానికి స్థూలప్రపంచాధారమెంతమాత్రమును లేదు. దిక్కాలములను మాట

---

* దీని తాత్పర్యమేమనఁగా స్థూలప్రపంచమున మానవాకృతిభాసించు జీవులందఱిలో నధికమగు నాధ్యాత్మికస్థితియందుండుట. శ్రీ మెహర్ బాబాగారిట్లు చెప్పుచున్నారు. 'మానవనివాసములును, స్థూలస్వరూపములునగు మూఁడులోకములలోను మన భూలోకములోని మానవున కాధ్యాత్మికముగా నత్యున్నతస్థితికలదు. ఇచ్చట మానవునియందు నూటికేబది పాళ్ళు విజ్ఞానము, నేబదిపాళ్ళు హోద్దతయు నుండును. మిగిలిన రెండులోకములలో నొకదానియందు మానవునకు నూటికి నూరుపాళ్ళు విజ్ఞానమును, రెండవదానియందు నూటికి డబ్బదియైదుపాళ్ళు విజ్ఞానమును, ఇరువదియైదు పాళ్ళు హోద్దతయు కలుగునని శ్రీ మెహర్ బాబాగారు తెలుపుచున్నారు. మానవుఁడు తన పునర్జన్మములలో నీ మూఁడులోకములలో నేదోయొకదానియందు జన్మనెత్తుచున్నాఁడు. కాని భగవత్సాక్షాత్కారమును బొందుటకు భాగవతపథమున చరించు మానవునకు తుదకైన నీభూలోకమునందు జన్మ మెత్తక తప్పదు. (భౌతికలోకము లన్నింట స్థూలప్రపంచములో భూలోకము ముక్తిమార్గమునకు బహు సమీపమున నున్నది.)

లవ్యక్తమగు భౌతికాకృతియందు గోచరించెడి యనంతాకాశమున నసంఖ్యాకసూర్యనక్షత్రాదిగోళములు భూమితోఁగూడ నిమిడియున్నవి. సూక్ష్మలోకముతోఁ బోల్చిచూచినయెడల నిది మిక్కిలి యల్పముగాఁ గనఁబడును.

ఆత్మసాక్షాత్కారమార్గము—సూఫీలు దీని "రాహ్ యేతరీకత్"అని వేదాంతు లాధ్యాత్మికమార్గమని పిలుతురు. ఇది ఏడుభూమికలు గలది. (ముఖములు లేక స్థానములు)- ఒక్కటే మొదటి స్థూలప్రపంచమునకు, యదార్థలోకమగు నయిదవదానికి మార్గము నేర్పఱచును. ఇందు మొదటి మూఁడుభూమికలు రెండవగోళములో నుండును.

సూక్ష్మగోళము తనసూక్ష్మశక్తిద్వారాను దేవతల వల్లను అన్నిటికంటె ముఖ్యముగా మానవుని పాక్షికముగాఁగాని పూర్ణముగాఁగాని యభివృద్ధినొందిన సూక్ష్మచైతన్యము వల్లను (స్థూలరూపములోని మానవచైతన్యము కొంతగాని, పూర్తిగాఁ గాని స్థూలలక్షణమునుండి విముక్తిపొందినది.) తన స్థూల గోళమును దాటి, సూర్యులు నక్షత్రము లనేకములు కలిగిన స్థూలాకాశమును గూడ బ్రద్దలుచేసి చొచ్చుకొని పోఁ గలుగుచున్నది.

సూక్ష్మమైన దృశ్యములు, శబ్దములు, భావములు శక్తులు లెక్కలేనన్ని భిన్నరూపములుగా వ్యక్తమగును. వీనికిని స్థూలగోళమునకును పోలికయే యుండదు. స్థూలపరిమితిలో శక్తి పరిమితమగును. మానవచైతన్యముగూడ నట్లే స్థూల పరిసరముల పరిమితలక్షణములచే నావరింపఁబడును.

మూఁడవది మనోగోళము లన్ని గోళములలోనికి ప్రధానమైనది. ఇది స్థూలసూక్ష్మ గోళముల యాధార మేమాత్రములేక స్వతంత్రమైయుండును. ఇది భగవంతుని చే ప్రత్యేకముగా నిర్వహింపఁబడుచున్నది. మనోగోళము మనోనివాసస్థానము. వ్యక్తిగతమనస్సు, సాముదాయకమనస్సు మహామనస్సుల యావాసము. ఈ మనస్సు తన గోళము నంతను వ్యాపించియుండుట యేగాక సూక్ష్మస్థూలగోళములను గూడ వ్యాపించియుండును.

బుద్ధి, సహజజ్ఞానము, అంతర్దృష్టి, జ్ఞానప్రకాశమువంటి విషయములన్నియు నీ మనోగోళమునకు సంబంధించియుండును. ఇందులోనే యున్నతశ్రేణికిఁజెందిన యాధ్యాత్మమార్గము లోని యైదాఱుభూమిక లిమిడియుండును. నాలుగవభూమిక సూక్ష్మగోళములోని మూఁడవభూమికకు, మనోగోళములోని యైదవభూమికకు కూడలిస్థానములోనున్నది.

అయినప్పటికిని మనోగోళము సత్యగోళమునుగాని, నిజస్థితినిగాని పొందలేదు. ఎందుచేతననఁగా 'నేనే భగవంతుఁడ' ననిగాని 'అహమస్మి' అను స్థితినిగాని నిరూపించి తన నిజస్థితిని తానే పొందినప్పుడు గాని లభ్యముకాదు.

నాలుగవది సమగ్రగోళము. దీనినిగుఱించి తఱచు వినుచుందుముకాని, దాని యర్థము బహుస్వల్పముగ దెలియును. అందు 21 చిన్నగోళము లున్నవి. అందుచే నది గోళముగాను, కానిదిగానుగూడ నెన్నఁబడుచున్నది. ఇందు స్థూలసూక్ష్మగోళములమధ్యమున నేఁడు చిన్న స్థూలగోళములు నేఁడు చిన్న

సూక్ష్మగోళములు గొలుసుకట్టుగా గలిసియున్నవి. సూక్ష్మ మనోగోళములమధ్యమున 7 చిన్న సూక్ష్మగోళములు 7 చిన్న మనోగోళములు కలసియున్నవి. మనోగోళమునకు వాస్తవిక గోళమునకును నడుమ 7 చిన్నమనోగోళములు, 7 చిన్న మహా మనోగోళములు కలసియున్నవి.

ఈ విషయ మీక్రిందచూపిన పద్ధతిని బాగా అర్థ మగును.

టేబిల్ I

4 సమగ్రగోళము
- 1 స్థూల
  - 7 (నీచ)
- 2 సూక్ష్మ
  - 7 (మధ్యమ)
- 3 మానసిక
  - 7 (ఉచ్ఛ)
- 5 సత్య

టేబిల్ II

(1) స్థూలగోళము (మొదటిది)

7 తక్కువ శ్రేణికిచెందిన (యాంతర) నీచ గోళములు యివి 4వ సమగ్రగోళ సంబంధములు.

(2) సూక్ష్మగోళము (రెండవది)

7 మధ్యమ నీచగోళములు

4 వ సమగ్రగోళ సంబంధములు.

(3) మనోగోళము (మూఁడవది)
7 ఉచ్చగత నీచగోళములు
4 వ సమగ్రగోళమునకు చెందినవి.
(5) సత్యగోళము (ఐదవది.)

తక్కువ శ్రేణియందలి యేడు నీచగోళములు నాధ్యాత్మిక విచారణమున స్థూలగోళముకంటె నెక్కువైనవి. వానికి స్థూలగోళముతో సంబంధము కలదు. కాని 7 ఉత్తమ శ్రేణియందలి నీచగోళములు, మనోగోళములకంటె నున్నతమైనవి కావు. వానికి సత్యగోళస్పర్శమును లేదు. ఈ విషయ మీక్రింద విశదము చేయఁబడినది.

మానవునికిని భగవంతునితో సంధానము చేయఁగల మార్గమొక్కటే కలదు. అది సూక్ష్మమనోలోకములనుండి పోవును. ఈ రెండుగోళములలో ననంఖ్యాకములగు వస్తువులు జీవులు కలరు. అట్లే యేడు క్రింద శ్రేణియందలి యేడు పై శ్రేణియందలి గోళములలోఁగూడ గలవు. ఈ వస్తుజీవనము దాయమునఁ బ్రతివ్యక్తియు బ్రత్యక్షముగానో పరోక్షముగానో యాధ్యాత్మికమున ముఖ్యమైనదే.

సూక్ష్మగోళములోఁగూడఁ గ్రింది శ్రేణి యేడుగోళములు మొదలుగా నేడు మధ్యమ నీచగోళముల వఱకు, విగత శరీరులైన యాత్మ లింక నితరవస్తువులతో వసించుచుండును. శరీరహీనములైన దేవతాత్మలుకూడ నిందే యుండును. మధ్యములో నున్న యేడుగోళములనుండి పైశ్రేణియందలి యేడు

చిన్న గోళముల వఱకును మనోగోళముతోఁగూడ మిగిలినవస్తువులతోఁబాటు ప్రధానదేవతలు నివసించెదరు. శరీరములను వదలిన యాత్మలు లేక జీవులు మంచివి చెడ్డవి కూడ కష్టసుఖముల యనుభవములను బొందుటకుఁబూర్వమును, తదనుభవానంతరమునఁగూడ 'వేచియుండుస్థితి'లో నుండవలసి యున్నది. ఈ స్థితులనే సామాన్యముగా స్వర్గమని, నరకమని చెప్పెదరు.

శరీరములేని దేవతలు భగవంతుని యిచ్ఛననుసరించి సంచరించు యంత్రముల వంటివి. భగవంతుని ప్రేరణము లేనిదే యవి యేపనియుఁ జేయవు. సర్వవ్యాపకమై సంచలితమైన భగవంతుని శక్తిపైననే యీ ప్రేరణములు, సంకల్పములు నాధారపడి యుండును. అపుఁగా భౌతికశరీరమువల్ల మలినముగాక దేవతలు స్వచ్ఛముగానుందురు. స్థూలవాతావరణము దాటనేరని చైతన్యముగల మానవునికంటె దేవతలుచ్ఛస్థితిలో నున్నారు. (ఆధ్యాత్మికమార్గమున ప్రవేశింపని మానవుఁ డిట యుద్దేశింపబడినాఁడు.) విరుద్ధముగాఁ దోఁచినను, స్థూలశరీరస్థితివల్ల మలినమునకు గుఱియైన మానవుఁడు తనయందంతర్గతమైయున్న యనకాశమువల్ల నున్నతశక్తుల కాలవాలమై యున్నాఁడు. తనలోనున్న లోటుబాటుల ననుభవములను పొందుచు, మనోదౌర్బల్యలక్షణములను, బంధనముల నెదుర్కొనుచుఁ దననైజస్వచ్ఛతను, శక్తినాత్మానుభూతిని బొందుటకై సమర్థుఁడై యున్నాఁడు. ఈ యున్నతశక్తు లొకప్పుడు ప్రధానదేవతలకుఁ గూడ నందుబాటులో నుండవు.

సృష్టిస్థితిలయములను, భగవంతుని ప్రధానదివ్యలక్షణ ములను పరిమితమగు జీవితద్వారమున నపరిమితమగు రూప మున నావిర్భవించి యఖండజ్ఞానమును పరిమితముగాఁ బ్రజ్వ లింపఁజేయుట కీప్రధానదేవతలు భగవంతునకుఁ గరణమాత్రు లగుచున్నారు. ఈ ప్రధానదేవత లెప్పుడు నానందము ననుభవించెదరు. ఎప్పుడు బాధలను పొందరు.

ఈ ప్రధానదేవతలు నాలుగవగోళమగు చిన్నమహా మనోలోకములలో నుందురు. దానినే సమగ్రగోళమని యిందు తెలిపితిమి. ఇది మూఁడవదియగు మనోలోకమునకుఁ దాప హాతి వచ్చును. అయిదవదియగు సత్యగోళమునకు సమీప ముగా నుండును. కాని యున్నయదార్థమంతయు నిం దిమిడి లేదు. సమీపములో నున్నప్పటికి నయిదవగోళమును పొందఁ జాలదు. పై నుదహరించిన మహామనోగోళములోనున్న ప్రధానదేవత భగవంతుని సాక్షాద్దర్శనము పొందలేదు. కాని మానవుఁడు మూఁడవ మనోగోళములోని యారవ భూమిక నుండి భగవంతుని ప్రత్యక్షముగా నెల్లెడల నన్నివస్తువులలోను గనుఁగొనును. చివర చిన్న మహామనోగోళములలోని తుది ప్రదేశమునుండికూడ ప్రధానదేవతయగు గేబ్రియల్ దాట లేఁడు. (ఈ చోటును సూఫీలు తుది సరిహద్దులేక 'సద్రితుల్ మున్ తహా'అని చెప్పుదురు.)

సత్యదూరములై పరస్పరసంబంధముగల యేడు బంధ ములను, నాలుగు గోళములను దాటి సత్యగోళమగు నైదవ దానిలోనికి మానవుఁడొక్కఁడే పోఁగలుగుచున్నాఁడు. ఇది

నిజము. దేవతలుకూడ భగవత్సాక్షాత్కారము పొందనతె నన్న దేవత్వమునువదలి మానవజన్మ మెత్తకతప్పదు. మానవుఁడు భగవంతునిలో నైక్యము పొందినప్పుడు, దేవతలు, ప్రధానదేవతలు కూడ తన లక్షణములు కలవారేయని గ్రహించును.

నాలుగవ సమగ్రగోళమునకు చెందినట్టియు, నుచ్ఛశ్రేణికిఁజెందినట్టియు నేఁడు చిన్నలోకము లంతమున విచ్ఛిన్నమైనప్పుడు దానిని మహాప్రళయ మందుము. ఇది జరిగినప్పుడు స్వత్వవిహీనమైన సృష్టియంతయు (non existent-non existence) తన గోళములు చిన్నగోళములలోఁ గూడ, ననావిర్భూతబీజములోనికిఁ దిరిగి పోవును. తిరిగి యనంతకాలములోని యుత్తరక్షణములో నూతనసృష్టి ప్రారంభమగును.

నాలుగవదియగు సమగ్రగోళము సాధారణముగా నీ క్రిందఁ దెలుపఁబడినవిధముగా మొదటి మూఁడుగోళములలో నిమిడియున్నది.

1. స్థూలగోళము నాల్గవదానిలోని కొంతభాగముకలిసి సమగ్రగోళము. దీనిని వేదాంతులు అన్నమయకోశ మందురు. సూఫీలు 'ఆలమ్-యే-నసుల్' అందురు.
2. సూక్ష్మగోళము నాల్గవ (సమగ్ర) గోళములోని కొంతభాగము కలిసి ప్రాణమయకోశ మందురు. (వేదాంతపద్ధతి) 'ఆలమ్-యే-మల్‌కుట్' అందురు.

౬. మనోగోళము నాల్గవ (సమగ్ర)గోళములోని కొంత భాగముకలిసి మనోమయకోశమందురు. (వేదాంత పద్ధతి). సూఫీలు 'ఆలమ్-యే-జబ్ రూట్'అందురు.

వేదాంతభాషలో నీ నాలుగుగోళములు త్రిభువనము లనిగాని త్రికోశములనిగాని పిలుతురు. సూఫీలు 'దో-ఆలమ్' అని పిలుతురు. స్థూలకోశ మొకటిగాను,సూక్ష్మమనఃకోశమును (సమగ్ర)కోశముతో (గూర్చి) రెండవదిగా నెంచెదరు.

ఐదవదియైన యదార్థ గోళము ఆధ్యాత్మమార్గము లోని ఏడవభూమిక. ఇది పూర్ణమగు మహాచైతన్యసంబంధము కలది. అదివరలో నాలుగుగోళములలో నంటియున్న ద్వంద్వలక్షణములన్నియు చైతన్యమునుండి వీడిపోయినవి.ఐదవ గోళమగు నేడవభూమికయనునది గోళముకాదు, భూమికయు గాదు. అది భగవంతుని నిజవిభూతి. దానినే మానవకోటి పరమాత్మయనియు, అల్లాయనియు, సర్వమయుఁడగు దేవుఁడనియు, 'యెజ్ దన్' అనియు పిలుతురు. ఆ యేకేశ్వరుఁడగు భగవంతునే 'అస్మి' నుండి 'అహమస్మి' అహమస్మినుండి "సర్వాంతర్యామి" యను వేర్వేరు పదములు భగవంతుని యదార్థతకు వేర్వేరు అవస్థలనుబట్టి యుపయోగింపఁ బడుచున్నవి. వేదాంతులు విజ్ఞానమయకోశము విజ్ఞానమని, సూఫీలు 'ఆలమ్-యే-హాహోట్', 'ఆలమ్-యే-లహోట్'అని చెప్పుదురు.

16 (104వ పేజీ 23వ పంక్తి స్వానుభవములవలన గలిగిన విశ్వాసము.)

సూఫీ ధర్మప్రకార మాధ్యాత్మికజీవితము నాలుగంతరములు నున్నది. ఈభూమిమీద మానవునిజీవితము భగవంతుని సాక్షాత్కారమునకు సహకారియగు జ్ఞానప్రదీప్తికి వలయు కార్యక్రమమునకు సహకరించుమార్గము. ఈనాలుగంతరములు షరియట్ (ధర్మశాస్త్రము), తరికట్ (ఆధ్యాత్మమార్గము), హాకికట్ (కైవల్యము), హాకికట్ యొక్క మరెఫట్ (అనుభవము)

నాలుగుపొరలుకలకాయతో నీనాలుగంతరములను యిమామ్ మహమ్మదుఘుజలీ పోల్చెను. మొదటిది పైబెరడు, రెండవది లోపలితొక్క, తరువాతది పలుకు, నాలుగవది పలుకులోని తైలము. ఈనాలుగు నొకదానికొకటి యాధారములుగా నున్నవి.

ఆత్మ యీనాలుగు మార్గాంతరములనుండి పోవుచున్నప్పుడు సత్యదర్శనము విషయమై క్రమముగా విశ్వాసము బలపడుచుండును. సూఫీ లీనమ్మకము కలిగించు విషయములను (1) యిల్-ముల్-యాకిన్ (2) ఐనుల్-యాకిన్ (3) హక్కుల్-యాకిన్ (4) ఉర్ఫుల్ యాకిన్ అనిపిలుతురు.

(1) యిల్ముల్-యాకిన్—భావసంబంధమైన విశ్వాసము లేక నిశ్చితార్థము. అదియంతర్గత భావస్పందనమువల్లను, కలలోని దివ్యదర్శనములవల్లను, నాధ్యాత్మికానుభవమువల్లను కలుగును. అవియాధ్యాత్మికమార్గముననున్నపుడుగాని, దానికి సంబంధము లేనప్పుడుగాని సంభవించుచుండును.

(2) ఐనుల్-యాకిన్ లేక దృష్టికి యదార్థము గోచరించుట. ఎడతెగకుండ నన్ని యెడలను భగవంతుని జూచుట. వేదాంతులు దీని సంతర్దృష్టి యందురు.

(3) హక్కుల్-యాకిన్ లేక సాక్షాత్కారనిశ్చయము. ఆధ్యాత్మికయాత్రలోని యేడవభూమికయం దాత్మపొందగలిగినదిది. దీనిని హాకీకట్ అందుము. ఇచ్చట ఆత్మ (జీవుఁడు) తనంతటతానే యాత్మసాక్షాత్కారము పొందును. వేదాంతులు దీనిని ఐక్యానుసంధానమని చెప్పుదురు.

(4) ఉర్-ఫుల్ యాకిన్-అనుభవయాదార్థ్యము మానవునిలోని భగవంతుని సరిపూర్ణత్వమును దెలిసికొని తద్ద్వారా మహాత్మయు, సమస్తబ్రహ్మాండమునయు రహస్యములన్నియు దెలిసికొనును. ఇందుసార్వభౌమిక మనస్సు లేక మహామనస్సు పనిచేయును. ఇందలి విచక్షణస్థానము దేవతాప్రణిధానమున గల్గినది.

ఈ విషయములనుగుఱించి యుదాహరణపూర్వకముగ నింకను దెలుపవలెనన్న నొకపాత్రయందు బాలున్నవని యొకనికిఁదెలిసి తద్విషయమునుగుఱించి యకుంఠిత విశ్వాసమును కలిగియుండుట 'యిల్ముల్-యాకిన్' అందురు. తన బుద్ధికిఁ దెలిసిన యీవిషయమున దృష్టిలేక పాత్ర దగ్గఱకు స్వయముగాఁబోయి తన కన్నులతోఁ బాలను ప్రత్యక్షముగాఁజూచి తనబుద్ధికి సహజజ్ఞానమునకుఁదెలిసినదానితో సరిగా నున్నదని తెలిసికొనుట 'ఐనుల్-యాకిన్' (దృష్టికి తృప్తి). ఆపాలను

తా్రిగి దానితోఁ నేకత్వమును బొందుట 'హాక్కుల్-యాకిన్' (ఐక్యానుసంధానము) పొందుట. పాలలోనుండు చక్కెర, నీరు, క్రొవ్వువిటమిన్లు మొదలగు వివిధభాగముల రుచుల మంచిచెడ్డలను గుఱించినజ్ఞానమును దనలో కలిగియుండి వీని ప్రియోజనముల నితరులకు వివరములతోఁ జెప్పఁగలుగుట నిశ్చయజ్ఞానము లేక యనుభవము కలిగియుండుట. దానినే సూఫీలు 'ఉర్‌ఫుల్-యాకిన్' అందురు. అనఁగా 'హాకీకట్' యొక్క మరెఫట్.

## అయిదు విధములగు జ్ఞానము.

సూఫీమతప్రకారము మానవులకు సంబంధించినది ఐదు విధములగు జ్ఞానము కలదు.

మొదటిది భూగోళమునకు సంబంధించిన జ్ఞానము. ఐహికసుఖముల సముపార్జనతోఁ గూడినది.

రెండవది :- ధర్మశాస్త్ర (షరియట్) మునకు సంబంధించినజ్ఞానము. ఇది శాస్త్రచర్చలో మాటల తెలివితేటలతో నెదుటివారి నోడించుట కుపయోగించును. ఇది సామాన్యులైన యోగులకు వేదాంతులకుఁ దెలిసినది.

మూఁడవది :- ఆధ్యాత్మికమార్గమునకుఁజెందినది. ఇది యాంతరంగికమగు నాధ్యాత్మశిక్షగల మార్గము నవలంబించి పేలవములగు శాస్త్రచర్చలకు దూరముగానుండువారికి సంబంధించినజ్ఞానము. ఇందు అహము అంటిపెట్టుకొనియుండును. ద్వంద్వములగు మంచిచెడ్డల జ్ఞప్తి జీవు నంటియుండును.

వేదాంతులయు, నాలోచనాపరులయు జ్ఞానముపై నుదహరింపఁ బడిన రెండు మూఁడుతరగతుల జ్ఞానమునకు మధ్యముగా నుండును. నాలుగవవిధమగు జ్ఞానము భగవంతుని గుఱించిన జ్ఞానము—ఆత్మజ్ఞానము. (హాకీకట్)

ఈజ్ఞానముదయించినవానికి, మాయావృతమగు నహంకారము లేశమునుండదు. ద్వంద్వలక్షణములన్నియు పూర్తిగా మాసిపోవును.

ఐదవవిధమగు జ్ఞానము నిజమగుజ్ఞానము. హాకీకట్ యొక్క మరెఫట్. ఇదేభగవంతునియు సమస్తబ్రహ్మాండములయుఁ బరిపూర్ణజ్ఞానమని శ్రీమెహర్ బాబాగారు తెలుపుచున్నారు. అవతారపురుషుఁడును (రసూల్) సద్గురువును (కుతుబ్) ఈపరిపూర్ణతను తెలుపు జ్ఞానమునుగలవారు.

ఆత్మ యీవివిధములగు జ్ఞానాంతరములనుండి పోయినగాని, జ్ఞానశిఖరమును జేరఁజాలఁదు. అది(సులుక్) లేనిచో సాధారణ జీవస్థితిలోనికిఁ దిరిగిరావలెను. ఈజ్ఞానస్థితిలోనికివచ్చినవానిని సద్గురువని పిలువవచ్చును. నడుమనున్న యంతరములతో నిమిత్తములేకుండగనే నాలుగవ జ్ఞానాంతరముచేరినవారున్నారు. కాని యట్టివారరుదు. అట్టివారికి సద్గురుప్రాప్తి వలన నిది సాధ్యమగును.

ఆధ్యాత్మికముగా నున్నతస్థితియందున్న యాత్మలను 5 ప్రధానములగు తరగతులుగా శ్రీమెహర్ బాబాగారు విభజించుచున్నారు. భగవంతునిలో లీనమైనవారు, భగవదావేశము

గలవారు. భగవన్నిమగ్నులు, భగవన్నిత్య సంబంధులు భగవదున్మాదులు. ఈవిషయమై తెలిసికొనుటకు డాక్టర్ డాన్కిన్ వ్రాసిన Way farers అనే యింగ్లీషు పుస్తకములోని 21_37 పేజీలుచూచినచో నచట బాబాగారి అభిప్రాయములు విశదముగాఁ దెలియఁగలవు.

17. (157వ పేజీ 11వ పంక్తి దివ్యకలయగు సృష్టినాటకములోని)

## అయిదాధ్యాత్మిక విషయములు.

(1) సాధారణమానవుఁడు—మానవుఁడు తనవలెనే యితరులనితరవస్తుజాతమును జూచును.

(2) ఆఱవ భూమికలోనివారు—మానవుఁడు మానవుఁడుగానుండియే యందఱిలోను అన్నిటియందును భగవంతుని జూచును.

(3) ఏడవభూమికలోని మజూబ్ — (బ్రహ్మీభూతుఁడు) భగవంతుఁడు భగవంతుఁడుగా తన్ను తానందఱిలోను నన్నిటియందునుగనును.

(4) కుతుబ్ (సద్గురువు) —భగవంతుఁడు మానవుఁడుగా, ప్రతిపురుషునందు, ప్రతివస్తువునందు ననుజూచును.

(5) అవతార్—భగవంతుఁడు మానవరూపిగా భగవంతుఁడుగా నేకకాలమందు తనయాత్మదర్శనమును ప్రతిపురుషునందుఁ బ్రతివస్తువునందుఁగాంచును.

(శ్రీ మెహర్ బాబా.)

18. (193వ పేజీ 5వ పంక్తి బాఖా అనగా శాశ్వతిస్థితి)

**పానాబాఖాలను గురించి సూఫీ అభిప్రాయము.**

పానా మరియు బాఖాయను పదములను సూఫీ లెట్లర్థముచేసికొనినదియు సంగ్రహముగాఁ దెలుపఁబడినది. ప్రతి భూమికయు దన ప్రత్యేక పానాబాఖాలను గలగియున్నది. ఈ భూమికలలోని పానా యేఁడవభూమికకుఁజెందిన పానా కాదు. భూమికలబాఖా సద్గురువు స్థితిలోగలుగు బాఖా కాదు. సూఫీ మతప్రకార మాధ్యాత్మికజ్ఞానములోని కొన్ని ముఖ్యవిషయములను గమనింతము. అవి యెక్కువగా నేడవభూమికకు సంబంధించినవి. ఈపదము లాధ్యాత్మిక ప్రధానములైన యర్థము కలిగినవి. పానా అనఁగా త్యాగము లేక ఆత్మబలి. అట్టిస్థితి శాశ్వతముగా నుండదు. బాఖాయనఁగా శాశ్వతము; ఎల్లప్పుడు నుండునది. పానా భగవంతుని చేరు ప్రయాణమున తుదిఘట్టము. బాఖా భగవంతునిలోఁజేరు ప్రారంభదశ. పానా ఒకగుణమని యెంచరాదు.అది నీటిలోపంచదారను కరగించుటవంటిది. హాజ్ విరి చెప్పినప్రకారము ప్రధానాంశము నాశనము కాదు. బాఖా యిదివరలో నున్నదిగా నిక ముందుకూడ నుండునదిగాను తెలుపువస్తువు; భగవంతుని ప్రధానతత్వమువంటిది. పానా ద్వంద్వము లంతమొందుటను దెలుపును. బాఖా యీద్వంద్వములు నాశనమైనపిమ్మట భగవంతునిగూర్చి కలుగు జ్ఞానము గుల్ షణ్-యే-రాజ్ అను గ్రంథములో మహమ్మదు షా బిస్తారి చెప్పినట్లు మోహాముగాని కోర్కెలవలనగానిగలుగు న్మ్రదేకనాశనము; సంకల్ప

మహంకారమున కంతము. దీనివలన శాశ్వతత్వము నిచ్చు నాధ్యాత్మిక పరిబోధముకలుగును (భా॰ షా॰). అల్పమగు నహమును మఱపించును. ఈయహమునవల్లనే మానవుఁడు తననిజస్వరూపమగు భగవంతుని గనలేకున్నాఁడు. ఆత్మకంటె దాను వేరని సాధకునకుఁ దోచునంతవఱకు నదిలోటుగా నెంచవలెను. అట్టి వేరుచేయుభావమునుండి దూరమగుటే యత్యుత్కృష్టస్థితి.

పానా రెండువిధములు. బహిర్గతము—అంతర్గతము.

బహిర్గతమైనది. కార్యములు సాధించుట. దివ్యపరిభావముకల పనులుచేయుట. ఈపానానుపొందినవాఁడు తన్ను దాను మఱచి భగవంతునికార్యములో నిమగ్నుఁడై యుండును. భగవంతుని యిచ్ఛాసంకల్పము తప్ప అతనికితరస్పృహయుండదు. కొందఱు పవిత్రులగు సాధకులు శరీరమునకు వలయు సాధారణావసరములనుగూడఁ జూచుకొనెడి స్థితిలోనుండరు. అట్టితరి వారిని జూచుటకు భగవంతుఁడే కొందఱిని నియమించును.

అంతర్గతమైనది:—సత్యములో గలిసియున్న లక్షణములు గల పానా యిది. తనకుఁ బ్రత్యక్షమైన భగవంతుని గుణములవల్ల తన గుణముల పానాలో మునిఁగి యుండును. ఒక్కొక్కసమయమున భగవంతునియొక్క తేజఃపరిభావములలో మునిఁగియుండును.

బహిర్గతమగు పానా:— హృదయమునకు పరిభువులగు వారలయు భగవద్గుణానుభవముగల సహాధ్యాయులయు భాగము.

అంతర్గత పానా:— అనుభవముల శక్తినిదాటి హృదయమును జొచ్చుకొనిపోయిన యుదారుల భాగము. ఇట్టి యుదారహృదయుల బృందమునుండి భగవదాప్తు లేర్పడుదురు. బహిర్గతమగు పానాకును బాఖాకును యీ సంబంధము కలదు. పానాసంబంధములగు వాంఛాసంకల్పముల వశుఁడగు వానిని దరువాత భగవంతుఁడు వాంఛాసంకల్పములకు యజమానునిగాఁ జేయును. దానివల్ల నతనికి సర్వాధికారము భగవంతుఁడిచ్చును.

అంతర్గతపానాకు, బాఖాకునుగల సంబంధమిది. ఆత్మ భగవంతునితో నైక్యముపొందదు. సృష్టి కష్టముగా తెర వలెనున్న భగవంతుఁడు, భగవంతుని కష్టముగానున్న సృష్టి యష్టముగానే యుండును. పానాలో భగవంతుఁడు సృష్టికి తెఱగా నున్నాఁడు (మాయాశబలితుఁడుగా). పానా స్థితికి చేరనివారికి సృష్టియే భగవంతుని మఱుఁగుపరుచు మునుఁగు.

19. (198వ పేజీ 15 పంక్తి క్రొత్తసంస్కారముల యనుభవములకు)

(శ్రీ)బాబాగారింక నీక్రిందివిధముగ వ్యాఖ్యానించుచున్నారు: మానవరూపము మొదటగా ధరించినతరువాత నప్పటికిఁ బూర్తియైన పూర్ణచైతన్యము క్రమముగా భూమిక తరువాత భూమిక వెనుక బడుచుండును. ఈ చైతన్యాంతర్గత పరిణామము కరుఁడుగట్టిన స్థూలసంస్కారములు పలుచబడుటతోడనే ప్రారంభమగును. చైతన్య మీలాంవిధమున బ్రథమ భూమికానుభవమును పొందును. సంస్కారములు బలహీనమైనకొలఁదిని చైతన్య మంతర్గతపరిణామమునకు బుఱోభివృద్ధిఁ

గాంచుచు రెండవభూమిక యనుభవము పొందును. అట్లే యేడవభూమిక చేరువఱకుఁ గ్రమవిశిష్టానుభవముల నొందుచు బురోగమించును.

చైతన్యము వెనుకమార్గముపట్టుటయనఁగా పూర్ణత్వముఁ జెందిన చైతన్యము ప్రథమమున భగవంతునిపై దృష్టినుంచుటకు బదులు స్థూలసంస్కారములపై కేంద్రీకరించుట, అంతర్గత పరిణామమార్గమున నన్యోన్యవిరుద్ధ ద్వంద్వసంస్కారముల పరిభావమువలన నది క్రమముగా క్షీణించుట ప్రారంభమగుట తోడనే చైతన్యముకూడ నాత్మవైపు తనదృష్టిని మరల్చును. ఏడవభూమిక చేరునప్పటికి చైతన్యమున కేవిధమగు సంస్కారములసంపర్కము మిగులదు. దీనివల్ల ఆత్మవైపు దృష్టి సహజముగా మరలును. అనఁగా నాత్మతో నేకమగుననుట.

20 (201వ పేజీ 20వ పంక్తి మజూబియత్ స్థితి.)

## ఐదు సాంకేతిక నిర్వచనములు

1. భగవంతుఁడు= అనంతస్థితి+అఖండ అనంతజ్ఞానము+ అపరిమితానందము—చైతన్యహీనత =సత్+చిత్+ఆనంద—జడత్వము లేక చైతన్యహీనత=సచ్చిదానందము—చైతన్యహీనత.

2\. స ద్గు రు వు := సద్గురువు= అనంతస్థితి+అఖండజ్ఞానము+ అపరిమితానందము+చైతన్యము= అనంత స్థితిచైతన్యము, పరిమితమగుదానిస్మృతి.

3\. అ వ తా ర ము=యిన్‌సానేకమిల్‌=పురాతనపురుషుఁడు= బుద్ధ = సాహేబేజమాన్‌=రసూల్‌= జీవ క్రైస్తు=సచ్చిదానందము+చైతన్యము. =అనంతపరిమితస్థితుల స్మృతి యేకకాల మందు కలిగియుండుట.

4\. మానవుఁడు లేక జీవాత్మ లేక యిన్‌సాన్ } =శరీరము+ ప్రాణశక్తి + మనస్సు + చైతన్యము+ఆత్మ.

5\. మజూబ్‌ (బ్రహ్మీభూతుఁడు) } =దైవసమానమగు నేను = భగవంతుని చైతన్యము—పరిమితమగు చైతన్యము.

21 (203వ పేజీ 19వ పంక్తి సాలిక్‌లు లేక జీవన్ముక్తులగువారు)

## నాలుగు విధములగు ముక్తి

వివిధములగు సహజసమాధిస్థితిని (Perfection) తెలుపుటకు వేదాంతములోఁ గొన్ని వాడుకలోనున్న పదములుకలవు. ఈ భగవత్సాక్షాత్కారముపొందు ప్రయత్నములో సాధకుఁడు వాని యుపయోగమును దెలిసికోవచ్చును. ఇందు ప్రధానమగు పదము ముక్తి. అనఁగా విడుదలపొందుట. అది నాల్గు విధములుగా నున్నది.

ఈక్రింద తెలుపఁబడిన నాలుగువిధములగు ఆత్మముక్తి యేడవభూమికా సంబంధములైనవి.

1. సాధారణముక్తి
2. విదేహముక్తి
3. జీవన్ముక్తి
4. పరమముక్తి

## 1 సాధారణముక్తి (మోక్షము)

సత్యప్రియులును యోగ్యులు నెక్కువగా భగవంతుని యందు భయభక్తులుగలవారు మరణానంతరము సాధారణ ముక్తి నొందుదురు. ఆత్మ శరీరమును త్యజించిన నాలుగైదు దినములలో నీముక్తి లభ్యమగును. శరీరములేక యీముక్తి సంప్రాప్తించుటచే వానియాత్మ యానందము ననుభవించును. శక్తి జ్ఞానము లున్నప్పటికి ముక్తినిపొందినవాఁడు వానిపట్ల తూష్ణీభావము వహించియుండును. సంయోగానందానుభవము మాత్రమే యట్లు ముక్తినొందిన యాత్మకుఁ గల్గును. అతనికిక సృష్టి లేనట్లే. ఇంతటితో జననమరణముల పరిభ్రమణమంత మొందినట్లే.

నిర్వాణమునకును, నిర్వికల్పసమాధికి నీ సాధారణముక్తి యనఁదగు మోక్షస్థితికిని సంబంధములేదు. ఆత్మ ముక్తిని పొందుట భౌతికశరీరము నశించినపిమ్మటనే. అట్టియాత్మ శరీర మరణానంతరమే భగవంతుని సమీపించును. పైనఁ దెల్పిన

నిర్వాణ, నిర్వికల్పసమాధులకును, సాధారణముక్తికిని ముఖ్యమగు వ్యత్యాసముకలదు. మొదటి రెండు నాత్మశరీరముతో నుండగనే యనుభవములోనికి వచ్చును. అనఁగా నట్టివాఁడు విదేహాముక్తుఁడగును.

## 2 విదేహ ముక్తి

విదేహాముక్తులని చెప్పఁబడు సాక్షాత్కారము పొందిన కొన్నియాత్మలీ సాక్షాత్కారముపొందిన మూఁడునాలుగు దినములవఱకు శరీరమును నిలుపుదురు. వారి చైతన్యము తమ నిజాత్మ(భగవంతుఁడు)లో లీనమగును. అందుచే వారి శరీరములయు, సృష్టియు, స్మృతి వారి కుండదు. వారు సదా భగవంతుని యనంతానందము,ననంతశక్తిజ్ఞానముల ననుభవింతురు. కాని వారిశక్తులను సృష్టిలో నుపయోగింపలేరు. ఇతరుల ముక్తికొఱకై వానిని వినియోగింపలేరు. వారు భూమిపై నున్న కొలఁది దినములలో ననంతమైనట్టియు, నీపైన దెలుపఁబడినట్టియు శక్తులను నలుదిశలఁ బ్రసరింపఁజేయుదురు. అట్టి వారిని సమీపించి వారికి సేవచేసి యారాధించువా రెక్కువ లాభమును పొందఁగలరు. కొందఱు తమప్రారబ్ధవిశేషములచే దమ శరీరము నేండ్లతరఁబడి నిలుపుకొందురు. విదేహాముక్తుని వేదాంతములో బ్రహ్మీభూతులనియు, సూఫీలు ముజూజేకమిల్ అనిపిలుతురు. విదేహాముక్తులు మూఁడు కోశములనుదమంతతామే యప్రయత్నముగా ననుభవింతురు. వేదాం

మున నీమూఁడుకోశముల నానందకోశము, జ్ఞానమయకోశము, శక్తిమయకోశము అని తెలుపుదురు.

## 3 జీవన్ముక్తి

జీవన్ముక్తుఁడు తురీయావస్థలోనుండును. (పానాఅల్ బాఖా) పైన దెలుపఁబడిన మూఁడుకోశముల ననుభవించును. అతని చైతన్య మెుక్కొక్కసమయమునఁ దానే భగవంతుఁడ నను స్థితిలో నుండును. ఇదియునుగాక మూఁడుగోళములనఁదగు లోకములు, స్థూలసూక్ష్మమనోలోకముల చైతన్యముగూడఁ గలిగియుండును. కాని నియమితమగుపని లేకపోవుటచే నీ యానందజ్ఞానశక్తుల నితరులకొఱకు వినియోగింపఁడు.

## 4 పరమ ముక్తి

పరమముక్తుని సద్గురువని (కుతుబ్) పిలుతురు. అతఁడు భగవత్సాక్షాత్కారము పొందినతరువాత సాధారణచైతన్యము నకుఁ దిరిగివచ్చును. భగవంతునిలో నైక్యస్థితియు ననంతజ్ఞాన శక్తిస్థితిత్రయమునయు, స్థూలసూక్ష్మమనోలోకములయు నను భవము నేకకాలమందు పొందియుండును. మూఁడుకోశముల (జ్ఞానఆనందశక్తుల)ననుభవించుటయేగాక మహామనస్సుద్వారా వానిని సర్వసృష్టిసంబంధమగు సర్వభూమికల నుపయోగిం చును. అవతారములయు, సద్గురువులయు, మహాకారణశరీర ములద్వారాకూడ నీపైనఁదెలుపఁబడిన శక్తులను నుపయో గించును.

అట్టిపరమముక్తులు తామేభగవంతుఁడను చైతన్యమును భగవంతుని సగుణ నిర్గుణరూపముల రెండింటియందును కలిగి యున్నారు. వారు మార్పులేని శాశ్వతత్వముకల భగవంతుని నిగ్గనియు, ననంతములగు రూపములనియుఁగూడ వారికిఁ దెలియును. సృష్టికంటె భిన్నమైనభగవంతుని యనుభవమును పొందియున్నారు. అనఁగా సృష్టిస్థితిలయకారకునితో నేకత్వమును బొందుచున్నారు. ఈసృష్టిపరిమితలక్షణముల నధిగమించిన భగవంతునిలో నైక్యమును పొందుదురు. 226 వ పేజీకి నెదురుగాఁజూపిన చిత్రములోని భగవంతుని పదియవస్థలలోను ప్రత్యవస్థ చైతన్యమును కలిగియుండును.

మూఁడుకోశముల పరమశాంతిస్థితిని పరమముక్తుఁడెప్పుడు ననుభవించుచు దాని నుపయోగించును. భగవంతునిసృష్టి లీల నానందించును. అది నడచునట్లుచేయును. సర్వవ్యాపియగు భగవంతుఁడు తానేయని యతనికిఁ దెలియును. అందుచే నాధ్యాత్మికమార్గమున నెల్లవానికిసహాయము చేయఁగలఁడు. నాలుగువిధములలో నేవిధమగు ముక్తినైన నితరుల యాత్మలు పొందునట్లు ప్రసాదింపఁగలఁడు. అతఁడు మొత్తముమీఁద సృష్టియంతకును, ప్రత్యేకము మానవలోకమునకు సహాయకారి.

22 (203వ పేజీ 19వ పంక్తి సాలిక్‌లు లేక జీవన్ముక్తులనువారు)

## నాలుగు విధముల ముక్తి సంగ్రహము

(శ్రీ) మెహర్‌బాబాగారీక్రిందివిధముగఁ దెలుపుచున్నారు.

| ముక్తివిధము | చైతన్యము | ద్వంద్వములోని ధర్మము |
|---|---|---|
| సాధారణముక్తి | ఆనంద మొక్కటే; నేనే భగవంతుఁడనని కాని, ద్వంద్వ చైతన్యముకాని లేదు. | లేదు |
| విదేహముక్తి | సచ్చిదానందముతోఁగూడిన నేనే భగవంతుఁడనను చైతన్యము. ఇందు ద్వంద్వస్మృతి లేదు. | లేదు |
| జీవన్ముక్తి | నేనే భగవంతుఁడ నను భావము ఒకమారు ద్వంద్వహీనమై మఱియొకమారు ద్వంద్వసహితమైన చైతన్యము. | లేదు |
| పరముక్తి | ఏకకాలమందే నేనే భగవంతుఁడనను చైతన్యము ద్వంద్వానుభవముతోఁ గూడియుండుట. | కలదు |

ఆ న ం ద ము= ఆనందమయకోశము=జ్ఞానమయకోశము+ శక్తిమయకోశము
సత్ చిత్ ఆనందము=ఆనందమయకోశము +ద్వంద్వము=స్థూలసూక్ష్మమనోలోకములు =సర్వసృష్టి

23 (207 పేజీ 11వ పంక్తి మానవుని సద్గురువు అని పిలుతురు.)

సద్గురువునుదప్పకుండ గుర్తుపట్టగలమార్గమును తెలుప వలసినదని యొక శిష్యుఁడు వేసిన ప్రశ్నకు శ్రీ మెహర్ బాబాగారిట్లు తెలిపిరి.

"సాధారణ మనుష్యుఁ డాఱవభూమికవఱ కాధ్యాత్మిక మార్గములలో నుండు వివిధాంతరములను గుర్తించుట కష్టము. అట్టి యాత్మ లున్నతదశలో నున్నట్లు తెలిసి కోఁగలఁడుకాని యెంత యుచ్ఛస్థితిలోనున్నవో తెలిసి కొనఁజాలఁడు. సరియైన సత్యాన్వేషకుఁ డాధ్యాత్మికముగాఁ బక్వదశ పొందినవ్యక్తికి సన్నిహితుఁడైనయెడల నాంతరంగిక మగు నాధ్యాత్మికౌన్నత్యమును గొన్ని పైకిఁగనఁబడు సూచనలద్వారా తెలిసికొనఁగలఁడు.

ఈ లక్షణములలో ముఖ్యమైనవి మూఁడు. మొదటిది: పరిపూర్ణత. భగవంతునియం దైక్యమందుటతో నాగదు. సర్వముతోఁ దానొకటేయనుభావ మెడ తెగకుండఁ గోచరించును. సద్గురు సంగతిలో నిది తన యాత్మయనెడి యనుభవము నెల్లవేళలందును పొందుచుండును. ఇట్టి యాంతరంగికమైన యనుభవము సృష్టి యంతటియందును బ్రకటితమగు

సప్రియత్న ప్రేమగా బహిర్గతమగును. అతని రాగవిరాగము లకు గుఱియగునది లేదు. మంచిచెడ్డలు, పుణ్యాపాపాత్ములు, సాకారవికారములు, వివేకమూర్ఖతలు, రోగనిరోగములు మొదలగునవియన్నియు నాతని స్వరూపమునందలి నానామూర్తులే. మానవరూపములోనున్న పరిపూర్ణత్వము (సద్గురువు). ఏ జీవినైనను పోషించినను, ప్రేమించినను, దనను దానే పోషించి ప్రేమించినట్లు సంతోషించును. ఇం దితరము పరమను ఛాయయే యుండదు.

రెండవచిహ్నము: ఒక విధమగు నతీతాధ్యాత్మికానందమును వెదజల్లు వాతావరణము సద్గురువు పరిసరములలో వ్యాపించియుండును. దానికోసము వెదకుచున్న క్రొత్తవానికది గుర్తుకువచ్చును. సద్గురు వనంతమగు నానందము ననుభవించుటయేగాక, సర్వవ్యాప్తమగు బాధలనుగూడ ననుభవించును. ఆనందాతిశయముచే బలవత్తరమగు నీబాధ నిస్సారముగా చేయఁబడుచున్నది. ఎట్టికష్టములలో నితరులుపెట్టు హింసల లోను గూడ సద్గురువానందమయ శాంతమును వహింపఁ గలుగుచున్నాడు.

మూఁడవచిహ్నము : సద్గురువే శ్రేణికి చెందిన మానవ కోటితో నైనను సమరసముతో నుండఁగలఁడు. సింహాసనము మీఁదను, మురికి గుంటలో నొకేవిధమగు నిర్లక్ష్యముతో నుండఁ గలఁడు. లేనివారితో క్లుప్తముగాను, నున్నవారితో దుబారాగాను, రాజులతో రాజకీవితోను ప్రజ్ఞానంతులతో బుద్ధిమంతుఁడుగాను, విద్యలేని యమాయకులతో విద్యాగంధము లేనివానివలె నుండఁగలఁడు. భాషాజ్ఞానము కలిగిన పండితుఁడు

నధ్యాపకుఁడు వివిధబుద్ధి చాతుర్యము గల తమశిష్యులకెట్లు బోధించునో యట్లే యాధ్యాత్మికముగా దానుద్ధరింపఁ దలఁచిన వారిపట్ల సద్గురువు వర్తించును".

ఆధ్యాత్మికజ్ఞాన సముపార్జనమునుగుఱించి ఘౌస్ ఆలీషా కలాండర్ ఉపన్యసించుచు నిట్లుచెప్పెను. "శిష్యుని కాధ్యాత్మిక మహావిద్యను (పూర్ణసిద్ధి)ప్రసాదించుట కొక క్షణకాలము లోని భాగమైనచాలును. చెవిలోనొక్కమాట వదలినచో మానవుఁడు పరిమితస్థితినుండి యనంతస్థితిపొందును. అట్టి యద్భుతమగు మార్పుపవాసములయు, ప్రార్థనములయు నాధారమునఁ గలుగును."

మహాలానారూమి యిట్లు చెప్పెను.

"భగవంతుని కరుణ యొకవ్యక్తి శక్తిసామర్థ్యములపై నాధారపడియుండదు. ఒకని సామర్థ్యము వాస్తవముగా భగవంతుని కరుణపై నాధారపడియుండును." ఈమాటవిని యొక శిష్యుఁడిట్లు ప్రశ్నించెను. "అయ్యా సాక్షాత్కార మింత సులభముగా లభ్యమైనచో, శిష్యులిట్లు దీర్ఘకాలముపరీక్షలకు, శిక్షలకును గుఱిచేయఁబడుచున్నా రేల?" దానికిఁ బ్రత్యుత్తరముగాఘౌస్ ఆలీషా యీక్రింది వృత్తాంతమును దెలిపెను.

ఒకని దగ్గర ననేక వత్సరములుగా తుప్పుమన్ను పట్టిన రెండు పాత్రములున్నవి. వానిని శుభ్రపఱచుట కతఁడు నిశ్చయించుకొనెను. ఒకపాత్రను పాత్రలను శుభ్రపరచువృత్తి కలవానికిచ్చెను. దానిని వాఁడు నలుబది దినములలో బాగు చేసెదనని చెప్పెను. రెండవ దొకనాఁటిలో బాగుచేసెదనని చెప్పగా వానికిచ్చెను. అదేవృత్తి కలవాఁడా పాత్రను

శాస్త్రోక్తముగా బాగుచేయ ప్రారంభించెను. నలువది దినములు దానిని బాగుచేయ మొదలిడెను. దానిని చక్కగా శుభ్రపఱచుటయే గాక యుపయోగ్యముగాఁ జేసెను. రెండవవాఁడొకదినములో పనిపూర్తి చేయనెంచి పాత్ర నొక పెద్ద కొలిమిలో నుంచెను. దీనివలన త్వరతో పని పూర్తియాయెను. కాని యా పాత్ర పలుచనై బలముతగ్గినిరుపయోగమాయెను. రెండు పాత్రలు బాగుపడినప్పటికిని దీర్ఘకాలము నిదానముగా శుభ్రపఱుపఁబడిన దుపయోగములోనికి వచ్చినది. అందుచేతనే సద్గురువు జిజ్ఞాసువునకు మోక్షాధికారము క్షణమాత్ర లభ్యముగాఁజేయఁడు. క్రమముగా నామార్గములో నడిపి, భగవంతుని కార్యమునకు బలమై ప్రయోజనకరమగు పాత్రనుగా నతనిని మార్చును.

ఈ సందర్భములో శ్రీమెహర్ బాబాగారు తనయనుచరులతో నొకమారిట్లు పలికిరి.

"సాక్షాత్కార మెవరికైన నొకక్షణములో లభ్యమగునట్లు చేయవచ్చును. అది పొందినవారికి మాత్రము లాభించును. మిగిలినవారికుపకరింపదు. ఆత్మత్యాగము శిక్షణ, కష్టానుభవము గురువుగారి యానతిప్రకారము పొందినవానికొకశక్తి ప్రసాదితమగును. దానివలనఁ దాఁబొందిన భగవత్ సాక్షాత్కార మితరులలో నాధ్యాత్మిక జాగృతికొరకై పని చేయుటకు వలసిన శక్తి యొనకూడును.*

---

* ఆధ్యాత్మికమగు పరిపూర్ణతకును, ద్వంద్వములను సంబంధించిన ప్రగతికిని గల తారతమ్యము తెలిసికొనుటకు శ్రీబాబాగారి Discourses మొదటివాల్యూము చూడవలెను.

24 (208 పేజీ 17వ పంక్తి విజ్ఞానభూమికలోనుండి)

## అనుభవము అవస్థ (హాల్; ముఖమ్)

సూఫీ అధ్యాత్మ జ్ఞానరీతిననుభవము, అవస్థలను గుఱించి సంగ్రహముగా నీక్రిందఁ దెలుపఁబడినది. కొందఱు సూఫీలీ రెంటికి నెన్నఁదగిన భేదము లేదని నమ్మెదురు. ప్రత్యవస్థయు ప్రారంభములో ననుభవమనియు చివరకవస్థగా మారుననియు చెప్పెదురు. ఇది సూక్ష్మమనోగోళములతోఁగూడ నన్ని భూమికలకును వర్తించును. కాని కొందరీ రెంటికిని భేదమును పాటింతురు.

బస్రా కాపురస్థుఁడగు శ్రీ అబ్దుల్లా హారిస్ ముహాసిబి అభిప్రాయ మిట్లున్నది.

అనుభవము దైవదత్తము. అది విద్యుల్లతవలె క్షణికము. అది సాధనవల్ల (ముజాహిదా) లభ్యమగును.

అవస్థయనునది పశ్చాత్తాప ఫలము. అది నిరంతరానుభవము కూడ నున్నచో లభ్యమగును.

'అవారి ఫుల్ మారిప్' గ్రంథకర్త యిట్లు చెప్పుచున్నాఁడు.

అనుభవము పైలోకమునుండి సాధకుని హృదయముపై వచ్చి పడెడి యొకరహస్య విషయమును లేక సంఘట్టనను సూచించును. ఇవి సాధకుఁడు క్రిందినుండి యూర్ధ్వస్థితిని పూర్తిగాఁ జేరునంతకును వచ్చుచు బోవుచు నుండును.

అవస్థ యనునది యధ్యాత్మమార్గమున జిజ్ఞాసువు చేరెడి యొక మజిలీ. ముందునకు సాగిపోవువఱ కతఁ డక్కడకొంత కాలము నిలచియుండుచోటు.

అనుభవము సాధకుని స్వాధీనములో నుండదు. సాధకునే యది స్వాధీనములో నుంచుకొనును.

అవస్థ యాత్రికునికి లోఁబడియుండును.

అనుభవము దైవదత్తము.

అవస్థ సంపాదించుకొన్నది.

అనుభవముఅవస్థతో సంబంధము లేకుండ నుండ నేరదు.

అవస్థయు ననుభవముతో సంబంధము లేకుండ నుండ నేరదు.

ఘాజురేయి లాహి అనుపేర తెలియఁబడెడి షేక్ మహమ్మదు యిబ్రహీమ్ తన 'యిర్షాదాత్' అను గ్రంథమున నిట్లు చెప్పుచున్నాఁడు.

అనుభవ మెడ దెగక యున్న యెడల నవస్థయగును. అనుభవమును పొందినవాఁ డారంభకుఁడు. అది సాగినచో పరిపూర్ణత్వము సిద్ధించును.

శ్రీ మెహర్ బాబాగా రిట్లు వ్యాఖ్యానించుచున్నారు.

అనుభవమను మాట సాధారణార్థమున ననుభవము, అంతర్గతమైనది. (అపరిమితానందము మితము అపరిమితము కూడ) ఈ యంతర్గతానుభవము మొదటి యాఱుభూమికలలో

నన్యోన్యసంబంధము కలిగిన స్థితికిఁ జెందినది. ఈసందర్భములో ననుభవ మనఁగా ననంతానందమన్నమాట. అది యున్న స్థితికి సంబంధించి యుచ్ఛస్థితియందుండును. వేదాంతములో 'హాల్' అనఁగా భావము. ముఖమ్ అనఁగా స్థానము. ఒక ప్రత్యేకభావములో (హాల్) ఒక నియమితమైన భూమికలో సాధకుఁడు నిలచియుండుట 'ముఖమ్' అందురు.

ఆఱవభూమికలోనికిఁ బోవువఱకు, 'హాల్, ముఖమ్' కలసిపోవును భావము హాల్ ముఖమ్ (స్థానము లేక అవస్థ) కంటెఁ బైస్థాయిలో నుండును.

ఈరెండు నేడవభూమికలో నుండవు.

భావమున్నచోట ద్విత్వముండును. ఏడవభూమికలో నున్నవాఁడు తనధర్మనిర్వహణము నిమిత్తము సాధారణచైతన్యమును బొంది యే భూమికయందైనను స్థానమేర్పరచుకొనిన యెడల నాభూమిక యతనిస్థానమగును. అదియే యవస్థ. అందుచే సద్గురువునకు స్థితి(ముఖమ్) తప్ప భావములేదు. సాధారణమానవులు సహజముగా భావోద్రేకము కలవారు సంగీతము వినునపుడు భావానుభవమున నానందింతురు. కాని దీనికి నాధ్యాత్మికమార్గములో నున్న జిజ్ఞాసు భావానుభవమునకును సంబంధములేదు.

25 (218 పేజీ 17వ పంక్తి సద్గురువులద్వారా తనదివ్యస్థితిని)

భగవంతుని సాక్షాత్కారము పొందిన మొదటి వ్యక్తిగత యవతారమగునా యను ప్రశ్నకు బాబాగారి సమాధానము తెలుపుచున్నారు,

"అఖండ చైతన్యమును మొదటపొందినవాఁడు భగవంతుఁడు, (భగవంతునిస్థితి IIB లో వ్యాఖ్యానముచూడుము). అనఁగా భగవంతుఁడు తన్ను తానెఱిఁగెను. వెనువెంటనే భగవంతుఁడు IIA. స్థితిలో నంతము లేని చైతన్యహీనతలో నున్నాఁడు. (God state IIA. వ్యాఖ్యానము చూడవలెను.) భగవంతుని మిగిలిన అవస్థలు, భగవంతుని IIA. స్థితిలో నుండి యనంతమగు చైతన్యమును పొందుటకు జరుగు శాశ్వత సంకల్పము నుండి బయలుదేరుచున్నవి.

"ఈ కార్యకలాపము ద్వారా మానవుఁడు భగవంతుఁడగుట మనము చూచుచున్నాము."

"సద్గురువు దేవాంశము కలిగిన మానవుఁడు. పరిణామాంతః పరిణామ మార్గములను పట్టవలసినవాఁడు. కాని యవతారము భగవంతుఁడే మానవరూపము పొందినవాఁడు. అనఁగా పరిణామపద్ధతులలో ప్రమేయము లేకుండఁగనే భగవంతుఁడు నేరుగా మానవత్వముపొందును."

"అయిదుగురు సద్గురువులు (కుతుబ్‌లు) అవతార్ భూమిపై నవతరించుటకు సహాయభూతులగుదురు. (రసూల్ క్రీస్తు, బుద్ధుఁడు) అందుచే సద్గురువులు ముందువచ్చిన తరువాతగానియవతారముభూమిపైనవతరించుట జరుగదు. అందుచే నాదిలో నయిదుగురు సద్గురువు లాత్మ సాక్షాత్కారము పొందిన తరువాత, మొదటి యవతారము భూమిపై నవతరించుట జరిగినది."

"ఆదాము మొదలు 26 అవతారములు వచ్చెనా? లక్ష యిరువది నాలుగువేల మతప్రివక్తలు వచ్చిరా? యేసుక్రీస్తు తుదియవతారమా లేక ఒక్కఁడేయవతారమా? మహమ్మదు ఆఖరు ప్రివక్తయా? వీని శాశ్వతత్వమును సత్యము లేక యదార్థతనుగురించి మనమాలోచించినప్పు డప్రస్తుతములు. నత్యల్పములుగాఁదోచును. అవతారములు పదియా? యిరు వదియా? లేక పదిలక్షలా? యనువిషయమంతె చర్చనీయాంశముకాదు. సత్యమేమన నవతారమెప్పుడు నొక్కటియే మార్పులేనిది. అయినగురు సద్గురువు లా యవతారము భూమిపై నవతరించునట్లు చేయుదురు. ఇదియుగము తరువాతయుగము లో జరుగుచున్నది. లక్షలకొలఁది యుగములిట్లు దొరలిపోవుచునే యున్నవి. కాని యనంతమగుకాలముపై వీనిప్రిభావమిసుమంతైనను లేదు."

26 (218వ పేజీ 22వ పంక్తి శివాత్మలఖండ శక్తిజ్ఞానా నందములు)

ఏడవ భూమికయందలి నేను భగవంతుఁడను 'అహమ్బ్రిహ్మాస్మి'*అను,మజూబ్ (బ్రహ్మీభూతుఁడు)అజాడేముతలక్ (జీవన్ముక్త) కుతుబ్ (సద్గురువు) రసూల్ (అవతారము) విషయమును గురించిన వివరములను శ్రీ మెహర్ బాబాగారిట్లు తెలుపుచున్నారు.

---

*భౌతిక శరీరమును వదలిన తరువాత (మరణానంతరము) వీరందరును ననంత కాలముగా 'అహమస్మి' లో నుందురు.

1. మజూబ్ (బ్రహ్మీభూతుఁడు)
అనల్_హక్ :_ అనంతమగు నేను భగవంతుఁడను(అహం బ్రహ్మాస్మి) అనుభావము.

2. అజాడేముతలక్ (జీవన్ముక్తుఁడు)
అనల్_హక్_ అహంబ్రహ్మాస్మి అనుభావము కలిగియు లేకయు నుండుట.
హమూబామన్ అస్త్:_ "సర్వము నాతోనున్నది."

3. కుతుబ్ (సద్గురువు)
అనల్ హక్ :_ (అహంబ్రహ్మాస్మి) నేను నేనే
హమూమన్ అమ్:_ అనఁగా సర్వము నేనే
హమూదార్ మన్ అస్త్:_ సర్వము నాలోనేయున్నది.
హమూఅజమన్ అస్త్:_సర్వము నానుండియే.

4. సాహేబ్ యే జమూన్:_ (అవతారము)
అనల్ హక్ :_ (అహంబ్రహ్మాస్మి) నేను నేనే
మన్ హమూఅమ్:_ అనఁగా నేను సర్వమునై యున్నాను
మన్ దార్ హమూఅమ్:_ అనఁగా నేను సర్వమునందు నున్నాను.
హమదార్ మన్ ఓ అజమన్ అస్త్ :_అనఁగా సర్వము నాలోనున్నది. నాదగ్గఱనుండి వచ్చుచున్నది.

24

27. [220 వ పేజీ ఫుట్ నోటు]

(శ్రీ) బాబాగారు తెలుపదలంచిన దేమనగా "సద్గురువు మంచియారోగ్యముగా నున్నాడనికాని, అనారోగ్యముగా నున్నాడనికాని చెప్పినప్పు డీ విషయములను సామాన్యమాన వులు చూచుచు ననుభవమువలన దెలిసికొనుచున్నారు. సత్య మేమనఁగా సద్గురువు దృష్టిలో నారోగ్యరోగము లాయన యనంతాత్మనంటవు. ఈమాయ యంతయు మాయగానే యాయనకు స్మృతిలోనుండును. రోగము న రోగము రెండు మాయకు సంబంధించినవనియు శూన్యములోనుండి జనించిన వనియు నాయనకుఁ దెలియును."

"శూన్యమున కాయనపై ప్రభావమెట్లు కలుగును? పరిణామమువల్ల పునర్జన్మము, అంతఃపరిణామమువల్ల శూన్యతా జనితమైన సంస్కారములను జయించెను. అతఁడే సర్వమయుఁ డను సంగతి సాక్షాత్కారముచేసికొనినాడు. సద్గురువు, సృష్టి ధర్మము పరిమితిలోనున్న నాధర్మ మతని నంటదు."

"సద్గురువనఁగా మానవుఁడు భగవంతుని యంశము పొందెనన్న మాట. అనఁగా మానవుఁడు భగవంతుఁడైన తరు వాత మానవుఁడుగా నుండఁజాలఁడు. మానవుఁడుగా జీవింప వలెనన్నచో, మానవునకు స్వభావసిద్ధములగు లక్షణము లన్నియుఁ బ్రకటించుచు మానవునివలె కర్మములు చేయుచుఁ గనఁబడవలెను."

"పూర్ణత్వమును పొందిన సద్గురువుగా దనకు సమయో చితమగుపాత్ర నన్ని యంతరములలో భూమికలలో, నతఁడు

పరిపక్వింపవలెను. అందుచే స్థూలప్రపంచములో నుండెడు సాధారణ మానవులలో నొకనివలె గన్పట్టును. సూక్ష్మ భూమికలో నుండువారికా భూమికకు సంబంధించినవాఁడుగాఁ గనఁబడును. మనోభూమికలో నుండువారి కట్లే మనోభూమికలో నుండునట్లు కనఁబడును."

"సద్గురు వాకేపర్యాయ మత్యున్నత నీచ శ్రేణులలో నుండఁగలఁడు. ఒకవైపున యదార్థమగు ననంతసత్యములో నిలిచియుండును. మరియొక వైపున మాయకధికారిగా నుండును. సద్గురువు హెచ్చుతగ్గులు లేక యుచ్చనీచములను దనస్వాధీనములో నుంచుకొనును. వివిధములగు సంతర్గతావస్థలలో నీ యాద్యంతములనుండు ద్వంద్వవిషయములను సమన్వయము చేయవలెనన్నచో సద్గురు వన్నియంతరములలో నొకేమారు ప్రవృత్తుఁడై యుండవలెను."

"అవతారవిషయ కథ వేఱు. ప్రధానమగు వ్యత్యాసము, సద్గురువనఁగా మానవుఁడు భగవదంశమును పొందుట; అవతారమనఁగా భగవంతుఁడు మానవుని స్థితిలోనికివచ్చుట. అవతారమను పదము నర్థమును పూర్తిగా గ్రహించుట కష్టము. అవతారమనఁగా భగవంతుఁడని, భగవంతుఁడు మానవ రూపము దాల్చినాఁడని మానవజాతి చెప్పుట సులభమే. అంతమాత్రముచే నవతారమనుమాట కర్థము పూర్తి కాలేదు."

"అవతారము భగవంతుఁడనుట ఎక్కువ సమంజసము. మానవలోకమునకు భగవంతుఁడు మానవుఁడగును. అట్లే

సృష్టిలోని ఖగాదిలోకమునకు ఖగాదియగును. పిపీలికాది జంతుజాలమునకు నా యా రూపములు గల జంతువగును. రజఃకణసమూహములో రజఃకణమగును. సృష్టిలోఁ బ్రతి వస్తువు విషయములోఁగూడనంతే".

"అయిదుగురు సద్గురువులు భగవంతుని దివ్యాంశను మాయలోఁ బ్రవేశపెట్టినప్పు డీ దివ్యత్వమే మాయ నంత నావరించి వివిధములగు రూపములలో దానుగాఁ బ్రత్యక్షమగుచున్నది. స్థూలసూక్ష్మ మనోరూపముల అవతారకాలములనీభగవంతుఁడు మానవులలో మానవుఁడుగా జంతువులలో జంతువుగాను జనించును. స్థూలప్రపంచములో నుండు సాధారణమానవుఁ డిది గ్రహింపలేక భగవంతుఁడే మనుష్యుఁడైనాఁడని చెప్పును. ఈ యభిప్రాయముతోఁ దృష్టిపడియూరకుండును."

"మానవుఁ డెట్లర్థముచేసికొన్న నవతార మవతరించును; (becomes) (భవతిఅస్తి యనుభావవికృతి గలది) సద్గురువు క్రియాప్రధానుఁడగును."

"అవతారానారోగ్యము కర్మఫలప్రాప్తమైనది కాదు. భగవంతుఁ డవతారమైనప్పుడు మానవరూపమును దాల్చుటచే నారూపము లేక శరీరమునకు సంక్రమించు నైసర్గిక లక్షణముల మంచిచెడ్డల ననుభవింపకతప్పదు. అవతారములో భగవంతుఁడు మానవుఁడైనాఁడు. మానవుఁడే సాధారణమానవునివలె నవతార మనారోగ్యమునకు గుఱియైన ననంత

మగు సచ్చిదానందములు గూడ నతని స్వాధీనములో నున్న వనుసంగతి మఱువరాదు."

"వ్యక్తుల కర్మపరిపాకఫలముల నవతారము తనపైవేసి కొనఁడు. ఆయన దివ్యవిభూతి (God hood) సర్వవ్యాపక మైన పనిచేయుచుండును.

28. [221వ పేజీ 3వ పంక్తి నీ భూమిపై]

ఆధ్యాత్మాచార్యాధిపత్యపరంపరగుఱించి శ్రీ మెహర్ బాబాగారిట్లు చెప్పుచున్నారు. "ఒక్కొక్క కాలచక్రపరిభ్రమణములో ఏడువందలు మొదలు పదునాలుగువందల వత్సరముల వఱకుండును. అందు పదకొండంతరము లొక్కొక్కటి అఱువదియైదు మొదలు నూటయిరువదియైదు వత్సరములవఱకుండును. ఈప్రతికాలచక్రము మొదలు చివరవఱకును మొత్తముమీద 55 సద్గురువు లుందురు.అనఁగా నొక్కొక్క యంతరములో* 5 గురు సద్గురువులుమాత్రమే యుందురన్న మాట. ఈ చక్రములో 11వ యంతరమును తుదిదానిలో నవతారము (సాహెబ్-ఏ-జమన్) కూడ నుండును. ప్రతిచక్రములోను 55 సద్గురువులవతారముగాక 56 'మజూబ్-యే-కమి'లులుబ్రహ్మీభూతులుకూడ కలరు. ఈబ్రహ్మీభూతులు భగవంతుని సృష్టి లీలాకార్యములో నిద్రలో మునిఁగియుండు భాగస్వాములు.

---

* వేదాంతములో ఒక కాలచక్రమును యుగమందురు.

| | | సద్గురువులు Perfect Masters | బ్రహ్మీభూతులు Perfect Ones | |
|---|---|---|---|---|
| 1. | మొదటి మహాయుగము | 5 | 7 | (ఇందు సాక్షాత్కారముపొందిన వెంటనే శరీరమును త్యజించువారు నలుగురు) |
| 2 | ,, | 5 | 3 | |
| 3 | ,, | 5 | 7 | ,, |
| 4 | ,, | 5 | 3 | |
| 5 | ,, | 5 | 7 | ,, |
| 6 | ,, | 5 | 3 | |
| 7 | ,, | 5 | 7 | ,, |
| 8 | ,, | 5 | 3 | |
| 9 | ,, | 5 | 7 | ,, |
| 10 | ,, | 5 | 3 | |
| 11 | ,, | 5 | 6 | (ఇందు ముగ్గురు సాక్షాత్కారానంతరము శరీరమును వదలుదురు) |
| | అవతారము | 1 | | |
| | | 56 | 56 | |

ఈ సూచిక నర్థముచేసికొనుట కీ క్రిందివిషయములు జ్ఞాపకముంచుకోవలెను.

(1) ఒక కాలచక్రము 700 మొదలు 1400 సంవత్సరములవరకునుండును. ఇందు 11 అంతరములుండును. ప్రత్యంతరములో నొక్కొక్కటి 65 మొదలు 125 సంవత్సరములుండును. ఈకాలపరిమితి కాలచక్రపరిమితివలెనే భౌతికాధ్యాత్మికసంబంధమైన సర్వసృష్టినిగురించిన విషయముల యాధారమునఁ బ్రవర్తించును.

(2) ప్రత్యంతరములో నీపరంపర 7000 మందియాధ్యాత్మికోన్నతికలిగిన జీవులను గలిగియుండును. ఉచ్ఛస్థితిలోనున్నవారు మొదటిభూమిక మొదలాఱవదానియంతమునఱకునుండుదురు. ఇందు సద్గురువులు బ్రహ్మీభూతులుందురు. ప్రత్యంతరములోను 1 మొదలు 10 మందివఱకు 5 గురు సద్గురువు లుందురు. అందొకరు 'కుతుబ్-యే-యిర్షాద్.'

(3) పదునొకండవదియుఁ దుదియునగు నంతరమున నయిదుగురు సద్గురువులలో 'కుతుబ్-యే-యిర్షాద్'ఉండరు; అవతారముండును. ఆయన మానవరూపమున నవతరించును. ప్రత్యంతరములో 5 గురు సద్గురువులసంఖ్య యట్లే నిలచియుండును.

(4) బ్రహ్మీభూతు (మజూబ్‌లు) లీ యంతరములలో మారుచుందురు. 7 గురు మొదటియంతరములో, 3 గురు రెండవయంతరములోనుందురు. తిరిగి 7-గురు మూడవఅంత

రములోనుండురు. 11వ యంతరములో 6గురు బ్రహ్మీభూతు లుందురు.

1,3,5,7,9,11 అంతరములలో ముగ్గురుబ్రహ్మీభూతులు కంటె నెక్కువున్నచోట అదనముగానున్నవారు భగవత్సాక్షాత్కారము పొందుటతోడనే శరీరమును త్యజించెదరు. 11వ తుదియంతరములో 6గురు బ్రహ్మీభూతులున్నచోట ముగ్గురు దేహత్యాగముచేసెదరు.

అనఁగా నేయంతరములోనైనను 3గ్గురు బ్రహ్మీభూతులుమాత్రము శరీరధారణముచేసెదరు. కార్యనిర్వహణము చేయు నధికారబృందములో* ఒక్కొక్క అంతరములో 3గ్గురు మాత్రమేయుండురు.

అధికారవర్గములోని 7000 మంది వివిధములగు నాధ్యాత్మికభూమికలలో నీక్రిందివిధముగా నుందురని శ్రీబాబాగారు తెలుపుచున్నారు.

---

*Functioning Hierarchy సర్వకాలములయందు, కాలచక్రములయందు, యుగములయందు, భూమిపై మానవరూపములో భగవత్సాక్షాత్కారముపొందిన శివాత్మలు 56 ఉందురు. ఇందెనమండుగురు మాప్రేమికులలోనున్న యాచార్య గురువర్గములో ముఖ్యముగా కార్యక్రమములో నిమగ్నులై యుందురు. వారివారి యాధ్యాత్మికోన్నతినిబట్టి వివిధచైతన్య భూమికలలోను వేరువేరు నియమితధర్మములను నెరవేర్చెడి యీయాచార్య వర్గములో 7 వేలమంది వ్యక్తులుకలరు.

పైలెక్కలప్రకారము 56 లోను మిగిలిన సాక్షాత్కారము పొందిన 48 మంది పైనతెలుపఁబడిన 7 వేలమందిలోఁ జేరలేదు. ఈ 48 మంది మిగిలిన 8 మందివలెనే 'అహమస్మి' అనుపవిత్రస్థితి ననుభవించు చున్నప్పటికిని

మొదటి భూమికలోను; 1_2; 2_3; 3_4; 4_5; 5_6 మధ్యముల

| | | |
|---|---|---|
| 6, 7 | మధ్యమున | 5600 |
| 2 | భూమికలో | 666 |
| 3 | ,, | 558 |
| 4 | ,, | 56 |
| 5 | ,, | 56 |
| 6 | ,, | 56 |
| 7 | భూమికలో (శరీరధారులైన) | |
| | బ్రహ్మీభూతులు | 3 |
| | సద్గురువులు | 5 |
| | | 7000 |
| 11 | అంతరములోని అవతారము | 1 |
| | తో సహా | 7001 |

ప్రజలుమాత్రము వారిమహత్త్వమును గుర్తింపలేరు. నియమితకార్యకలాపములలో నిమగ్నులైయున్న పెద్దలెవరైనను తమదేహములను చాలించినచో వాలోటును దొలగించుటకై 48 మంది యెప్పుడును సంసిద్ధులైయుందురు.

పైనుదహరింపబడిన సాక్షాత్కారముపొందిన యేనమండుగురిలోను 5 గురు సద్గురువులు. వీరిని ప్రజలుబహుళముగా గుర్తించి గౌరవించెదరు. వీరు మానవకోటికంతకు నాధ్యాత్మికమైన సేవచేయుధర్మమును తెలిగిన వారైయున్నారు. మిగిలిన ముగ్గురును మజాబ్‌లు (బ్రహ్మీభూతులు) భగవత్సాక్షాత్కారము పొంది మానవరూపములో నున్నప్పటికిని, మానవకోటికి సంబంధించిన ఆధ్యాత్మికధర్మము నెరవేర్పవలసిన పనికలిగియుండరు. కాని వారితోసంపర్కము కలిగినవారందరకును వారాధ్యాత్మిక సంబంధముగు మేలుచేయుచుందురు.

29 (228వ పేజీ 9వ పంక్తి అద్వైతసిద్ధాంతమును గూడ)

## తౌహీద్ "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ"

భగవంతుఁడొక్కఁడే యను సిద్ధాంతము నిర్వివాదమైనది. ఎరిగిన యన్నిమతముల కదిప్రధాన ప్రాతిపదికము. వేదాంతములోను సూఫీమతములోను నాధ్యాత్మికసాధనమునకుఁ బరమలక్ష్యము. ప్రజాసమూహ మీసూత్రమునువిశ్వాసముతో నంగీకరించెదరు. కాని దాని ననుభవరూపమైన పరిశీలనచేయు నదవకాశము కొద్దిమందికే కలదు. అదిసులభముగా గనఁబడును. ఉపన్యాసవేదికపై నీసూత్రముపై వ్యాఖ్యానములు చేయవచ్చును. కాని యనుభవైకవేద్యమైన దాని యదార్థతను గ్రహించుట చాలకష్టతరమైనపని.

తర్కాతీతమగు దృష్టినాలోచించితిమేని భగవంతుఁడద్వితీయుఁడు, కేవలుఁడు. వేదాంతములలో దీని నద్వైతమందురు.

---

అనఁగా 5గురు సద్గురువులు మానవకోటియంతటికి నాధ్యాత్మికసంబంధమగు సేవచేయుచుందురు. మిగిలిన ముగ్గురు మజ్జూబ్‌లు వలన వారిని సమీపించువారు ఆధ్యాత్మికప్రయోజనములను పొందుచుందురు. సాక్షాత్కారముపొంది శేషించిన 48 మంది పెద్దలు, లోకము దృష్టిలో లేకుండ దూరముగానుందురు. ఎనమండుగురు నాయకశ్రేష్ఠులలోనెవరైన దేహమును త్యాగముచేసినప్పుడీ పెద్దలాస్థానమునఁ బ్రవేశించుటకు సిద్ధముగానుందురు.

—మెహర్ బాబా

ఇది క్లిష్టమైన విషయము. అంధు డేనుఁగురూపమును దెలిసికొన యత్నించినట్లుండును. వ్యక్తిగతముగాఁ బ్రయత్నించుట మంచిదేగాని ఏనుఁగు సమగ్రరూప మంధుల కర్థమగుట కష్టముకదా? ప్రసిద్ధులగు సూఫీలు భగవంతుని యేకత్వమును *గురించి తెలిసినవిషయము లీక్రింద పొందుపరుపఁబడినవి.

---

*సూఫీలువ్రాసిన మాటలలో పైకిఁగనఁబడి యన్యోన్యవిరుద్ధము లనుభవములోనికి వచ్చిన సత్యపదార్థము నాయాసందర్భములను బురస్కరించుకొని తగినమాటలలోఁ జెప్పుటకు సాధ్యముకాక పోవుటవల్ల సంభవించినవి. నిజమగు ననుభవముకలిగి సాక్షాత్కారముపొందినవారి మాటలలో సత్యమంతమాత్రమును మరుగుపడదు. ఇదివరకు గ్రంథములో విశదీకరింపఁబడిన కొన్నిటివల్ల తేటతెల్లము కాఁగలవు. ఉదాహరణము.

279 పేజీ. సత్యాన్వేషణము వ్యక్తిగతముగా జరుగును. వివరణముల విషయములోనది ఆవ్యక్తి యాధ్యాత్మికాభినివేశము, శరీరలక్షణము పరిసర ప్రభావమును బట్టియుండును.

287 పేజీ. అనేకులు భిన్నభిన్నములగు ననుభవములను పొందుచుండవచ్చును. కానియాధ్యాత్మిక మార్గమొకటియే.

304 పేజీ. సాక్షాత్కారమునకు సంబంధించిన విశేషములగు ననుభవములు పొందుచున్న నివియన్నియు నొకేపర్యాయము అనుభవములోనికి వచ్చుట జరుగును.

335 పేజీ. ఒకప్పుడు వివరణము లెక్కువైనకొలది కలతయెక్కువగును. అవి తక్కువైనప్పుడు విషయము సరిగా నవగాహనముకాదు. అనేక సందర్భములను దృక్కోణములను దెలుపు నిమిత్తము వివిధములగు పర్యాయ

సంస్కారములు మాసిపోయి, జ్ఞానోదయమై భగవంతుని సహజ స్వచ్ఛందత నావిష్కారమైనప్పుడాయన యద్వితీయ ప్రతిభగోచరించును. (బాగ్దాద్ వాసి జునైద్)

తౌహీద్ (భగవంతుని యద్వితీయత) భగవంతుని గురించిన జ్ఞానము, దీనివలన లౌకికపారమార్థిక సత్యముల వివేకించి తెలిసికొనుటకు వీలగును. వాఙ్మనసాతీతానుభవమున నీ వివేక మిమిడియుండును. (జునైద్)

ప్రేమికుడు ప్రేమించిన దానిలో లీనమైపోవుటయద్వితీయత యందుము (జహంగీర్ సమ్నాని)

తౌహీద్ రెండువిధములు. ఒకటి యవస్థ, రెండవదిదాని వర్ణన. ఈవర్ణనాసంబంధమైన భాగము, మతప్రవక్తలు లోక సంగ్రహార్థము చేయవలసినపనికి సంబంధించినది. ఈయవస్థ యపారమగు సముద్రమువంటిది. వర్ణనకు సంబంధించిన భాగ ముదృష్టి, వినుట, గుర్తించుట, మాట్లాడుటతోఁగూడినది. ఇవి యదార్థములని నిర్ధారణముకానలెను. బహిర్గతమగు లక్షణములతో వీనిసత్యమును స్థిరపరచుట తిరిగి ద్వంద్వమునకు దారి తీయును. తౌహీద్‌లో ద్వంద్వచ్ఛాయకూడ లేదు. మానవుని

---

పదములుపయోగింపవలసియుండును. అనుభవము లేనప్పుడొక విషయమును గురించిన విశదీకరణమే విఘాతముగాఁదోచును. కానియన్యోన్య సంబంధము గల యనుభవములవల్లను చివరకాత్మ సాక్షాత్కారమువల్ల నీయన్యోన్య విఘాతములుగాఁదోఁచు మాటలొకదానితో నొకటిపొందికయు సంబంధమును గలవిగాఁగనఁబడును.

లోనున్న విశ్వాసమీదవ్యంద్వ మార్గములో నడచిపోవును. ఈ యవస్థను తప్పించుకొనుటకు వీలులేదు.

తౌహిద్ వర్ణింపఁబడినప్పుడు దీపముతోఁ బోల్పనగును. అది స్వతస్సిద్ధమైనదిగా సూర్యునితోఁ బోల్పవచ్చును. సూర్యుని ముందరదివ్వె శూన్యములో గనఁబడదు. వర్ణింపఁబడునది, మార్పునకు గురియగును. స్వస్థితిమార్పులేనిది శాశ్వతమైనది. మాటలు హృదయముచేఁ బరిశీలింపఁబడును. ఆధ్యాత్మిక మార్గములో హృదయప్రధానమగు స్థితి చేరుసరికి మాట్లాడుశక్తి (నాలుక) స్తంభించిపోవును. తరువాత హృదయముమీదనాత్మ తనయధికారమును స్థిరపరచుకొనును. ఈస్థితిలో సాధకుఁడు భగవంతునితో మాట్లాడును.

ఈ సంభాషణ మూలతత్వమును గూర్చికాదు; లక్షణమునుగురించి మాత్రమే. లక్షణము మారునుగాని మూలతత్వము మారదు. సూర్యునివేడివల్ల నీరువేడెక్కి తన లక్షణమును మార్చుకొనును. కాని నీరుమాత్రము మారదు. తౌహిద్ అనఁగా భగవంతుని యేకత్వమును స్థిరపఱచుటకుఁ జేయుయత్నమువల్ల మూలతత్వమగు నద్వితీయత్వ స్వచ్ఛతకుఁ గలంకముకలుగవచ్చును. నిరామయమగు నేకత్వమునకు తౌహిద్ యేకేశ్వరవాదికొక తెరగానుండును. దానిని పొందవలెనని చేయుప్రయత్నమువల్ల నదిబలహీనమగుచున్నది. "తౌహిద్‌ను గురించి వ్రాయువానిని ముల్‌హిద్ అందురు. (హేతువాది) దానినిగురించి వేలెత్తిచూపువాఁడు ద్వైతవాది

దానిని హేతువాదముచే నిర్ధారణచేయువాఁడు (తర్కాంశముగా) విగ్రహారాధకుఁడు. (ఊహించువాఁడు).

దానినిగురించి మాట్లాడువాఁడు నైతండికునివంటివాఁడు. దానిని గురించి మౌనము వహించువాఁడు అజ్ఞాని. తాను సాక్షాత్కరించుకొంటిననుకొనువాఁడు ఆత్మవంచకుఁడు. తనకు సమీపములోనున్నదని తలఁచువాఁడు దూరముగనున్నవాఁడు. బుద్ధిబలముచే నెంచి దానినిగురించి యూహించువాడితరులను సమ్మోహపఁబోవును. యత్నము లేకుండఁ దెలిసికొనినవాని కది దక్కదు.

—అబుబకర్ షిబ్లి.

"నిరాలంబతతో తౌహిద్‌నుపోల్చుట దానికి గుణము నాపాదించుటయగును. దానికిగుణమున్నదని చెప్పుటవల్ల దానిని పరిమితముచేయుటయగును. ఈ రెండు నతివాదములకు సమానముగనుండు మధ్యమార్గము సరియైనది; వాంఛనీయమైనది.

—ముహీఅల్ దీన్ యిబన్ అరబి.

తౌహిద్ అనునది తౌహిద్‌నుగూర్చినస్మృతి లేకుండుట. సామాన్యచైతన్యస్థితికిఁ దిరిగి వచ్చువారికి భౌతికభూమికలోఁ గొంతపని యుండవలెను. అందుచే నెప్పటికి జీవితమునఁ దీర్చలేనిఋణము నిచ్చిన ఋణదాత వంటిది తౌహిద్"

—కుమన్ తుల్-కుబ్రా.

భగవంతుని యద్వితీయస్థితియగు తౌహిద్‌ను తెలుపుటకు భాష లేదు. ఆ పరమోత్తమస్థితిలోఁ దెలుపువాఁడు తెలిసికొనువాఁడు లేఁడు. సూఫీలు "తౌహీద్" ను ఐదు ముఖ్యపద్ధతులలో విభజించిరి. అవి మానవుని యాధ్యాత్మికవికాసముతో సంబంధించియుండును.

1. తౌహిద్-యి-అక్వాలి= మాటలో భగవంతుని ఏకత్వము.
2. తౌహిద్-యి-ఆఫాఆలి= కార్యములో భగవంతుని ఏకత్వము.
3. తౌహిద్-యి-అహ్వాలి= భావములో భగవంతుని ఏకత్వము.
4. తౌహిద్-యి-సిఫాటి= లక్షణములో భగవంతుని ఏకత్వము.
5. తౌహిద్-యి-జాతి= మూలతత్వములో భగవంతుని ఏకత్వము.

(1) తౌహిద్-యి-అక్వాలి, అవతారమునగాని ప్రవక్తయందుగాని విశ్వాసమున్న బహుజనులితరగతివారు. ఆయన సందేశములో నమ్మకమున్న వారు వీరు. ఈస్థితిలో భగవంతునియందు నాయన ఏకత్వమున నంగీకారమును నోటిమాటతోఁ దెలిపి ప్రవక్త చెప్పినవిధులను నెరవేర్చువా రధ్యాత్మమార్గ

ములో ముందుకు పోవుదుమని నమ్మెదరు. దీనిని తౌహీద్-యి-షరియట్ అందురు.

(2) తౌహీద్-యి-అఫాలి అనువా రధ్యాత్మమార్గమున బ్రవేశము కనుగొనినవారు, సూక్ష్మగోళముతో సంబంధము కలిగినట్టివారు, భగవంతుని ఏకత్వమునుగూర్చి నమ్మువారు, దేవతలసమూహములోఁ జేరుదురు. ఇందు మంచిచెడ్డల రెంటి వెనుకను భగవంతుని లీల యున్నదను నాధ్యాత్మికవిశ్వాసము కలుగును.

"మహాత్మానస్తుమాం పార్థదైవీం ప్రకృతిమాశ్రితాః
భజన్త్యనన్యమనసోజ్ఞాత్వాభూతాదిమవ్యయమ్"
(భగవద్గీత, 7-13)

3. తౌహీద్-యి-అహ్వాలి అను స్థితి మనోగోళమున నయిదవభూమికయందు బురోగమనస్థితిలో నున్న యాత్మలకు లభ్యమగును. ఈ స్థితిలో నాత్మ భగవంతుని శక్తితో స్పందించుచు స్మృతిపూర్వకముగనో లేక స్మృతి లేకయో స్థూల సూక్ష్మగోళముల యాత్మల కెక్కువ సాయముచేయు చుండును.

(4) తౌహీద్-యి-సిఫాటి, మనోగోళములో నారవ భూమికాసంబంధమైనది. స్థూలభూమికకు సంబంధించిన జడత్వము, సూక్ష్మభూమికకుసంబంధించిన సూక్ష్మలక్షణము నింక నాత్మ నంటియున్నయెడల నవి యిక్కడ పూర్తిగా నశించిపో

వును సూర్యునిముందఱ నక్షత్రములు కళనుపోగొట్టుకొనినట్లు. 3, 4 తౌహిదలు ఒకే మనోగోళము నందలివి. 2,3,4 లు మొత్తముమీద తౌహిద్-యి-తారికట్ అని పిలువఁబడుచున్నవి.

(5) తౌహిద్-యి-జాతి, వాస్తవమగు హకీకట్ యొక్క- ఐదవ గోళములోని భగవత్సాక్షాత్కారము. ఇది హకీకట్ యొక్క- మారిఫట్. అనఁగా హాలట్ - యే - మహమ్మది (లహూట్ స్థితిలోనిది) హాహుట్ స్థితిలోనిహకీకట్ - యే-మహ్మమ్మ దికి చెందినది. ఇవి ముఖ్యసత్యమునకు సంబంధించినవి.

సాక్షాత్కారములో స్వతస్సిద్ధముగానున్న వివిధలక్షణ ములలో పరిపూర్ణతకలిగినది భగవంతునియందు మానవునకుఁ గల దాసానుదాసలక్షణమని సూఫీ లేకగ్రీవాభిప్రాయముకలిగి యున్నారు. మానవుఁడు మానవుఁడేయని, భగవంతుఁడు భగవంతుఁడేయని, మనుష్యుఁడు భగవంతుఁడుకాలేడని,భగవం తుఁడు మానవస్థితిలోనికి రాలేఁడని మతాధిపత్యము వహించు మతపీఠములు తప్పుడర్థమును చెప్పి వానిని తగు కార్యాచరణలో పెట్టలేదు. ఇందుగల నిజమేమిటనఁగా భగవంతుని సాక్షా త్కారముపొందినతరువాత నీ సేవ్యసేవకసంబంధప్రాధాన్యము వల్ల సాలిక్ పరమహంసల మూఁడవప్రయాణమునుదెలుపును. అనఁగా భగవంతుని చైతన్యము సర్వదాయుండును.

పైనుదహరించిన భగవంతుని యద్వితీయస్థితి వివిధలక్ష ణము లీక్రిందసూచికలోఁ దెలుపఁబడినవి.

| అవస్థలు | లక్షణములు | గోళములు |
| --- | --- | --- |
| తౌహిది - యిజాతి | (1) అషిక్-ఓ-మషుక్ (ప్రేమి కుఁడు ప్రేమింపఁబడినవాడు నొకటి) | (1) అలమ్-యే-లహూట్ |
| | (2) అషిక్ (ప్రేమికుఁడు) మరి యు మషుక్ (ప్రేమింపఁబడి నవాడు) పేకకాలమందు | (2) అలమ్-యే-హాహూట్ (అయిదవ గోళము) |
| తౌహిన్ యి-సిఫాటి | అషిక్-(ప్రేమికుఁడు) | అలమ్-యే జబ్రూట్ (మూఁడవ గోళము.) |
| తౌహిద్ యి అహావాలీ | అరిప్-(జ్ఞాని) | |
| తౌహిద్ యి అఫాలీ | వసిప్-(కీర్తించువాఁడు) | అలమ్-యే-ములకుట్ (రెండవగోళము) |
| తౌహిద్ యి అక్వాలీ | వకీప్-(స్థూలచైతన్యము) | అలమ్-యే-నసూట్. (మొదటిగోళము) |

వుజుదియా - మరియు షుహుదియా

భిన్నులగు నేకేశ్వరవాదులలో (అహ్లె - తౌహిద్) ప్రధానములును వివాదగ్రస్తములునగు రెండుపక్షములుకలవు.

అందు ఒకటి వుజుదియా రెండవది షుహుదియా. వుజుదియా పక్షమునకు మొహిఅల్_దిన్_యిబన్ అరాబి బలమగు ప్రబోధకుడు. ఈయన యద్వైతవాదమును బలపఱుచును. వేదాంతములో శ్రీ శంకరాచార్యులు, వీరు బలపఱచిన యద్వైతవాద మిదియే. 'ఘుజున్_యి_యిలాహీ' చెప్పనదేమనఁగా యిబన్అరాబి భగవంతుని యస్తిత్వము యేకత్వముకంటె యధికముగాదని చెప్పను. తనంతటతానే యావిర్భవించును. ఒక పరిమితరూపములో మంచుగా రూపొందినను మూల వస్తువొక్కటే (దీనినే వివర్తమందురు) అంతఃపరిణామము పూర్ణత్వముచెంది సాక్షాత్కారము కలిగినప్పుడు పరిమితమగు రూపమంతరించి యద్వితీయుఁడగు పరమాత్మ మిగులును. ఇదే యహమేవాహమ్మనియు, అయమాత్మాబ్రహ్మయనియు ౦ గును.

షుహుదియావాదమునకు ప్రధానులగు షేక్ షహాబ్-ఉద్_దిన్ సుహ్రవర్ది, ఈవేదాంతమును వహావత్_అల్షుహుద్ అని చెప్పిరి. ఇదే వేదాంతములో విశిష్టాద్వైతమని చెప్పుదురు. ఇందు సాక్షాత్కారములో, బొందా (పరిమితమగునది) 'కానా హుహు' లేక భగవంతునిరూపమును పొందును. కాని వానిలో లీనమైపోదు. ఇందుకుదాహరణముగా క్రిందివిషయములు తెలుపఁబడినవి. కొలిమిలోనున్న యినుప ముక్క. అది నిప్పువలె నెఱ్ఱబడును కాని నిప్పుకాఁజాలదు. త్యమగు నినుమునకు నిప్పునకు మధ్యమున వ్యత్యాసముకలదు. నుము, అగ్ని రెండు వేఱువస్తువు లనిషుహుదియా తెలుపును.

ఇనుము తాత్కాలికముగా నగ్నియగును కాని రెండును వేఱు వేఱు వస్తువులే.

మిర్జాజాన్ జనాన్ యిట్లు చెప్పుచున్నారు. ఆవిర్భవించిన భగవల్లక్షణమునకును, రూపరహితమైన భగవల్లక్షణమునకును సంబంధము సముద్రము అందుబయలుదేరు తరంగములకు, నీటిబుడగలకు మధ్యమునగల సంబంధమువంటిదే. ఈభిన్నత్వములవల్ల నవిభక్తలక్షణముగల సత్యమున మార్పు కలుగదు. ఇది వహదత్–అల్ వుజూద్ (యేకీకరణత్వము) అందురు. దీనికి భిన్నముగా భగవంతునికిని సృష్టికిని గల సంబంధమును నిర్ణయించుటలో, వస్తువు దాని నీడ లేక సూర్యుడు, వానికిరణములువలె నున్నదానిని విశిష్టాద్వైతమందురు. (వహదత్–అల్–షుహుద్) ముహి–అల్–దిన్–ఇబన్ అరాబియొక్క వహదత్–అల్–వుజూద్, చైతన్యముతోగూడిన యద్వైతశిఖరమునుండి (అహదియత్) బయలుదేరుచున్నది. ఈస్థితికి సంబంధించిన యాధ్యాత్మికవిషయమును భగవంతుడు సర్వాంతర్యామి (హమాఅస్ట్) అని చెప్పవలెను.

షేక్ షహాబుద్దీన్ సుహ్రవర్దియొక్క వహదత్ అల్ షహూద్ లేక ముజద్దిద్ అను నామాంతరముకలది యీ యదార్థతనుండి (హకీకట్) యే బయలుదేరినది. కాని ఆధ్యాత్మికముగా 'హమాఆజ్ అస్ట్' అందురు. అనగా (సర్వమాయనుండియే వచ్చినది)

ఈ రెండు సూత్రములు వానినుండి బయలుదేరిన వాద ప్రతివాదములు తరువాత నిటీవల గురుపరంపరతో బయలు దేరినవి. అరబ్బుదేశ ప్రవక్త జీవితకాలములో నివిపుట్టలేదు. వుజుదియాల సూత్రము లనదగువాదమనుభవమీాదను హేతు వాదము మీాద నాధారపడియున్నది. షుహూదియాలనుభవ ముపైనను, సామాన్యలక్ష్యమగు కొరాన్ సంబంధమగు విష యములపైన నాధారపడుదురు.

ఇబన్ అరాబి మానవాతీతమగు నుత్కృష్టతను గాని యాంతరవ్యాప్తినిగాని యంగీకరింపడు. ఇందద్వైతమిమిడి యున్నది. భగవంతుఁ డొక్కడేయనియు, నున్నవాఁడొక్కడే యని యతను తెలుపును. ఉన్నట్లుకనపడు మిగిలినవన్నియు భగవంతునియంశలే(తజల్లియత్) కనుక గుణములతో భగవం తుఁ డేకత్వము కలిగియున్నాడు. దివ్యనామములన్నియు నా ఒక్కనికే చెందును. అతడే అల్లా లేక భగవంతుఁడు. వుజూదియా తెగకు చెందిన సాధువులు భగవంతుని యద్వై తీయత్వములో విశ్వాసముకలవారు. మొదటవచ్చిన యీా విర్భావము భగవంతుని యంశగా నెంచినప్పుడు, తరువాత నుద్భవించిన మనస్సాక్ష్యస్థూలలోకములు నీడల లేక ఛాయల వంటివి. యదార్థమూలముపై పైగానుద్భవించిన శూన్యము లుగా నెంచవలెను. ఈనీడ యనంతుడును శాశ్వతుఁడునగు భగవంతునిపై నాధారపడియుండును.

వుజుదియాలీ నీడలనుగూడ (మనస్సూక్ష్మస్థూల లోకములను) వేరే స్వతంత్రమగు నాలంబనములేని భగవంతునిగానే యెంచెదరు.

షుహుదియాలు, భగవంతునకు రెండు ప్రధానాంశము లున్నవని నమ్మెదరు. ఒకటి యదార్థత, రెండవది తద్విరుద్ధమైనది. ఒకటి భగవంతుఁడు. రెండవది బందా. బందాకు మూలము పూర్ణానుస్వారము (అడమ్). ఈశూన్యము పర్ణాధారసంబంధమైనది. వాస్తవమగు యదార్థముకాదు. ఈ శూన్యము యదార్థవస్తువుగాఁ బరిగణింపఁబడినచో ద్వంద్వమునకు త్రోవతీయు రెండు శూన్యములుండును. శూన్యము లెన్నికలిసినను ఫలము శూన్యమేయగును. అందుచే భగవంతుని తెలుపు జ్ఞానమున నీశూన్యము (సున్న) ఒకసాంకేతికము. మూలతత్త్వమును భగవంతుఁడొక్కఁడే. అపరిపూర్ణత శూన్యము నంటియుండును. అందుచేఁ జెడ్డయనునది యీ శూన్యతకుఁ జేరియుండును. ఈ వహదత్-అల్-షుహూద్ అను విశిష్టాద్వైతవాదమును ముజద్దిద్ ప్రచురించెను. ఇది అల్-యిన్సాన్-అల్‌కమిల్ అనుదానికి గర్తయగు అబిద్ అల్ కరిమ్ ఆల్‌జిలి దీని మొదట స్థాపించెను.

వుజుదియా వేదాంతము ఉత్తమ శ్రేణికి జెందినది. ఇందొకరి సదుపాయముతోగాని రాజీపద్ధతితోఁగాని సంబంధము లేదు. (శ్రీ) మెహర్ బాబాగారు తెలిపెడి యాధ్యాత్మవిధానములోఁగూడ సత్యము నన్వేషించెడి యీరెండుమార్గముల యందు సమానమగు దృష్టినిఁజూపుచున్నది. 'భగవంతుని పడ

యవస్థలు' అనుదానిలో దెలిసినదాని ననుసరించునిమిత్తము, సూఫీమతములోఁ దెలుపఁబడిన ఖమ్సావుజుడట్ అను(అయిదు స్థితులు) భగవంతుని యంశక్రమమును తెలిసికోవలెను.

పరిపక్వదశనొందిన సూఫీల యాధ్యాత్మిక దృష్టిలో పరబ్రహ్మ పరమాత్మస్థితిలోని భగవంతుఁ డనిర్వచనీయుఁడు, తెలియగలిగినవాఁడు కాఁడు. ఈస్థితిని తెలిసికోవలెననియత్నించినప్పుడు, బుద్ధికాని యూహకాని యుపయోగపడదు. పరబ్రహ్మ పరమాత్మస్థితిలో నిరాలంబుఁడగు భగవంతుఁ డొక్కఁడే కలఁడు.

ఈ యతీతస్థితిలోనున్న భగవంతుని సూఫీ లనేకవిధములుగా వర్ణించినారు.

ఘైబ్-ఉల్-ఘైబ్ (గుప్తాతి గుప్తము)

మఝూల్-ఉన్-నాట్ (అజ్ఞేయము, అనిర్వచనీయమైనది). ఈ స్థితిలో నాదిశక్తి యాత్మజ్ఞానము కలిగియుండదు.

మున్ఖతా-ఉల్-ఇషారట్ (సూచనలన్నియు నశించిపోయినస్థితి)

అల్-ఆమా (నల్లని పొగమంచు) పరాత్పరపరబ్రహ్మ యంతర్గతశక్తిని సూచించునది. ఇందా(టట్)దిశక్తి తనయొక్క యతీతమగు నేకత్వమునస్మృతికలిగి దానిని బయటకుఁజూపు అహ్దీయత్ కూడఁ గలదు.

శ్రీ మెహర్ బాబాగారిట్లు తెలుపుచున్నారు. భగవంతుఁడు పరమాత్మస్థితినుండి పరాత్పరపరబ్రహ్మస్థితికిఁ దిరిగిపోలేక

పోయిన నాయన యీాయనంతస్థితి, యనంతజ్ఞానము, ననంతా సందముకలిగియుండెననియు, కలిగియున్నాడనియు నాయనకుఁ దెలియును. దానిద్వారా ఆయన మూలస్థితి పరాత్పర పర బ్రహ్మమని యాయనకుఁ దెలియును.

(జట్-యెల్-బాహా)

సాధకులకు సులభముగా దెలియుటకుగా నీ భగవంతుని పొందువిషయమునంతను అయిదు భిన్నములగు ఆవిర్భావము లుగాసూఫీలు దెలుపుచున్నారు.

ఖమ్సా-వుజుదాత్ లేక అయిదుస్థితులు.

1. వహిద్-ఉల్-వుజుద్ (అద్వైతస్థితి) మొదటిప్రత్య క్షము లేక సత్యగోళమునకుఁజెందిన ఆలమ్-యే-లహూత్ లోని తాజల్లి-యేల్-అవ్వల్ యందు అహదియత్ స్థితి (చైతన్య ముతోఁ గూడిన యేకత్వము) కూడ నిమిడియున్నది.

2. అరిప్-ఉల్-వుజుద్ (జ్ఞానముతోఁగూడినస్థితి) దీని కిని హీకాకత్-యే-మహమ్మద్ (మహమ్మదుయొక్క యదా ర్థత) లేక నూరేమహమ్మద్ (మహమ్మదుయొక్క తేజస్సు) యిదే హాహూత్ స్థితి లేక యదార్థగోళము. ఇది వహిదియత్ తన్నుదా నెఱిఁగియుండుట (ఏకతాజ్ఞానమున భిన్నత్వమున నను స్యూతమగు నేకత్వస్మృతి కలిగియుండుట). ఇది రెండవ యావిర్భావము. తజల్లి-యెల్-దువ్వం.

3. ముమ్తాన్-ఉల్-వుజుద్ (వ్యతిరేకస్థితి) మూడవ పది. తాజల్లీ-యేల్-సిఫ్ఫాయ్ (ఇది ఆలమ్-యే-జబ్రూత్-మనోగోళము) ఇచ్చటనే వహదియత్ (భిన్నత్వమునందేకత్వము) ప్రారంభమగును.

4. ముకిమ్-ఉల్-వుజుద్ (అనుమానస్థితి) అనేకేతర విషయములతోఁ బాటు దేవతాలోకము విగతశరీరులైన యాత్మలు కలిగియుండును. దీనిని ఆలమ్-యే-మల్కుట్ (సూక్ష్మగోళము) ఇదే శక్తిగోళము. ఇది నాలుగవస్థితి. దీనిని తాజల్లి-యెల్-చాహారమ్ అందురు.

5. వజీబ్-ఉల్-వుజుద్ (అనివార్యస్థితి) ఇందు స్థూల జీవితమునకుసంబంధించిన విషయములన్నియు నిమిడియున్నవి. సూఫీలు దీనిని ఆలమ్-యే-నసుట్ (స్థూలగోళము) అందురు. ఇది యయిదవస్థితి లేక లక్షణము. దీనిని తజల్లీ-యేల్-పనజుమ్ అందురు.

ఈ యయిదును పరమాత్మస్థితిలోనున్న భగవంతుని భిన్నావిర్భావములు. వీనిని తజల్లియత్-యికమ్సా లేక ఖమ్సావుజుదత్ అందురు.

అనివార్యస్థితినుండి (వజిబ్-వుల్ వుజుద్) మొదట ఊర్ధ్వ మార్గమున బోవుచు సద్వైతస్థితివరకుఁగల స్థితులను గురించి విచారింతము.

మతధర్మము (షరియట్) ప్రకారము వజిబ్-ఉల్ వుజుద్ (అనివార్యస్థితి) అనఁగా నిరాలంబియగు భగవంతుఁడు ఆయన

నుండి సమస్తసృష్టి యన్నియంతరములలోను దన జన్మమును బొందును. భౌతికసంబంధమైన స్థూలవిషయములనుమాత్రము సూచించుటకీపదమును సూఫీ లుపయోగించెదరు. ఇచ్చట ఉజద్ అనగా శరీరము. రాళ్లలోను వృక్షములలోను జాంతవ మానవరూపములలోను నున్నయాత్మ స్థూలరూపముగల పంచ భూతముల సాయము లేనిచోఁ బరిణామము పొందలేదు. వజిబ్ ఉల్–వుజుద్ లోనిస్థూలాస్తిత్వము భగవంతుఁడు ప్రసాదించిన మహావరము. ఈ యాలంబనము లేనిదే (స్థూలశరీరము) పూర్ణత్వమునుపొందుట యాధ్యాత్మికనాయకత్వ మేర్పడుట, మహా సాధుపుంగవులు బయలుదేరుట సాధ్యమయ్యెడిది కాదు.

మానవుని స్థూలశరీర మొక యపూర్వము నద్భుతము నగు యంత్రము. యథార్థములు, పరస్పరములునగు భగవదవస్థలను సూక్ష్మమనో, మహామనః సంబంధమగుగోళము లీయంత్రములో నిమిడియున్నవి. అందుచే సూఫీలు మానవశరీరమును ఆలమ్–యే–సాఘీర్ (సూక్ష్మజగత్తు) ఇది (ఆలమ్–యే–కబీర్) సర్వ విశ్వసారము. ఈ యుదావిర్భావములు లేక యవస్థలీమానవ శరీరములో నిమిడియున్నవి. ఏని రహస్యము నొక సద్గురువు లేక యవతారపురుషులలోనివారిలో నొకరి మహామనస్సహాయము లేనిదే భేదించుట సాధ్యముకాదు.

వజిబ్–ఉల్–వుజుద్ (అవసరస్థితి లేక స్థూలగోళము) సూక్ష్మగోళము (ముకిమ్–ఉల్–వుజుద్) నుండి యుత్పన్నమగు

చున్నది లేక దాని ఛాయయైయున్నది. ఈ యవస్థలో భగవంతునికిని సృష్టికినిగలసంబంధము సేవ్యసేవకసంబంధము. ఈస్థితిలోఁ బరిణామము పొందుచున్న చైతన్యము లేక మనస్సును దురాత్మ (Evil self) యని పిలతురు. తమఃప్రధానములగు సుఖములను పొంద నెల్లపుడు కోరుచుండును. ఇచ్చట భగవంతునికి మానవునికిఁగల సంబంధము నోటిమాటలతోఁగూడినది. అనఁగా మాటలో భగవంతుని గుర్తింతుము.

ముమ్‌కిన్-ఉల్-వుజూద్ (నిమిత్తావస్థ లేక సూక్ష్మగోళము) మనోలోకమునుండి యుత్పన్నమగుచున్నది. ఇచ్చటభగవంతునకు నాతని గుణములనుండి బయలుదేరిన లక్షణములకునుగల సంబంధము తండ్రిబిడ్డలకుఁగల సంబంధమువంటిది. ఇచ్చట భగవంతుఁడు దయాస్వరూపుడు ఏచింతయులేక యుండుబిడ్డలను ప్రతిఫలాపేక్షగాని, శిక్షగాని యాశింపని జ్ఞానసముపార్జనయందుగాని యాధ్యాత్మిక సంపత్తియందుగాని కోరికలేని తనబిడ్డలను రక్షించుటయే భగవంతుఁడు తనపనిగాఁ బెట్టుకొనును. అట్టివ్యక్తులు దేవతలనబడుదురు ఈగోళచైతన్యము (ఆలమ్-ఏ-మలకూట్)ను నఫ్స్-యిల్వామా (నిందార్హమైన యాత్మ) యందురు. ఈస్థితిలో భగవంతుని గుర్తించుట తో హీంద్-యి-అఫాలి (యేకాగ్రతగల కార్యము) అనియందురు. అనఁగా నీలోకములోని వ్యక్తులుతమకు నిర్దేశింపఁబడిన భగవంతునిస్మరణమందు పూర్తిగానిమగ్నులై యుండుట.

ముమ్‌తాన్-ఉల్‌ఉజుద్ (వ్యతిరేక లేక యభావస్థితి. మనోగోళము). ఈమార్గమునం దయిదారుభూమికలను గలిగి యుండును. ఈయవస్థలో ననేకత్వమున నేకత్వము సిద్ధించును (వహిదియత్). వహిదియత్ అయిదవభూమికలో ప్రారంభమై యారవభూమికలో నుచ్ఛస్థితినిపొందును. స్థూలసూక్ష్మావరణములకుసంబంధించిన సృష్టివివరణములన్నియు సందున్వ్యక్తమై యుండును. అరీఫ్_ఉల్-వుజుద్ (హాకీకట్‌యి - మహామ్మదిస్థితి) లోనుండి యుత్పన్నమైనట్టియు దాని ప్రతిబింబమైనట్టియు అలమ్_యేజబూ్రిట్ అనుస్థితియిది. దీనిని ముమ్‌తాన్-ఉల్-వుజుద్ లేక వ్యతిరేకస్థితి అనిపిలచుటకు కారణమేమనగాముమ్‌ తానా అనఁగా అస్తిత్వములేనిది. వుజుద్ అనఁగా అస్తిత్వరూపము లేక శరీరము, అనఁగా నది రూపరహితమైనది. బీజములోనే వృక్షమూలములగు వేళ్ళు శాఖలు నిమిడియుండు బీజస్థితితో దీనినిపోల్చనగును. ఇవి పైకావిర్భవించి విస్తరించినపుడు స్థూలసూక్ష్మభూమికలతో బోలిక కుదర్చవచ్చును. ఆకాసము కాలముతో సంబంధించినభావములన్నియు నొకేచోట కేంద్రీకరింపఁబడు లా-మాకన్‌అను పేరుతో దీనినిబిలుతురు.

మనోకోశ చైతన్యమును సూఫీలు నఫ్స్-యి-ముత్‌మైయన్నా అనిపిలచెదరు. అనగా నయిదవభూమికదృష్టిని పొంది యున్న యాత్మయనిఅర్థము. ఆఅవ భూమికలోనున్న యాత్మ భగవదావేశ పూరితమైనది. దానిని నఫ్స్-యి-ముల్‌హిమా యందురు. ఇచ్చట భగవంతునికిని సృష్టికినిగల సంబంధము

ప్రేమికునకును ప్రేమింపఁబడినవానికిని గల సంబంధమువంటిది. ఈస్థితిలో భగవంతుఁడనగా "భావైక్యత" పొందుటయని సూఫీలందురు. (తౌహీద్_యి-అహ్వాలి) ఈయవస్థనే మానవుని యదార్థస్థితి (హాకీకట్‌యిన్సాని) అందురు. ఇందుమానవుఁడు భగవంతుని ప్రత్యక్షముగాఁ గాంచును. కాని తనయహమికను పూర్తిగావదలకపోవుటచే ద్వంద్వస్థితిలో మానవుఁడుండును.

(అలామేలహాత్) యదార్థగోళములోని యేకత్వస్థితిలో (వహిద్-ఉల్‌వుజుద్) భగవంతుఁడు తనయొక్క స్మృతిపూర్వకమగు నేకత్వ (అహదియత్) చైతన్యమును పొందుచున్నాడు. మరియు నీయదార్థగోళములోనే అలమేహాహుట్ అవస్థాసంబంధమగు అరిప్‌ఉల్ వుజూద్, వహాదియత్ సంబంధమగు వహాదియత్ స్థితియగుచున్నది. అనఁగా ననేకత్వములోని యేకత్వచైతన్యమును స్మృతిపూర్వకముగా గలిగియుండుట. దీనిని హాకీకట్-యే-మహమ్మదీయనియు నందురు. సూఫీ మతప్రకారము భగవంతుఁడు వారా-ఉల్-వారా స్థితిలో మరుగున దాగియున్న యమూల్యధనము. ఆయన బయటకు ప్రచురణకావలెనని కోరుచుండెను. ఈమరుగుపడియున్న ధనము తన్నుదాను తెలిసికోవలెనను కోరికకలుగుటతోడనే తానొకజ్యోతిగా తనస్మృతిని పొందెను. (నూరెమహమ్మది) ఈజ్యోతి సమస్తసృష్టియందు నావిర్భవించిన లోకములోను నిబిడీకృతమై యున్నది. ఈసందర్భముననే మహమ్మదు ప్రవక్త యిట్లుచెప్పెను. "భగవంతుఁడు నాదీపమును తొలుత సృష్టించెను.

నాదీపమునుండి సమస్తలోకము లుద్భవించెను." ఏకత్వము కలమూలతత్వము'లో నిమిడియున్న దివ్యమగు భగవత్ జ్ఞానము నకు సంబంధించినదిది. ఇచ్చట భగవంతునికి సృష్టికిగల సంబంధము ప్రేమించువానికి ప్రేమింపఁబడువానికి గలసంబంధమే. ఇచ్చట ప్రేమించువాఁడు భగవంతుఁడు. ప్రేమింపఁబడినవాఁడు మహాత్ముఁడు. ఇచ్చట భగవంతుఁడు తనదియు దనసృష్టిదియు నగుపూర్తి చైతన్యమును గలిగియున్నాఁడు.

పరమాత్మ పరబ్రహ్మస్థితిలో నేకత్వముగల యస్తిత్వము ప్రథమప్రతిబంధకమైనది. లహూత్ అని తెలుపఁబడు నయిదవభూమికలోని యొకయవస్థ. ఇది స్మృతిగల నిరాలంబ స్థితి. జ్ఞానముగల లేక తెలిసినయస్తిత్వము దీనిపై తన ప్రభావమును బఱిపినప్పుడాయనకు ఫానా బాఖా యను రెండింటి యనుభవమును కలుగఁజేయును ఆధ్యాత్మమార్గములో మిగిలిన అవస్థలవలెనే యీయంతరముకూడ మనస్సునకును బుద్ధికి నందుబాటులో లేనివి. మాటలతో వర్ణింపవీలైనవికావు. తాజల్లి–యెల్–జమాలి (మూర్తీభూత సౌందర్యము) తాజల్లి–యెల్–జలాలి (ఆనందానుభవము). తాజల్లి–యెల్–జలాలి (ఆత్మపరిపూర్ణముగా భగవంతునిలో లీనమైన యనుభవము.) తాజల్లి–యెల్–జమాలిని సాధారణమగు చిదనుభవమును తిరిగి పొందుట. దీనిని సూఫీలు బాఖా (నిత్యము) అందురు. తాజల్లి–యెల్–జలాలిని 'అసాకెయత్ అనికూడ అందురు. ఇందు మానవుఁడు ప్రేమించువాఁడు భగవంతుఁడు ప్రేమింపఁబడు

హాశుగానుండును. తాజల్లి-యెల్-జమాలి మషూకియత్ అందురు. ఇందు భగవంతుఁడు ప్రేమించువాడు మానవుడు ప్రేమింపఁబడువాడు. ఇదేయున్నతమైన యాధ్యాత్మికశక్తి యావిర్భావము. దీనిని ఫకీర్ లేక ఫకీరియందురు.

అయిదవ ఆవరణలోని ఆలమ్-యే-లహూత్ లోను ఆలమేహాహూత్ లోను-యదార్థగోళము-ప్రేమికుఁడు ప్రేమింపఁబడువాడు, అవస్థలలో భిన్నములగునవి కలవు. ఒకదానిలో నిరువు రేకత్వములో లీనమైపోవుదురు. మరియొకదానిలో నిరువురొకరిప్రక్క నొక రేకకాలమందుందురు. మనోలోకములో ప్రేమికుఁడు జ్ఞానియుందురు. సూక్ష్మలోకములో భగవంతుని గుణగణములను గుర్తించువారుందురు. స్థూలలోకములో స్థూలచైతన్యముకలవారుందురు. ఈస్థితుల నవరోహణ క్రమములో మనము వర్ణించుచుపోవునెడల చైతన్యముగల వ్యక్తి యెక్కువచైతన్యమునుపొంది భగవల్లక్షణముల భాసిల్లు చేయ్యఁడగును. అచ్చటినుండి జ్ఞానోదయము కలుగుస్థితిలోనికి బోవును. అచ్చటినుండి భగవంతుని 'మాయలు మహాత్మ్యలు' కల భూమికలోనికిఁ బోవును. అచ్చటనుండి భగవంతుని దర్శనము లభ్యమగుస్థితికిపోవును. ఇప్పటికి భగవంతుఁడు ప్రేమించినవాని హోదాకలుగును. తుదకు తానే ప్రేమస్వరూపుఁడైనప్పుడు సమస్తమునకు దానే యాద్యంతములని తెలిసికొనును. ఈ హుయత్ స్థితిలో నేనే భగవంతుఁడనను భగవంతుని స్థితిలో సమస్తము లయమైపోవును.

౮౧. (౨౦౫ వ పేజీ 11 వ పంక్తి సాధారణ చైతన్యప్రధానమగు)

## మనుష్యుఁడు భగవత్ సాక్షాత్కారము పొందుట
## (శాశ్వతముగా మానవుఁడు భగవంతుఁడగుట)

హోదా, స్థితి, అవస్థ లేక లక్షణము యథార్థగోళము లోని జ్ఞానము మున్నగు మాటల సంగ్రహార్థము 40 పేజీలో నున్నది. అహమస్మి నేనేభగవంతుడననెడి యాధ్యాత్మిక జ్ఞానము మూఁడువిధములగు సాక్షాత్కారమునకు ప్రాతిపదిక యొక్కటే. శరీరము నశించుటతో నశింపదు.

స మా ప్త ము.

| పదము | హోదా (అంతస్థు) | స్థితి | అవస్థ లేక లక్షణము | ఆత్మజ్ఞానము సోఽహమస్మి |
|---|---|---|---|---|
| సూఫీ | మజూబ్-యె-కమిల్ | జామ్‌లేకహల తుయే మొహమ్మోది | అలామ్ యే లహూత్ | అనల్ హక్ |
| వేదాంతము | బ్రహ్మీభూత్ | నిర్వాణము, నిర్వికల్ప సమాధి | విజ్ఞానము | అహంబ్రహ్మాస్మి |
| Mystic | పరిపూర్ణుడు | భగవంతునిలో లీనము | మహాచైతన్యము | నేనేభగవంతుడను |
| సూఫీ వేదాంతము Mystic | అజాదేముతలక్ లేక సాహిబేజమోపర్క్ జీవన్ముక్తుడు ముక్తిని పొందిన స్వరూపము | జామ్‌పరక్ తో కూడియు విడివడియును నికి నిర్వికల్పసమాధి త్రిభువనములతో కలిసికొని విడిగాకానిస్పష్టిచైతన్య ముకలిగియు లేకయునుండుభగవంతునిచైతన్యము | పానా-వ-అల్ బాకా తురీయావస్థ పవిత్రకూడలి స్థానము | అనల్-హక్-హమా-బా-మన ఆస్తితో కూడి లేక విడిగా శివోహం జీవోహం ఒకటితరువాతనొకటి సర్వము నాలో నేకలదు అను భావముతో కలసి విడివడి యుండు నేనేభగవంతుడు |

| | | | | |
|---|---|---|---|---|
| సూఫీ | కుతుబ్ | జాముల్-జామ్ లేక బొకా బిల్లాలేక పరక్ బొదుల్ జామ్ | ముఖామే-హమ్మొద | అనల్-హక్ హమా ఉసన్ మరియు హమాఅజ్ ఉసన్ |
| వేదాంతము | సద్గురువు | | | |
| Mystic | పూర్ణత్వొందిన గురువు | సహజసమాధి లేక ఆత్మ ప్రతిష్ఠాపన. భగవంతుని యవతారము. నరరూపము లోభగవంతుడు | విజ్ఞానభూమిక భగవంతుని చైతన్యము స్మృతి చైతన్యము ఒకేమారు కలిగియుండుట | ఆ స్థితియేకకాలమందే శివోహం, సర్వోహంగతె యేక కాలమున నేనుభగవంతుడను సర్వమునేనే,నాలోనున్నది నానుండియే వచ్చుచున్నది. అని యేకకాలమునకలుగును |

సూరా : జామ్ అనగా భగవంతునితో పొందిన యైక్య చైతన్యము లేక యాస్మృతి.

పరక్ —భగవంతునిలో భిన్నమను స్మృతి అందుచే పరక్, స్థూలసూక్ష్మ మనోచైతన్యముల యన్నిటి స్మృతినిగాని ప్రత్యేకము స్మృతినిగాని కలిగియుండును.

హాల్ (భగవంతునికి తనకుగల అన్యోన్యసంబంధాంతరంగిక అనుభవము ఆఱవభూమిక వరకు నుండును. ఏడవభూమికలో హాల్ లేదు)

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 16 | తన్మయీభవనమున | తన్మయీభావమున |
| 1 | 18 | యల్పప్రదేశముంధు | యల్పప్రదేశమునందు |
| 4 | 11 | స్థూలస్వరూవముతో | స్థూలస్వరూపముతో |
| 3 | 2 | సంగహీవము | సంగహీనము |
| 5 | 14 | ఇవ్పటి | ఇప్పటి |
| 2 | 2 | క్షీణింపఁజేయును | క్షీణింపఁజేయును* |
| , | Foot Note 1 | గీ. విషయవాంఛల | *గీ.విషయవాంఛల |
| 9 | 17 | స్థూక్ష్మమార్గమున | సూక్ష్మమార్గమున |
| 4 | Foot Note 3 | గనుదోయ | గనుదోయి |
| 5 | Foot Note 4 | బ్రేమితుఁడు | బ్రేమికుఁడు |
| ,, | 5 | దాతఁడుట్లున్న తనికి | దాతఁడున్నట్లు తనికి |
| 3 | 18 | సూక్ష్మసంస్కారములను | సూక్ష్మసంస్కారములును |
| 1 | 10 | ఎనను | ఐనను |
| 4 | 17 | వివియోగించునప్పుడు | వినియోగించునప్పుడు |
| 3 | 7 | (Amneria) | (Amnesia) |
| 1 | 21 | ఈస్రృజనశక్తి | ఈసృజనశక్తి |
| 2 | 21 | ఏకత్వముపాదింప రాదు | ఏకత్వము నాపాదింప రాదు |
| 4 | 20 | కేవ్రులకు | కేవ్రునకు |
| 6 | 6 | జాగ్రత్స్వప్నసుషుస్త్య వస్థల | జాగ్రత్స్వప్నసుషుప్త్య వస్థల |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 96 | 8 | యనుభనములను | యనుభవములును |
| ,, | 14 | జ్ఞానోదమగు | జ్ఞానోదయమగు |
| ,, | 18 | కాలబేధమెట్లు | కాలభేదమెట్లు |
| 99 | 19–20 | గరలాతమలకమును | గరతలామలకమును |
| 104 | 5 | నంకల్పరూపమున | సంకల్పరూపమున |
| 106 | 1 | బ్రహ్మేభూతులనియు | బ్రహ్మీభూతులనియు |
| 116 | 15 | సర్యమునందును | సర్వమునందును |
| 117 | 6 | యభావానుభనము | యభావానుభవము |
| 123 | 2 | బౌతికరూపముతే | భౌతికరూపముతో |
| 164 | 15 | జాగ్రివస్థ | జాగ్రిదవస్థ |
| 175 | 4 | నాలుగవ | నయిదవ |
| 184 | 13 | శూన్యమునఁ | శూన్యమునఁ |
| 188 | 16 | మానపుఁడు | మానవుఁడు |
| 198 | 10 | సాధారణమానపునికిని | సాధారణమానవునికిని |
| 248 | 22 | ననంతచేత నాహీ తనలోనున్న | ననంతచేతనాహీనత లోనున్న |
| 264 | 20 | శిథిలమైపోపును | శిథిలమైపోవును |
| 272 | 6 | పెరిట | పేరిట |
| 324 | 14 | వనేక | ననేక |
| 343 | 1 | పొందనలెనన్న | పొందవలెనన్న |

థ, ధ లతోఁ గూడిన పదములయు, ఆయా ఒత్తులతోడి యక్షరములుగల పదములయు శుద్ధస్వరూపములను పాఠకులు గ్రహించెదరు గాక.

---